

ప్రచురణ నెం. 859

మొదటి ముద్రణ : ఆగస్టు, 1955
రెండవ ముద్రణ : నవంబరు, 1957
మూడవ ముద్రణ : నవంబరు, 1961
నాలుగవ ముద్రణ : ఫిబ్రవరి, 1971
ఐదవ ముద్రణ : ఏప్రిల్, 1977
ప్రతులు : 2000

వెల : రు. 8-00

ముద్రణ :
స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు

# విషయానుక్రమణిక

# ఐదో ముద్రణకు పీఠిక

ఈ గ్రంథం మొదట 1955 ఆగస్టులో వెలువడ్డది.

1957 లో వెలువడిన ద్వితీయముద్రణలో, "బౌద్ధంలో గతితర్కం" అను అధ్యాయాన్ని చేర్చాను.

1961 లో వెలువడిన మూడో ముద్రణలో, శంకరుని అద్వైతంపై ఒకటి, గీతపై నాలుగు, అరవిందునిపై ఒకటి, ఆధునిక ధోరణులపై ఒకటి. మొత్తం ఏడు కొత్త అధ్యాయాలను చేర్చాను.

1971లో నాలుగో ముద్రణ వెలువడ్డది.

ఇది ఐదో ముద్రణ. అధ్యాయాలను పునర్విభజించి, ఇస్లాం, క్రైస్తవ తత్వ శాస్త్రాలపై ఒక అధ్యాయాన్ని తత్వ శాస్త్రం సామాజిక ప్రయోజనం అను మరో అధ్యాయాన్ని కొత్తగా చేర్చాను. లోగడవలెనే పాఠకులు ఈ ముద్రణను కూడా అభిమానించగలరని ఆశిస్తున్నాను.

ఏప్రిల్, 1977
విజయవాడ.

ఏటుకూరు బలరామమూర్తి

# ప్రథమ ముద్రణకు పరిచయం

తరతరాలనుంచి వస్తున్న జీవితానుభవాలను సమన్వయం చేసు కోడం ద్వారానే, మానవ సంస్కృతి పెంపొందుతూ వచ్చింది. బాహ్యా ప్రపంచాన్ని అవగాహన చేసుకొని, ప్రకృతి శక్తులను మానవ కల్యాణా నికి అనుగుణంగా వినియోగించుకోవడంలోనే మానవుని గొప్పతనం వుంది. అనుభవం, ఆచరణ, హేతువాదం ద్వారానే, మానవజాతి విజ్ఞానం అభివృద్ధి చెందుతూ వుంది.

ఈ సత్యాన్ని నిరూపించే విజ్ఞానశాస్త్రమే గతితార్కిక భౌతిక వాదం. అదే మార్క్సిస్టు సిద్ధాంతాలకు మూలాధారమైన తత్వశాస్త్రం.

గతితార్కిక భౌతికవాదం బోధించునపుడు, ప్రతివారికీ ఒక చిక్కు ఎదురౌతుంటూంది. ఉత్పత్తిశక్తుల అభివృద్ధికి అనుగుణంగా మానవుని ఆలోచనలు, భావాలు ఎలా పరిణామం చెందాయో చెప్పాలి వచ్చినపుడు, అధ్యాపకులు, పాశ్చాత్య తత్వశాస్త్ర గ్రంథాలలోని వుదా హరణలు యివ్వడం పరిపాటి.

యూరపు చరిత్రను, ఆ ప్రజల సాంప్రదాయాలను ఎరుగని శ్రోతలకు, ఆ వుదాహరణలవలన, విశదపరచాలనుకున్న సంగతులు అవగాహన కానందున గందరగోళంగా తయారయేది. ప్రజల సాంప్ర దాయాలలో ఏదో రూపంలో జీర్ణించివున్న విషయాలనుండి, అను గతంగా వస్తున్న లోకోక్తులనూ, భారతీయ తత్వశాస్త్ర గ్రంథాలనుండి వుదాహరణలనూ ఇచ్చినపుడు, పాఠకులకు తత్వశాస్త్ర పాఠాలు సుల భంగా అర్థమవుతాయి.

శ్రీ ఏటుకూరు బలరామమూర్తిగారికి, రాజకీయ అధ్యయన తర గతులను నడుపుటలోనూ, తత్వశాస్త్ర పాఠాలను బోధించడంలోనూ

ఎంతో అనుభవముంది. వారు భారతీయ తత్వశాస్త్ర గ్రంథాలను జాగ్రత్తగా అధ్యయనం చేశారు. భారతీయ తత్వశాస్త్ర సూత్రాలను, వివిధ శాఖల పరిణామాన్ని మార్క్సిస్టు దృక్పథాన్నుంచి పరిశీలించుతూ 'సందేశం' పత్రికలో వ్యాసాలు వ్రాశారు. వాటిని సరిదిద్ది యీ పుస్తక రూపంలో ప్రకటించుతున్నారు.

భారతీయ తత్వశాస్త్ర పరిణామాన్ని అవగాహన చేసుకోడానికి ఈ పుస్తకం తోడ్పడుతుందనీ, తత్వశాస్త్ర గ్రంథాలను లోతుగా తరచి చూడాలనే ఆసక్తి కలుగజేస్తుందనీ ఆశించుతున్నాను.

ఇలాంటి కృషికి ఇదే తొలిప్రయత్నమనీ, తెలుగులో ప్రకటించ బడుతున్న మొదటి గ్రంథ మిదేననీ అనుకుంటున్నాము. అందుచేత, విమర్శకులు సహృదయంతో దీనిని పరిశీలించుతా రనడంలో సందేహం లేదు. గ్రంథంలోని పొరపాట్లను సోదాహరణంగా నిరూపించితే, అట్టి విజ్ఞులతో చర్చించడానికి, పునరాలోచించి సరిదిద్దుకోడానికి రచయిత ఎల్లప్పుడూ సిద్ధంగా వుంటారు.

విజయవాడ,
24-8-'55.

మద్దుకూరి చంద్రశేఖరరావు

## ఒకటవ అధ్యాయం

# అతి ప్రాచీనకాలం

పదార్థానికి, భావానికి గల సంబంధాలను చర్చించే విజ్ఞానశాస్త్రం తత్వశాస్త్రం. ప్రపంచం వాస్తవమా? కాదా? చైతన్య రహితమైన జడ పదార్థం ప్రాథమిక మైనదా? చైతన్యసహితమైన ఆలోచన ప్రాథమిక మైనదా? మానవునికి, బాహ్యప్రపంచానికి గల సంబంధం ఏమిటి? విజ్ఞాన సంపాదనకు ఏ మార్గాలు అనుసరించాలి? సృష్టికి మూలకారణమైన పరబ్రహ్మ ఒకడున్నాడా? సృష్టి స్వయం సిద్ధమా? మొదలైన సమస్యలన్నీ తత్వశాస్త్రంలో చర్చించబడతాయి.

ఆదిమ కమ్యూనిస్టు దశలో ప్రకృతి, మానవుల పరస్పర సంబంధాలను గురించి మానవునికి, ఏవో కొన్ని అభిప్రాయాలుండేవి. ఇవి తరచు మూఢనమ్మకాలుగా ఉండేవి. ఆ మూఢనమ్మకాలే ఆదిమ మానవుని తాత్విక దృక్పథాన్ని ప్రతిబింబించేవి. మతభావాలు, తత్వశాస్త్రం పెనవేసుకుని వుండేవి.

మానవసమాజం నాగరికతామార్గంలో కొన్ని వేల సంవత్సరాలు పురోగమించిన మీదట, మత భావాలనుండి తత్వశాస్త్రాన్ని వేరుచేసి, దాని నొక ప్రత్యేక విజ్ఞానశాస్త్రంగా అధ్యయనం చేయడం ఆరంభమైంది. భారతదేశంలో తత్వశాస్త్రాన్ని, ప్రత్యేక విజ్ఞాన శాస్త్రంగా

చర్చించిన గ్రంథాలు ఉపనిషత్తులు. వీనిలో అతి ప్రాచీనమైనవి క్రీ. పూ. 1000 ప్రాంతంలో రచించబడ్డవి.

ప్రత్యేక విజ్ఞానశాస్త్రంగా క్రోడీకరింపబడేముందు, కొన్ని వేల సంవత్సరాలుగా మానవుని తాత్వికభావాలు వివిధ రూపాలలో పరిణామం చెందుతూ వచ్చాయి. తాత్వికభావాలకు, సమాజ పరిస్థితులకు పరస్పర సంబంధమున్నది. ఈ భావపరిణామాన్ని తెలుసుకున్నపుడే, ఉపనిషత్తుల లోని తత్వశాస్త్రాలకు వెనుకనున్న సాంఘిక పునాదులను మనం తెలుసు కోగలం.

భారతదేశంలో జీవించిన ప్రజలలో ద్రావిడులు, నాగులు ప్రాచీనులు. వీరికంటె కూడా ప్రాచీనమైన తెగల ప్రజలు వుండేవారు. వారి జీవిత విధానాన్ని గురించి మనకు యెట్టి సమాచారం తెలియదు. కనుక ద్రావిడ, నాగ ప్రజల నాగరికతలో వ్యక్తమవుతున్న వారి మత భావాలను తెలుసుకొని, నాటినుండి ఉపనిషత్తులకాలం వరకు, ఈ మత భావాలు ఎలా పరిణామం చెందుతూ వచ్చాయో తెలుసుకుందాం.

కొత్త రాతియుగంలో జీవించిన ప్రజల పనిముట్లు అనంతపురం, బళ్ళారి, కర్నూలు జిల్లాల్లోను, దక్షిణ హిందూదేశంలో మరికొన్నిచోట్ల దొరికినవి. ఇవి అత్యంత ప్రాచీనకాలానికి చిహ్నాలు. క్రీ. పూ. 5000 సంవత్సరాల నాటికి చెందినవి.

కోయంబత్తూరు, తిరుచునాపల్లి జిల్లాలలో ఈశిథిలాలు విశేషంగా వున్నవి.

వీనిలో కుండలు, పిడతలు, మూకుళ్ళతోపాటు రకరకాల సైజు లలో వున్న శవపేటికలు అనేక మున్నవి. నాటి ప్రజల మతభావాలకు ఈ శవపేటికలే చక్కని నిదర్శనాలు.

మట్టి పాత్రలను మాత్రం చేయ నేర్చుకున్న యుగంలో, జీవించిన ఆదిమ మానవునికి, మత సంబంధమైన సమస్యలను గురించి సమగ్రంగా ఆలోచించడానికి అవసరమైన విశ్రాంతి, మానసిక స్థాయి-రెండూ లేవు. చనిపోయిన వ్యక్తి శవాన్ని ఏంచేయాలి అన్న ప్రత్యక్ష సమస్య మాత్రం ప్రతినిత్యమూ అతనిని ఎదుర్కొంటూనే ఉండేది.

తనతోపాటు జీవించి, మరణించిన ఒక వ్యక్తి శరీరాన్ని, అతను వాడుకున్న సామగ్రిని, కొంత ఆహారపదార్థాన్ని అందులో భద్రపరచి శవపేటికను భూస్థాపితం చేయటమే నాటి మానవుడు చేయగల కనీస కర్తవ్యం. చనిపోయిన వ్యక్తిపట్ల ప్రదర్శించే గౌరవానికి యిది చిహ్నం. క్రీ. పూ. 4000 సంవత్సరాలకు పూర్వం జీవించిన ప్రజల నాగరికతను ఈ శవపేటికలు మట్టి పాత్రలు తెలియజేస్తున్నవి.

అటు తర్వాత ప్రజలు లోహాలను త్రవ్వటం, వ్యవసాయం చేయటం నేర్చుకొని, బానిస విధానంలోకి ప్రవేశించారు. సింధునదీ తీరంలో బయల్పడ్డ హరప్పా, మొహంజాదారో నగర శిథిలాలు ఈ నాగరికతకు చిహ్నాలు. వీనికాలం క్రీ. పూ. 3000.

హరప్పా, మొహంజాదారో నగరాలు నిర్మించబడేనాటికి, ప్రజల మత భావాలు మరింత అభివృద్ధి అయినవి. ప్రకృతిని స్త్రీగా ఆరాధించే ఆచారం ఏర్పడ్డది. దేవతా విగ్రహాలు అనేక రూపాలలో చెక్కబడ్డవి. గ్రామ దేవతలుగా నేటికీ ఆరాధించబడుతున్న పోలేరమ్మ, నాంచారమ్మ మరిడమ్మ, ఇత్యాది దేవతల రూపకల్పనలు హరప్పా, మొహంజాదారో శిథిలాల్లో అనేకం ఉన్నవి.

పురుష దేవతలు కూడా ప్రారంభమయ్యారు. శివుడు, అతని వాహనమైన ఎద్దు, ఏర్పడ్డవి. శివుని లింగాకారంలో పూజించే ఆచారం కూడా ఆనాడు విస్తారంగా ఉన్నట్లు నిదర్శనాలు లభించినవి. లింగాకారంలో (పురుషుని జననేంద్రియం) శివుని పూజించే ఆచారం, ద్రావిడులకంటె ప్రాచీనులైన ఆస్ట్రిలాయిడ్ ప్రజలకు చెందినది. నాటి నుండి నేటివరకూ హిందూమతంలో ఒక అంతర్భాగంగా ఈ ఆచారం నిలిచిపోయింది.

సృష్టికి మూలకారణాన్ని కనుక్కోవటానికి, నాటి మానవుడు చేసిన ఆలోచన అతి ప్రాథమిక స్థాయికి చెందినది. అందుకు అనుగుణంగానే ఈ ఊహలు ఆచారాలు ఏర్పడ్డాయి.

ఆర్య గణాలు మధ్య ఆసియానుండి భారతదేశానికి దిగివచ్చాయి. వచ్చిక బయళ్ళలో పశువులను మేపుకుంటూ, గుర్రాలమైన ఎక్కి,

విల్లంబులతో యుద్ధాలుచేస్తూ. వీరు సింధునదీతీరంలో మొదట స్థిరపడి అటు తర్వాత గంగా, యమునా నదీతీరాలకు వి స్తరించారు.

ఆదిమ కమ్యూనిస్టు సమాజ పద్ధతిలో జీవించే ఆర్యుల దండ యాత్రల ముందు, హారప్పలోని బానిసవిధానం కూలిపోయింది. వరదలు వంటి ప్రకృతి వైపరీత్యాలు కూడా ఇందుకు తోడ్పడ్డాయి. తాత్కాలి కంగా నశించినప్పటికీ, వ్యవసాయంపై ఆధారపడిన బానిస సమాజం తిరిగి ఆర్యులలోనే తల యెత్తింది. సమాజ పరిణామంలో, ఆదిమ కమ్యూనిస్టు సమాజం కంటె బానిస సమాజం ఉన్నత స్థాయికి చెంది నది. ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి అది చిహ్నం. కనుక చివరకు అదే పేరూనింది.

ఆర్యుల మతభావాలను వెలిబుచ్చే గ్రంథాలు వేదాలు, ఋగ్వేదం, సామవేదం, యజుర్వేదం, అధర్వణవేదం అని ఇవి నాలుగు. ఋగ్వేదం అతి ప్రాచీనమైనది.

మానవుని జీవితాని కత్యవసరమైన ప్రకృతి శక్తు లన్నిటినీ వారు దేవతా భావంతో పూజించేవారు. నిప్పు మానవ జీవితాని కత్యవ సరమైనది ఋగ్వేద దేవత లందరిలోకి అతి ముఖ్యుడు అగ్ని. ఋగ్వే దం అగ్నిని వివిధ రూపాలలో వర్ణిస్తూ అతని కీ ర్తిని అనేక విధాలుగా పొగడింది.

వేద కర్తలకు కవితావేశం హెచ్చు. వర్ణనలు, అతిశయోక్తులు, ఉత్ప్రేక్షలు వేద సూక్తాలలో కొల్లలు. తమ నిత్య జీవితానుభవాలను ఉత్ప్రేక్షించి. సూక్తాల రూపంలో వెలిబుచ్చగలవారి మేధోశక్తి ఫలి తమే వేదరచన. వేదసూక్తులనిండా వారి తాత్వికభావాలుకూడా ఉన్నవి. అగ్నిని వారీ విధంగా వర్ణించారు :

ధూమకేతుః పొగను జండగా కలిగినవాడు.

హవ్యవాహనః దేవతలకిచ్చే ప్రసాదాన్ని మోసుకుపోయేవాడు. (అగ్నిలో హోమంచేయుట ఆర్యుల ఆచారం.)

జాతవేదన్ః సృష్టింపబడిన వ్యక్తులందరినీ ఎరిగియున్నవాడు.

విప్రుడు, ఋత్విజుడు, పురోహితుడు, అధ్వర్యుడు, బ్రహ్మ – ఇవన్నీ అగ్నిని గురించి చేసిన వర్ణనలో భాగాలే.

ఈ క్రింది సూక్తాల ద్వారా ఆర్యుల మతభావాలను తెలుసుకో గలం. శవాన్ని దహనం చేసేటప్పటి సూక్తం.

1. ఓ అగ్ని, ఈ శవాన్ని కాల్చవద్దు, మాడ్చవద్దు. దాని చర్మాన్ని ముక్కలు ముక్కలుగా చీల్చకుము. ఓ జాతవేదుడా, యీ శరీరాన్ని ఏమీ కష్టపెట్టకుండా ఒక్కసారిగా భుజించి, పితృలోకానికి అతనిని చేరవేయుము.

2. నీవు భుజించి ఈ శరీరాన్ని పితృలోకానికి చేర్చిన తర్వాత, అతను దేవతల ఆజ్ఞల ప్రకారం నడుచుకుంటాడు.

3. చనిపోయినవాని కళ్ళు సూర్యునిలో చేరుగాక, ఊపిరి గాలిలో కలిసిపోవుగాక; మిగతాది నీటిలో కలిసిపోవుగాక. వాని వాని అర్హతలను బట్టి చనిపోయిన వ్యక్తి స్వర్గానికి వెళ్ళవచ్చు; లేక భూమిలో కలిసిపోవచ్చు. అతని అవయవాలు మొక్కలలో చేరిపోవుగాక.

అగ్ని తర్వాత ప్రధాన దేవత ఇంద్రుడు. ఇతడు మేఘాలకు అధిపతి. వర్షాలను కురిపిస్తుంటాడు. మేఘాలకు కొండలు అడ్డంగా వస్తే, వాటి రెక్కలను విరిచిపారేశాడు. నీటి కరువును కలిగించిన వృత్రాసురుని సంహరించాడు. ఆర్యుల శత్రువుల నందరినీ సంహరించాడు. ఇతని ఆయుధం వెన్నెముక.

ఇంద్రుని గురించిన వర్ణనలలో అధికభాగం వృత్రసంహార, వృత్రహన్, పురవైరి, పురభిద్ (మేఘములను పురములని వర్ణించారు) అని ఉన్నవి. వర్షానికి అడ్డుగా నిలచిన ఊహాకల్పితమైన వృత్త అనే పరిధిని, లేక ఆటంకాన్ని బద్దలుగొట్టి వర్షాలను కురిపించినవాడు అని అర్థం.

వీ రిద్దరుగాక, పృథ్వి (భూమి), సోమ (సోమరసాన్నిచ్చే దేవత) అశ్విన్, వరుణ, ఉష, సూర్య మొదలైనవారు వర్ణించబడ్డారు.

చీకటి అంతరించి వెలుగు రావటం, నీటికరువు అంతరించి వర్షాలు కురవడం – ఈ ప్రకృతి ఘటనలు, నాటి ఆర్యుల మనస్సుపై గొప్ప ప్రభావాన్ని కలిగించినవి. ఆ ఘటనలను ఎన్ని రూపాలలో వర్ణించినా వారికి తృప్తి లేదు. ఈ వర్ణనలు ఆర్యుల ఉత్తరధ్రువ నివాసానికి చిహ్నాలు.

వేదాలలో చివరిది ఐన అథర్వణ వేదంలోని ఈ క్రింది భూమి సూక్తం వారి తాత్విక భావాలకు, పృథ్వీ మాతపట్ల వారికిగల ఆదరాభి మానాలకు తార్కాణం :

1. పరమసత్యము, ధర్మసూత్రము ఈ భూమిని ధరిస్తున్నవి. యజ్ఞయాగాదులతో ఇది పవిత్ర మౌతున్నది. భూత, భవిష్యత్ కాలా లకు అధినేతయైన భూదేవి మమ్మలను కాపాడుగాక.

2. అసంఖ్యాకమైన కొండలు, నదులు, ఓషధులు ఈ భూమాత గర్భంలో ఉన్నవి. ప్రజల కవసరమైన ఆహారం అంతా యిక్కడనుండే ఉద్భవిస్తున్నది.

3. మొదట్లో అంతా మహాసముద్రంలా జలమయంగా ఉండేది. అందులోనుంచి మునులు మంత్రశక్తి ద్వారా భూమిని ఆవిష్కరించారు. ఈ భూమాత మరణ రహితమైన హృదయం స్వర్గంలో ఉన్నది.

4. భూమిని ఇంద్రుడు రక్షిస్తున్నాడు. ఎర్రనేల, నల్లనేల, పచ్చ నేలలతో కూడిన ఈ భూమి మీద మానవుడనైన నేను ఎట్టిఅపాయము లేకుండా అజేయుడనై నిలబడి ఉన్నాను. భూదేవీ! నీ కొండలు, మంచు పర్వతాలు, గుట్టలు అన్నీ నాకు క్షేమాన్ని కలిగించు గాక!

5. భూదేవీ! నీ శరీరము ఎక్కడ, కటిభాగమేది, బొడ్డు యేది, నాకు ఈ వివరాలేమీ తెలియవు. కాని నీవు తల్లివి. నేను కుమారుడను. నా తండ్రి పర్జన్యుడు (ఇంద్రుడు). అతను నాకు క్షేమం కలిగించుగాక!

ద్రావిడులు, నాగజాతి ప్రజలు భూమి మీద ఉన్న పాములను, చెట్లను, స్త్రీ పురుష విగ్రహాలను పూజించేవారు. ఆర్య దేవతల నివాసం మాత్రం భూమి కాదు, ఆకాశం. ఇంద్రుడు, సూర్యుడు ఆకాశంలో తిరుగుతూ వర్షాన్ని, వెలుగును ఇస్తారు. నిత్య జీవితకర్మ లన్నింటికీ అత్యవసరమైన సామాన్య వస్తువు అగ్ని, తేజస్సు లేక శక్తి. కేవలం కంటికి కనబడే వస్తువులను గాక, దూరంగా ఆకాశంలో ఉన్న శక్తులను, వివిధ వస్తువులలో అంతర్లీనంగా ఉండే సామాన్య లక్షణాన్ని గుర్తించ డానికి, ఆరాధించటానికి ప్రయత్నించిన ఆర్యుల మానసికస్థాయి, ఉన్నతమైనది.

భావనాశక్తి యొక్క ఈ పెంపుదల ఫలితంగానే. క్రమంగా మత భావాలు, పూజాపునస్కారాలు వెనుకబడి తాత్విక చింతన ఆరంభమైంది.

ఆర్య ద్రావిడ నాగరికతలు సమ్మేళనం చెందాయి. ద్రావిడుల మతభావాలను, పూజాపద్ధతులను ఆర్యులు స్వీకరించారు. ఉపనిషత్తులతో ప్రారంభమైన తాత్విక చింతనను, మరింత అభివృద్ధిచేసిన శంకర,రామానుజ, మాధ్వులు ముగ్గురూ దక్షిణ దేశంలో ఆవిర్భవించారు. ఈవిధంగా సాంస్కృతిక ఐక్యత సాధించబడ్డది.

నాటి సమాజంలో వర్గ విభేదాలు అప్పటికే తల ఎత్తసాగాయి. తెగ అధిపతి, సామాన్యుడను వ్యత్యాసా లేర్పడ్డాయి. అధిపతి చనిపోతే, అతనితోపాటు, భార్యలను బానిసలను సమాధి చేసే వారు,ప్రాచీన ఈజిప్టులోనూ ఈ ఆచారం ఉండేది. కాని వర్గ వ్యవస్థ లేదు వర్గ విభేదాలు, అధిపతి, సామాన్యుడు అను — రెండు శ్రేణులకు మాత్రమే పరిమితమై ఉండేవి

## వేదసూక్తాలు

వేద సూక్తాలలోని—ఆనంద పారవశ్యంలో మధ్య మధ్య సందేహము, అనుమానము, తాత్విక చింతనలేక పోలేదు.

ఋగ్వేదంలో అనేక దేవతలు వర్ణించబడ్డారు. వీరిలో ఎవరికివారే గొప్ప. అందరికీ అధినాయకు డెవరైనా ఉన్నాడా, లేడా అన్న ప్రశ్న మొదట్లో రాలేదు. కొంత కాలానికి. ఈదేవతల మధ్య సమన్వయం చేయవలెనని, హెచ్చుతగ్గులు నిర్ణయించవలెనని ఆలోచన ప్రారంభమైంది. ఇందుకు సమాధానంగా ఈ క్రింది సూక్తం యేర్పడ్డది.

"మొట్టమొదట మనుష్యుడు ఎలా పుట్టాడు ? ఎముకలు లేని పదార్థంలోంచి ఎముకలుగలవ్యక్తి ఎలాకలిగాడు?ఈభౌమికకు ప్రాణము, రక్తము, ఆత్మ ఉన్నవా? ఈ ప్రశ్నలకు సమాధానం తెలుసుకొనేందుకు ఎవరైనా ఆ సర్వజ్ఞుని (దేవుని) వద్దకు వెళ్ళారా? అన్నిటికి మూలం లింగభేదంలేని సత్తు. దానినే ఇంద్రుడని,అగ్ని అని,వరుణుడని, మిత్రుడని, మాతరిశ్వన్ అని పిలుస్తున్నాం."

ప్రకృతి అంతా నియమబద్ధంగా నడుస్తుందని, అనియమమే ఋత్ అని మరికొన్ని సూక్తాలలో వర్ణించబడ్డది. ఉపనిషత్తులలో కనబడే 'కర్మ' సిద్ధాంతానికి మూలం యీ 'ఋత' భావమే.

సృష్టిని గురించి ఋగ్వేదంలో మరొకచోట యిలా ఉంది.

"ఋతంనుండి వేడి పుట్టినది. అందులోనుండి రాత్రి. తర్వాత సంవత్సరం ఏర్పడ్డవి."

"మొదట అంతా జలమయం. అందులోనుండి హిరణ్యగర్భుడు పుట్టాడు. అనాదిగా ఉంటూ వచ్చిన పదార్థం నుండి ఈ హిరణ్య గర్భుడు ప్రపంచాన్ని సృష్టించాడు."

పదార్థం శాశ్వతమైన, అనాది. ఆ పదార్థంలో నుండి దేవుడు ప్రపంచాన్ని సృష్టించాడనీ చెప్పే ఈ భావం, సాంఖ్య తత్వ శాస్త్రానికి పునాది. ఋగ్వేదంలో అధికభాగం, ఆర్యులు బానిస విధానంలోకి ప్రవేశించకముందు రచించబడ్డది. సమాన ప్రతిపత్తిపై జీవించే నాటి గణ సభ్యులవలెనే, వారి దేవతలు కూడా సమాన హోదా గలవారు. వారిలో ఎక్కువ తక్కువలు లేవు.

మానవునికి, ప్రకృతికి గల సంబంధాలను గ్రహించలేకపోవడం మత భావాల పుట్టుకకు మూలకారణం. మానవుని శరీరానికి, అతని ఆలోచనకు గల సంబంధాన్ని గుర్తించలేకపోవడం, 'ఆత్మ' భావానికి మూలం. ఈ విషయాన్ని వివరిస్తూ ఏంగెల్సు 'లుడ్విగ్ ఫ్యూర్‌బా' అను పుస్తకంలో యిలా వ్రాశాడు.

"ఆలోచనకు, అస్తిత్వానికి, ప్రకృతికి, భావానికి గల సంబంధం ఏమిటనే ప్రశ్న తత్వశాస్త్రంలో ప్రధానమైన ప్రశ్న. దీనికి మూలం మిగతా మతభావాలన్నిటివలెనే అటవిక మానవుని సంకుచిత అజ్ఞాన దృష్టి."

(లుడ్విగ్ ఫ్యూర్‌బా, 30 వ పేజీ).

మానవ శరీరంలో శాశ్వతమైన ఆత్మ ఉంటుందన్న భావం ఎలా ఏర్పడ్డదో వివరిస్తూ, అదే పుస్తకంలో ఏంగెల్సు యిలా వ్రాశాడు:

'తన శరీర నిర్మాణాన్ని గురించి అతి ప్రాథమిక విజ్ఞానంకూడా ఆదిమ మానవునికి లేదు. 'కలలు' ఎందుకు వచ్చేవో వారికి తెలియదు, మానవ శరీరాన్ని అంటిపెట్టుకుని ప్రత్యేకంగా ఒక 'ఆత్మ' ఉన్నదని ఆలోచన, స్వప్నజ్ఞానం మొదలైన లక్షణాలు ఆత్మకు మాత్రమే చెందినవని. శరీరానికి సంబంధించినవి కావని, ఈ కారణం వల్లనే కలలు వస్తున్నవని వారు నమ్మారు. మరణానంతరం 'ఆత్మ' శరీరాన్ని వదలి వెళ్ళిపోతుందని వారు భావించారు. నాటినుండి 'ఆత్మ' కు, బాహ్య ప్రపంచానికి గల సంబంధాన్ని గురించి మానవుడు ఆలోచిస్తూనే ఉన్నాడు.

(లుడ్విగ్ ఫ్యూర్ బా, 29 వ పేజీ)

'ఆత్మ' ను గురించి దీర్ఘంగా రోజుల తరబడి ఆలోచించే విశ్రాంతి రాతియుగంలోని మానవునికి లేదు. ఏ రోజు కారోజు ఆహార పదార్థాల సంపాదన కొరకు నిరంతరం అతడు కృషిచేస్తూ ఉండేవాడు. రాతి ఘనిముట్లతో కొయ్య పనిముట్లతో జంతువులను వేటాడి మాంసం సంపాదించేవాడు. పండ్లు, కాయలు తినేవాడు. తిండి చాలక బాధపడుతూ వుండేవాడు.

మానవుడు మరికొంత పురోగమించి, పశుపోషణను నేర్చుకున్నాడు. సమాజంలో ప్రప్రథమంగా పనివిభజన ఏర్పడ్డది, వేటాడేవారు, పశువులను పోషించేవారు విడివడ్డారు. పశువులను మచ్చికచేయుట ద్వారా పాలు, పెరుగు లభించేవి. తిండికొరత తగ్గింది. విశ్రాంతి లభించింది పశువుల కవసరమైన పచ్చి గడ్డికొరకు, గుంపులు గుంపులుగా వీరు దేశదేశాలు తిరగసాగారు. ఈ విధమైన సంచారక తెగలుగానే ఆర్యులు భారత దేశానికి వచ్చారు.

పచ్చిగడ్డి పెరగాలంటే వర్షం అవసరం. వర్షం ఎలా కురుస్తున్నది ? ఎవరు కురిపిస్తున్నారు ? మొదలైన సమస్యలన్నీ మానవుని వేధించ సాగినవి. ప్రకృతిశక్తుల ఉపాసన ప్రారంభమైంది. ఋగ్వేదంలో ప్రకృతిశక్తుల ఆరాధన ఈ విషయాన్ని సూచిస్తుంది.

ఉత్పత్తిశక్తులు పెరిగినకొద్దీ, మానవుడు పొలాలు దున్ని. పచ్చి గడ్డిని పెంచటం నేర్చుకున్నాడు. మరికొంత కాలానికి ఆహార ధాన్యాలు

పంపిణీచటం ప్రారంభమైంది. వ్యవసాయం చేతనైన తెగలు, చేతగాని తెగలు ఏర్పడ్డాయి. ఈ తెగలమధ్య జరిగిన యుద్ధాలలో ఓడిపోయిన వారు బానిస లయేవారు. వర్గాలు, దోపిడీ, హెచ్చు తగ్గులు ప్రారంభ మైనవి.

బానిస యజమానులలో కూడా వివిధ వర్గాలు ఏర్పడసాగినవి. వర్గవిభజన, వర్ణవిభజన రూపు ధరించడం భారతదేశంలో ప్రత్యేకత. వర్గదోపిడీకి మారుపేరు అగ్రవర్ణాల పెత్తనం.

పని విభజన మరింత ముందుకు సాగింది. వ్యవసాయం, చేతి వృత్తులు, వాణిజ్యం— ఇలా వివిధ వృత్తులు ఏర్పడ్డాయి. ఆదిమ కమ్యూనిస్టు సమాజంలోని సమిష్టి ఉత్పత్తి సంబంధాలు నశించి, పని విభజన, వర్గదోపిడీపై ఆధారపడ్డ ఉత్పత్తి సంబంధాలు వచ్చాయి.

పని విభజన, నైపుణ్యం, భౌతిక శ్రమకు, మానసిక శ్రమకు విభజన, ఏర్పడ్డవి. పరాన్నభుక్కులైన మేధావర్గ ఆవిర్భావానికి నాందీ వాచకం ఏర్పడ్డది. భావవాద తత్వశాస్త్ర రూపకల్పనకు ఇదొక ప్రాతిపదిక. ఉత్పత్తివిధానంలో బహుముఖమైన అభివృద్ధి బానిస సమాజంలో ఏర్పడ్డది. భావప్రపంచంలో ఈ అభివృద్ధి ప్రతిబింబించింది. ప్రకృతి శక్తులను యథాతథంగా పూజించే ధోరణి వెనుకకు తగ్గి, ఊహా ప్రధానమైన దేవతలు వెలిశారు. దేవతల వస్తువాహనాదులకు సంబంధించిన చర్చ వెనుకకు తగ్గి, సృష్టిలో వారి పాత్ర విషయమై జిజ్ఞాస ప్రారంభమైంది. సాకార సగుణబ్రహ్మ స్థానంలో నిరాకార నిర్గుణ బ్రహ్మ ఏర్పడ్డాడు. ఈ పరిపోత విధానమే తత్వశాస్త్రాభివృద్ధికి మూలకారణం.

ప్రకృతిశక్తుల ఉపాసననుండి ఏకేశ్వరోపాసన వరకు వచ్చిన ఈ పరిణామాన్ని, ఏంగెల్సు ఇలా వివరించాడు:

"ప్రకృతి శక్తులకు దేవత్వం ఆరోపించుటద్వారా మొట్టమొదటి దేవుళ్ళు ఏర్పడ్డారు. మతసిద్ధాంతాలు అభివృద్ధి అయినకొద్దీ, ఈ దేవుళ్ళు ప్రకృతి శక్తులతో తమకు గల సంబంధాన్ని వదలించుకుని, ఊహా ప్రపంచంలోకి వెళ్ళిపోయారు. మానవుని భావనాశక్తి పెంపొందినకొద్దీ, ప్రత్యేక ఘటనలనుండి సాధారణ సూత్రాలను వెదదీసి, వాని ద్వారా విజ్ఞానాన్ని పెంపుచేసుకొనే పద్ధతి సహజంగా అభివృద్ధి కాసాగింది. ఈ

ఐకమైన వడపోత విధానంద్వారా, ఒకరిమీద మరొకరు పెత్తనంచేసే అసంఖ్యాకమైన చిల్లరదేవుళ్ళు అంతరించారు. ఏకేశ్వరోపాసనకు ఉన్నా మైన మూలవిరాట్ భావం, క్రమంగా మానవుని మనస్సులో కలిగించి."

(లుడ్విగ్ ఫ్యూర్‌బా, 80 వ పేజీ)

మతరీత్యా ఏకేశ్వరోపాసన, తత్వశాస్త్రరీత్యా భావవాదం చరిత్రలో తల యెత్తినవి. ప్రపంచాన్ని ఏదో మానవాతీతమైన శక్తి దేవుడు సృష్టించాడనీ, ఈ శక్తి, దేవుడు లేక భావం ప్రాథమిక మైనదనీ, ప్రకృతి లేక పదార్థం తరువాత పుట్టినదనీ, అప్రధానమైనదనీ భావించే వారందరూ భావవాదులు.

## రెండవ అధ్యాయం

# ఉపనిషత్తులలోని భావవాదం

భారతదేశంలో మొట్టమొదట భావవాదాన్ని స్పష్టంగా వివరించిన గ్రంథాలు ఉపనిషత్తులు. ఉపనిషత్తుల సంఖ్య 108. వీనిలో ప్రధానమైనవి 10, లేక 12. ఈ 10, 12 ఉపనిషత్తులు, క్రీ. పూ. 1000 నుండి క్రీ. పూ. 500 వరకు గల అయిదు శతాబ్దాలలో రచించబడ్డాయి.

భారత దేశంలో జానిస విధానం వర్ణవ్యవస్థ రూపం ధరించింది. ఆర్యులైన బ్రాహ్మణ, క్షత్రియుల మధ్య పెనుగులాట మొదటినుంచీ ఉన్నది. ఈ పెనుగులాట ఫలితంగా, ఒకప్పుడు బ్రాహ్మణులు, ఒకప్పుడు క్షత్రియ రాజులు పెత్తనం చెలాయించేవారు. ఉపనిషత్తుల కాలంనాటికి క్షత్రియులు అనేకులు తత్వవేత్తలుగా రూపొందారు. రాజసభలలో తత్వశాస్త్ర చర్చలు జరుగుతూ వుండేవి. అజాతశత్రువు, జనకుడు, అశ్వపతి కౌకయ మొదలైన రాజులు తత్వశాస్త్ర చర్చలలో ప్రధానపాత్రవహించారు.

2 వేల సంవత్సరాలు అతి దారుణంగా కొనసాగిన వర్ణవ్యవస్థపై తీవ్ర అసంతృప్తి ఏర్పడ్డది. బ్రాహ్మణవర్గం ఆచరించే కార్మకాండపై నిరసన బ్రహ్మవాదం. ఇది మొదట క్షత్రియులలో తల ఎత్తింది.

కర్మకాండ పశుహింస ప్రధానం. పశువుల నష్టం ఉత్పత్తి శక్తులకు దెబ్బ. ఈ బాధ అనుభవించేది శూద్రులు, వైశ్యులు. దానిని

ఎంతో కొంత గుర్తించక తప్పని వారు రాచరికం నిర్వహించే క్షత్రియులు. కనుకే కర్మకాండ నిరసన, బ్రహ్మవాద ప్రతిపాదన మొదట్లో క్షత్రియులలోని ఒక విభాగం నుండి ఆవిర్భవించింది.

రంతి దేవుడను రాజు యజ్ఞం చేయగా చనిపోయిన పశువుల చర్మాలు, చంబల్ లోయలోని నది నంతా ఆవరించగా, ఆ నదికి చర్మణ్వతి అని పేరు వచ్చింది.

ఇట్టి కర్మకాండను ఆపివేయడం, కనీసం నిరుత్సాహ పరచటం ఒక సామాజికావసరం అయింది. తాత్త్విక రంగంలో ఈ ధోరణి ప్రతిబింబం బ్రహ్మవాదం.

మొదటి ఉపనిషత్తు ఐతరేయ ఉపనిషత్తు. దీని కర్త మహీదాసు. ఇతను శూద్రవర్ణంలో పుట్టి స్వయంకృషిద్వారా ఉపనిషత్కర్తగా రూపొందాడు. మరొక వ్యక్తి సత్యకామ జాబాలి. ఇతనితండ్రి ఎవరో తెలియదు. తల్లి పేరు జాబాలి. ఆమె ఒక దాసి.

తను దాసీపుత్రుడనని, తన తండ్రి ఎవరో తనకు తెలియదని, తత్వజ్ఞానం సంపాదించవలెనను ఆసక్తికలదని, సత్యకామజాబాలి గౌతముడను బ్రాహ్మణునివద్దకు వెళ్ళి అభ్యర్థించాడు. అతని శిష్యుడుగాచేరి, గొప్ప తత్వవేత్త ఐనాడు. గార్గి, మైత్రేయి మొదలైన స్త్రీలుకూడ తత్వవేత్తలలో ఉన్నారు.

ఉపనిషత్తుల కాలంనాటికి, ఈ మార్పు రావడానికి కొన్ని బలవత్తరమైన చారిత్రక కారణా లున్నవి.

బానిస విధానంపై ఏర్పడిన వర్ణ వ్యవస్థ, నిరంకుశ రాచరికం స్థిరపడిన మీదట, బ్రాహ్మణ, క్షత్రియ వర్ణాలు అతి దారుణంగా క్రింది వర్ణాలపై తమ పెత్తనం సాగించసాగాయి. ప్రభుత్వ చట్టాలు, నీతి నియమాలు, ధర్మసూత్రాలు, శిక్ష, ఆస్తిమీద పన్ను మొదలైన సమస్త విషయాలలో, బ్రాహ్మణులకు ఎక్కువగాను, క్షత్రియులకు కొంతవరకు ప్రత్యేక సౌకర్యా లుండేవి. శూద్రులు, ఇతరులు అతి కఠినమైనసాంఘిక, ఆర్థిక, రాజకీయ దోపిడీకి గురికాసాగారు. రామాయణ, భారత గాథల మధ్య కాలంలో (క్రీ. పూ. 2500–1500 వరకు) భారతదేశంలో తలయెత్తిన నిరంకుశ రాజ్యాల చరిత్ర, న్యాయశాస్త్రాలు చూస్తే

ఈ విషయం బోధపడుతుంది. ఈ నిరంకుశ ధోరణిపై అనేక రాజకీయ, సాంఘిక తిరుగుబాట్లు జరిగాయి. భారత యుద్ధానంతరం బ్రాహ్మణుల కంటే క్షత్రియులు సమాజంలో ఉన్నత స్థానం సంపాదించారు. సాంఘిక సంబంధాలలో కొంత మార్పు వచ్చింది.

ఉపనిషత్తులు వర్ణవ్యవస్థను ఖండించలేదు కాని మినహాయింపులు చెప్పాయి. కర్మ కంటె జ్ఞానం ముఖ్యం. శక్తిగలవారు చొరవగలవారు. క్రింది వర్ణాల నుంచి పైకి ఎగబాకటానికి అవకాశం కల్పించాయి.

మహీదాసు, సత్యకామజాబాలి అట్టివారు.

ఋగ్వేదానికి ఉపనిషత్తులకు మధ్య 2 వేల సంవత్సరాలు గడిచాయి. ఈ మధ్యలో అతి కఠినరూపం ధరించిన వర్ణ వ్యవస్థ. ఉపనిషత్తుల కాలం నాటికి కొంత సడలింది.

ఈ సాంఘిక పరిణామ ఫలితంగా ఏర్పడ్డ భావపరివర్తన ఉపనిషత్తుల లోని తాత్విక చర్చలలో వ్యక్తమౌతున్నది. ఋగ్వేదం అతి ప్రాచీనమైనది. ఇందులో విజయం సాధించిన ఆర్యుల ఆనంద పారవశ్యం, ప్రకృతి ఆరాధన, అచ్చటచ్చట తాత్వికచింతన కనబడుతుంది. ఆ తర్వాత సామవేదం ఏర్పడ్డది. ఋగ్వేదంలోని ఋక్కులను ఏ విధంగా గానంచేయాలి అన్న విషయం తప్ప ఇందులో అదనంగా ఏమీ లేదు. అలా గానం చేస్తేనే, యజ్ఞం ఫలప్రదమౌతుందన్న నమ్మకం ఏర్పడ్డది. ఋక్కులలోని అర్థాని కంటే సంగీత స్వరానికి ప్రాధాన్యత ఏర్పడ్డది. అర్థం తెలియకుండా, వేదాలను, గానంచేసే పురోహితవర్గం ఒకటి ఏర్పడ్డది.

తర్వాత యజుర్వేదం ఏర్పడ్డది. యజ్ఞవేదిక ఎత్తూ, పొడుగూ, దానిపైన వుంచవలసిన ధాన్యాలూ, ఏ పురోహితుడు ఏ మూల కూర్చొని యజ్ఞం చేయించాలి మొదలైన కర్మకాండను వివరించేది యజుర్వేదం.

తర్వాత అథర్వణ వేదం. ఇందులో పై విషయాలతో బాటు అనార్య తెగలలో వ్యాపించివున్న మూఢ నమ్మకాలు,దయ్యాలు,ప్రయోగాలు, వాటికి ప్రతిక్రియలు మొదలైనవి ఉన్నాయి.

ఇంతటితో ఆగలేదు. పై నాలుగు వేదాలకు బ్రాహ్మణములు ఏర్పడ్డవి. ఇవి కర్మకాండలో అనుసరించ వలసిన పద్ధతులను వివరిస్తూ వ్రాయబడిన వచన వ్యాఖ్యాన గ్రంథాలు. కర్మకాండ, బ్రాహ్మణములతో సంపూర్ణ పరాకాష్ట నందుకున్నది.

ఈ పతనావస్థపై తిరుగుబాటుగా మరొక ధోరణి తలయెత్తింది.. కర్మకాండ ప్రధానమైనది కాదనీ, ప్రపంచ రహస్యాన్ని, సృష్టికి మూల కారణాన్ని కనుక్కోవలెనంటే కర్మకాండతో నిండివున్న సమాజాన్ని వదలి, దూరంగా అడవులలో దీర్ఘాలోచన, అధ్యయనము చేయవలెనని కొందరు వాదించ నారంభించారు. ఈ ధోరణికి చిహ్నంగా అరణ్యకములు (అరణ్యములలో మాత్రమే అభ్యసింపవలసిన గ్రంథములు) తలయెత్తినవి. అనేకులు అడవులలోకి పోయి, ఆశ్రమాలు కట్టుకొని తత్వ విచారణ ప్రారంభించారు. నాలుగు వేదాలకూ అనుబంధాలుగా అరణ్యకములు వ్రాయబడినవి.

ఈ గ్రంథాలలో సగం కర్మకాండ, సగం తత్వవిచారణ ఉన్నది..

ఈ పరిణామం పూర్తిచెంది, తత్వవిచారణే ప్రధానంగా పెట్టుకున్న ఉపనిషత్తులు వచ్చినవి. ఉపనిషత్కర్తలు కర్మకాండను వదలి వేశారు. రాజసభా భవనాలు తత్వశాస్త్ర చర్చలతో ప్రతిధ్వనించినవి. (ఉపనిషత్తు = గురువు దగ్గర కూర్చొని నేర్చుకోవలసిన విజ్ఞాన గ్రంథం).

పదార్థం వివిధ రూపాలలో పరిణామం చెందుతూ వచ్చింది. ఇది ఒకరిచే సృష్టించబడలేదు. పదార్థం చలనం అవినాభావ సంబంధం కలవి. పదార్థ పరిణామక్రమంలో నిర్జీవ పదార్థంనుండి సజీవ పదార్థమైన ప్రాథమిక జీవకణం (ఎమీబా) ఉద్భవించింది. 'ఎమీబా' నుండి మానవునివరకు జరిగిన సుదీర్ఘ పరిణామం ఫలితంగా మానవుని మెదడు ఏర్పడ్డది. కనుక పదార్థం మొదటిది; ప్రాథమికమైనది: భావం అందులో నుండి ఉద్భవించినది.

ఈ శాస్త్రీయమైన దృక్పథం, ఆధునిక భౌతికవాదానికి మూలం. కాని ఉపనిషత్తులలో సృష్టిని గురించిన సిద్ధాంతం ఇందుకు పూర్తిగా విరుద్ధమైనది.

పదార్థం నిర్జీవమైనది. దీనిని శక్తివంతంచేసి ప్రాణం పోయాలి. ఈ పని ప్రజ్ఞావంతుడైన పరమాత్మ మాత్రమే చేయగలడు (ప్రజ్ఞానః నిరంతర చలనశీలమైన స్వయం భూశక్తి). పదార్థంకూడా పరమాత్మ లోని భాగమే. పదార్థంయొక్క ప్రాథమిక రూపాలు నిప్పు, నీరు, భూమి.

మొదట్లో ప్రజాపతి ఒక్కడే వున్నాడు. ఒంటరితనాన్ని భరించ లేని ఆ ప్రజాపతి, సాలీడు, తనలోనుండి దారాన్ని బైటికి తీసినట్లు, వేణువులో నాదం ఉద్భవించినట్లు, నిప్పులోనుండి కణములు వచ్చినట్లు ప్రపంచాన్ని సృష్టించాడు. ప్రజాపతి అనాదిసిద్ధుడు. అతని సృష్టి ఈ ప్రపంచం.

ఛాందోగ్య ఉపనిషత్తులలో తండ్రి, కొడుకుల మధ్య సృష్టిని గురించి ఈ క్రింది సంభాషణ నడిచినట్లు ఒక కథ ఉంది:

తండ్రి: ఆ మర్రిపండు తీసుకురా.
కొడుకు: ఇదిగో తెచ్చాను.
తండ్రి దానిని పగలగొట్టు.
కొడుకు: ఇదిగో పగలగొట్టాను.
తండ్రి: ఇప్పుడు నీవేమి చూస్తున్నావు?
కొడుకు: అసంఖ్యాకమైన నలుసులను చూస్తున్నాను.
తండ్రి: అందులో ఒక నలుసును వేరుచేసి దానిని పగలగొట్టు.
కొడుకు: ఇదిగో: అలాగే చేశాను.
తండ్రి: ఇప్పు దేమి చూస్తున్నావు?
కొడుకు: ఏమీ చూడటంలేదు.

తండ్రి: కనుక ఓ కుమారా! నీకు కనబడని ఆ శూన్యం నుంచి యీ మర్రి విత్తనం, అందులోనుండి యీ మహావృక్షం పుట్టినవి. కనబడీ కనబడని ఆ శూన్యంలోనుండే యీ చరాచర ప్రపంచ మంతా, నీవూ-నేనూ-అందరమూ పుట్టాం. ఓ శ్వేతకేతూ! అదే ఆత్మ, అదే పరమాత్మ, అదొక్కటే వాస్తవమైనది. ఓ కుమారా! ఈ విషయం నీవు విశ్వసించుము.

సృష్టికి సంబంధించిన భావవాద దృక్పథం పై ఉదాహరణలో మనకు స్పష్టంగా బోధపడగలదు.

ఉపనిషత్తులు ఒకరోజున ఒక తత్వవేత్త వ్రాసిన గ్రంథాలు కావు. అనేకమంది తత్వవేత్తలు, కొన్నివందల సంవత్సరాలపాటు వ్రాస్తూ వచ్చారు. అవి ప్రధానంగా భావవాద సిద్ధాంతాన్నే బోధించినా, వానిలో శాఖాభేదాలుకూడా ఉన్నవి. సృష్టికి సంబంధించిన యీ క్రింది నాలుగు సిద్ధాంతాలకు ఉపనిషత్తులలో ఆధారాలున్నవి:

1. ప్రకృతి అనాదిసిద్ధం. భగవంతుడు దీనిని సృష్టించలేదు. కాని ప్రకృతిలోని మార్పుకు, అభివృద్ధికి భగవంతుడే మూలకారణం—ఈ ధోరణిలోనుండి సాంఖ్యవాదం తల యెత్తింది.

2. దేవుడు ప్రకృతిని శూన్యంలోనుంచి సృష్టించాడు. ప్రకృతి భగవత్ సృష్టి అయినప్పటికీ, అది స్వతంత్రమైనది.

3. భగవంతుడు తనలోనుండే ప్రకృతిని సృష్టించాడు.

4. భగవంతుడు మాత్రమే వాస్తవం. సృష్టి అంతా మాయ. అది అతని నీడ మాత్రమే—ఇది శంకరాచార్యుని మాయావాదానికి మూలం.

పై నాలుగు ధోరణులలో సాంఖ్యవాదం మినహా, మిగతా అన్నీ భావవాద ధోరణులు.

మానవ శరీరాన్ని అంటిపెట్టుకొని 'ఆత్మ' ఒకటి ఉంటుందనీ; ఈ ఆత్మకు సుఖదుఃఖాలు, జననమరణాలు లేవనీ, ఇది పరమాత్మ స్వరూపమనీ భావవాద తత్వశాస్త్రం బోధిస్తుంది. ఈ ఆత్మను నిరూపించటానికి జరిగిన ప్రయత్నాలను ఛాందోగ్యోపనిషత్తులోని ఈక్రింది సంభాషణల ద్వారా మనం తెలుసుకొనగలం.

ఇంద్రుడు (శిష్యుడు): ఆత్మ అంటే ఏమిటి?

ప్రజాపతి (గురువు): వృద్ధాప్యం, మరణం, దుఃఖం, ఆకలి దప్పులు, పాపపుణ్యములు, ఆకారం-ఏవీ లేనిది ఆత్మ.

ఇం: నాకు నిదర్శనం కావాలి?

ప్ర: అద్దంలో నీకు కనబడే ప్రతిబింబమే నీ ఆత్మ.

ఇం: కాని, నా ప్రతిబింబం కూడా నావలెనే ఆకారం.రూపురేఖలు కలిగి వున్నది కదా? అది ఎలా ఆత్మ అవుతుంది?

ప్ర: (కొంచెం ఆలోచించి) నీ కలలో కనబడే నీ రూపమే ఆత్మ.

ఇం: (కొంచెం ఆగి) కలలు పగటిపూట రావుగదా? రాత్రిప్పు కూడా ఎల్లప్పుడూ రావుగదా? అప్పుడు నా ఆత్మ ఏమైనట్లు? పైగా కలలో కనబడే ఆత్మకు, నా భౌతికరూపానికి పోలిక ఉన్నది గదా? ఇలాం టప్పుడు, అది నిరాకారమైనది అన్న నిర్వచనం ఎలా కుదురుతుంది?

ప్ర: (చాలా సేపటికి) కలలు రాని నిర్వికారస్థితిలో నిద్రించేదే ఆత్మ.

అలా ముగిసింది చర్చ. ఇంద్రుని సందేహం మాత్రం నివారణ కాలేదు.

కలలు ఎందువల్ల కలుగుతున్నాయో తెలుసుకోలేని ఆదిమ మానవుని అజ్ఞానం, 'ఆత్మ' అనే భావానికి మూలమని ఏంగెల్సు తెలియ జేశాడు. దానికి పై సంభాషణ ఉదాహరణ.

ఇలాంటి సంభాషణలు ఉపనిషత్తులలో చాలా ఉన్నవి. ఆత్మ, పరమాత్మ మొదలైన విషయాలను మేధోశక్తి ద్వారా నిరూపించడం సాధ్యంకాదని, అంతరాత్మ ప్రబోధం ద్వారానే బ్రహ్మజ్ఞానం సంపాదించ గలమని, చివరకు ఒక కథలో వివరించబడ్డది.

ఆత్మ, పరమాత్మలను గురించి ఒక గురువుకు, శిష్యులకు దీర్ఘ సంభాషణలు జరిగాయి. శిష్యుల సందేహాలు నివారణ కాలేదు. చివరకు గురువు ఇలా అన్నాడు.

"రేపు రండి బ్రహ్మజ్ఞానం గూర్చి వివరిస్తాను." మర్నాడు ఉదయం శిష్యులు వచ్చేటప్పటికి గురువు పద్మాసనం వేసుకొని, ధ్యాన ముద్రలో ఉన్నాడు. ఎప్పుడు గురువుగారికి మెలకువ వస్తుందా అని శిష్యులు ఎదురు చూసి చూసి, వారు కూడా ధ్యానముద్రలో నిమగ్నులై నారు. 4, 5 రోజులు గడిచిన తర్వాత అంతా ధ్యానంలోనుంచి బైట పడ్డారు. అప్పుడు గురువుప్రశ్నకు శిష్యులు ఇలా అన్నారట: "బ్రహ్మ జ్ఞానం కలగలేదుగాని, ధ్యానముద్ర మాత్రం అలవాటైంది." గురువు: "అదే సరైన మార్గం, ధ్యానం, తపస్సు ద్వారా మీ అంతట మీరే బ్రహ్మజ్ఞానం పొందుతారు. ఇది మేధోశక్తి ద్వారా చెప్పేదికాదు."

"గురోస్తు మౌనం వ్యాఖ్యానం
శిష్యాస్తు చ్ఛిన్న సంశయః."

గురువుగారి వ్యాఖ్యానం మౌనం. శిష్యుల సందేహాలన్నీ నివారణ అయినవి.

ఇందుకు విరుద్ధంగా భౌతికవాదం ఇలా తెలియజేస్తుంది: ప్రపంచం వాస్తవం. అనుభవం, ఆచరణ, మేధోశక్తి ద్వారా ప్రపంచానికి సంబంధించిన విజ్ఞానాన్ని మానవుడు సంపాదిస్తాడు. ప్రపంచంలో అనేక విషయాలు ప్రస్తుతం మానవునికి తెలియకపోవచ్చు. కాని తెలుసుకోలేని విషయాలు అంటూ ప్రపంచంలో లేవు.

ఉపనిషత్తులలోని దృక్పథం ఇందుకు వ్యతిరేకంగా ఉంది. అవి యిలా చెబుతున్నాయి :

జ్ఞాన సంపాదనకు మార్గాలు రెండు. భౌతిక ప్రపంచాన్ని గురించి తెలుసుకోవటం ఒకటి. మానవుని అంతరాత్మ ప్రబోధం రెండవది. ఇందులో రెండవ మార్గమే ఉత్తమమైనది. ఇందుకుగాను, ప్రత్యక్ష కార్యాచరణకు, మానవుడు ఎంతదూరంగా ఉంటే అంత మంచిది. ఆహార స్వీకరణ, గాలిపీల్చటం, నీరు త్రాగటం మొదలైన శారీరక విధులను గూడా నిరోధించ గలిగితే మరీ మంచిది. అప్పుడు జ్ఞాన నేత్రం మరింత త్వరగా వికసిస్తుంది.

ఉపనిషత్తులలో ఒక కారికలో ఇలా వుంది:

"మానవునికి సహజంగా బాహ్యదృష్టి ఉంటుంది. కాని జ్ఞాని అయినవాడు కళ్ళు మూసుకుని అంతర్దృష్టి అలవర్చుకుని ఆత్మను తెలుసుకుంటాడు."

ఋగ్వేదంలోని ప్రకృతిశక్తుల ఉపాసన మానవుని బాహ్యదృష్టికి నిదర్శనం. కనుకనే అనేక సందర్భాలలో ఉపనిషత్తులు వేదాలను నిరాకరించినవి. ఛాందోగ్యోపనిషత్తులో యిలా ఉంది.

"నారదుడు నాలుగు వేదాలను అధ్యయనం చేశాడు. మంత్రాలన్నీ కంఠస్థం చేశాడు. కాని ఆత్మను తెలుసుకోలేకపోయినాడు."

మండూక్యోపనిషత్తులో ఇలా ఉంది:

"జ్ఞానంలో రెండు రకాలున్నవి. ఒకటి తక్కువ స్థాయికి చెంది నది. మరొకటి ఉన్నత స్థాయికి చెందినది. వేదాల ద్వారా వచ్చే జ్ఞానం తక్కువ స్థాయికి చెందినది. తపస్సు ద్వారానే ఉన్నత జ్ఞానాన్ని మానవుడు పొందగలడు."

హేతువాదాన్ని అదుపులో ఉంచాలని తెలియజేసే మరొక ఉదాహరణ చూద్దాం. యాజ్ఞవల్క్యమునికి, గార్గికి ఈ సంభాషణ జరిగినట్లు బృహదారణ్యకోపనిషత్తు తెలియజేస్తున్నది:

"గార్గి —దేవతలంతా ఇంద్రునిలో నుండి పుట్టారు. ఇంద్రుడు ఆది శక్తినుంచి, ఆదిశక్తి బ్రహ్మనుండి వచ్చారు. సరే, బ్రహ్మ ఎక్కడ నుండి వచ్చాడు ?"

యాజ్ఞ— "గార్గీ, అధిక ప్రసంగం చేయకు, హేతువాదాని కొక పరిమితి ఉన్నది ?"

"బ్రాహ్మణుడు, తన జ్ఞానాన్ని అంతా మరచి శిశువువలె అజ్ఞానంలో వుండాలి. అప్పుడే అతను బ్రహ్మను తెలుసుకోగలడు—"

—బృహ.

"అంతులేని చర్చలవల్ల లాభంలేదు. నోటికి వృథా శ్రమనీలు"

—బృహ.

పై సిద్ధాంతాలన్నీ తత్వవిచారణలో మునిగిన మేధావి వర్గానికే ప్రధానంగా పరిమితమైనవి. ప్రజాసామాన్యంలో ప్రవేశించలేదు. ఐతే ప్రజల వాస్తవిక జీవితానికి సంబంధించిన సమస్యల పైన కూడా ఉపనిషత్తులు కొన్ని అభిప్రాయాలను వెలిబుచ్చినవి.

మానవుడు ఈ జీవితంలో అనుభవించే సుఖదుఃఖాల కన్నిటికి, వెనుకటి జన్మలో చేసిన 'కర్మ' మూలకారణమన్న సిద్ధాంతం మొదటి సారిగా ఉపనిషత్తులలో రూపొందించబడ్డది.

"ధాన్యపుగింజ నశించినట్లే మానవుడు నశిస్తాడు. తిరిగి ధాన్యపు గింజ వలెనే ఉద్భవిస్తాడు." —[illegible]షత్తు

"సత్కార్మలు చేసినవారు వచ్చేజన్మలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులాలలో ఏదో ఒకదానిలో పుడతారు. చెడుపనులు చేసినవారు కుక్క జన్మ, పంది జన్మ లేక ఛండాలజన్మ పొందుతారు."

— ఛాందోగ్య.

"ఒక శిల్పి పాతవిగ్రహాన్ని చెడగొట్టి ఆ పదార్థంతోనే అంత కంటే మంచి విగ్రహాన్ని చేస్తాడు. అదే విధంగా ఆత్మ ఒక శరీరం వదలి, అంతకంటె ఉన్నతమైన శరీరాన్ని సృష్టించుకొని అందులో వుంటుంది."

—బృహదారణ్యకం.

## మూడవ అధ్యాయం

# ప్రాచీన భౌతికవాదం

భారతదేశంలో మొదట భౌతికవాదాన్ని ప్రచారం చేసినవారు చార్వాకులు. ఈకోవకు చెందిన తత్వవేత్తలు ఎందరుండేవారో, వారి నామధేయాలు ఏవో మనకు తెలియవు. వీరి నందరినీ కలిపి 'చార్వాక మతస్థులు', 'నాస్తిక మతస్థులు' — అను పేర్లతో వ్యవహరించేవారు. ఇదైనా వ్యతిరేకులు వారికిచ్చిన అపభ్రంశపు పేరే కాని. అసలు పేరు కాదు. వారినే లోకాయతులు అని కూడా అనేవారు.

వీరి కాలం క్రీ. పూ. 600. మరొక్క 50సంవత్సరాలకు గౌతమ బుద్ధుడు భారతదేశంలో ఉన్నిస్తాడనగా, యీ చార్వాకమతం తల ఎత్తింది. దానికి బీజాలు చాలాకాలం క్రితమే ప్రజలలో ఉన్నవి.

కృషిద్వారా ప్రజలు పంట పండిస్తున్నారు. స్త్రీ పురుషుల కలయిక ద్వారా సంతానం కలుగుతోంది. ఇది లోక ప్రసిద్ధి. ఇక దేవుని అవసరమేమి ? ఈ ప్రాథమిక దృష్టి లోకాయత వాదానికి పునాది.

ఈ భౌతిక ప్రాతిపదికపై చార్వాక తత్వశాస్త్రం ఆధారపడిఉంది.

ఈ మతస్థులు వ్రాసిన పుస్తకాలు లభించటంలేదు ఈ మతాన్ని ఖండిస్తూ వ్రాసిన పుస్తకాలలోఉదాహరణలనుండిమాత్రమేమనం చార్వాక

తత్వశాస్త్రాన్ని తెలుసు కోవలసి వుంటుంది. ఇలాంటి పుస్తకాలలో ముఖ్యమైనది సర్వదర్శన సంగ్రహం.

చార్వాకమత బీజాలు ఉపనిషత్తులలో బృహస్పతి అను ఒక ముని వ్రాసిన సూత్రాలలో వున్నట్లు సర్వదర్శన సంగ్రహకర్త వర్ణించాడు. బృహస్పతి యీ మతానికి ప్రారంభకుడైనట్లు మహాభారతంలో ఒక కథకూడా వుంది.

చార్వాకమతం దేశంలో ప్రారంభమయ్యేసరికి, కర్మకాండ ప్రపంచాన్ని పూర్తిగా ఆవరించింది.

ఈ కర్మకాండను, వెర్రి ఆచారాలను అవహేళన చేయటంతో చార్వాకమతం ప్రారంభమైంది.

చనిపోయిన వ్యక్తులకు శ్రాద్ధదినాలలో ఆహారాన్ని యిచ్చే ఆచారాన్ని చార్వాకులు ఇలా ఎగతాళి చేశారు:

"ఎక్కడో చచ్చి, స్వర్గాన మీతండ్రి వున్నాడనీ, ఇక్కడ ఒక ఆకులో యింత అన్నం పెడితే, ఆ చనిపోయిన వ్యక్తి ఆకలి తీరుతుందనీ గదా మీ విశ్వాసం. అలాగైతే పొలంలో పనిచేసుకునే వ్యక్తి ఆకలితీరటానికి, యింట్లోనే ఒక విస్తట్లో అన్నం పెట్టరాదా?

"బ్రాహ్మణులు తృప్తిగా శ్రాద్ధభోజనంచేస్తే, స్వర్గంలో ఉన్న పితరులు సంతృప్తి పడతారని అంటున్నారుకదా? అలాగయితే దూర దేశం వెళ్ళే ప్రయాణీకులు, తమతో ఆహార పదార్థాలు మోసుకు వెళ్ళి తోవలో వంటచేసుకొనుటకు అగచాట్లు పడటం ఎందుకు? వారి బదులు మీరే రోజూ సుష్టుగా భోంచేస్తే చాలదా?"

మరొక కథ: ఒక రోజున ఒక చెరువులో ఒక చార్వాక మతస్థుడు నిలిచి, రెండు చేతులతో నీటిని ఎత్తయిన గట్టుకు అవతల ఉన్న తన పొలంలోకి చల్లుతున్నాడు. అందులో ఒక చుక్క ఐనా గట్టు దాటలేదు. నీళ్ళనీ చెరువులోనే పడుతున్నవి. ఒక బ్రాహ్మణుడు త్రోవనపోతూ, అతని తెలివి తక్కువను ఎగతాళిచేశాడు అప్పుడు ఆ చార్వాక మతస్థుడు ఇలా అన్నాడు: "నన్ను ఎగతాళి చేశావు సరే; నీవు నదిలో నుంచుని దోసిట్లో యిన్ని నీళ్ళు పోసుకొని ఎక్కడో పరలోకంలో వున్న మీ

పితరులకు తర్పణలు వదలు తున్నావే, అంత కంటె నేను తీసిపోయి నానా!"

యజ్ఞయాగాదులు విరివిగా సాగుతూండే ఆ రోజుల్లో, ప్రతి సంస్కర్తా, వాటిని ఖండించనిదే ఒక అడుగు ముందుకు వేయలేదు. బౌద్ధమతం కూడా యిలాగే ప్రారంభమైంది. హింస చేయరాదనే ప్రాతి పదికపై బుద్ధుడు వాటిని ఖండించాడు. చార్వాక మతస్థులు, మరింత సూటిగా యజ్ఞయాగాదులను విమర్శించారు. ఈ కర్మకాండ వెనుక దాగివున్న పురోహితవర్గ స్వార్థాన్ని బహిర్గతం చేశారు. వారివాదన యిది:

"యజ్ఞ పశువుగా మేకను వధిస్తే, ఆ మేక స్వర్గానికి పోతుందని మీరు అంటున్నారు. మీ మాటల్లో మీకు విశ్వాసముంటే, మేకను వదలి, మీ తండ్రినే యజ్ఞపశువు చేయరాదా? తండ్రికీ స్వర్గాన్ని సమకూర్చిన వారవుతారు."

"ఈకర్మకాండ అంతా బ్రాహ్మణులచే కల్పించబడ్డది. వారి భుక్తి మార్గం అంతా ఇదే. కనుకనే దీనిని వారు మరింత పెంచుతున్నారు. ఇందులో వారి స్వార్థం యిమిడి వుంది."

భావవాద తత్వశాస్త్రాన్ని, వైదికాచారాలను ఖండించి, సంపూర్ణమైన భౌతికవాద సిద్ధాంతాన్ని వీరు నిర్మించారు.

ప్రపంచం అనాది సిద్ధం దీనిని ఎవరూ సృష్టించలేదు. దేవుడు సృష్టించాడని చెప్పటం తప్పు. పదార్థం నాలుగు రకాలు. నిప్పు, నీరు, భూమి, గాలి. ఈనాలుగు పదార్థాల సంయోగ వియోగాలవల్లనే ప్రపంచ పరిణామం జరుగుతున్నది. కలయిక, విడిపోవుట అనునవి పదార్థం సహజ స్వభావములు. పదార్థాన్ని, దాని స్వభావాన్నుండి వేరుచేయ రాదు.

నిర్జీవపదార్థాలకు, సజీవ పదార్థాలకు తేడా వున్నది. మానవులు, జంతువులు, వృక్షాలు ప్రాణము కలవి. పదార్థానికి ప్రాణంలేదు. ప్రాణం అంటే ఏమిటి? భావవాదులు ప్రాణం 'ఆత్మ' వలననే కలుగుతున్న దంటారు. చార్వాకులు దీనిని ఖండించారు. పదార్థ పరిణామ క్రమంలో, అంతకు పూర్వం లేని కొన్ని కొత్త లక్షణాలు ఏర్పడతాయి. పచ్చని తమలపాకు

తెల్లని సున్నము కలిపి నమిలితే ఎరుపు రంగు వస్తున్నది. ఈ ఎరుపు రంగు కొత్త లక్షణం.

తాటిరసం తీసి కుండలో నిలవచేస్తే, కొంతసేపటికి అది పులిసి 'కల్లు' అవుతున్నది. నురుగు ఏర్పడుతున్నది. అంతకు పూర్వం లేని 'నిషా' యిచ్చే స్వభావం ఏర్పడుతున్నది.

ఇదే విధంగా పదార్థ పరిణామ క్రమంలో ఒక దశలో 'చైతన్యం' 'ప్రాణం' ఏర్పడ్డవి. నిర్జీవ ప్రకృతినుంచి సజీవ ప్రపంచం ఏర్పడ్డది. ఇది సహజంగా జరిగిన పరిణామం.

పరిమాణాత్మకమైన మార్పులు కొంతకాలం జరిగిన మీదట గుణాత్మకమైన మార్పులు ఏర్పడతాయి. నిర్జీవ ప్రపంచంలో నుండి సజీవ ప్రపంచం ఉద్భవించటానికి ఇదే కారణం. ప్రకృతిలో యిమిడివున్న ఈ గతితార్కిక మార్పును, ఆధునిక విజ్ఞానశాస్త్ర సహాయంతో మనం స్పష్టంగా గుర్తించ గలుగుతున్నాం.

ఈ సమస్యను చార్వాకులు ఆ నాడే ఎలా వివరించగలిగారు ? ఆ కాలంలో, వైద్యశాస్త్రం కొంత అభివృద్ధి చెందింది. మూలికలను నూరి చూర్ణాలను, కషాయాలను, మాత్రలను తయారు చేయటం మొదలైంది. రసాయనిక, సంయోగ వియోగాలకు సంబంధించిన పరిజ్ఞానం, ఏర్పడ్డది. రసాయన శాస్త్ర పరిజ్ఞానాన్ని, తాత్విక సమస్యల పరిష్కారానికి జోడించుటలో చార్వాకుల ప్రత్యేకత యిమిడివున్నది.

సృష్టి, ఆత్మ— ఈ రెంటికీ భౌతికవాద వ్యాఖ్యానం ఇవ్వటంతో పాటు, జ్ఞాన సంపాదనకు మార్గ మేమిటి ? అనే విషయంలో గూడా చార్వాకులు కొత్తమార్గం చేపట్టారు. 'తపస్సు'ద్వారా ఆత్మజ్ఞానం సంపాదించగలమనీ, అదే నిజమైన జ్ఞానమని చెప్పిన భావవాద వ్యాఖ్యానాన్ని పూర్తిగా నిరాకరించి ఇంద్రియ పరిజ్ఞానం ఒక్కటే జ్ఞానసంపాదనకు మార్గమని వీరు నిర్ధారణ చేశారు. కన్ను, ముక్కు, చెవి నోరు, చర్మం యివి పంచేంద్రియాలు. వీని సహాయంతో బాహ్య విషయాలను చూచి. వాసనబట్టి, విని, రుచిచూసి, తాకి—ప్రపంచాన్ని గురించి తెలుసుకుంటాం. ఈ రకమైన ఇంద్రియ జ్ఞానం ఒకటే సరియైన మార్గం

భావవాద తార్కికులు చెప్పే అనుమానం శబ్ద ప్రమాణం రెండూ సరియైనవి కావని నిరాకరించారు.

మనం స్వయంగా చూడకపోయినా, అనుభవజ్ఞులైన ఇతరులు చెప్పిన దానిని నమ్మవలెనని చెప్పుట శబ్దప్రమాణం, లేక ఆప్తప్రమాణం. ఈ వాదన ద్వారా వేదాలలో ఉన్నవన్నీ నమ్మవలసిందని భావవాదులు వాదించేవారు. వేదాలను, అందులోని కట్టుకథలను పూర్తిగా ఖండించిన చార్వాకులు పై వాదనలోని తార్కిక పద్ధతిని కూడా త్రోసివేశారు. అనుమానం అను తార్కిక పద్ధతిని కూడా నిరాకరించారు.

పై రెండు తార్కిక పద్ధతులను నిరాకరించి, కేవలం ఇంద్రియ జ్ఞానమే జ్ఞాన సంపాదనకు మూలమని చెప్పటంలో చార్వాక తత్వశాస్త్ర బలహీనత యిమిడి వున్నది.

ఇంద్రియ పరిజ్ఞానం జ్ఞానానికి మూలం. కాని అంతటితో ఆగదు. కంటితో చూచి చెవితో విని మనం సేకరించిన సమాచారం మెదడులో ప్రవేశించి పూర్వానుభవాలు, జ్ఞాపకశక్తి, ఆలోచన— వీటితో సమ్మిళితమై సమగ్రమైన రూపం ధరిస్తుంది. దీనినే హేతుజ్ఞానం అంటాం. ఇంద్రియ జ్ఞానం హేతుజ్ఞానంగా మారటానికి ముందు మనం సేకరించిన సమాచారమంతటినీ మెదడులో సమన్వయ పరచాలి. ఇలా సమన్వయ పరచటమే మెదడుపని. ఇలా చేసేటప్పుడు, అనుమానం, ప్రమాణం, జ్ఞాపకశక్తి, ఆలోచన, ఊహ—విడదీసి పరిశీలించుట, కలిపి ఆలోచించుట మొదలైన తార్కిక సూత్రాలన్నీ అమలులోకి వస్తాయి. ఈ తార్కిక సూత్రాలు మానవుని మేధోసంపద అభివృద్ధికి విదర్శనం. వీనిని అన్వయించటంలో జాగ్రత్త అవసరం. కాని ఈ సూత్రాలనే త్రోసివేయటం సరికాదు. జ్ఞాన సంపాదనను గురించి, గతి తార్కిక దృక్పథం ఇది.

ఈ దృక్పథంతో చూచినపుడు చార్వాకుల తత్వశాస్త్ర బలహీనత బోధపడుతుంది.

భావవాద తత్వశాస్త్రాన్ని, మూఢాచారాలను, కులభేదాలను, బ్రాహ్మణుల స్వార్థపరత్వాన్ని నిశితంగా ఖండించి, నిరాకరించిన

చార్వాకులు – ఆ వూపులో అంతవరకూ మానవుడు సాధించిన తార్కిక జ్ఞానాన్నికూడా త్రోసిపుచ్చారు.

తత్వశాస్త్రప్రభావం వాస్తవజీవితంపై ఎలావున్నది అనేఅంశంపై దాని సామాజిక ప్రయోజనం ఆధారపడి వుంది. ఈ విషయంలో ప్రాచీన భారతీయ తత్వవేత్తలు చార్వాకులను గురించి దురభిప్రాయం కలిగించేందుకు చేయవలసినదంతా చేశారు. చార్వాకుల గ్రంథాలను నాశనం చేశారు. తాము వ్రాసిన గ్రంథాలలో, చార్వాకులు అరాచక వాదులనీ, అవినీతిపరులనీ, దొంగతనం, దోపిడీ, వ్యభిచారం–మొదలైన సంఘ వ్యతిరేక చర్యలకు పాల్పడేవారనీ వ్రాశారు.

చార్వాకుల జీవిత దృక్పథం యిలా ఉండేది :

పైన పొట్టు ఉన్నదన్న కారణంవల్ల గింజలను మనం పారవేస్తామా ? చేపలకు ముళ్ళువున్నవన్న సాకుతో చేపలను తినటమే మానుకుంటామా ? దొంగలు పంటలను కాజేస్తారని భయపడి, పంటలను పండించటమే వదలు కొంటామా ?

అదే విధంగా జీవిత సుఖాలనుభవించటంవల్ల బాధ, కష్టము, పరలోకంలో శిక్షలు వస్తవనే సాకులకు భయపడి జీవితాన్ని నిరాకరించకూడదు. తిండి, బట్ట, ఇల్లు, సంసారము—వీటివల్ల కలిగే సుఖాలన్నీ అనుభవించవలసిందే. ఇందువల్ల తప్పులేదు.

శరీరాన్ని కష్టపెట్టి నీరు, ఆహారం మాని, వాయుభక్షణ చేస్తూ తపస్సుచేయవలెననీ, అదే మోక్షానికి మార్గమనీ, ప్రపంచంలో పుట్టటం, తిండి తినటం పాపాన్ని కలిగిస్తుందనీ చెప్పే వికృత సిద్ధాంతాలు, నమ్మకాలు విరివిగా ప్రజలలో వ్యాపించివున్న రోజులలో, వానిని ఖండించి పైన వివరించిన వాస్తవ దృక్పథాన్ని ప్రచారం చేయటం సరైనదే.

కాని అంతటితోనే చార్వాకులు ఆగలేదు. వీరిలో కొందరు ఉగ్రవాదులు 'అప్పుచేసి అయినా పప్పుకూడు తిను,' 'అప్పు తీర్చలేకపోతే ఎగవేసిపో,' 'దొంగతనం చేస్తే చేశావు గాని, నేర్పుగా తప్పించుకో' మొదలైన మాటలూ అన్నారు. దీనిని అవకాశంగా తీసుకుని పాలక

వర్గాలు వారిని సాంఘిక అరాచకవాదులుగా ఖండించారు. కఠినశిక్షలు వేసి, హింసించి, దేశంనుండి వెళ్ళగొట్టి చార్వాకులను నిర్మూలించ ప్రయత్నించారు. మహాభారతంలో. ఒక చిన్న కథ ఈ విషయాన్ని తెలియజేస్తుంది.

భారత యుద్ధం అంతా అయిపోయింది. పాండవులు సంపూర్ణ విజయం సాధించారు. ధర్మరాజు రాజలాంఛనాలతో హస్తినాపురం ప్రవేశిస్తున్నాడు.

యుద్ధంలో కౌరవులు, పాండవులు ఇద్దరూ సమానంగానే మోసాలు చేశారు. ఒకరు యెక్కువ, మరొకరు తక్కువ లేదని ప్రజా సామాన్యంలో కనీసం ఒక భాగం అనుకోసాగింది. అయితే బహిరంగంగా ధర్మరాజును యెదిరించే సాహసం వారికి లేదు. చార్వాకుడనే విప్లవ కారుడు ధర్మరాజు ఊరేగింపుకు యెదురుగాబోయి, "నీ పేరు ధర్మరాజు. కాని, నీవు చేసినదంతా అధర్మం సుమా!" అని బహిరంగంగా విమర్శించాడు. జనులు దిగ్భ్రాంతులైనారు. రాజభటులు ఆ వ్యక్తిని బంధించారు. ఇతడు రాక్షసుడు కనుక వధ్యుతని పురోహితులు మంత్రులు తీర్పు చెప్పారు. ధర్మరాజు తల వూపాడు. చార్వాకుని ఆ క్షణంలోనే వధించి, ఊరేగింపు ముందుకు సాగింది ప్రజలు తిరిగి నివ్వెరపోయారు.

భారత గాథ జరిగిన కాలంలో (క్రీ.పూ.1500) చార్వాకులులేరు. ఆది గ్రంథస్థమైన కాలంలో (క్రీ. పూ. 200) చార్వాకులపై దాడి జరుగుతూందేది అనడానికి ఈ కథ ఉదాహరణ.

వీరి తత్వశాస్త్రాన్ని ముగించే ముందు ఒక విషయం గమనించాలి. చార్వాకుల తత్వశాస్త్రం, నాటి సాంఘిక వ్యవస్థపై న, పరిపాలకవర్గాల అధికారంపై న, భావవాద తత్వశాస్త్రంపై న, మూఢాచారాల పైన—తిరుగుబాటుగా ప్రారంభమైంది. ఇందువలన వీరు పాత సిద్ధాంతాలను ఖండించుటలో చూపిన శ్రద్ధ, తమ తత్వశాస్త్రాన్ని రూపొందించుటలో చూపలేదు. చార్వాక తత్వశాస్త్రంలో ప్రాథమిక దశ, కేవల వ్యతిరేక దృక్పథం విశేషంగా కనబడుతున్నది.

చార్వాక ప్రచారకులను గురించి మనకు లభ్యమయ్యే సమాచారాన్ని గమనిద్దాం.

1. పిరిలో అసితకేశ కబంబుడు ప్రథముడు. ఇత నొక సేనానాయకునివద్ద బానిసగా ఉండేవాడు. అప్పు చెల్లించనందువల్ల యితను బానిసగా చేయబడ్డాడు. కొంత కాలానికి పారిపోయి, అడవులలో తిరిగి, తాత్వికుడుగా పరిణతి చెందాడు. నల్లగా ఉండే వెంట్రుకలతో కూడిన కంబళిని కప్పుకొనేవాడు కావటంవల్ల, ఇతనికి అసితకేశ కంబళుడనే పేరు వచ్చింది.

ఇతడు చాలా పట్టుదలగా తన సిద్ధాంతాన్ని ప్రచారం చేసేవాడు. ఇతనిని ఉగ్రభౌతిక వాది అనేవారు. గొప్ప పాండిత్యాన్ని సంపాదించి. ఉపనిషత్తులోని భావవాదాన్ని అతి తీవ్రంగా విమర్శిస్తూ కొన్ని గ్రంథాలు వ్రాశాడు. భౌతికవాదు లందరికి ఆచార్యుడు.

ఇతని వ్యక్తిగత జీవితం నియమ నిష్ఠలతో కూడినట్టిది. బౌద్ధ భిక్షువులవలె కాషాయవస్త్రాలు ధరించి భిక్షాటన ద్వారా జీవించేవాడు. మండుటెండలో, జడివానలో నిలబడి తీవ్రాలోచన చేస్తూ ఉండేవాడు— అప్పుడప్పుడు సంపూర్ణ దిగంబరత్వంలో తన్మయుడై పోయేవాడు.

2. మక్కలి ఘోషాల్: ఇతడు కూడా బానిస. గోశాలలో పుట్టినందువల్ల ఘోషాల్ అను పేరు వచ్చింది ఇతని యజమాని ఒక సేనానాయకుడు. ఒక రోజున బజారునుండి నూనె తెస్తూ, త్రోవలో పరధ్యానంవల్ల నూనెను ఒలకబోశాడు. ఇంటికి వెళితే యజమానివల్ల దేహదండన తప్పదని గుర్తించి, తెగించి అడవులకు పారిపోయి, తాత్వికు డైనాడు.

ఇతని భౌతిక వాదంలో ఒక విశేషం వుంది. ప్రపంచమంతా మార్పులేని కొన్నిసూత్రాల కనుగుణంగా నడుస్తుంది. మానవునికి స్వేచ్ఛ లేదు. అంతా అదృష్టం, కర్మ. ఇతని సిద్ధాంతం భౌతిక వాదానికి చెందిన కర్మవాదం అనవచ్చు.

ఇతను మొదట్లో జైనమతంవైపు కొంత మొగ్గి, తర్వాత మారిపోయినాడు. అందువలన జైన గ్రంథాలలో యితనిని గురించిన దూషణ విపరీతంగా ఉంది. "ఈర్ష్యాళువు, ధర్మాంధుడు, విఘంటనాద

పుత్రు (మహావీరు)ని హత్యచేయ యత్నించాడు. దేవతా విగ్రహాల పై మలమూత్ర విసర్జన చేసేవాడు. బ్రాహ్మణులచే పిండిపిండిగా మర్దించ బడ్డాడు...."

జీవితమంతా తాత్విక ప్రచారానికి వినియోగించే అజీవక వ్యవస్థను యితడు ప్రారంభించాడు. ఇతనితోబాటు, నందవాత్స్యకృశ-సాంకృత్స్య అను యిద్దరు అజీవకులు కూడా ఉండేవారు.

3. మూడవవాడు పూర్ణ కాశ్యపుడు: ఇతను కూడ ఒక బానిస. ఇంతకు ముందే 99 బానిసలుండి ఇతనితో 100 సంఖ్య పూర్తి కావటం వల్ల, ఇతనికి యజమాని పూర్ణ కాశ్యపుడని పేరు పెట్టాడు. ఒకరోజున యితని యజమాని ఇంట్లో దొంగలు పడ్డారు. ఆ సందడిలో బానిసలంతా పారిపోయినారు. పూర్ణ కాశ్యపుడు అడవులకు పారిపోయి తత్వప్రచారం ప్రారంభించాడు.

ఇతను భౌతిక వాదంతోబాటు, సాంఘిక తిరుగుబాటును కూడా తెచ్చిగొట్టాడు. శత్రువులను చంపినా, కొట్టినా, నరికినా, దొంగతనం, వ్యభిచారం, హత్యలు ఏమిచేసినా తప్పులేదని బోధించాడు. బహుశా బానిస జీవితం యొక్క కాఠిన్యాన్ని స్వయంగా అనుభవించి, విసిగి వేసారిన పూర్ణకాశ్యపుడు, పై విధమైన అరాచక తిరుగుబాటు తత్వాన్ని బోధించి ఉండవచ్చు.

4. ప్రకృధ కాత్యాయన్ : పదార్థం అంతా అణువులతో కూడు కుని వున్నది. అణువులు చలనమూ, మార్పూలేని అఖండ సూక్ష్మాంశాలు. నిప్పు, నీరు, గాలి, భూమి, జీవము, సుఖము, దుఃఖము– ఇవి సప్తభూతాలు. వీనిలో మొదటి ఐదూ పరమాణురూపంలో ఉంటాయి. పరమాణువులు నిశ్చల, నిరాకార, నిర్గుణ స్వభావము కలవని చెప్పే ఇతని వాదనను, జడభౌతికవాద మనవచ్చు.

5. నిఘంటునాథపుత్ర, సంజయవేలట్టిపుత్ర : వీరి దృక్పథం జైన తత్వశాస్త్రానికి దగ్గరగా ఉంది. పైకి గతితార్కిక పద్ధతిని పోలి ఉన్నా, అందుకు పూర్తిగా విరుద్ధమైన చర్చాపద్ధతిని వీరు ప్రవేశపెట్టారు. ఈ పద్ధతివల్ల స్పష్టత, వివరణ కలగకపోగా, అస్పష్టత, అనుమానం ఎక్కువౌతాయి. వీరిని అనిశ్చితవాదులని పిలిచేవారు.

# ఉ దా హ ర ణ

1. ప్రశ్న :

దేవుడు ఉన్నాడా ?

(1) లేడు.

(2) ఉన్నాడు కూడా.

(3) ఉండలేడు కూడా.

(4) లేడు కూడా.

(5) లేదనేది లేదు కూడా.

2. పరలోకం ఉన్నదా ?

(1) ఉన్నదని నేను నమ్మితే అలా చెప్పగలను.

(2) నేను అలా చెప్పను, ఇలా చెప్పను, ఎలాగూ చెప్పను.

పై చర్చ ద్వారా, మనం ఏమీ చెప్పలేము, ఏదీ తెలుసుకోలేము అనే నిస్సహాయతకు దిగజారుతాము.

వస్తు సారంలోని వైరుధ్యాలను బహిర్గతం చేసే పద్ధతి గతి తార్కిక పద్ధతి. ఇందుకు విరుద్ధంగా అస్పష్టతను, సంశయాలను ఎక్కువ చేసి, ఎటుపడితే అటు వాదించటానికి వీలును మాత్రం కలిగించే పద్ధతి అల్పం. ఇట్టి పద్ధతి జైన తత్వశాస్త్రంలో విశేషంగా ఉంది.

భారతీయ ప్రాచీన భౌతికవాదులకు గ్రీకు భౌతికవాదులకు గల పోలికలను, తారతమ్యాలను తెలుసుకోవటం అవసరం.

యూరపులో తత్వశాస్త్రానికి గ్రీసుదేశం పునాది. గ్రీసు దేశంలో తత్వశాస్త్రానికి భౌతికవాదం పునాది. ప్రపంచం అనాదిసిద్ధమని, దీనికి మూలం నీరుఅని థేల్స్ అను తత్వవేత్త మొట్టమొదట వివరించాడు. చార్వాకులకు థేల్స్ సమకాలికుడు (క్రీ. పూ. 600). థేల్స్ గ్రీక్ భౌతికవాదానికి, గ్రీకు తత్వశాస్త్రానికి గురువు.

అటు తర్వాత 200 సంవత్సరాల కాలంలో, సుమారు అరడజను మంది భౌతికవాద తత్వవేత్తలు బయలుదేరారు. వీరందరు తత్వవేత్తలు మాత్రమేగాక, శాస్త్రజ్ఞులు, పరిశీలకులు. వీరందరిలోకి డెమొక్రటస్ (క్రీ. పూ. 500) ప్రముఖుడు. ఇతను విశ్వరూపం అను ఉద్గ్రంథం వ్రాసి, అణు సిద్ధాంతాన్ని ప్రతిపాదించి సుదీర్ఘంగా వివరించాడు.

ఈ భౌతికవాద తత్వశాస్త్రం గ్రీసుదేశంలో అభివృద్ధి కావటానికి అనేక కారణాలున్నాయి. మెలీషియా, స్పార్టా, ఏథెన్సు-నగరాలు నాటి ప్రపంచ వ్యాపారకేంద్రాలు. ఆ నగరాలలో ఒక రకమైన ప్రజాస్వామ్యం ఉండేది. బానిసలను మినహాయించినా, మిగతా పౌరులందరికీ పరిపాలనలో భాగముండేది. ఈ కారణాల వల్ల బానిస యజమానుల వర్గానికి చెందిన మేధావులలో విశ్రాంతి, విశాలదృష్టి, పరిశీలనాకాంక్ష, భౌతికవాద దృక్పథం ఏర్పడ్డాయి. ఈ భౌతికవాదానికి తిరుగుబాటుగా కొంత కాలం తర్వాత సోక్రటీస్, ప్లాటో, అరిస్టాటిల్—నాయకత్వాన యూరపియన్ భావవాదం పుట్టింది. కనుక యూరపులో భౌతికవాదం ముందు పుట్టి ఆ తర్వాత భావవాదం ఏర్పడ్డది.

భారతదేశంలో పరిస్థితి ఇందుకు వ్యతిరేకం. మన భౌతిక వాద తత్వవేత్తలందరూ బానిసల నుండి ఉద్భవించినవారు. వర్ణ వ్యవస్థ రూపంలో బానిస విధానం నగరాలలో, పల్లెలలో సుమారు 15 వందల సంవత్సరాలపాటు భారతదేశ మంతటా వేళ్ళూనిన మీదట, దానిమీద తిరుగుబాటుగా భౌతికవాదం ఉద్భవించింది. వైశాల్యందృష్ట్యా భారతదేశంలో గ్రీసుదేశం10వ వంతు ఉండేమో, గ్రీసులో ఒక్కొక్క నగరం ఒక ప్రత్యేక రాజ్యంగా ఉండేవి.

గ్రీసు, భారతదేశాల సామాజిక వ్యవస్థలలో ఈ తారతమ్యం, తత్వశాస్త్రంలోని వ్యత్యాసాలకు కూడా కారణమైంది. విజ్ఞానశాస్త్రరీత్యా, గ్రీకు ప్రాచీన భౌతికవాదులు, భారతీయ భౌతికవాదుల కంటె పైస్థాయికి చెందినవారు. భూమి, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు, లోహాలు, వాని స్వభావము మూలపదార్థాలు మొదలైన అనేక విషయాలనుగురించి పరిశోధన చేసిన వారు ప్రాచీన గ్రీకు తత్వవేత్తలు. విజ్ఞాన శాస్త్రానికి, భౌతికవాద తత్వశాస్త్రానికి అక్కడ చాలా దగ్గర సంబంధం ఉన్నది.

భారతదేశంలో భౌతికవాదానికి, సాంఘిక తిరుగుబాటుకు దగ్గర సంబంధమున్నది. చార్వాక మతస్థులు సాంఘిక విప్లవకారులు.

గ్రీకు, భారత తత్వశాస్త్రాలకు గల ఈ వ్యత్యాసాన్ని మనం గుర్తించక తప్పదు.

## నాల్గవ అధ్యాయం

# గౌతమ బుద్ధుడు - నాటి సమాజం

గౌతమ బుద్ధుడు క్రీ. పూ. 563 సంవత్సరంలో హిమాలయ పర్వత ప్రాంతానికి దాపుగానున్న కపిలవస్తు నగరంలో జన్మించాడు. శాక్యవంశస్థుల అధిపతియైన శుద్ధోధనుడు ఇతని తండ్రి.

గౌతముడు బాల్యంనుండి జిజ్ఞాసాపరుడై ఉండేవాడు. రాజ్య వ్యవహారాలలో ఆసక్తి చూపేవాడు కాడు. ఇతని దృష్టిని మరల్చుటకై శుద్ధోధనుడు అనేక ప్రయత్నాలు చేశాడు. యుక్తవయస్కుడైన వెంటనే, యశోధర అను రాకుమార్తె నిచ్చి వివాహం చేశాడు. ఇవి ఏవీ గౌతముని దృష్టిని మరల్చలేదు. సంసార కూపంలో నుంచి ఎంత త్వరగా బైటపడదామా అన్న ఆత్రుత కలిగింది. నగర సంచారానికి వెళ్ళివచ్చే సందర్భంలో, ఒక రోజున ఒక వృద్ధుడు, మరొకరోజున ఒక రోగి, మరొకతూరి ఒక మృతశరీరం, ఆఖరున ఒక సన్యాసి - ఈ నలుగురిని చూచిన మీదట, గౌతమునికి జీవితంపై విరక్తి కలిగిందట. సంసారాన్ని త్యజించి, అడవులలో తపస్సుచేసి దుఃఖమయమైన ఈ ప్రపంచంలోనుంచి బైటపడే మార్గాన్ని కనుక్కో-వలెనని నిశ్చయించుకున్నాడు. యశోధర ప్రసవించి మగశిశువును కన్నదన్న వార్త వినగానే, తన మార్గానికి మరొక బంధనం (రాహులం)

కలిగిందని భయపడ్డాడు. కొద్ది రోజులలోనే సంసారాన్ని వదలి, అర్థ రాత్రివేళ అడవులకు వెళ్ళిపోయాడు. అప్పటికి గౌతముని వయస్సు 30.

6 ఏండ్లు నియమ నిష్ఠలతో తపస్సు చేశాడు. అందువల్ల శరీరం శుష్కించుట తప్ప, గౌతముని సమస్యలకు పరిష్కారం దొరకలేదు. మనశ్శాంతి లభించలేదు. నియమ నిష్ఠలతో కృశించి, శల్యావశిష్టుడై గౌతముడు ఒక చెట్టుక్రింద పడి ఉండగా, సుజాత అను గొల్లస్త్రీ, గౌతముని నోట్లో పాలుపోసి అతనిని బ్రతికించింది. సుజాత మాతృహృదయం, గౌతముని మృత్యుముఖంలోనుంచి మాత్రమేగాక, అందుకు ప్రోవతీసిన వైరాగ్య మార్గంలోనుంచి కూడా వెనకకు మళ్ళించింది. ఆ తర్వాత బుద్ధగయలోని ఒక రావిచెట్టు క్రింద కూర్చుని ఆలోచనలో వుండగా, గౌతమునికి జ్ఞానోదయమైంది. నాటినుండి గౌతముడు బుద్ధుడైనాడు (అన్ని తెలిసినవాడు). 80 సంవత్సరములవరకు తన సిద్ధాంతాన్ని దేశమంతటా ప్రచారంచేసి, మల్ల దేశంలోని కుసినారవద్ద ఒక తోటలో బుద్ధుడు మరణించాడు.

బుద్ధుని కాలంనాటికి భారతదేశం గొప్ప సామాజిక పరిణామదశలో వుంది. వ్యవసాయం, వృత్తిపనులు, వ్యాపారం బాగా వృద్ధి చెందినవి.

60 రకాల చేతివృత్తులవారి పేర్లు "దీఘనిక్కాయ" అను జాతక కథలో ఉదహరించబడ్డాయి. వడ్రంగి, కమ్మరి, కుమ్మరిగానుగలవాండ్లు, రథకారులు, ఆయుధాలు చేసేవారు, పశుపాలకులు, అనేక వృత్తులు ఏర్పడ్డాయి. వృత్తులు ఏర్పడటమేగాక, వారి సంఖ్యకూడా పెరిగి, ఆవృత్తికి చెందిన వారందరూ ఒకే గ్రామంలో నివసించే పద్ధతి ఏర్పడ్డది.

("వద్దకి గామ" జాతకం)

వ్యవసాయం బాగా పెరిగింది. ధక్కినగిరి అను గ్రామంలో ఏకనాలుడు అను భూస్వామి 500 అరకలు కట్టి భూమి సాగుచేసేవాడని "సూత్త విపాతం" అనే బౌద్ధ గ్రంథం తెలియజేస్తున్నది. వరిపంట ప్రధానమైన పంటగా ఏర్పడ్డది.

వ్యాపారవర్గం ప్రబలమైన శక్తిగా ముందుకు రాసాగింది. నగరాలలో గృహపతులు శ్రేష్ఠులు వ్యాపారం సాగించేవారు. వీరు వడ్డీ వ్యాపారం కూడా చేసేవారు.

దేశంలో వివిధ ప్రాంతాలమధ్య భూమార్గాధ్వన విస్తారంగా వ్యాపారం సాగుతుండేది. 500 ఎద్దుల బండ్లను బిడారు అనేవారు. ఈ బిడారులతో వ్యాపారస్థులు దేశ దేశాలు తిరిగి తమ వస్తువులను అమ్మేవారు. ఒంటెలమీద సరుకులు మోసుకు వెళ్ళేవారు. 710 మంది ప్రయాణీకులను చేరవేసే ఓడలుండేవి. భారతదేశంలో తూర్పుకొననుండి పశ్చిమ కొనకు 500 బిడారులతో వ్యాపారంచేసే ఒక కోటీశ్వరు డున్నట్లు "అంగుత్తనికాయం" అను గ్రంథంలో ప్రస్తావించబడ్డది. గుడ్డలు, దంతపు సామానులు, పట్టు చీరెలు, మందులు, వెండి, బంగారు నగలు ప్రధానమైన వ్యాపార సరుకులు.

నూతనంగా ముందుకు వస్తున్న ఈ వర్గాలకు, పాలక వర్గాలకు ఘర్షణ ప్రారంభమైంది.

ఈ వర్గపోరాటం, నాటి భారతదేశ పరిస్థితులలో అగ్రవర్గాల పెత్తనంపై తిరుగుబాటుగా రూపొందింది. బ్రాహ్మణులలో సైతం ధనికులు, దరిద్రులు అను వ్యత్యాసం తీవ్రరూపం ధరించింది. పురోహితవర్గం పాత ప్రాబల్యాన్ని కాపాడుకోగలిగినప్పటికీ, అనేకమంది బీద బ్రాహ్మణులు చేతి వృత్తులు, వైద్యం, నౌకరీ, సైనిక వృత్తి, వ్యాపారం, హస్తసాముద్రికం, పశుపోషణ, వ్యవసాయం – మొదలైన వృత్తులను చేపట్టినట్లు "సూత్తనిపాత" మను బౌద్ధగ్రంథంలో వాసిట్ట సూత్తం తెలియజేస్తున్నది.

కాశీ, కోసల, మగధ, వైశాలి అను బలమైన నాలుగు ప్రభుత్వాలు, గంగా—యమునా తీరంలో పరిపాలిస్తూ వుండేవి. వాటి మధ్య నిరంతర ఘర్షణలు జరిగేవి. ఈ నాలుగు గాక, అనేక చిన్న రాజ్యాలు, పరస్పర కలహాలలో మునిగి ఉండేవి.

బానిసలలో నాలుగు రకాలవారుండేవారని "విధుర పండిత" జాతకంలో వివరించబడ్డది: (1) బానిసల సంతానం, లేక బానిస స్త్రీల సంతానం; (2) డబ్బుతో కొనుక్కొన్న బానిసలు; (3) దౌర్జన్యంగా

బానిసలుగా చేయబడ్డవారు; (4) పొట్ట గడవక తమంతట తాము బానిసలుగా చేరినవారు.

వర్ణవ్యవస్థ, ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి ఆటంకంగా తయారైంది. బానిసల పరిస్థితి హృదయ విదారకంగా వుండేది.

ఈ సామాజిక సమస్యలను బుద్ధుడు గుర్తించాడు. వర్ణ వ్యవస్థను ఖండిస్తూ, అందరూ సమానమేనని బోధించాడు. బానిసలను గౌరవంగా చూడవలెనని, సాధ్యమైనంత త్వరలో వారిని బానిసత్వంనుండి విముక్తి చేయవలెనని అన్నాడు. వైదిక సిద్ధాంతాలను, యజ్ఞయాగాదుల పేరుతో బ్రాహ్మణులు చేసే పశుహింసను నిరసించాడు. వేదాలలో చెప్పిన ప్రతి ముక్క పరమ సత్యమన్న ఛాందసభావాన్ని త్రోసి వేశాడు.

భారతదేశం బానిస విధానం నుండి అర్ధబానిస విధానంలోకి మారే సంధికాలం అది. వ్యవసాయం, చేతివృత్తులు, వ్యాపారం—అభివృద్ధికి—పాత వర్ణవ్యవస్థ ఆటంకంగా పరిణమించింది. పాత వ్యవస్థను పాత సిద్ధాంతాలను, కట్టుబాట్లను ఖండించి, నూతన సమాజ నిర్మాణానికి వేగుచుక్కగా పనిచేసే ఒక ఉద్యమం, ఒక శక్తి, ఒక నాయకుడు అవసరమైనాడు. సాంఘిక తాత్విక రంగాలకు సంబంధించినంతవరకు, బౌద్ధ మతం. యీ చారిత్రక బాధ్యతను నిర్వహించింది.

"లడ్విగ్ ఫ్యూర్ బా" అను గ్రంథంలో ఏంగెల్సు ఈమార్పును యిలా వివరించాడు : "సమాజ చరిత్ర ఒక దశనుండి మరొక దశకు మారే సంధియుగాలలో అప్పు డప్పుడు నూతన మతాలు తల యెత్తాయి. క్రైస్తవమతం, ఇస్లాం, బౌద్ధమతం— ఈ మూటికి పై సూత్రం వర్తిస్తుంది."

(లడ్విగ్ ఫ్యూర్‌బా : ఇంగ్లీషు ప్రతి 45-వ పేజీ)

బుద్ధుని సంఘసంస్కార బోధలు, బ్రాహ్మణ వర్ణంపైన బ్రాహ్మణులపైన ఇతరులకు గల అసంతృప్తికి ఒక రూపం ఇచ్చాయి. బుద్ధుని సమానత్వ బోధన బానిసవిధానం మారటానికి అవసరమైన వాతావరణాన్ని సృష్టించింది. దేవుడు, ఆత్మ మొదలైన భావాలను బౌద్ధమతం నిరసించింది. "శాశ్వతమైనది ఏదీ లేదు ప్రతిదీ మారిపోతూ వుంటుంది.

అకారణంగా ఏదీ జరగదు. ప్రతిదీ కార్య కారణ సంబంధం ద్వారా జరుగుతుంది" అను ఈ నూతన తత్వశాస్త్రం, నాటి వైజ్ఞానిక రంగాన్ని ఆవరించిన సంకెళ్ళను బద్దలుచేసింది. స్వేచ్ఛాయుత ఆలోచనకు ఇది శంఖారావం. బుద్ధుని తత్వశాస్త్రం భౌతిక వాదం కాకపోయినప్పటికీ, అందులో హేతువాదం, వాస్తవికదృష్టి వున్నాయి. జడాత్మక ఆలోచనా పద్ధతిని ఛేదించి, స్వేచ్ఛాయుత ఆలోచనను ప్రోత్సహించుట కవసరమైనంత మేరకు గతితర్కం, వున్నది.

బానిసలు బుద్ధుని బోధలవల్ల ఎలా ఆకర్షించబడ్డదీ క్రింది గాథల ద్వారా తెలుసుకోవచ్చు :

కోసల దేశంలో తూన అనే గ్రామంలో ఒక బ్రాహ్మణ గృహంలో స్త్రీ బానిస వుండేది. ఆమె నీళ్ళకు వెళ్ళి వచ్చేటప్పుడు త్రోవలో బుద్ధుని చూసింది. వెంటనే ఆ నీళ్ళ కడవతో బుద్ధుని పాదార్చన చేసి, కొంచెం ఆలస్యంగా ఇంటికి వెళ్ళింది. ఇది తెలిసి, ఆ బ్రాహ్మణ యజమాని, బానిసను కర్రతో మోది చంపి వేశాడు. (విమానవత్తు గ్రంథం) కౌశాంబిలో కజ్జుతార అను ఒక స్త్రీ బానిస, విరాలి అను మరొక బానిస, బుద్ధుని బోధలు విని, తమ యజమానురాలికి కూడా వినిపించారు. వారంతా బౌద్ధ ధర్మాన్ని స్వీకరించారు.

గాయగామ అను గ్రామంలో ఒక బ్రాహ్మణ కుటుంబంలో ఒక బానిస వుండేది ఆమె కూతురు కూడా బానిస. ఆమె చాలా అందమైనది. ఆమె అందాన్ని సహించలేక యజమానురాలైన బ్రాహ్మణ స్త్రీ, ఆ బానిస పిల్లను రోజూ అకారణంగా దండించేది. చివరకు బానిస పిల్ల ఆ బాధలు భరించలేక అడవిలోకి వెళ్ళి ఆత్మహత్య చేసుకుంది. (విమానవత్తు). ఈ బానిసలందరూ బౌద్ధంవైపు ఆకర్షితులయ్యారు.

వర్ణ వ్యవస్థను బుద్ధుడు ఖండించాడు. జన్మ ప్రధానం కాదని, గుణం మాత్రమే ప్రధానమని, తాము అగ్రవర్ణపు వారమని విర్రవీగుట బ్రాహ్మణులకు తగదని అనేక సందర్భాలలో బోధించాడు. ధనికులు, బీదలు అను వ్యత్యాసాలు ప్రధానమైన మీదట వర్ణభేదాలు వెనకకు

తగ్గక తప్పదవి చెపుతూ ఒక బ్రాహ్మణుని ప్రశ్నకు సమాధానంగా బుద్ధుడు ఇలా అన్నాడు:

"ధనికుడైన క్షత్రియుడు, వైశ్యుడు, శూద్రుడు కోరినచో బ్రాహ్మణుడు వారివద్ద నౌకరీ చేయునుగదా ? ఇచ్ఛానుసారముగా డబ్బు సంపాదించును గదా ? అట్టిచో బ్రాహ్మణుల ఆధిక్యత ఏమి ?"

మరొక సందర్భంలో బ్రాహ్మణులను అతి కఠినంగా విమర్శిస్తూ బుద్ధుడు ఇలా అన్నాడు:

"పూర్వం బ్రాహ్మణులు సాయంకాల భోజనం కొరకు సాయం కాలమునను, ఉదయ భోజనము కొరకు ఉదయమునను అనగా ఒక పూటకు మాత్రమే వెదుకు చుండెడివారు. కాని ఈ కాలమున బ్రాహ్మణులు తృప్తితీరక పొట్టనిండా తిని ఇంకను శేషమును ఇంటికి తీసుకు పోతున్నారు. ఓ భిక్షుకులారా ! కుక్కలు సాయంకాలం భోజనమునకు సాయంకాలమునను, ఉదయం భోజనమునకు ఉదయమునను తిరుగు చున్నవి. ఇది నేడు కుక్కలలో కనబడుతున్న ప్రాచీన బ్రాహ్మణ ధర్మం." (అంగుత్తర నికాయము.)

ఒక రోజున బుద్ధుని ముఖ్యశిష్యుడైన ఆనందుడు శ్రావస్తిలో భిక్షాటనకై బయలు దేరాడు. త్రోవలో అతనికి దాహమైంది. ఒక బావి వద్ద ప్రకృతి అను ఒక మాల బాలిక నీరుతోడుతున్నది. ఆనందుడువెళ్ళి ఆమెను మంచి నీరు అడిగాడు. "అయ్యా. నేను మాలదాన్ని, మీకు నీరు ఎలాపోయగలను."అని ఆమె అనగా, "నేను నీ కులమేది అనిఅడగలేదు. మంచినీరు మాత్రం యిమ్మంటిని" అని ఆనందుడు సమాధాన మిచ్చాడు. తనను అంత గౌరవంగా పిలిచిన ఆనందుని మాటలకు ఎంతో సంతోషించి, అతనికి నీరుపోసి, వెంటనే జేతవనంలోని బుద్ధుని వద్దకు వెళ్ళి ఆమె బౌద్ధ భిక్షుకిగా మారిపోయింది.

ఈ వార్తను విని శ్రావస్తీ నగర బ్రాహ్మణులు కోసల రాజైన ప్రసేనజిత్తుకు ఫిర్యాదుచేసి, బుద్ధుడు వర్ణ వ్యవస్థను ధ్వంసం చేస్తున్నాడని ఆరోపించారు. ప్రసేనజిత్తు బుద్ధుని వద్దకు వెళ్ళి "మాల స్త్రీని నీవు ఎలా ఆరామంలోకి రానిచ్చావ"ని ప్రశ్నించాడు. బుద్ధుడు వర్ణ భేదాలను

విమర్శిస్తూ ప్రసంగించి, ప్రసేనజిత్తును శాంత పరిచాడు. ప్రసేనజిత్తు బౌద్ధ అభిమాని అయినాడు.

జీవితంపట్ల విరక్తిచెంది ఆత్మశాంతి కొరకు పరివ్రాజకులుగా మారిపోయిన అనేకులు బుద్ధుని శిష్యులుగా చేరారు. వీరంతా బ్రాహ్మణులు. పూర్వం బుద్ధునితోపాటు అయిదుగురు పరివ్రాజకులు 6 ఏండ్లు తపస్సు చేశారు. తర్వాత తపస్సు చాలించిన బుద్ధునిపట్ల గౌరవం నశించి కాశీ వెళ్ళిపోయినారు. బుద్ధుడు మొట్టమొదట ఆ అయిదుగురిని కలుసుకొని తన నూతన సిద్ధాంతాన్ని వివరించి వారిని తన శిష్యులుగా చేసుకున్నాడు. ఈ ప్రథమ ప్రసంగాన్ని ధర్మ చక్ర ప్రవర్తన అని పిలుస్తారు. వీరు బుద్ధుని ప్రథమ శిష్యులు.

వీరికి బుద్ధుడు చేసిన బోధన ఇది: ఆత్మ, పరమాత్మ, పునర్జన్మ మొదలైన అంతులేని సమస్యలను చర్చిస్తూ జీవితం వృధా చేయవద్దు. మీ చిత్తసంక్షోభానికి మూలం ప్రపంచమంతా ఆవరించిన దుఃఖం. ఈ దుఃఖానికి కారణం కోరిక. కోరికను జయించుటకు ఎనిమిది నీతిసూత్రాలను అవలంబించాలి. ఈ మార్గాన్ని అవలంబిస్తే మీకు ఈ జన్మలోనే శాశ్వత మనశ్శాంతి - నిర్వాణము లభిస్తుంది.

ఈ ఎనిమిది నీతిసూత్రాలను అష్టాంగ మార్గము అంటారు. సరియైన ఆలోచన, వాక్కు, ఆదరణ, న్యాయబద్ధమైన జీవనం, ఇతరులకు హాని కలుగకుండా జీవించటం మొదలైన యీ నైతిక సూత్రాలు ఆ పరివ్రాజకులను ఆకర్షించినవి.

నియమబద్ధ జీవనం, క్రమశిక్షణ, ప్రజాసేవ ఆత్మోన్నతికి మార్గమని ఒప్పించుటలో బుద్ధుడు కృతకృత్యుడైనాడు. నాటి మేధావి వర్గానికి బుద్ధుని సందేశం ఇది.

ఐదవ అధ్యాయం

# బౌద్ధంలో గతితర్కం

తత్వశాస్త్ర పరిణామంలో ఒక నిర్దిష్టమైన చారిత్రక దశలో, జడాత్మకదృష్టి తలయెత్తింది. అదేవిధంగా మరొక నిర్దిష్టమైన చారిత్రక దశలో గతితార్కిక దృష్టి ఆవిర్భవించింది. భారతదేశంలో కూడా యిలాగే జరిగింది. క్రీ. పూ. 1000 నుండి ప్రారంభమైన ఉపనిషత్తుల రచనలో భారతీయ జడాత్మక దృష్టి రూపొందిందని చెప్పవచ్చు.

జడాత్మకదృష్టి అంటే ఏమిటి? స్థితి, గతి. ఈ రెంటిలో స్థితి ప్రాథమికం, వైరుధ్యం-ఏకత్వం యీ రెంటిలో ఏకత్వం ప్రాథమికమని జడాత్మక దృష్టి తెలియజేస్తుంది. పరిసరాలనుండి ఘటనలను వేరుచేసి పరిశీలించినపుడే వస్తుసారం బోధపడుతుందనీ, ఒక ఘటనకు మరొక ఘటనకు మధ్య అభేద్యమైన అడ్డుగోడ లున్నాయని కూడా జడాత్మకదృష్టి తెలియజేస్తుంది.

ఉపనిషత్తులలో ఇట్టి దృష్టి రూపొందటానికి కారణమేమిటి? అంతకు ముందు భారతదేశంలో తత్వశాస్త్రం మతం పెనవేసుకుని ఉండేవి. వైదిక వాఙ్మయం నిండా నాటి ప్రజల మత విశ్వాసాలు, నమ్మకాలు, ఆనంద ఆవేశాలు కర్మకాండ - బహుముఖాలుగా వ్యక్తం

చేయబడ్డాయి. ఈ భావోద్రేకాల మధ్య, సందేహం, ఆలోచన, జిజ్ఞాస, తర్కం - అక్కడక్కడ మెరుపులాగా మాత్రమే ద్యోతక మయ్యేది.

భూగర్భంనుండి ముడి ఇనుమును త్రవ్వి, మూల ఖనిజాన్ని ఉప ఖనిజాలనుండి వేరుచేసి, దానికి సాన పెట్టి ఐగిషీ చేయటం ఎలా అవసరమో, అలాగే వైదిక వాఙ్మయంలో చెల్లాచెదురుగా ఉన్న తాత్విక భావాలను క్రోడీకరించి, వర్గీకరణచేసి, వానిలో మూలపదార్థమేదో తెలుసుకోటానికి ఉపనిషత్కారులు కృషిచేయవలసి వచ్చింది. ఈ కృషి జరగకపోతే, భారతీయ తత్వశాస్త్రం ఒక ప్రత్యేక విజ్ఞానశాస్త్రంగా అభివృద్ధి అయ్యేదే కాదు. ఈ పరిశీలనాక్రమంలోనే జడాత్మకదృష్టి తల ఎత్తింది.

ప్రకృతిలోని ప్రతి వస్తువును దేవతగా పూజించే ధోరణిపై విరసనగా, ఈ దేవత లందరికీ మూలమైన ఆదిశక్తి ఏదీ అనేప్రశ్న ఉదయించింది. ఈ ఆదిశక్తి సగుణమా? నిర్గుణమా? సాకారమా, నిరాకారమా? అను జిజ్ఞాస తల యెత్తింది. ఆలోచనాక్రమం ఇలా సాగి, ప్రగతిశీలమైన ప్రకృతికంతకూ మూలం, ఆద్యంత రహితమైన మార్పులేని, చలనంలేని, శాశ్వత పరబ్రహ్మ అనీ, ఆ పరబ్రహ్మ జ్యోతిశ్శకలమే జీవాత్మ అనీ ఒకభావం ఏర్పడ్డది. ఉపనిషత్తులలోని భావవాద తత్వశాస్త్రానికంతా మూలం యీ భావం.

అంతఃపూర్వం వున్న బహు దేవతా ధోరణిని ప్రకృతి శక్తుల ఉపాసనను, కర్మ ప్రధానమైన మతాచారాలను తోసిపుచ్చేందుకు తోడ్పడ్డది. అది తాత్విక పురోగతిలో ఒక ముందంజ

కాగా ఈ క్రమంలో ప్రపంచ వాస్తవికతను ఈ ధోరణి త్రోసిపుచ్చింది.

ఆలోచనా పద్ధతిలో ముందడుగు, తాత్విక వ్యవస్థలో వెనకడుగు— ఈ రెండూ పెనవేసుకొని ఉపనిషత్తులలో భావవాదం ఏర్పడ్డది.

ప్రపంచ మంతటా తాత్విక పురోగతి ఇట్టి వంకర టింకర మార్గాన, విరోధ వైరుధ్య సూత్ర ప్రకారంగా సాగటం మనము గమనించగలం.

# గతితార్కిక పద్ధతి

జడాత్మక దృష్టికంటె భిన్నమైనది, ఉన్నతమైనది గతితార్కిక దృష్టి.

పరిసరాలనుంచి ఘటనలను వేరుచేసి పరిశీలించటం సరియైన పద్ధతి కాదు. అసలు ఘటన అనేవి నిశ్చలమైనవీ, మార్పులేనివీ కావు. ఎడతెగని చలనం. నిరంతర ప్రవాహం ఘటనలలోని సారాంశం. స్థితి, గతి: యీ రెంటిలో గతి ప్రాథమికం. ఘటనలలోగల అంతరంగిక వైరుధ్యాలు గతికి మూలం. ఒక ఘటనకు, మరొక ఘటనకు మధ్య అభేద్యమైన అడ్డుగోడలేవీ లేవు. ప్రకృతిలోని ఘటనా పరంపర అన్యోన్య సంబంధంగల గొలుసువంటిది. ప్రకృతినీ ప్రకృతి పరిణామాన్నీ ఈ దృష్టితో పరిశీలించినపుడే, మనకు సమగ్రమైన సమ్యక్ దృష్టి ఏర్పడుతుంది.

ఇట్టి సమ్యక్ దృష్టిని, గతితర్కిక ధోరణిని భారతదేశంలో మొట్ట మొదట ప్రతిపాదించిన తత్వవేత్త గౌతమ బుద్ధుడు.

గౌతమ బుద్ధుని జీవితాన్ని గురించి సమగ్రంగా పరిశోధించిన ఓల్డెన్ బర్గ అను రష్యన్ తత్వవేత్త ఇలా అన్నారు : 'దృశ్యమాన ప్రపంచంలోని గతికంతా స్థితి మూలమని ఉపనిషత్తులు భావించాయి. అందుకు విరుద్ధంగా బుద్ధుడు, స్థితికంతా గతి మూలకమని తెలియజేశాడు' (బుద్ధుని జీవితం, 225 పేజీ.)

వారణాసి సమీపంలోని సారనాధ్ వద్ద మృగదావంలో గౌతముడు మొట్టమొదటిసారిగా, తన నూతనసిద్ధాంతాన్ని ప్రవచించాడు. ఈ ప్రసంగాన్నే "ధర్మచక్ర ప్రవర్తన" అని వ్యవహరిస్తున్నారు. ఆ ప్రసంగంలో గౌతముడు ఇలా అన్నాడు :

'ప్రపంచానికి ఆది, అంతం-ఏది అనే సమస్యను పక్కకు పెట్టండి. ఈ సమస్యలు నిరుపయోగమైనవి. పరిష్కరించ సాధ్యం కానివి (అవ్యక్తాని). నేను మీకు ధర్మాన్ని ఉపదేశిస్తున్నాను. అది అలా ఏర్పడ్డది కాబట్టి, యిది యిలా ఉద్భవిస్తున్నది. అది లేకపోతే, ఇది లేదు. అది ఆగిపోతే యిదీ ఆగిపోతుంది. ఇదే ధర్మం. ఈ

ధర్మాన్ని ఆమోదించిన ప్రతి ఒక్కడూ ప్రతీత్య సముత్పాదవాదాన్ని ఆమోదించినట్లే.'

అది, యిది – కార్యం, కారణం ఈ రెంటికీ గల గతితార్కిక సంబంధం, జగత్పరిణామాని కంతా మూలం. ప్రతి పనికీ ఒక కారణం ఉంటుంది; అకారణంగా ఏదీ ఏర్పడదు. ప్రతి కార్యం తిరిగి కారణంగా మారుతుంది. ఈ రెంటికీ మధ్య అడ్డుగోడలు లేవు. ఇదే భావాన్ని, గౌతముడు ధర్మపథంలో యిలా వివరించాడు :

"ఓ భిక్షువులారా! జీవించేది ప్రతిదీ మరణిస్తుందని తెలుసుకోండి. ప్రతిదానికీ ఒక కారణం ఉంది. కారణం నశించగానే, కార్యం కూడా నశిస్తుంది. పైకి స్థిరంగా కనబడే పదార్థాలన్నీ నిజానికి అస్థిరమైనవే. అవన్నీ నశించేవే. అత్యున్నతస్థాయి నందుకున్న ప్రతిదీ పతనం చెందవలసిందే. మొదలు ఉంటే చివరకూడా ఉంటుంది. ఐక్యత ఉన్నచోట ఎడబాటుకూడా ఉంటుంది. ప్రాణం ఉన్నచోట మృత్యువు కూడా ఉంటుంది."

ప్రపంచంలో ప్రతిదీ వైరుధ్యాలతో కూడుకుని ఉన్నదన్న సత్యమే, పై ఉపదేశాలలో తిరిగి తిరిగి ప్రతిధ్వనిస్తున్నది. గౌతముడు వాడిన 'ధర్మం' అను మాట ఏ అర్థంలో వాడబడిందో కూడా తెలుసుకోవాలి.

బౌద్ధ తత్వశాస్త్రంలో వస్తువు, ధర్మం అను రెండు మాటలు తరచు కనబడతాయి. ప్రవాహ సదృశమైన జగత్పరిణామమన్నా త్రమే ధర్మం. ఆ అర్థంలోనే, గౌతముడు తన తాత్విక చర్చలన్నిటిలోను ఆ మాటను ఉపయోగించాడు.

అంతకు పూర్వమున్న కార్యకారణ వాదానికి, సిద్ధార్థుడు ప్రతిపాదించిన ప్రతీత్య సముత్పాదవాదానికి గల వ్యత్యాసాన్ని వివరిస్తూ, మహా పండిత్ రాహుల్‌జీ ఇలా అంటున్నారు:

'అణువులు లేక పదార్థం, మార్పులేని మూలవస్తువులు అని భావించేవారు. ఆ వస్తువుల సంయోగ వియోగాలద్వారా సృష్టి జరుగుతుంటుంటారు. కాని బౌద్ధతత్వశాస్త్రం, అట్టి మార్పులేని మూలపదార్థాలను

ఆమోదించదు. ప్రపంచంలో వస్తువు లనేవి లేనే లేవు. ప్రతిదీ ధర్మమే. పరిణామక్రమమే.'

కార్య కారణ సంబంధాలలో ఒకదానినుండి మరొకదానికి అందించబడే మూలవస్తు వేమీ లేదు. కారణం నశించగానే, కార్యం నశిస్తుంది. కార్యం మరొక కారణంగా రూపొందుతుంది నిరంతర చలనం జగత్తుకు మూలం. ఈ భావం ప్రతీత్య సముత్పాద వాదానికి కీలకం.

## కారణ సముదాయం

గౌతమునికి పూర్వమున్న కార్య కారణవాదం యాంత్రికమైనది. బౌద్ధంలోని ప్రతిత్యసముత్పాదవాదం, గతితార్కికమైనది.

ఒకే కారణంనుండి అనేక ఫలితాలు ఏర్పడవచ్చునని ఉపనిషత్తులలోని భావవాదం తెలియజేస్తుంది. పరమాత్మ ఒక్కడే. అతనిలో నుండి చరాచర ప్రపంచం ఉద్భవిస్తున్నది ఇదేవిధంగా చార్వాకులు, పదార్థం ఒక్కటేననీ, అందులోనుండి ప్రపంచం అంతా ఆవిర్భవిస్తుందనీ అన్నారు.

గౌతము డీ ధోరణిని తిరస్కరించాడు. ఒకే కారణం కార్యాలన్నిటినీ కలిగించలేదు. అనేక కారణాలు కలిస్తేగాని ఒక ఫలితం కలగదు. ఈ కారణాలలో ఏ ఒక్కటి లేకపోయినా ఫలితం కలగదు.

క్రీ. పూ. 200 ప్రాంతంలో పశ్చిమోత్తర రాష్ట్రాన్ని పరిపాలించిన మినాండర్‌కు బౌద్ధగురువైన నాగసేనుడు, పై సూత్రాన్ని ఇలా వివరించాడు: 'అనేకమైన భాగాలు, చక్రాలు, ఆసనము, గుర్రాలు, సారథి మొదలైనవన్నీ ఉంటేనే రథం ఏర్పడుతున్నది. అలాగే 32 రకాలైన భౌతిక వస్తువులు, పంచభూతాలు కలిసి మానవాకారం ఏర్పడినప్పుడే నేను 'నాగసేనుడి'ని అవుతున్నాను. కారణ సముదాయం వలననే ఫలితం కలుగుతున్నది. (మిళింద ప్రశ్నా).

కార్య కారణాలకు భిన్నత్వం, ఏకత్వం రెండూ ఉన్నవి. పరిణామక్రమంలో ఎప్పుడూ కొత్త విషయా లుద్భవిస్తూంటాయి. పాతవి కొన్ని కొనసాగుతూ వుంటాయి.

క్రీ. పూ. 400 లో జీవించిన బౌద్ధ తాత్వికుడు బుద్ధ ఘోషుడు ఈ క్రింది ఉదాహరణ నిచ్చాడు:

"తీయని పాలలోనుండి పుల్లని పెరుగు ఏర్పడుతున్నది. కార్య కారణాల మధ్య పూర్తి ఏకత్వమున్నా, లేక పూర్తి భిన్నత్వమున్నా ఇది సాధ్యంకాదు కదా."

పాత కొత్తల కలయిక పరిణామ స్వభావం.

ఈ భావాన్ని నాగసేనుడు మిళిందపన్హాలోని ఈ క్రింది సంభాషణలో వివరించాడు:

రాజు: నాగసేనా! జన్మించిన వ్యక్తి యథాతథంగా ఉంటాడా, మారిపోతూ ఉంటాడా ?

నాగ సేనుడు: యథాతథంగానూ ఉండడు; పూర్తిగా మారిపోనూ పోడు.

రాజు: ఒక ఉదాహరణ యివ్వగలవా ?

నాగసేనుడు : ఓ రాజా. నీవు ఒకపుడు శిశువుగా వుండేవాడవు. చిన్న ఆకారంలో మృదువుగా ఉంటూ క్రిందపడి దొర్లుతూ ఆడుకునే వాడివి. ఇప్పుడునీవు పెరిగి పెద్దవాడవైనావు నీవూ, ఆ శిశువూ ఒకరా, వేర్వేరా ?

రాజు : ఆ శిశువు వేరు, నేను వేరు.

నాగసేనుడు: ఆ శిశువూ, నీవూ వేరైనట్లయితే, తల్లీ, తండ్రీ, గురువూ, ఎవరూ లేకుండానే నీ వింతవాడవైనావా? ప్రతిరోజూ మనలో కొత్తదనం ప్రవేశిస్తుంది. అయితే యిది పూర్తి కొత్తదనం కాదు. విరంతర పరిణామం, తెగగొట్టడానికి వీలులేని క్రమపద్ధతి ఈ రెండూ కలిసేవున్నాయి.

ఉదయం నుంచి రాత్రివరకూ మండుతూ ఉండే కొవ్వువత్తిని ఉదాహరణగా యిచ్చి, నాగసేనుడు ఇలా అంటున్నాడు. "ఓ రాజా! ఘటనల సముదాయం గొలుసువలె బంధించబడివుంది. ఒక్కొ కొత్త ఘటన విరంతరం ఆవిర్భవిస్తూ వుంటుంది. ఒక ఘటన నశిస్తూ, కాలగర్భంలో కలిసిపోతూ వుంటుంది. ఆద్యంతాలు లేకుండా యీ పరిణామం సాగుతూనే ఉంటుంది."

# సర్వం దుఃఖం దుఃఖం

ఈ మార్పు కంతకీ కారణ మేమిటి? ఘటనలలోని ఆంతరంగిక వైరుధ్యాలే మార్పుకు కారణమన్న గతితార్కిక సూత్రాన్ని గౌతముడు ప్రతిపాదించాడా ?

"సర్వం దుఃఖం, దుఃఖం,
సర్వం కష్టం, కష్టం,
సర్వం క్షణికం, క్షణికం"

అను వాక్యాలను గౌతముడు తరచు వాడాడు. బౌద్ధ ధర్మ మూల సూత్రాలుగా కూడా యివి పరిగణింపబడుతున్నాయి.

దుఃఖం అను మాట శోకం, విచారం అను లౌకికార్థంలో కాక, వైరుధ్యం, ఘర్షణ అను తాత్విక భావంలో గౌతముడు ప్రయోగించాడు. ఏమంటే శోకం, విసులం అనే భావం 'కష్టం. కష్టం' అను మాటలతో ఉండనే ఉంది.

గౌతముడు ఉపదేశించిన నాలుగు "ఆర్య" సూత్రాలు (ఉదాత్తమైన సూత్రాలు) ఇవి:

1. జీవితమంతా దుఃఖమయం.

2. ఈ దుఃఖానికి కారణమున్నది.

3. ఈ దుఃఖాన్ని నిరోధించవచ్చు.

4. దుఃఖ నిరోధ మార్గాన్ని, అనగా అష్టాంగ మార్గాన్ని అనుసరించాలి.

'దుఃఖం' అను మాటను వ్యక్తిపరంగాను, సమాజం పరంగాను గౌతముడు వ్యాఖ్యానించాడు. పుటుక, చావు, వ్యాధి, తృష్ణ— మొదలగునవి వ్యక్తిగత దుఃఖానికి కారణాలు. సమాజంలోని వ్యత్యాసాలున రాజు—ప్రజ, ధనికుడు—పేద, అగ్రవర్ణుడు-హీనవర్ణుడు మొదలైనవి సామాజిక దుఃఖానికి కారణాలు. ఈ రెండే కాక ప్రకృతిలో, దృగ్విషయా లన్నిటిలోనూ విరుద్ధ శక్తుల కలయిక ఉన్నది. అదికూడా దుఃఖమే.

1956 నవంబరులో ఢిల్లీలో జరిగిన బౌద్ధసంగీతిలో సింహళ ప్రతినిధి, ప్రముఖ బౌద్ధ తత్వవేత్తఅయిన జి. కె. మల్లాలశేఖర యిలా అన్నారు :

"ఈ వైరుధ్యాన్నే బుద్ధుడు దుఃఖం అని అన్నాడు. ఇది విశ్వవ్యాపితం."

రెండువేల అయిదు వందల సంవత్సరాలనాడు జన్మించిన గౌతముడు, తాత్విక రంగంలో ఇట్టి ప్రగతిశీల దృక్పథాన్ని ప్రవేశపెట్టడం నిజంగా ప్రశంసనీయం. ఆధునిక యుగంలోని గతితార్కిక పరిభాష, గౌతముని కాలంనాటికి ఏర్పడలేదు. అలా ఏర్పడాలని ఆశించడం కూడా పొరపాటు. సామాజిక పరిస్థితులను, శాస్త్రీయ విజ్ఞానాన్ని తత్వశాస్త్రం అధిగమించలేదు. కొంతవరకు మాత్రమే భవిష్యత్తులోకి తొంగిచూడ గలదు.

## దేవుడు, ఆత్మ

గతితార్కిక దృక్పథంతోనే దేవుడు, ఆత్మవంటిమత సమస్యలకు కూడ గౌతముడు, సమాధానం యిచ్చాడు.

దేవు డున్నాడా, లేడా ? ఉంటే ఎక్కడ, ఎందుకున్నాడు ? మొదలైన సమస్యలు ఆనాడు మేధావులను వేధిస్తూ ఉండేవి. ఈ సమస్యలను పరిష్కరించేందుకై కొందరు సన్యసించి హఠయోగాదులను అనుసరించేవారు. వీరు శ్రమణకులు. ఇట్టి వారానాడు వేల సంఖ్యలో ఉన్నట్లు చరిత్రవల్ల తెలుస్తున్నది. మరికొందరు వైదిక కర్మ కాండను అంధప్రాయంగా అనుసరిస్తుండేవారు. మరికొందరు ఉపనిషత్తులలోని ఆత్మవాదాన్ని చిలుకపలుకులవలె ఉచ్చరించేవారు. ఈ ధోరణు లన్నిటిపై తిరుగుబాటుగా, చార్వాక ధోరణికి చెందిన భౌతికవాదులు దేవుని, ఆత్మను, కర్మకాండను,మూఢాచారాలను నిరసిస్తూ ప్రచారం చేసేవారు. మహావీరుని జైనమతం కూడా ఇదే కాలంలో ఏర్పడ్డది.

ఇన్ని విభిన్న ధోరణుల మధ్య ఘర్షణ జరుగుతున్నకాలంలో గౌతముడు తన ప్రచారం ప్రారంభించాడు. దేవుడున్నాడా, లేడా అన్న నిరర్థక ప్రశ్ననుండి ప్రజల దృష్టిని మళ్ళించి, సమాజంలోని దుఃఖం,

దుఃఖ నివారణోపాయం వైపు కేంద్రీకరించడం సిద్ధార్థుడు తన ప్రథమ కర్తవ్యంగా భావించాడు.

గౌతముడు ఒక సందర్భంలో యిలా అన్నాడు :

"కొంతమంది ఆచార్యులు ఇంద్రుణ్ణి, వరుణుణ్ణి, ప్రజాపతినీ పేరు పెట్టి పిలిచి ప్రార్థిస్తారు. ఒక నదిని దాటదలచుకున్న వ్యక్తి, యివతలి ఒడ్డున నిలబడి అవతలి తీరా న్నివతలికి రమ్మని ప్రార్థిస్తే వస్తుందా? అప్పుడా మానవుడు ఏం చేస్తాడు? ఒక తెప్ప కొయ్యను సంపాదించి, దాని ఆధారంతో సర్వశక్తులూ కేంద్రీకరించి నదిని దాటు కుంటూ వెళ్తాడు."

మరొక సందర్భంలో మాలుక్య పుత్రుడను భిక్షువుతో చర్చిస్తూ, గౌతముడిలా అన్నాడు ; "ఒకని శరీరమునందు విషలిప్తమైన బాణము గుచ్చుకొన్న దనుకొనుము. అప్పుడు వైద్యుడు, "ఈ బాణము వేసిన దెవరు? అతడు శూద్రుడా, బ్రాహ్మణుడా। నల్లనివాడా, ఎర్రనివాడా? వాని ధనువెట్టిది? అల్లెతా డెట్టిది; అను ప్రశ్నలతో కాలం గడుపుతా డనుకొనుము. ఓ మాలుక్యపుత్రా, అట్టి వైద్యునితో రోగికి ఏమి ప్రయోజనం? అట్లే ఆత్మ శాశ్వతమా, కాదా; దేవుడున్నాడా, లేడా? అను ప్రశ్నలు తేలువరకు నేను బ్రహ్మచర్యము స్వీకరించను అని ఒకడను నను కొందము. అందువలన ప్రయోజన మేమి? దుఃఖం దుఃఖ కారణం. దుఃఖనిరోధం, దుఃఖనిరోధమార్గం – ఈ మార్గాన్ని చేబట్ట వలెను."

'దేవుని' సమస్యకు గౌతముడు చాలా స్వల్ప ప్రాధాన్యత నిచ్చి నట్లు పై ఉల్లేఖనలద్వారా స్పష్టం కాగలదు.

అయితే దీని అర్థం? బుద్ధుడు ఆ సమస్యకు సమాధానం చెప్ప లేదనికాదు. సమాధానం యిచ్చాడు. గతితార్కిక దృష్టిని వర్తింపచేసి, 'దేవుని' అస్తిత్వాన్ని నిరాకరించాడు.

అనాధ పిండకునితో చర్చిస్తూ గౌతముడిలా అన్నాడు.

"మనకు తెలిసినవాటి కన్నిటికీ, ఏ సంబంధం లేకుండా పర బ్రహ్మఉన్నాడు అని చెప్పినట్లయితే, అతని ఉనికిని హేతువాదంద్వారా నిరూపించలేము. జగత్తు అంతా పరస్పరాధారమైనది. ఇందుకు భిన్న

మైనది ఏ ఒక్కటి లేదు. ఉండబోదు. పరబ్రహ్మమునకు ఏ లక్ష ణాలూ ఉండకూడదు. కాని వాస్తవ మేమంటే, ప్రతివస్తువూ ఏదో ఒక లక్షణాన్ని కలిగి ఉంది. కనుక సృష్టికి కారణమని చెప్పబడే 'పరబ్రహ్మ' లేదు! ... ఈశ్వరుడే సృష్టి కర్త అయితే, ఇచ్ఛాపూర్వ కంగానో అనిచ్ఛాపూర్వ కంగానో సృష్టిని సాగిస్తూ ఉండాలి. ఇచ్ఛా పూర్వకంగా చేస్తుంటే, ఆయన పరిపూర్ణుడు కాడు. లోపభూయిష్ఠుడే గదా ఇచ్ఛ ఉద్దేశించబడ్డది అనిచ్ఛాపూర్వకంగా సాగిస్తే, అతడు ఉన్మాదిగానో, పసి బాలుడుగానో ఉండాలి." బుద్ధ చరిత్ర

ప్రతిదీ నశిస్తుంది: ఏదీ శాశ్వతంకాదు అనుసూత్రాన్ని అనుసరించి బుద్ధుడు 'ఆత్మ'ను నిరాకరించాడు. మానవ శరీరం నశించిన పిమ్మట కూడా, ఆత్మ శాశ్వతంగా ఉండగలదనటం హేతువాదానికి విరుద్ధ మని ఖండించాడు.

బౌద్ధమత శాఖలన్నీ 'అనాత్మవాద శాఖలు'. 'ఆత్మ' నిరాకర ణకు బౌద్ధంలో విశేష ప్రాధాన్యత ఉన్నది.

జడాత్మక దృష్టికి పరాకాష్ఠ ఆత్మభావం. ప్రపంచంలో జరిగే మార్పులన్నీ తాత్కాలికమైనవి. పైపైవి. వీటన్నింటికి అతీతమైన, మార్పులేని శాశ్వత పదార్థం ఆత్మ. ఆత్మ శరీరంలో ఉన్నప్పుడే ప్రాణం ఏర్పడుతుంది. సుఖ దుఃఖాలు, పాప పుణ్యాలు శరీరానికేగాని, ఆత్మకుగావు. ఈ ఆత్మవాదం తార్కికదృష్ట్యా లోపభూయిష్ఠమైనదే కాక, నైతిక, సాంఘిక దృష్ట్యా కూడా ఆనాడు తీవ్ర దుష్ఫలితాలను కలిగించింది.

పాప పుణ్యాలు శరీరానికి మాత్రమేగానీ, ఆత్మకు కావు. కనుక ప్రవర్తనలో నీతి, అవినీతి అను విషయమై పట్టుదల అక్కరలేదు. భోగ విలాసాలను సమర్థించేందుకు ఈ వాదం ఒక సాకుగా ఉపయోగ పడేది.

"ఆత్మ" అంటె నేను; అహం. సమాజంతో పని ఏముంది? నేను నా సుఖదుఃఖాల విషయం చూసుకుంటే చాలు. సమాజం కంటె 'నేను' అధికుడిని. నాలోకూడా 'శరీరం' కంటే ఆత్మ ముఖ్యం.

వ్యక్తిగత అహంకారం పెచ్చరిల్లి సామాజికదృష్టి లోపించేందుకు బుద్ధునికాలంలో ఈ ధోరణి, ప్రోత్సహించింది.

కనుకనే గౌతముడు ఆత్మవాదాన్ని అతి కఠినంగా ఖండించాడు. బౌద్ధశాఖ లన్నిటిలోను 'ఆత్మవాది' అను మాట ఒక దూషణగా కూడ వ్యవహరించ బడ్డది.

వ్యక్తివి, సమాజానికీ అవినాభావ సంబంధ మంది. ఇతరులకు కష్టం కలిగించకుండా, పై పెచ్చు ఉపయోగపడేటట్లు వ్యక్తి జీవించ డమే అష్టాంగ మార్గ మూలసూత్రం. సామాజిక దృక్పథం, వినయం, బౌద్ధానికి ప్రాణసమానములు. వ్యక్తిగత అహంకారం, భోగలాలసత బద్ధశత్రువులు.

బౌద్ధంలో అనాత్మవాదానికి గల ప్రాధాన్యతను వివరిస్తూ శ్రీ మల్లాల శేఖర ఇలా అంటున్నారు :

"అనాత్మవాదాన్ని గురించిన బుద్ధునిబోధ ప్రపంచంలోని ఏ మత తాత్విక సిద్ధాంతాలలోనూ లేని విశిష్టలక్షణం అని చెప్పవచ్చు. శరీరం నశించిన పిమ్మట కూడా 'ఆత్మ' జీవిస్తుందని చెప్పే వాదనను నిరాకరించటం మాత్రమే కాదు. ఇక్కడ గమనించవలసింది. మానవ చరిత్రలో నిరంతరం ఘర్షణలకు, వైరుధ్యాలకు ప్రోత్సహిస్తున్న వ్యక్తి దురహంకారాన్ని బుద్ధుడు నిరసించాడు."

## సమకాలిక ధోరణులు

మార్పు అస్థిరమని, స్థితి శాశ్వతమని బోధించే భావవాద జడాత్మక దృష్టి, సాంఘిక వ్యత్యాసాలను, దౌర్జన్యాలను సమర్థించేందుకు, వాటిని సహించమని ప్రజలకు చెప్పేందుకు ఉపయోగపడ్డది. వర్ణవ్యవస్థ. రాచరికం. సాంఘిక వ్యత్యాసాలు అనాదిగా వున్నాయి. ఇప్పుడు పోవాలన్నా పోవు. పోయినట్లు కనపడ్డా. తిరిగి అవే మరో రూపంలో ప్రత్యక్షమౌతాయి.కనుక సమాజ వ్యవస్థను మార్చటానికి యత్నించటం నిరర్థకం. ఈ బాహ్య ప్రపంచమంతా అశాశ్వతం, ఆత్మ మాత్రమే శాశ్వతం. ఆత్మజ్ఞానాన్ని పొందటానికి మానవుడు కృషి చేయాలి. ఇది జడాత్మక భావవాదం యొక్క సాంఘిక పార్శ్వం.

భౌతికవాద ధోరణులలో కూడా ఈ జడాత్మక దృష్టి ఉండేది.

చార్వాక మతస్థుడైన పూర్ణకాశ్యపుని ఈ క్రింది బోధ అందుకు తార్కాణం :

"ఒక డేమిచేసినను, చేయించినను పాపం లేదు. హత్య, దోపిడీ, దొంగతనం, వ్యభిచారం, అసత్య భాషణం – వీనివలన కూడా పాపం లేదు. దానధర్మాలు, యజ్ఞయాగాదులవలన పుణ్యమూ రాదు" ఈ ధోరణి పేరు అక్రియా వాదం.

మక్కలి గోశాలుని "నియతివాదం."

"స్వతః సామర్థ్యముతో ఏ పనీ కాదు. ప్రాణులు, సర్వభూతములు అన్నియు దుర్బలములు, నిర్వీర్యములు. ఇవి నియతి లేక స్వభావంచే పరిణతము లగును. ఈ సంసారమున సుఖ దుఃఖములు పరిమిత ప్రమాణములలో ఉన్నవి. ఈ ప్రమాణం ముందే నిర్ణీతం." మానవుడు "నియతి" అనబడు లోకాతీత శక్తికి బానిస. ఆ శక్తిని ఎదిరించ లేడు.

అజితకేశకంబళుని ఉచ్ఛేదవాదం.

"మనుష్యుడు నాలుగు భూతపదార్థముల సమ్మేళనం. మరణించినపుడు శరీరము పంచభూతాలలో కలుస్తుంది. ఇక మిగిలే దేమున్నది? ఆస్తికవాదం వ్యర్థం. శరీరం నాశనమైన పిదప మూర్ఖుడు, చతురుడు ఒకేరకంగా ఉచ్ఛేదం (వినాశం) పొందుదురు."

ప్రకృధ కాత్యాయనుడు అన్యోన్యవాది. "ఏడు పదార్థములనెవ్వడూ చేయలేడు, చేయించలేడు. వానిని గురించి చెప్పువాడు, విను వాడు, తెలిసినవాడు లేడు."

సంజయవేలట్ఠిపుత్ర "పరలోక మున్నదో, లేదో, స్వర్గనరకము లున్నవో, లేవో, తథాగతుడు మరణానంతర ముండునో లేదో వీనిలో ఏదీ నాకు తెలియదు." ఇది విక్షేపవాదం.

నిగంఠనాథ పుత్రుడు "అహింస, సత్యం, దొంగతనం చేయక పోవుట, దానం స్వీకరించకపోవుట మొదలైన నాలుగు మార్గముల ద్వారా మోక్షము సాధించవచ్చు." నిగంఠనాథ పుత్రుడే జైనమత ప్రవక్త మహావీరుడు.

పై వాదాలన్నిటిలోను, జైనధోరణి మినహా, మిగతావి మానవుని సత్క్రియాచరణను ప్రోత్సహించునవి కాక, నిరాశ, నిస్పృహ ధోరణులవైపు త్రోసివేసేవే.

జైనులు దేవుని నిరాకరించారు. కాని పిపీలికాది బ్రహ్మ పర్యంతం చరాచర జీవకోటిలో ప్రతి వస్తువుకు ఒక ఆత్మ కలదని వీరిభావం. భౌతిక ప్రపంచం వాస్తవ మన్నారు. పదార్థ పరిణామం విరుద్ధశక్తుల ఘర్షణ ద్వారా జరుగుతుందని వివరించారు. పదార్థ పరిణామానికి సంబంధించినంత వరకు, గతితార్కిక ధోరణిని ప్రదర్శించినా, జైనుల తాత్విక దృక్పథంలో జడాత్మకదృష్టి హెచ్చుగా ఉంది.

సమాజంలోని అన్యాయాన్ని, మత మౌఢ్యాన్ని, ఛాందసాన్ని విరసించి నంతవరకూ ఈ భౌతికవాద ధోరణులు అభ్యుదయకర పాత్ర వహించాయి. కాని జడాత్మక దృష్టి, ప్రబలంగా ఉన్నందున, కార్యాచరణను ప్రోత్సహించలేక పోయినవి. మానవుడు, దేవుని చేతిలో కీలుబొమ్మ అని భావవాది అనగా, 'నియతి' చేతిలో కీలుబొమ్మ అని చార్వాక భౌతికవాది అన్నాడు. అంతే తేడా.

ఇట్టి జడాత్మక దృష్టిని, ఖండించి, మానవునిలో ఆత్మ విశ్వాసాన్ని పూరించి, దుఃఖనివారణమార్గాన్ని ప్రవచించేందుకు గౌతముడు పాటు పడ్డాడు.

బుద్ధుని క్రియాశీల దృక్పథాన్ని వివరిస్తూ శ్రీ మల్లాల శేఖర ఇలా అంటున్నారు.

"గతంనుండి వర్తమానం ఉద్భవించినట్లే, వర్తమానంనుండి భవిష్యత్తు ఉద్భవిస్తుంది. గతంలోని కార్యాల ఫలితాలను వర్తమానంలో అనుభవిస్తున్నట్లు, వర్తమానంలోని కార్యాల ఫలితాలను భవిష్యత్తులో అనుభవిస్తాం. వర్తమానంలో భవిష్యత్తు బీజాలు ఉన్నాయి. కనుక మనం వర్తమాన కాలాన్ని గూర్చి శ్రద్ధవహించాలి; అది మన కర్తవ్యం. వర్తమానంలోనే మనం భవిష్యత్తుకు రూపురేఖలు దిద్దుతున్నాం."

"ప్రతిదీ ఉన్నది. ఇది ఒక విపరీత ధోరణి. ఏదీ లేదు. ఇది మరొక విపరీత ధోరణి. ఓ కచ్చనః ప్రతిదీ ఉన్నది. లేదు అని నేను చెబుతున్నాను. ఇదే సత్యం. మధ్యేమార్గంలో ఉంటుంది."

(సంయుక్త నికాయం)

ఈ మధ్యేమార్గం బుద్ధుని బోధలన్నింటిలోను ద్యోతక మౌతుంది. సుఖభోగాలలో మునిగిపోరాదు. శరీరాన్ని అనవసరంగా కష్టపెట్టరాదు. మాంసాహారాన్ని నిరుత్సాహపరచాలి. కాని భిక్షువుకు, ఏగృహిణిఐనా, తాను తినే మాంసాహారాన్నే భిక్షగా ఇస్తే నిరాకరించరాదు. తాత్విక చర్చలు చేయాలి. కాని అదే పరమార్థమనుకొని, కార్యాచరణను వదల రాదు. ఈ మధ్యేమార్గం బౌద్ధమత వ్యాప్తికి సహాయపడిన కారణాలలో ఒకటి. బుద్ధుని వాస్తవిక దృష్టికి ఇది తార్కాణం.

## సాంఘిక ప్రయోజనం

ఆనాటి సమాజం ఎలా ఉండేది?

గంగా,యమునా తీరంలో అసంఖ్యాకమైన రాజ్యాలుండేవి. వీరిలో లిచ్ఛవి, శాక్యగణసత్తాకములు. వీరిలో గణ సభ్యులు కానివారికి ఎట్టి హక్కులూలేవు. గణసభ్యులకు మాత్రం ప్రజాస్వామ్యహక్కులుండేవి. గ్రీసులోని నగరరాజ్యాలలోని ప్రజాస్వామ్యం వంటిది వీనిలో ఉండేది. అట్టి గణసత్తాకశాక్యవంశంలో జనించిన గౌతముడు, ఆ ప్రజాస్వామ్య భావాలను స్వీకరించాడు.

ఈ గణసత్తాక రాజ్యాలు అన్యోన్య కలహాల ఫలితంగానూ, కోసల, మగధ, కాశీ వంటి పెద్ద రాజ్యాల తాకిడివల్లనూ క్షీణించ సాగినవి.

మగధరాజైన బింబిసారుడు, కోసలరాజైన ప్రసేనజిత్తు ఇద్దరూ బలవంతులైన రాజులు. వీరిది నిరంకుశ రాచరికం. వీ రిద్దరూ బుద్ధుని బోధలవైపు ఆకర్షింపబడ్డారు.

కోట్లకు పడగలెత్తిన వైశ్యులు, అనాథపిండకుడు. యాసుడు మొదలైన వారున్నారు. వర్తకులవద్ద, భూస్వాములవద్ద, రాజులవద్ద వేల సంఖ్యలో బానిస లుండేవారు.

బానిస వ్యవస్థకు తోడు దారుణమైన సాంఘిక ఆర్థిక వ్యత్యాసా లుండనే వున్నాయి.

ఇట్టి సాంఘిక వ్యవస్థలో బుద్ధుడు బోధించిన సమానత్వం, స్వేచ్ఛ ప్రేమ, శాంతి-సిద్ధాంతం అభ్యుదయకర పాత్ర వహించింది. ఏదీ శాశ్వతం కాదు, ప్రతిదీ మారుతుందన్న బోధ, పాత సమాజం నశించి, కొత్త సమాజం ఉద్భవించక తప్పదు అన్న భావాన్ని కలిగించింది. సమాజంలో అట్టడుగున పడివున్న వ్యక్తులతో మొదలుపెట్టి ధనికులు, వైశ్యులు, రాజులు బౌద్ధమతాన్ని ఆదరించారు. "బహుజన హితాయ, బహుజన సుఖాయ" అను సందేశం, అన్ని వర్గాలవారిని ఆకర్షించింది మంగలిఉపాలి, రథసారథి ఛన్నుడు, గోపాలకుడైన నందుడు, మత్స్యకారుని కుమారుడు సతి, చాప, వున్న పున్నిక-మొదలైన బానిసపుత్రులు-సుమంగళ మాత, సుభ మొదలైన స్త్రీలు-వీరంతా పీడిత ప్రజలనుండి బౌద్ధమతం వైపు ఆకర్షింపబడినవారు. థేరగాథ (భిక్షువుల గాథ) థేరిగాథ (భిక్షుకి గాథ) లను పరిశీలించితే, బౌద్ధ భిక్షువులలో అత్యధిక సంఖ్యాకులు పేదప్రజల నుండి ఆకర్షింపబడినవారేనని బోధపడ గలదు.

మేధావివర్గంనుండి కూడా పెక్కుమంది ఆకర్షింపబడ్డారు. రాజగృహంలో బుద్ధుడు నివసిస్తుండగా, శారిపుత్త మొగ్గలాన అను జైన శిష్యులు, బుద్ధుని శిష్యుడైన అసాజీని కలుసుకొని, మీ గురువుగారి ప్రధాన సిద్ధాంతమేమని ప్రశ్నించారట. భిక్షువు అసాజీ, ఇలా అన్నాడు: "ప్రతిదానికీ ఒక కారణం వుంది. సృష్టి అంతా కార్యకారణ మయం. ఈ కారణం తథాగతునికి తెలుసు." అంతట శారిపుత్త మొగ్గ లానులు, రాజగృహంలోని జైన శిష్యులందరూ బుద్ధుని శిష్యులైనారట.

ప్రతీత్య సముత్పాదవాదం, నాటి మేధావులను ఆకర్షించిన దనటానికి ఇది నిదర్శనం.

రాజులమధ్య కలహాలు అనేకం జరుగుతుండేవి. అవి దారుణ యుద్ధాలుగా పరిణమించేవి. రోణావతినది నీటికొరకై శాక్యులు, కోలీయులు- ఇరుగు పొరుగు ప్రజలు. యుద్ధానికి సన్నద్ధులు కాగా, బుద్ధుడు యుద్ధభూమికి వెళ్ళి, ఉభయులను మందలించి శాంతిని చేకూర్చాడు. లిచ్ఛవీ రాజ్యాన్ని నాశనం చేయటానికి, మగధరాజైన అజాత

శత్రువు దండెత్తకలచగా బుద్ధుడు మందలించాడు. కాని యుద్ధాన్ని నివారించలేకపోయాడు. శాక్యదేశంపై, ప్రసేనజిత్తు కుమారుడైన విడూడభుడు, దండెత్తి శాక్య స్త్రీ, పురుష, శిశువులందరినీ దారుణంగా హత్య చేసి, రక్తప్రవాహాలను ప్రవహింపజేసిన వార్తను కుపినార ప్రాంతంలో ఉన్న గౌతముడు విని, ఎంతో ఖేదించాడు. తాసీ యుద్ధాన్ని ఆపలేక పోతినే అని క్లేశపడ్డాడు.

గణతంత్ర ప్రజాస్వామ్యంలోని కొన్ని అమానుష ఆచారాలను బుద్ధుడు అంతం చేశాడు. శ్రావస్తీనగరంలో అంబపలి అను అపురూప సుందరి ఒక వైశ్య స్త్రీ ఉండేది ఆమెను వివాహమాడటానికి పెక్కుమంది ముందుకు రాసాగారు. ఈ వివాదాన్ని పరిష్కరించలేక ఆమె తండ్రి, వైశాలి పరిషత్తుకు నివేదించగా, వారు అంబపలివంటి అపురూప సుందరి, అందరికి అందుబాటులో ఉండే "గణిక"గా జీవించాలని శాసించారు.

తన యిష్టానికి వ్యతిరేకంగా, అంబపలి వేశ్యాజీవనం గడపసాగింది. తన జీవితాన్ని ఉద్ధరించగలవాడు ఒక్క గౌతముడేనని ఎదురుచూడసాగింది. బుద్ధుడు వైశాలి నగరం చేరగానే, అంబపలి బుద్ధుని దర్శించి, తన విషాధగాధ వెలిబుచ్చింది. బుద్ధుడు వైశాలి పరిషత్తు పెద్దల నందరినీ సమావేశపరచి, వారెంతటి క్రూరకార్యం చేశారో వివరించాడు. వారు పశ్చాత్తాప పడ్డారు. అంబపలి బౌద్ధభిక్షుకి అయింది.

చైనాలో బౌద్ధమతం కలిగించిన ప్రభావాన్ని గురించి, చౌపూ చో యిలా వ్రాస్తున్నాడు:

"బౌద్ధమతం చైనాదేశంలో క్రీస్తుకు పూర్వమే ప్రవేశించింది. అరోజులలో చైనా అంతరంగిక కలహాలతో సతమత మవుతుండేది. ఆ స్థితిలో బుద్ధుని కార్యకారణవాదం, దుఃఖనివారణమార్గం, మానవ ప్రేమ, కరుణ, సర్వ మానవ సౌభ్రాతృత్వం, ధనికులను, పేదలను - అందరినీ ఎంతో ఆకర్షించింది." (చైనా రీ కన్‌స్ట్రక్ట్సు - ఏప్రిల్ 1956)

మంగోలియాలో బౌద్ధమతంకలిగించిన ప్రభావాన్ని గురించి, ఢిల్లీలో జరిగిన బౌద్ధసంగీతికి హాజరైన ధేంషెల్‌లామా, యిలా అంటున్నారు.

"బుద్ధుని దుఃఖనివారణమార్గం, మానవప్రేమ, కరుణలతో నిండివున్నది. మానవతాదృష్టికి బుద్ధునిబోధలు పరాకాష్ఠ. బౌద్ధమతం మంగోలియాలో ప్రవేశించి. ప్రజల జీవితాన్ని యెంతో మార్చింది. నైతిక దృక్పథాన్ని ఏర్పరచేందుకు కళ, విద్య. సంస్కృతి మొదలైన వాని అభివృద్ధికి, ఇది యెంతో తోడ్పడ్డది. ఆసియా ప్రజలందరికి వెలుగు చూపినవాడు బుద్ధుడు. తెగల దశలో ఉన్న మంగోలియా సమాజం ఒక జాతిగా రూపొందటానికి బౌద్ధం తోడ్పడ్డది.

బౌద్ధమత గ్రంథాలు శతాధికంగా, మంగోలియాలో వెలువడి, మంగోలియా భాషాభివృద్ధికి తోడ్పడ్డాయని కూడా ఆయన పేర్కొన్నాడు.

బానిస సమాజం నుండి అర్ధ బానిస సమాజంలోనికి భారతదేశం పరివర్తన చెందుతున్నసమయంలో చౌద్ధమతం తలయెత్తింది. చైనాలో కూడా, అదే కాలంలో అదేరకమైన సామాజిక పరివర్తన సాగుతున్నది.

## భావవాదమా ? భౌతికవాదమా ?

పరబ్రహ్మను, ఆత్మను గౌతముడు నిరాకరించిన విషయం నిర్వివాదం. భావమా? పదార్థమా? ఏది ముందు అనే సమస్యకు, గౌతముడు ఏ సమాధానం యిచ్చాడు ?

సంయుక్త నికాయంలో యిలా ఉంది:

"రెండు తట్టెపుల్లలు ఒకదానిపై ఒకటి ఆధారపడి నిలబడినట్లే, ఓ మిత్రుడా! చైతన్యం పదార్థంలోనుంచి (నామరూపం) ఆవిర్భవిస్తుంది. పదార్థం చైతన్యంలోనుండి ఆవిర్భవిస్తుంది. ఈ రెండూ పరస్పరాధారాలు. ఈ గొలుసు ఇలా సాగిపోతుంది."

పదార్థం ముందా? చైతన్యం ముందా? అను ప్రశ్నకు బౌద్ధంలో సూటి సమాధానంలేదు.

ఈ విషయంలో చార్వాకుల భౌతికవాద స్థాయిని బుద్ధుడు అందుకోలేకపోయాడు.

పదార్థం ప్రాథమికం అని అంగీకరించకపోయినా, పదార్థం వాస్తవం అని అంగీకరించుటలో బుద్ధునికేగాక, బౌద్ధ ధోరణుల కన్నిం

టికీ ఎట్టి సంకోచమూ లేదు. పదార్థం, చైతన్యం రెండూ వాస్తవమేనని, పరస్పరాధారంగా ఇవి మార్పు చెందుతాయని వీరంటారు.

వైభాషికుల గ్రంథమైన అభిదమ్మకోశం ఇలా చెబుతున్నది. రంగు, వాసన, రుచి, స్పర్శ ఈ నాలుగు లక్షణాలతో కూడుకున్నది. పదార్థం పదార్థంయొక్క అత్యల్ప రూపం పరమాణువు. ఇది అవిభాజ్యం కాని శాశ్వతంకాదు. ఇది ఒకక్షణికమైన మెరుపువంటిది."

పై నిర్వచనంపై వ్యాఖ్యానిస్తూ, రష్యన్ తత్వవేత్త షెర్‌బట్‌స్కీ ఇలా అన్నారు.

"పదార్థం యొక్క రూపాలు, వాని కార్యచరణద్వారా మాత్రమే వ్యక్తమౌతాయి. కనుక అవివస్తువులుకావు. శక్తిరూపాలు మాత్రమే."

కర్మ, పునర్జన్మ, నిర్వాణం అను భావాలు కూడా గౌతముడు ప్రత్యేకమైన అర్థంలో వాడాడు. బుద్ధుని దృష్టిలో, కర్మఅంటే మతకర్మ కాదు. వెనుకటి జన్మలో చేసిన కర్మఅనికూడా కాదు. వర్తమానకాలంలో మానవుడు చేస్తున్న కర్మ.

బుద్ధుని తర్వాత, కర్మ అంటే వెనుకటి జన్మలో చేసిన కర్మ అను అర్థం ఏర్పడ్డది.

నిర్వాణం అను మాటను బుద్ధుడు, రాగ ద్వేష రహితమయిన మానసిక స్థితిని తెలియజేయుటకు ఉపయోగించాడు. ప్రతివ్యక్తి అట్టి స్థితిని పొందుటకు కృషిచేయాలన్నాడు.

పునర్జన్మ భావం మొదట్లో బుద్ధుడు, ప్రవచించలేదు, కానిఆయన బోధనలలోని అస్పష్టత, అతి త్వరలో పునర్జన్మవాదానికి త్రోవ తీసింది. పునర్జన్మ, నిర్వాణం ఈ రెండు భావాలు వృద్ధిచెంది, గతితర్కానికి విరుద్ధమైన జడాత్మక ధోరణులను బౌద్ధమతంలో ప్రవేశపెట్టాయి.

గౌతముడు ప్రవచించిన అవి బౌద్ధాన్ని భావవాద మని కాని, భౌతికవాదమని కానినామకరణం చేయరాదు. ఈరెంటికీ మధ్యేమార్గంలో, భౌతికవాదానికి సన్నిహితమైన చైతవాదం.

గౌతముడు భారతదేశంలో ఉద్భవించిన మహాపురుషులలో అగ్రగణ్యుడు. గౌతముని బోధలలో వినయం, సౌశీల్యం, అణకువ అడుగడుగున వ్యక్తమవుతూ వుంటాయి. ఏ ఒక్కదానినీ, చివరకు తన బోధ

పలను సైతం, అంధప్రాయంగా అనుసరించ వద్దని, బుద్ధుడు, పదేపదే తన శిష్యులను హెచ్చరించాడు.

"ఎవరో గొప్పవారు చెప్పారని దేనినీ అంగీకరించవద్దు. సంప్రదాయ సిద్ధంగానూ, అనుశ్రుతంగానూ వస్తున్నంత మాత్రాన దేనినీ విశ్వసించవద్దు. గ్రంథస్థమై ఉన్నది కదా అని ఏ నిర్వచనాన్ని స్వీకరించవద్దు నీ ఆచార్యుడు చెప్పినంత మాత్రాన, అదంతా నిజమేనని అనుకోవద్దు. బౌద్ధులు చూప గలిగింది బాట మాత్రమే. ఎవరి సత్యసిద్ధికోసం వారే శ్రమించాలి" అని ఒక సందర్భంలో బుద్ధుడు తెలియజేసాడు.

అన్ని విషయాలకు తాను సమాధానం చెప్పగలనని గౌతముడు ఎన్నడూ అనలేదు. తనకు తెలిసిన విషయాలేవో చెబుతున్నానని, మిగతా విషయాలకు సమాధానాలు కాలగర్భంలో ఇమిడి ఉన్నాయని ఆయన ఒక సందర్భంలో చెప్పాడు. "ఓ మాలుక్య పుత్రా, ఏవైతే బోధపడలేదో, వాటిని అలాగే బోధబడనట్లే ఉండనిమ్ము. ఏవైతే తెలిసినవో వానినే స్వీకరించుము." (మధ్యమ నికాయ)

తన పరినిర్వాణ సమయంలో, శోకతప్తుడైన ఆనందుని చూసి, గౌతముడు ఇలా అంటున్నాడు: "తథాగతుడు మరణిస్తున్నాడని విచారించకు ఆనందా! పుట్టినది ప్రతిదీ గిట్టక తప్పదుకదా. వెళ్ళి నీ ధర్మం ఆచరించు ఇది వసంతకాలం. చుట్టూ ఆకులు అశేషంగా రాలుతున్నాయి. వీటిని లెక్కపెట్టడం సాధ్యమా? కాదు; అలాగే నేను మీకు కొన్ని ధర్మాలను మాత్రమే తెలియజేశాను. యింకా వేలాది ధర్మాలు తెలుసుకోవలసినవి వున్నాయి. అవన్నీ మీరే తెలుసుకోవాలి. మీకు మీరే మార్గదర్శకులు కావాలి."

ఒకప్పుడు మానవ మేధస్సును ఉన్నతపథానికి కొనిపోయిన ఆలోచనా ధోరణులు, కాలక్రమేణ పిడివాదంగా రూపొంది, సృజనాత్మక ధోరణి లోపించి నిర్జీవమైపోవటం చరిత్రలో తరచు జరుగుతున్న విషయం. బౌద్ధ గతితర్కానికి అదే అవస్థ ఏర్పడ్డది. నాగార్జునునివంటి కొందరు, ఈ గతితార్కిక దృష్టిని శూన్యవాదంతో జతచేసి ధ్వంసం చేశారు. క్రమేణ, బౌద్ధ తత్వశాస్త్రంకంటె బౌద్ధమతం పై చేయి సంపాదించింది. ఆ మతంకూడ సాంప్రదాయకమైన కర్మకాండను, పూజా

పధులను అలవర్చుకున్నది. క్రీ. శ. 600 తర్వాత, బుద్ధుని వాణి భారత దేశంలో వినిపించిన వేయిసంవత్సరాలకు, బౌద్ధమతం భారతదేశంలో అదృశ్యమైంది. కాని శాంతి, ప్రేమ, సహనంవంటి నైతిక సూత్రాలు. పరిణామశీలమైన జగత్తుకు అనుగుణంగా, ఎప్పటికప్పుడు మారుతూ వుండాలన్న జీవిత దృక్పథం— భారతీయ సంస్కృతిలో అంతర్భాగాలైనవి. బౌద్ధం భారత జాతికి చేసిన మహోపకారం యిదే.

# ఆరవ అధ్యాయం

## బౌద్ధ శాఖలు

బుద్ధుడు మరణించిన మరుక్షణమే బౌద్ధంలో విభేదాలేర్పడ్డాయి.

వీటిలో కొన్ని ఆచారపరమైనవి, కొన్ని మతపరమైనవి, మరి కొన్ని తాత్విక పరమైనవి.

బుద్ధుడు అరవై ఏడ్లు సంచారం చేసిబోధలు చేశాడు. ఆయన జీవిత కాలంలో అవి గ్రంథస్థం కాలేదు.

బుద్ధుడు మరణించిన వెంటనే రాజగృహంలో జరిగిన మొదటి సంగీతిలో బుద్ధుని బోధనలను గ్రంథస్థం చేసి, రెండుభాగాలుగా విభజించాడు. బుద్ధుని బోధనలను వాక్కో వాక్యంగా గ్రంథస్థంచేసినవి సూత్ర పిటకం. భిక్షుకుల జీవిత విధానానికి సంబంధించి, తథాగతుడు వచించిన నియమ నిబంధనలు వినయపిటకం.

బుద్ధుని మరణానంతరం ఒక శతాబ్దానికి అంటే క్రీ. పూ 444లో, లిచ్ఛవీ రాజధాని వైశాలిలో రెండవ సంగీతి జరిగింది.

భిక్షువులు ధన, ధాన్య సంపద స్వీకరించ వచ్చునా, కూడదా అన్నది ప్రధాన చర్చనీయాంశం.

కూడదు అన్న 700 మంది భిక్షువులు : థేరవాదులు. తాత్వికంగా వీరు సౌత్రాంతికులు. సూత్రవచనములే ప్రమాణమని వీరి విశ్వాసం. ఈ భిక్షుశాఖ, అనేకములుగా చీలింది, సూత్రములకు వ్యాఖ్యాన పరమైన అభిధమ్మ పిటకం ఏర్పడ్డది. ఇది మొదటి సంగీతినాటికి లేదు. అభిధమ్మ పిటకం ప్రమాణం అన్నవారు వైభాషికులైనారు.

రెండవ సంగీతిలో బహిష్కృతులైనవారు వేరే సభ జరిపి, 10 వేల మందితో మహా సాంఘికులైనారు. కొంతకాలానికి మహాయాన వాదులైనారు.

రాజాదరణ, ధనధాన్య సేకరణ ఆమోదించిన మహాయానం, కాలక్రమేణ విస్తారమైన ఆదరణ పొందింది. ఇది కూడదన్న సౌత్రాంతికులు అల్పసంఖ్యాకులైనారు. రాజీమార్గం అవలంబించిన వైభాషికులు కూడా కాలక్రమేణ అల్పసంఖ్యాకులైనారు.

భిక్షుసంఘ అంతరంగిక నియమాలకు, మత విశ్వాసాలకు, తాత్విక భావాలకు గల అన్యోన్య సంబంధాన్ని గమనించటం అవసరం.

ప్రతిదీ ఉన్నదీ – లేదు. సర్వమూ క్షణికమూ. ప్రగతిశీలమూ. ప్రతీత్య సముత్పాదితమూ – ఇది బుద్ధుని తాత్విక ఆలోచనలోని కీల కాంశం.

## సౌత్రాంతికులు

దీనికి అంటి పెట్టుకున్నవారు సౌత్రాంతికులు.

బాహ్య ప్రపంచం వాస్తవం. వాస్తవికత అంటూ ఒకటి లేనిదే. అసలు జ్ఞానం కానిభ్రమకాని ఎలా ఏర్పడుతుంది. భౌతిక వస్తువులాంటిది అనేమాటలోనే, భౌతిక వస్తువు ఉనికి స్ఫురిస్తుంది. వస్తువు. దానిని గురించిన జ్ఞానమూ రెండూ ఒకటే అనటం పొరపాటు.

"నేను కుండనుచూస్తున్నాము" అంటాము. వస్తుజ్ఞానం ఎలాఏర్పడుతుంది ? అందుకు నాలుగు అంశాలు తోడ్పడాలి. వస్తువు చైతన్యం, విచక్షణ, సహాయకాంశము. చీకటిలో కుండను చూడలేము. వెలుతురు

అవసరం. ఇది సహాయకాంశం. ఇన్ని అంశాలు కలిస్తే వస్తుజ్ఞానం ఏర్పడుతుంది.

వాటి ఫలితంగా మనోఫలకంపై వస్తు ప్రతిబింబం ఏర్పడుతుంది వస్తువు లేనిదే ప్రతిబింబం లేదు. మనం వస్తువును, ప్రతిబింబం ద్వారానే గ్రహించగలం. పాశ్చాత్యతత్వ శాస్త్రంలో ప్రతిబింబవాదంతో సౌత్రాంతికులను పోల్చవచ్చును.

జ్ఞానానికి గీటురాయి ఏమి? ఆచరణ. ఫలితాన్నిచ్చే జ్ఞానం వాస్తవమైనది.

"అర్థాధిగమాత్ సమస్త ప్రమాణవ్యాపార" సౌత్రాంతికుల ఈ నిర్వచనము వారిని భౌతిక వాదుల శ్రేణిలో చేరుస్తుంది.

క్షణిక వాదానికి వీరు విశేష ప్రాధాన్యమిస్తారు. గతం, వర్తమానం, భవిష్యత్తు అను ప్రవాహం నిరంతరం పుడుతూ, నశిస్తూ, తిరిగి పడుతూ ఉంటుంది. ఇందులో అస్తిత్వమూ ఉంది. క్షణికత్వమూ వుంది. అస్థిత్వాని వదిలివేసి క్షణికత్వాని మాత్రం గుర్తిస్తే, ఆ తర్వాత రూపొందిన విజ్ఞానవాదుల వలె భావవాదంలోకి పోతాము క్షణికత్వాన్ని వదలి అస్థిత్వాన్ని నొక్కి చెబితే వైభాషికులవలె జడవాదం వైపు నడుస్తాము.

అన్ని బౌద్ధ శాఖలలోకి గతితార్కిక భౌతిక వాదానికి సన్నిహితమైనది సౌత్రాంతిక శాఖ.

సౌత్రాంతిక శాఖవలెనే, వారి సాహిత్యం కూడా అంతా నశించింది. దీర్ఘ విరామం తర్వాత, వైభాషిక ధోరణి వ్యాప్తి, పతనం రెండూ జరిగిన మీదట,కొందరు తత్వవేత్తలు సౌత్రాంతిక గ్రంథాలవైపు మళ్ళారు. క్రీ. శ. 635 లో ధర్మకీర్తి ఒక సౌత్రాంతిక తర్క గ్రంథం వ్రాశాడు. ధర్మోత్తరుడు క్రీ.శ. 847 లో దానిపై వ్యాఖ్య వ్రాశాడు.

## వైభాషికులు

బౌద్ధంలోని రెండవశాఖ వైభాషికులు. మత రీత్యా వీరు హీనయానానికి చెందినవారు. గాంధార, కాశ్మీరాలలో వీరి వ్యాప్తి హెచ్చు. వీరికి మరో పేరు సర్వాస్తి వాదులు.

సౌత్రాంతికుల వలె వీరు కూడా భౌతిక, భావప్రపంచ వాస్తవి కతను అంగీకరిస్తారు. కాగా వారి వలె క్షణికత్వానికి అంటిపెట్టుకోరు. గతం, వర్తమానానికి తోవ తీసిన వెంటనే నశిస్తుందని సౌత్రాంతికుల వాదన. కొనసాగుతుందని వైభాషికుల భావం. భూత, భవిష్యత్ వర్త మానముల చర్చ బౌద్ధంలో ప్రధానం. కాలం అనంతం. దాని విభజనే భూత భవిష్యత్ వర్తమానములు. గతము మానవస్మృతిలో ఉండగలదే కాని, ప్రత్యేకంగా ఉండదు.

సూత్ర గ్రంథముల కంటే, అభిధమ్మ కోశము తర్కజటిల ము. పరస్పర విరుద్ధ భావసంకలితము. దానిని ఆశ్రయించిన వైభాషి కులు, చలన శీల క్షణిక వాద దృష్టినుండి కిందికి జారారు. సర్వాస్తి వాదులు అనుపేరు లోనే బలహీనత ఉంది. బుద్ధుడు పేరు పెట్టి ఈ వాదన్ని నిరాకరించాడు. ఈ పేరు వైభాషికులు తమకు తామై స్వీక రించినదికాదు, శంకరుడు కల్పించినది అని ఒక వాదన ఉంది.

ఏమైనా వైభాషికులు, జడవాదం వైపు మొగ్గారని స్పష్టం.

అసంగ, వసుబంధు (క్రీ.శ 400) లిద్దరూ అన్నదమ్ములు. అసంగుడు యోగాచారవాది. వసుబంధు వైభాషికుడు. అభిధమ్మ కోశమను బృహద్గ్రంథ కర్త. క్రమంగా అసంగుని ప్రభావంతో వసు బంధుడు కూడా విజ్ఞాన వాది ఐనాడు

వైభాషికుల దృష్టిలో భౌతిక, భావ ప్రపంచములు రెండూ స్వతంత్రమైనవి, వాస్తవమైనవి. వీరి సాహిత్య మంతా సంస్కృతంలో ఉంది. కాశ్మీర్, గాంధార దేశాలు వీరి కేంద్రాలు. ఈ సాహిత్యం చాలా వరకు నశించింది. పాలి తర్జుమాలు మాత్రం టిబెట్‌లో లభిస్తున్నాయి.

సాంఖ్యానికి సన్నిహితమైన ద్వైతవాదులు, వైభాషికులు. బౌద్ధం స్వీకరించటానికి ముందు, ద్వైత మార్గానుయాయులైన సారిపుత్ర మొగ్గలానులు, వైభాషికులు.

భౌతిక, భావ ప్రపంచాలను విడిగా చర్చించక, రెంటికీ వర్తించే విధంగా తాత్విక పదజాలాన్ని వాడటం వైభాషికుల ప్రత్యే కత. బుద్ధుని అడుగు జాడల ననుసరించి తాము నైరాత్మ్య వాదులమని

పేరు ప్రకటించుకున్నారు. ఆత్మ అంటె దేహం కంటె భిన్నమైన శాశ్వత నిర్గుణ రూపం అని కదా! కాని వైశేషికులు ఆత్మను పదార్థానికి కూడా వర్తింపచేశారు.

## శూన్యవాదం

క్రీ.శ. 180 ప్రాంతంలో నాగార్జున కొండవద్ద నివశించి, యజ్ఞశ్రీ శాతకర్ణి సమకాలికుడైన నాగార్జునాచార్యులు ఈ వాదం రూపొందించాడు.

బౌద్ధ తత్వశాస్త్రానికి మూలం, ప్రతీత్యసముత్పాదం. అనేక కారణాల ఫలితంగా ఒక కార్యం ఏర్పడుతుంది. అకారణంగా ఏదీ జరగదు.

నాగార్జునాచార్యులు ప్రతీత్య సముత్పాదాన్ని ఆమోదిస్తూనే, అంత కంటే మౌలికం ఏది అను ప్రశ్న వేసుకున్నాడు. ఈ ప్రశ్నలోనే బల హీనత ఉంది. ప్రతీత్య సముత్పాదమే మౌలికం. ఒక మౌలికానికి, మరొక మౌలికం ఉండజాలదు.

తన ప్రశ్నకు తానే సమాధానం ఇస్తూ, ప్రతిదీ మౌలికంగా నిస్స్వభావం, కనుక శూన్యం అని నాగార్జునాచార్యులు అన్నారు.

శూన్యం. మాయ, భ్రమ, పర్యాయ పదాలు. మరి లౌకిక జగత్తు ఏం కావాలి.

సత్యం రెండురకాలు. ఒకటి సంవృత్తి సత్యం. ఇది లౌకికం. రెండవది పారమార్థిక సత్యం. ఇది మౌలికం అని నాగార్జునుని జవాబు. ప్రతీత్య సముత్పాదం మొదటిదానికి వర్తిస్తుంది. పరమార్థానికి వర్తించదు. అది నిస్వభావం. కనుక శూన్యం.

సంవృత్తి అనగా ఆవరణ. శంకరుడు కల్పించిన మాయకూడా, సత్యాన్ని కప్పిపుచ్చే ఆవరణే, మాటలలో కూడా, నాగార్జున, శంకరులకు గల పోలిక గమనించతగ్గది.

సత్యాన్ని రెండుగా విభజించిన నాగార్జునుని బోధ, ఆధునికమైన ఐన్‌స్టీన్ సాపేక్షవాదం వంటిదని కొందరంటారు. శంకరుని మాయా వాదం అలాంటిదేనని మరికొందరంటారు.

ఈ రెండువాదనలూ పొరపాటు. ఐన్‌స్టీన్ దృష్టిలో సాపేక్షకత అంటే కొన్ని పరిమితులకు లోబడిన రూఢిసత్యం. అఖండ సత్యమంటూ ఐన్‌స్టీన్ దృష్టిలో మరొకటి లేదు. అంతా సాపేక్షకతే.

శంకర నాగార్జునుల దృష్టిలో రెండు సత్యాలున్నాయి. తపస్సు ద్వారా ఒకవ్యక్తి ఆత్మజ్ఞానం పొంది జీవన్ముక్తి పొందితే అఖండ సత్యంలో ఐక్యమైనట్లే.

శంకర, నాగార్జునుల, పరబ్రహ్మ, పారమార్థిక శూన్యతా భావాలలో సాపేక్షత ఏది?

శాస్త్ర విజ్ఞాన పురోగతిలో ఐన్‌స్టీన్ సాపేక్షవాదం ఏర్పడ్డది. భౌతిక ప్రపంచం పట్ల విముఖత్వం కలిగించటానికి, శంకర, నాగార్జునులు పై విభజన చేశారు. ఒకటి పరిశోధనా ఫలితం, మరొకటి ఉద్దేశపూర్వక కల్పన. అట్టివారిని ఐన్‌స్టీన్‌తో పోల్చటం హాస్యాస్పదం.

"ఇది పూర్తి సత్యం కాదు. ఏమంటె సత్యమైనది పరిణామ రహితంగా ఉండాలి. ఇది పూర్తి అసత్యం కాదు. ఏమంటే ప్రపంచంలోని ధర్మాలన్నీ ఇలాంటివే గనుక. కార్యకారణ బంధితమైనదానిని నేనుశూన్యత అంటాను" (నాగార్జునుడు, మాధ్యమిక సూత్రాలు)

"రెండు సత్యాలున్నాయి. బుద్ధుని బోధలు ఈ రెంటి మీద ఆధారపడి వున్నాయి. ఒకటి దృశ్యమాన ప్రపంచానికి చెందిన సత్యం. (సంవృత్తి) ఇది సామాన్య ప్రజలకొరకు ఉద్దేశించబడ్డది. రెండవది లోకాతీతమైన అఖండ సత్యం (పారమార్థిక సత్యం). ఈ రెండు రకాల సత్యాల తేడాలను గుర్తించలేనివారు బుద్ధుని బోధలలోని గొప్పతనాన్ని గుర్తించలేరు" (మాధ్యమిక శాస్త్రం, 24 వ అధ్యాయం, 8, 9 కారికలు).

ఈ వ్యాఖ్యానం ద్వారా నాగార్జునుడు బౌద్ధసారాన్నేమార్చివేశాడు. సామాన్యులు, మేధావులు అనే విభజన చేశాడు. తాత్వికంగా, మతపరంగాకుండా పతనానికి త్రోవతీశాడు.

ఐతే సాంఘికంగా బౌద్ధసారాన్ని వదలలేదు. కులవ్యవస్థతో రాజీపడలేదు. సర్వజాతి మత, సమానత్వాన్ని కొనసాగించాడు. నాగార్జున విశ్వవిద్యాలయంలో దేశదేశాల విద్యార్థులు, జాతి, మత,

లింగ విభేదం లేకుండా విద్య నభ్యసించారు. బౌద్ధంతో పాటు వైదిక విద్యలు కూడా నేర్పారు. నలందాలోనూ ఇలాగే సాగింది.

సుహృల్లేఖ ద్వారా ఉదార రాజ నీతి సూత్రాలను నాగార్జునుడు ప్రతిపాదించారు.అంతరాలు, అనుమానం, కౌటిల్యంపై ఆధార పడిన చాణక్య రాజనీతికిది పూర్తిగా భిన్నం. లౌకిక పరిపాలనకు ప్రాతిపదిక.

భావవాదానికి దిగ జారిన ఫలితంగా శూన్యవాదం–రాజాదరణకు పాత్రమైంది. ధనికవర్గాల అండ సంపాదించింది.

పరమార్థంలో అంతా శూన్యం కనుక లౌకికంగా ఎలా ప్రవర్తిస్తే మాత్రం ఏమి అను నిరపేక్షధోరణికి కూడా ఇది త్రోవతీసింది. తర్వాతి కాలంలో శంకరుని మాయా వాదం ఈ ఫలితాన్నే కలిగించింది.

## విజ్ఞానవాదం

బౌద్ధ శాఖలలో ఆఖరుది విజ్ఞాన వాదం. దానినే యోగాచారం అని కూడా అంటారు

క్రీ. శ. 270–350 లో జీవించిన మైత్రేయ నాథుడు యోగాచార ధోరణికి మూలపురుషుడు. అసంగవసుబంధులు దీనిని వృద్ధి చేశారు. క్రీ. శ. 500 లో జీవించిన ధర్మకీర్తి, దిఙ్నాగులు – యోగాచారమునే విజ్ఞానవాదంగా పెంపుచేశారు.

ఇది సంపూర్ణ భావవాదం – భౌతిక ప్రపంచం అవాస్తవం - భావప్రపంచం మాత్రమే వాస్తవం. ఇదే ఆలయవిజ్ఞానం (Absolute spirit). దీనిని శూన్యత అని పిలువరాదు. అలా పిలవటమంటే సంశయవాదానికి తోవ తీయటమే.

విజ్ఞానవాదులు, తర్కశాస్త్రమును ఆధారంగా చేసుకుని, భౌతిక ప్రపంచ అవాస్తవికతను నిరూపించ యత్నించారు. వైదిక తత్వశాస్త్రాలలో ఒకటైన న్యాయం (తర్కం) తర్కశాస్త్రాన్ని పునాదిగా చేసుకుని భౌతిక ప్రపంచ వాస్తవికతను నిరూపించింది. ఈ రెంటికీ తీవ్ర ఘర్షణ సాగింది.

భౌతిక ప్రపంచం అవాస్తవం. అయితే ఈ ప్రపంచాన్ని గురించిన భావాలు ఎలా ఏర్పడుతున్నాయి. ఈ భావాలు అనాదిగా మానవ చైతన్యంలో ఉన్నాయి. కుండకు సంబంధించిన ముద్ర ఒకటి అనాదిగా మన చైతన్యంలో ఉంది. కుండ కనపడగానే, ఆ ముద్ర జ్వలితమౌతుంది. కొంతకాలానికి కుండ నశిస్తుంది. కాని కుండ అనే భావం నశించదు కనుక వస్తువు తాత్కాలికం అసత్యం. భావం శాశ్వతం.

ఇలాంటి భావాలన్నీ కలిసినదే అలయ విజ్ఞానం.

పచ్చాటి రంగు, ఆ రంగును గురించిన జ్ఞానమూ రెండూ ఒకటే.

రంగు లేనిదే జ్ఞానమెలా కలుగుతుంది అది సౌత్రాంతికుల ప్రశ్న.

జ్ఞానం లేకపోతే రంగు ఉన్నదో లేదో ఎలా తెలుస్తుంది. కనుక జ్ఞానం ముఖ్యం అని విజ్ఞానవాదుల వాదన.

ఇదే వాదనను శంకరాద్వైతులు చేస్తారు.

యోగాభ్యాసంద్వారా అలయ విజ్ఞానంలో లీనం కావచ్చునని వీరి విశ్వాసం. కనుకనే వీరు యోగాచారులైనారు.

బౌద్ధ తర్కశాస్త్రంలో దిజ్నాగుడు గొప్పదిట్ట. కాళిదాసునకు సమకాలికుడు. ఆంధ్రుడు.

పై నాలుగు ధోరణులలో మతరీత్యా, సౌత్రాంతిక వైభాషికులు హీనయానశాఖకు చెందినవారు. శూన్యవాద, విజ్ఞానవాదులు మహాయాన శాఖకు చెందినవారు.

బుద్ధుని ప్రతిమారూపంలో పూజించరాదు అని హీనయానం, పూజించ వచ్చును, వలెను అని మహాయానులు విభేదించారు. మహాయానం క్రమంగా వజ్రయానం, తంత్రయానం ఐంది.

నిర్వాణం వ్యక్తికే పరిమితమైతే, "మిగతా ప్రజలందరూ స్వర్గ పదవి పొందనిదే నాకు స్వర్గమక్కరలేదు" అను బుద్ధుని మాటలేమి కావాలి? నిర్వాణం సమాజపరం. ప్రజానీకాన్ని ఉద్ధరించాలి. బౌద్ధాన్ని ప్రజలకు దగ్గర చేయాలి. మహాయానంలోని సూత్రం ఇది.

మతరీత్యా ఇది వ్యాప్తి చెందింది. తాత్వికరీత్యా పతనమైంది. చిత్ర, శిల్పకళలకు ఇతర లలితకళలకు అపారమైన ప్రోత్సాహ

మించిపోయింది. ప్రజలలోని మూఢనమ్మకాలన్నిటినీ స్వీకరించింది. దేశ దేశాలకు వ్యాపించింది.

శాతవాహన చక్రవర్తులు, అంతకుముందు కనిష్కుడు మహాయానాన్ని అభిమానించారు. అశోకుని కాలానికి స్థవిరవాదం మాత్రమే ఉంది. దేశదేశాలకు, ఖండఖండాలకు బౌద్ధప్రచారకులను పంపిన అశోకుడు, స్థవిరవాదం, మహాయానంగా రూపొందక తప్పని పరిస్థితులు కల్పించాడు.

"బౌద్ధతత్వశాస్త్ర చరిత్ర 'నిర్వాణ' భావచరిత్ర" అని ఒక పరిశోధకుడు చెప్పిన మాట నిజం.

బుద్ధుని దృష్టిలో నిర్వాణం అంటే, కామక్రోధాది అరిషడ్వర్గములను పరిహరించిన సమాధిస్థితి. సౌత్రాంతిక వైభాషికులు అదే అర్థాన్ని ఆమోదించారు.

నాగార్జునుని దృష్టిలో అంతా శూన్యం. నిర్వాణమూ శూన్యమే. మహాయాన మతంలో నిర్వాణం అంటే తుషిత స్వర్గానికి పోవటం, తిరిగి జన్మ ఎత్తటం. ఈ జన్మ పరంపరనుండి విముక్తి చెందటం, వైదిక మతంలోని మోక్ష భావానికి ఇది సన్నిహితం.

విజ్ఞానవాద దృష్టిలో నిర్వాణం అంటే, అలయ విజ్ఞానంలో ఏకం కావటం - శంకరుని పరిభాషలో జీవ బ్రహ్మైక్యం.

బుద్ధుడు ప్రవచించిన ప్రతి భావమూ ఇలాగే రూపాంతరం చెందింది. పరస్పర విరుద్ధ ధోరణులకు త్రోవతీసింది. అన్నిమతాలకు పట్టిన దుర్గతే బౌద్ధానికి పట్టింది.

ఒక్క నిర్వాణ భావానికిచ్చిన వ్యాఖ్యకు మాత్రమే పరిమితమైతే, మరణానంతరం మిగిలేదేమీ లేదు అను చార్వాక భావానికి, నాగార్జునుని శూన్యతా భావానికి సామీప్యత ఉన్నట్లు చెప్పవచ్చు.

## ఏడవ అధ్యాయం

# జైనం – స్యాద్వాదం

జైన మతాన్ని ప్రారంభించిన వర్ధమాన మహావీరుడు క్రీ. పూ. 599-527 సం॥ల మధ్య జీవించినవాడు. గౌతమ బుద్ధునికంటే వృద్ధుడైనా, కొంతకాలం సమకాలికుడు. బుద్ధుని వలెనే ఇతడూ క్షత్రియ వంశంలో జన్మించాడు.

బౌద్ధంవలె జైనంకూడా వర్ణ వ్యవస్థను ఖండించింది. వేద ప్రామాణాన్ని నిరాకరించింది. దేవుని త్రోసిపుచ్చింది. అహింసను, బౌద్ధంకంటె తీవ్రంగా బోధించింది. యజ్ఞయాగాదులను ఖండించింది.

కాని ఆత్మను నిరాకరించలేదు.

స్థితిమౌలికమని ఉపనిషత్తులు–గతిమౌలికమని బౌద్ధులు అన్నారు. జైనులు ఈ రెంటినీ కాదని, పుట్టుక, నశింపు, శాశ్వతత్వం - అను మూడు లక్షణాలు వాస్తవికతలో అంతర్భాగమన్నారు. ఉపనిషత్ వాసనను, బౌద్ధుల ఆలోచనను, మిశ్రమం చేశారు.

దీనిని వారు అనేకాంతవాదమని పిలిచారు. వస్తువుకు అనేక లక్షణాలుంటాయి. ఏదో ఒక అంశానికి విశేష ప్రాధాన్యత ఇవ్వరాదు. అన్ని అంశాలను పరిశీలించాలి. ఇది ఇంతే అనరాదు.

పుట్టుక, నశింపుల మధ్య అవిచ్ఛిన్నత ఉన్నమాట నిజం. అది శాశ్వతత్వం కాదు. నిత్య పరిణామశీలం. జైనులు, అవిచ్ఛిన్నతను శాశ్వతత్వంగా భావించారు.

ఈ గందర గోళమే వారి తత్వ శాస్త్రంలో అడుగడుగునా కనిపిస్తుంది.

ప్రకృతి ద్రవ్యమయం. మట్టి ద్రవ్యం. కుండ, మూకుడులాంటి అనేక రూపాలు ధరిస్తుంది. అయినా ద్రవ్యం అన్నిటిలోనూ ఉంటుంది.

కాలం కూడా ఒక ద్రవ్యం. కాని దానికి శరీరములేదు. మిగతా అన్ని ద్రవ్యములకు శరీరమున్నది. కనుక అది అస్తికాయము.

అస్తికాయములు రెండు విధములు జీవములు, అజీవములు. జీవములనగా ఆత్మలు. ఆత్మలలో కొన్ని ముక్తులు. కొన్ని బద్ధులు. బద్ధులైన ఆత్మలు తిరిగి రెండు విధములు. కదలిక కలిగినవి(మనుష్యులు, జంతువులు) కదలిక లేనివి, స్థవిరములు (నేల, నీరు, అగ్ని, గాలి, చెట్లు). వీటన్నిటిలోనూ ఆత్మలున్నవి. ఇవి శాశ్వతములు.

జైనులు అనే కాంత వాదులు మాత్రమే కాదు, అనే కాత్మవాదులు కూడా.

కదలికలేని స్థవిరములకు నాలుగు లక్షణములున్నవి. ధర్మ, అధర్మ, ఆకాశ, పుద్గలములు. పుద్గలమన పదార్థము. పుద్గలము అణువులతో కలిసి ఉన్నది. అణువుల కలయిక వలన పుద్గలము, పుద్గల, ఆకాశాదుల కలయిక వల్ల అజీవ స్థవిరము, ఏర్పడు తుంది. ఇవన్నీ ద్రవ్యములో భాగములు.

అణువులు, వాటి కలయిక ఫలితంగా పుద్గలము (పదార్థము) అను భావం భౌతికవాదానికి జైనంతో గల సాన్నిహిత్యాన్ని తెలియ చేస్తుంది. పుద్గలం, నిర్జీవ ఆత్మలకు మాత్రమే పరిమితమనుట ద్వారా, జీవ, నిర్జీవ ప్రపంచాల మధ్య, జంతు, వృక్ష ప్రపంచాల మధ్య జైనులు శాశ్వత అగాథాన్ని సృష్టిస్తున్నారు.

చార్వాక, జైన, బౌద్ధాలు ఒకే కాలంలో ఆవిర్భవించాయి. చార్వాకులలోని భౌతిక భావాలను, వైదిక మతంలోని ఆత్మ భావాన్ని జైనులు

మిశ్రమం చేశారు. బౌద్ధంలోని చలనశీలతను, ఉపనిషత్తులలోని శాశ్వత తత్వాన్ని మిశ్రమం చేసినట్లే.

తాత్వికంగా జైనం అత్యంత బలహీనమైన శాఖ. వారి విశిష్టత, నైతిక ప్రవర్తన వైరాగ్యంపైన వారు చూపిన విశేష శ్రద్ధ.

మతరీత్యా జైనం, వైదిక మతంతో పోలికను కలిగిఉంది.

ఆత్మ లక్ష్యం ముక్తి. కర్మఫలితంగా ఆత్మ బంధితమౌతుంది. భౌతిక ఆకర్షణలు కర్మకు మూలం. ఆగ్రహం, గర్వం, దురాశ-ఇవి భౌతిక ఆకర్షణలు. వీటి నుండి బైటపడాలి. అందుకు జ్ఞానం అవసరం. అందుకు విశ్వాసం ఉండాలి. సత్ప్రవర్తన ఉండాలి.

ఈ విషయంలో, జైన, బౌద్ధాలకు కొంత పోలిక ఉంది. కాని బౌద్ధంలో విశ్వాసానికి స్థానంలేదు. ఆలోచనకు ప్రాధాన్యం.

జైనుల జ్ఞాన సిద్ధాంతంలోనూ ఈ కలగాపులగం కనిపిస్తుంది.

జ్ఞానసంపాదనకు వివిధ మార్గములున్నవి. మతి (ఇంద్రియ జ్ఞానం), శ్రుతి (ప్రమాణ గ్రంథాలు) అవధి (అంతర్వాణి), మనః పర్యాయ (దూరశ్రవణం) కేవల (శుద్ధజ్ఞానం)

అంతర్వాణి, దూరశ్రవణం అను భావాలు బౌద్ధంలో లేవు. ఉపనిషత్తులలో అంతర్వాణి ప్రస్తావన అంతరాత్మగా ఉన్నది తప్ప మరొకటి కాదు. ఈ రెండు భావాలను జైనులు, ఆటవిక తెగల విశ్వాసాలనుండి గ్రహించారు. హఠ యోగులకు ఈ శక్తులు లభిస్తాయనే విశ్వాసం ఉండేది.

దేవుని నిరాకరించినందున జైనం, నిరీశ్వరం. కాని శాశ్వతమైన ఆత్మను, లేక అనేకాత్మలను అది విశ్వసించింది. పదార్థం, పుదలం అణువు-వంటిభావాలు జైనాన్ని వాస్తవికతవైపు లాగాయి. అంతర్వాణి, దూరశ్రవణ ; హఠయోగం వంటి ఛాందసాలు అతీంద్రియ వీక్షణులకు ప్రోత్సహించాయి.

బినా జైనం వ్యాపించింది. అందుకు కారణం, వర్ణవ్యవస్థను నిరాకరించి, జంతుహింసను ఖండించి, అహింసను బోధించటం.

ఆ కాలంలో ఈ మూడు అంశాలున్న ఏ మతమైనా, ఉద్యమమైనా, అభ్యుదయ కరమైనది. సమాజాన్ని ఒక అడుగు ముందుకు తీసుకు వెళ్ళేది.

జైనమతస్థులు అహింసను అతిగా వర్తింపచేశారు. ఆహారానికి సైతం జంతు హింస చేయరాదు. రాత్రిళ్ళు భోజనం చేస్తే పురుగులు చచ్చిపోతాయి కనుక, సాయంత్రమే భోజనంచేయాలి. భూమిని దున్ని పంటలు పండించడం ద్వారా భూమిలోని జీవులు చనిపోతాయి గనుక, వ్యవసాయం పనికిరాదు –

ఈ ఛాందస సిద్ధాంతాల ఫలితంగా జైనమతం అంతగా వ్యాప్తి చెందలేదు. వ్యవసాయం చేయడంలో హింసఉన్నదన్న అపసవ్య సూత్రం ఫలితం గానో ఏమో, ఈ మతం వ్యవసాయంతో ఏమీ సంబంధంలేని వ్యాపారస్తులలో మాత్రమే వ్యాపించింది. మార్వార్, గుజరాత్, కన్నడ ప్రాంతాలలో వర్తకవర్గాలలో నేటికీ ఈ మతం నిలచి ఉంది. ఆంధ్రదేశంలో ఒకప్పుడు జైనమతం విస్తారంగా వ్యాపించింది (క్రీ. శ. 800-1300). కాని నాటి జైన మతానికీ, ఆదిమ జైనమతానికీ, భౌతికల కంటె వ్యత్యాసాలే హెచ్చు. ఆనాడైనా బంగారంపని, కమ్మరంపని చేసే వృత్తులవారిలో మాత్రమే ఈ మతం వ్యాపించింది.

జైన తత్వశాస్త్రంలో స్యాద్వాదం అను ఒక సిద్ధాంతంవుంది. దీని ప్రకారం పదార్థం వాస్తవమైనది. ఈ వాస్తవమైన పదార్థం బహుముఖ లక్షణాలు కలిగివుంటుంది. కొన్ని లక్షణాలనుమాత్రమే తెలుసుకోగలం. అన్నిటినీ తెలుసుకోలేము గనుక ఏవిషయాన్నైనా 'ఇది ఇంతేను' అని ఖండితంగా చెప్పరాదు.

సాధారణ తర్కంలో 'అవును, కాదు' అను రెండు భావములు వున్నవి. ఈరెండూ పరస్పర విరుద్ధమని సాధారణ తర్కం భావిస్తుంది. అవును, కాదు రెండూ కలిసేవుండవచ్చు. ప్రతిదానిలోనూ కొంత "అవును" కొంత "కాదు" వుండవచ్చు. అనగా విరుద్ధ లక్షణాలు కలసి వుంటాయి, ఇది గతితర్కం. స్యాద్వాదం పై చూపులకు గతితర్కంవలె కనిపిస్తుంది. కాని అది ఒక అభాస,

స్యాద్ వాదాన్ని జైనులు సప్త భంగి న్యాయం అని పిలుస్తారు.
ఉదాహరణకు:

1. బహుశా ఆ కుండ ఎర్రగా ఉన్నది (స్యాత్ అస్తి)

2. బహుశా ఆ కుండ ఎర్రగా లేదు. (స్యాత్ నాస్తి). ఆ కుండ ఎరుపురంగు క్షణక్షణము తగ్గిపోతుంది కనుక.

3. బహుశా ఆ కుండ ఎర్రగావున్నది. లేదు కూడా (స్యాత్ అస్తిచ। నాస్తిచ) —కనుక దాని అసలు రంగు ఏది అన్నపుడు —

4. బహుశా దాని రంగును తెలుసుకోలేము (స్యాత్ అవ్యక్తవ్యం).

5. బహుశా ఆ కుండ ఎర్రగా ఉన్నది. ఐనా దాని రంగు ఇది అని చెప్పలేము, (స్యాత్ అస్తిచ అవ్యక్తవ్యం) (1+4).

6. బహుశా ఆ కుండ ఎర్రగా లేదు. ఐనా దాని రంగు ఇది అని చెప్పలేము. (స్యాత్ నాస్తిచ అవ్యక్తవ్యం) (2+4).

7. బహుశా ఆ కుండ ఎర్రగా ఉన్నది. లేదుకూడా. ఐనా ఏమీ చెప్పలేము. (3+4).

ఏడు చరణాల తరువాత చివరకు వచ్చిన నిర్ణయం – "ఏదీ స్పష్టంగా చెప్పలేము."

పదార్థం యొక్క బహుముఖ లక్షణాలను గుర్తించవలె నన్నంత వరకు జైనుల వాదనను అంగీకరించవచ్చు. విరుద్ధశక్తులు కలసివుంటా యన్న దృష్టికూడా సరియైనదే. కాని యీ దృష్టిని వారు అన్వయించు టలో ఏదీ స్పష్టంగా చెప్పలేమనే అనిశ్చిత వాదానిక్రితోవ తీశారు

ఆధునిక గతితర్కం మాత్రమే ఈ సమస్యకు సరియైన సమాధానం చెబుతుంది.

"ఆధునిక భౌతికవాదం దృష్ట్యా,అంటే మార్క్సిజందృష్ట్యా పరిశీ లిస్తే. స్వతస్సిద్ధ శాశ్వతసత్యాన్ని (Objective absolute truth) ఆయా చారిత్రక పరిమితులకు లోబడి మనం గ్రహిస్తూఉంటాం, కాని అలాంటి సత్యం ఉన్నదనే విషయంలో ఎట్టి సందేహం లేదు. దానిని మనం రోజురోజుకూ మరింతగా గ్రహిస్తున్నామనే విషయంలోనూ యెట్టి సందేహం లేదు."

(Lenin: Materialism & Empirio criticism pp 134-135)

మన జ్ఞానం సాపేక్షమని అంటే, సందేహాస్పదమనికాదు. కొన్ని పరిమితులకు లోబడి మనం సంపాదించే జ్ఞానం రూఢిజ్ఞానమే. సాపేక్షజ్ఞానాన్ని సంశయజ్ఞానంగా భ్రమించటంవల్లనే, జైనులు అనిశ్చితత్వంలోకి ప్రవేశించారు.

పంచేంద్రియ గ్రహణం భౌతిక జ్ఞానానికంతా మూలం. మనం కంటితో ఎర్రకుండను చూస్తున్నాం. ఆ చూపు మనజ్ఞానానికి పునాది. స్వతస్సిద్ధ సత్యాన్ని సాపేక్షత నిరాకరించదు. దానికి పరిమితులను మాత్రమే ఏర్పరుస్తుంది.

ప్రాకృత భాషల అభివృద్ధికి, జైనపండితులు అపారమైన సేవ చేశారు. ప్రధానంగా రాజస్థాన్, గుజరాత్, మహారాష్ట్రలకు జైనులు వ్యాపించారు. అమర కోశం వంటి సంస్కృత గ్రంథాలను వీరు రచించారు.

రామాయణ, భారతాది ఇతిహాసాలు జైనుల గాథలలో అనేక రూపాలలో అనేక మార్పులతో వ్యాప్తి చెందాయి.

ఎనిమిదో అధ్యాయం

# సాంఖ్యం — యోగం

సాంఖ్య, యోగ, వైశేషిక, న్యాయ, సూత్రాలకు భారతీయ తత్వశాస్త్ర చరిత్రలో ప్రత్యేక స్థాన మున్నది. బౌద్ధ, జైన సిద్ధాంతాల వలె ఇవి వైదిక ప్రామాణ్యాన్ని నిరాకరించిన 'నాస్తిక' ధోరణులు కావు. తమ సూత్రాల కన్నిటికీ మూలాధారాలు ఉపనిషత్తులలోనే ఉన్నవని నిరూపించడానికి వీరు యత్నించారు. వైదిక ప్రామాణ్యాన్ని తిరస్కరించిన బౌద్ధ. జైన సిద్ధాంతాల విమర్శ, వీని సామాన్య లక్షణం.

ఈ సూత్రాలు రమారమి క్రీ. పూ. 200 —క్రీ.శ. 200 మధ్య కాలంలో గ్రంథస్థం చేయబడ్డాయి.

బౌద్ధ శూన్యవాదానికి ప్రాతిపదికలు కూడా అనాడే ప్రారంభ మైనాయి. కనిష్కుని కాలంలో జీవించిన అశ్వఘోషుడు మాధ్యమిక వాదానికి మూలపురుషుడు.

కుల వ్యవస్థను ఖండించిన బౌద్ధ, జైన సిద్ధాంతాలలోని సాంఘిక విప్లవధోరణులు వెనుకకు తగ్గి, భావవాద అవాస్తవిక తాత్విక సూత్రాలు మిగలడంతో, వాటిబలహీనత స్పష్టంకాసాగింది. ఈ తాత్వికబలహీనతను. అవకాశంగా చేసుకుని సాంఖ్య, వైశేషిక, న్యాయసూత్రాలుబౌద్ధ, జైన

సిద్ధాంతాలను, ముఖ్యంగా బౌద్ధుల శూన్యవాద, క్షణిక వాదాలను తీవ్ర విమర్శకు గురిచేశాయి. వైదిక ప్రామాణ్యాన్ని అంగీకరిస్తూనే పై మూడు సిద్ధాంతాలూ, ప్రపంచం వాస్తవమనీ, అది ఎవరిచేతా సృష్టింప బడలేదనీ వాదించాయి. సాంఖ్యవాదం దేవుని పూర్తిగా నిరాకరించింది. వైశేషిక, న్యాయ సూత్రాలు దేవుని అంగీకరించినా, వారి దృష్టిలో దేవుడు ప్రకృతికి మూలవస్తువులైన పరమాణువులు రెండూ స్వయం సిద్ధములే. ఈ ద్వైత ధోరణి పై మూడిటికి సామాన్య లక్షణం.

వాస్తవమైన ఈ ప్రపంచమంతా కొన్ని శాశ్వత సూత్రాల కను గుణంగా నడుస్తుంది. ఆ సూత్రాలను గ్రహించటమే మన పని. వాటిని ఎవరు నిర్మించారు ? ఎందుకు నిర్మించారు ? అన్న ప్రశ్నలు అర్థ రహితం. ప్రకృతి వలెనే ఈ సూత్రాలు కూడా స్వయం సిద్ధములు. ఈ సూత్రాలనే వైశేషికులు కర్మసూత్రాలనీ, అదృష్టశక్తులనీ వ్యవహ రించారు।

సమ్యక్ జ్ఞానాన్ని-అనగా సరియైన జ్ఞానాన్ని-కలిగిస్తుంది కనుక. దానిని సాంఖ్యవాదం అన్నారు. ప్రపంచమంతా దుఃఖమయం. యీ దుఃఖంలో నుంచి బైటపడాలంటే బౌద్ధులవలె అష్టాంగ మార్గం,ప్రజాసేవ వ్యర్థం. ప్రపంచానికి సంబంధించిన వాస్తవ జ్ఞానాన్ని సంపాదించాలి. సాంఖ్యవాదం జ్ఞాన ప్రధాన మైన సిద్ధాంతం. ప్రపంచానికంతా మూలం రెండు శక్తులు: ఒకటి ప్రకృతి. రెండు పురుషుడు. ప్రపంచంలో ప్రతిదీ సుఖమో. దుఃఖమో ఏదో ఒక దానిని కలిగిస్తుంది. ప్రతిదీ పరిణామం చెందుతూ ఉంటుంది. పరిణామ శీలమైన, కార్యకారణబద్ధమైన ఈ ప్రపం చానికి మూలం మార్పులేని ప్రకృతి పురుషులు. ఇవి రెండూ స్వయం సిద్ధములు,

సృష్టికి మూలకారణం ప్రకృతి అని నిరూపించటానికి సాంఖ్యులు ఇలా వాదిస్తారు: ఆత్మ లేక పురుషుడు సృష్టికి కారణం కాదు. ఏమంటే అది స్వయం ప్రకాశమైన, కార్య కారణ రహితమైన చైతన్యం. బౌద్ధులు. నైయ్యాయికులు(వైశేషికులను, న్యాయసిద్ధాంతకారులను కలిపి నైయ్యాయికులు అంటారు) చెప్పినట్లు సృష్టికి మూలం పంచభూతాలు, అణువులుకాగూడదా? కాదు. ఎందువల్లనంటే అణువులు పదార్థ పరిణా

మాన్ని వివరించగలవు. కాని, సూక్ష్మమైన మనస్సు, బుద్ధి వీటి పరిణామాన్ని వివరించలేవు. అణువులకంటే సున్నితమైన, సూక్ష్మమైన ప్రకృతి సృష్టికి మూలం. దీనికి మరొక కారణంలేదు. ఇది నిత్యం అనంతం.

ప్రకృతి పరిణామం చెందటానికి కారణంఏమి? మానవశరీరంలో బుద్ధి, మనస్సు ఈ రెండూ. కాక మరొకటి ఉంది. అదే ఆత్మ, లేక పురుషుడు. ఈ పురుషుడు ఉండబట్టే ఇంద్రియాలు పనిచేస్తున్నవి. నడిపే వాడు లేకపోతే యంత్రం నడవదు. పురుషుడు అనగా చైతన్య శక్తి లేనిదే ప్రపంచం నడవదు.

పురుషుడు ప్రకృతిని సృష్టించాడా; లేదు, ప్రకృతి పురుషులలో ఒకరు ముందు, ఒకరు వెనుక అనటం తప్పు రెండూ స్వయం సిద్ధములే.

## ప్రకృతి - పురుషుడు

ప్రకృతి దానంతట అది మార్పుచెందజాలదు. దానికి చైతన్యం లేదు. పురుషునికి చైతన్యంవుంది. కదలిక లేదు. ప్రకృతిలోని కదలిక, పురుషునిలోని చైతన్యం రెండూ కలిసి పరిణామానికి కారణభూత మౌతాయి. ఈ రెండూ ఎందుకు కలవాలి' గుడ్డివాని భుజాలపై కుంటి వాడు ఎక్కి ఇద్దరూ ప్రయాణం చేసినట్లు, ప్రకృతి పురుషుల కలయిక ఫలితంగా, ఇద్దరూ కైవల్యంలేక మోక్షం సంపాదిస్తారు. మోక్ష సాధనకై ఈ రెండూ కలుస్తున్నవి. పరిణామమంతా ఉద్దేశ పూర్వక పరిణామం.

ప్రకృతి పురుషుల కలయిక సంయోగం. ఈ సంయోగానికి ముందు ప్రకృతి సామ్యావస్థలో ఉంటుంది. సత్వ, రజ స్తమస్సులను మూడు గుణాలు ప్రకృతిలో సహజంగా ఉన్నవి. ఈ మూడు సమాన ప్రతిపత్తిలో ఉన్నప్పుడు సామ్యావస్థ ఏర్పడుతుంది. ఈ సామ్యావస్థ దానంతటది బద్దలు కాదు. పురుషుడు దీనిని బద్దలు చేస్తారు. పరిణామం ప్రారంభమౌతుంది. సత్వ రజ స్తమో గుణాల మధ్య ఐక్యత ఘర్షణ రెండూ ఉన్నవి. కదలిక దానంతట అది రాదు. చైత

నుండి పురుషుడు సామ్యావస్థను భ్రద్ధలు చేయాలి. తత్ఫలితంగా సత్వ రజ స్తమో గుణాలలో ఏదో ఒక దానికి బలం పెరుగుతుంది. కొత్తతరహా సామ్యావస్థ ఏర్పడుతుంది. పురుషుడు దానిని తిరిగి భ్రద్ధలు చేస్తాడు. మరొక తరహా సామ్యావస్థ ఏర్పడుతుంది. ఈ విధంగా సామ్యావస్థ, వికల్పం, తిరిగి సామ్యావస్థ పద్ధతిలో పరిణామం ప్రళయ కాలం వరకూ సాగుతుంటుంది.

ఒక చేలో నీళ్ళు ఉంటాయి. పక్క చేలోకి ఆ నీళ్ళు పోవడానికి గట్లు అడ్డంగా ఉన్నవి. ఆ గట్లను రైతు తీసివేస్తేనేగదా ఆ చేలో నుంచి నీరు ఈ చేలోకి వచ్చేది? అదే విధంగా పురుషుడు అనే బాహ్య కారణం కదిపితేనే, ప్రకృతి కదులుతుంది; లేకపోతే కదలదు.

ఆత్మలు అనేకము లున్నవని సాంఖ్యుల వాదన. పరమాత్మ ఒకటే సత్యం అన్న అద్వైతవాదాన్ని సాంఖ్యులు అంగీకరించరు. పరిణామక్రమాన్ని గురించి వారు ఇలా వివరించారు:

ప్రకృతి కదలటం ప్రారంభించినమీదట మొట్టమొదట ఏర్పడేది మహత్ లేక బుద్ధి. ఈ బుద్ధి(మనస్సు)ఇంద్రియాలద్వారా పనిచేస్తుంది. బుద్ధిసహాయంతోనే ఆత్మ ధర్మాధర్మ విచారణ చేయగలదు. ఆ తర్వాత అహం కారం ఏర్పడుతుంది. నేను ఇది చేయాలి.ఇది చేయకూడదు అని నిర్ణయించు కునే శక్తి అహంకారం. ఈ అహంకారం మూడు విధాలు: సాత్విక, రాజస, తామస, సాత్త్విక అహంకారంనుండి అయిదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, మనస్సు మొత్తం 11 ఏర్పడతాయి. తామస అహంకారం నుండి పంచతన్మాత్రలు అనగా శబ్దం, స్పర్శ, రంగు, రుచి, వాసన అనుభవాలు ఏర్పడతాయి. ఈ పంచతన్మాత్రలలో నుండి పంచభూతాలు (ఆకాశం,గాలి,కాంతి,నేల, భూమి) ఏర్పడతాయి. ఈ పంచభూతాలు అణురూపంలో ఉంటాయి. ఇవి మొత్తం 24.

జ్ఞానేంద్రియా అనగా రంగు, శబ్దం, వాసన, రుచి, స్పర్శను గ్రహించే ఇంద్రియశక్తులు.

కర్మేంద్రియాలు-నోరు, చేతులు, కాళ్లు, మలవిసర్జనావయవము, జననేంద్రియము.

పురుషులందరూ, అనగా ఆత్మలు అన్నీ కైవల్యప్రాప్తి చెందిన మీదట, పరిణామం చెందే ఈ ప్రపంచం నశిస్తుంది. అదే ప్రళయం. అప్పుడు పరిణామం ఆగిపోతుంది. యెక్కడ ప్రారంభించామో అక్కడికి వస్తాం. దీనినే సాంఖ్యులు ప్రతిసంచారము అన్నారు.

ప్రళయం తర్వాత తిరిగి సృష్టి జరిగేలోగా కొంత వ్యవధి ఉంటుంది. ఈ వ్యవధిలో సామ్యావస్థ ఏర్పడుతుంది. ఈ సామ్యావస్థలో కూడ సత్వ రజస్తమో గుణముల మధ్య ఘర్షణ ఉంటుంది. సామ్యావసలో జరిగేఘర్షణను సాంఖ్యులు సదృశపరిణామం అన్నారు. కొంత కాలానికి తిరిగి ప్రకృతి పురుష సంయోగం జరుగుతుంది, ప్రపంచం కదులుతుంది. ఇది విసదృశ పరిణామం.

# సత్కార్య వాదం

సాంఖ్యవాదుల జడాత్మక దృష్టి మరొక సిద్ధాంతంలోకూడా వ్యక్తమైంది. దానిని వారు సత్కార్యవాదం అన్నారు. బౌద్ధుల గతి తార్కిక దృష్టికి చిహ్నమైన కార్యకరణ వాదాన్ని ఖండించి వారు సత్కార్య వాదాన్ని ప్రతిపాదించారు.

నూవు గింజలను పిండితే నూనె వస్తున్నది. నూనె ఎక్కడి నుండి వస్తున్నది. గింజలోనే సూక్ష్మరూపంలో ఉండి ఇప్పుడు వ్యక్తమైంది. ఇంతకుపూర్వం లేనిది కొత్తగా రాలేదు. కార్యము కారణం లోనే ఉంది. అంతకుపూర్వమే సూక్ష్మరూపంలో ఉన్న దానిని కార్య కరణ వ్యక్తం చేయగలదేకాని, కొత్తదానిని సృష్టించలేదు.

నిర్దిష్టకారణాలనుండి మాత్రమే నిర్దిష్ట కార్యాలు ఏర్పడగలవు. పాలలోనుంచి మాత్రమే పెరుగు రాగలదు. దారాలనుండి మాత్రమే బట్ట ఏర్పడుతుంది. కనుక పెరుగు పాలకు, దారాలకు బట్టకు-ఏదో విడదీయ లేని సంబంధం ఉంది. అనగా ఏదోరూపంలో కార్యం, కారణంలోనే నిగూఢంగా ఉన్నదన్నమాట. కాకపోతే ఏ కారణంలో నుంచైనా ఏకార్యమైనా ఏర్పడాలికదా? అలా ఏర్పడదని మనకు తెలుసు.

"కథం అసతః సజ్జాయేతః" అసత్తులోనుండి సత్తు ఎలా పుట్టగలదు? "నాసతో విద్యతేభావః" అసత్తుకు ఉనికి లేదు మొదలైన వాక్యాలకు సాంఖ్యులు ఇచ్చిన వ్యాఖ్యానం ఇలావుంది. ఇంతకు పూర్వం లేనిది ఎలా పుట్టగలదు? శూన్యం నుండి సత్తు పుట్టలేదు గదా? కనుక సత్తు ఎల్లకాలం ఉన్నది. దానికి మొదలు తుది లేదు,

కొత్తది పుట్టదు అనే సూత్రం, గుణాత్మక మార్పులను నిరాకరించుట ద్వారా అభివృద్ధి విరోధక ప్రయోజనాలకు ఉపయోగపడ్డది. మానవుడు కొత్తగా ఏమీ సృష్టించలేడు. విధి వ్రాత తప్పదు మొదలైన కర్మసిద్ధాంతాల కది మూలమైంది.

సాంఖ్యవాదం దేవుని నిరాకరిస్తుంది. కనుకనే దీన్ని నిరీశ్వర సాంఖ్యం అంటారు. ప్రకృతిని నడిపించే అధినాధుడు దేవుడు అని అందామా? అది సరిగాదు. ఎందుకంటె దేవుడు ఏ పనీచేయడు. నడిపించటం మాత్రం చేయవలసిన అవసరం దేవుని కేముంది? ఏదో అవసరం ఉండి దేవుడు సృష్టిని సాగిస్తున్నాడంటారా. దేవుడు కూడా మానవుల లాగా ఒక అసంతృప్తిజీవి అన్నమాట. దేవునికి మీరిచ్చే నిర్వచనాన్నిబట్టి అతనికి సంతృప్తి, అసంతృప్తులు - ఉండకూడదుకదా? సృష్టికి దేవుడు కారణం కాడు. దేనృడనేవాడు లేడు. కష్టం, దుఃఖంతో కూడుకున్న ఈ ప్రపంచాన్ని, కరుణాసముద్రుడని మీరు వర్ణించే దేవుడు సృష్టించాడని ఊహించడమే అసంభవం.

## జ్ఞాన సిద్ధాంతం

మానవులు బాహ్య ప్రపంచానికి సంబంధించిన జ్ఞానాన్ని ఎలా సంపాదిస్తారు అన్న సమస్య తత్వవేత్త లందరినీ ఎదుర్కొన్నసమస్య. ఈ సమస్యకు సమాధానంగా భౌతిక ప్రపంచం మానవ జ్ఞానానికి మూలమని, పంచేంద్రియాల ద్వారా మనం జ్ఞానాన్ని సంపాదిస్తా

మని భౌతికవాదం చెబుతుంది. ఇందుకు విరుద్ధంగా భౌతిక ప్రపంచం మాయ అనీ, పంచేంద్రియాల ద్వారా కాక, మానవ మేధస్సులో వున్న కొన్ని శాశ్వతభావాల సహాయంతో జ్ఞానాన్ని సంపాదిస్తామనీ, భావవాదం తెలియజేస్తుంది. జ్ఞాన సిద్ధాంతాలలో సాంఖ్య, వైశేషిక, న్యాయసూత్రాలు భౌతికవాద ధోరణిని ప్రదర్శించాయి. మహాయాన శాఖకు చెందిన శూన్య వాద, విజ్ఞానవాదుల భావవాద జ్ఞాన సిద్ధాంతాన్ని త్రోసివుచ్చాయి.

సాంఖ్యాల జ్ఞాన సిద్ధాంతం ఇలా వుంటుంది.

—ప్రత్యక్ష అనుమాన, శబ్ద ప్రమాణాలు మూటిద్వారా జ్ఞానం సంపాదిస్తాం.

మనం తెలుసుకోవలసిన వస్తువు ప్రమేయం (Object)

తెలుసుకునే వ్యక్తి ప్రమాత (Subject)

తెలుసుకునే పద్ధతి ప్రమాణం (Source of Knowledge)

మనం ఒక బల్లను చూస్తాం. ఆ బల్ల మన మనస్సుమీద కొన్ని భావాలను కలిగిస్తుంది. ఈ భావాలను మనస్సు వర్గీకరణ చేస్తుంది. దీపపు కాంతికి, అద్దంలో ప్రతిబింబం ఏర్పడ్డట్లే భౌతిక వస్తువుల ప్రతి బింబాలు మనోఫలకం మీద ఏర్పడతాయి. ఇది ప్రత్యక్ష ప్రమాణం. జ్ఞాన సంపాదనకు ప్రధానమార్గం.

ప్రత్యక్షజ్ఞానం రెండురకాలు; మనం ఒక వస్తువును చూడగానే ఒక అస్పష్టభావం మన మనస్సులో ఏర్పడుతుంది. ఇది నిర్వికల్పిక జ్ఞానం. ఆ తర్వాత, మనకు గల పరిశీలనా శక్తి, జ్ఞాపకశక్తి, పూర్వాను భవం మొదలైనవాటిని వినియోగించి ఆ వస్తువును గురించి సంపూర్ణ జ్ఞానం మనం సంపాదిసాం. ఇది వివేచనద్వారా సాధ్యమౌతుంది. మన పూర్వ జ్ఞానస్థాయి కనుగుణంగా మన వివేచనాశక్తి వుంటుంది. వివే చనా పూర్వక జ్ఞానాన్ని సాంఖ్యాలు సవికల్పిక జ్ఞానం అన్నారు.

ప్రత్యక్షప్రమాణం తర్వాత, అనుమాన శబ్దప్రమాణాలువస్తాయి. శబ్ద ప్రమాణసందర్భంలో వైదికసూక్తులప్రమాణాన్నిసాంఖ్యాలుఅంగీక రించారు. అయినప్పటికీ, శబ్దప్రమాణానికి వీరు తృతీయస్థానంఇచ్చినందు వలన, ప్రత్యక్ష అనుమాన ప్రమాణాల విషయంలో భౌతికవాద దృష్టిని ప్రదర్శించి నందువలన, వీరిజ్ఞానసిద్ధాంతంలో భౌతికవాదఛాయలుహెచ్చు.

సాంఖ్యులు ఆత్మను అంగీకరించారు. ఎందరు ప్రాణులున్నారో అన్ని ఆత్మలుంటాయి. ఆత్మ ఎల్లప్పుడూ చైతన్యయుత శక్తిగానే వుంటుంది. చైతన్యం ఆత్మకు ఒక లక్షణంకాదు. ఆత్మ. చైతన్యం రెండూ ఒకటే. ఆత్మకు మార్పులేదు, చలనంలేదు. ఆత్మ శరీరం కాదు. మనస్సుకాదు. బుద్ధికాదు. ప్రకృతి పరిణామం చెందే 24 దశలలోను ఏ ఒక్కటీ కాదు. వీటన్నిటికీ అతీతమైనది ఆత్మ. శరీరసంబంధం ఆత్మలకు ఏర్పడ్డప్పుడే చలనం కలుగుతుంది. కష్టసుఖాలు ఏర్పడతాయి. శరీర బంధనం వదలిపోతే తిరిగి కేవల చైతన్యంగా మారిపోతుంది; ఆ స్థితిని పొందటమే మోక్షాన్ని లేక అపవర్గాన్ని పొందుట. మానవులకు వచ్చే కష్టాలు మూడు రకాలు.

1. ఆధ్యాత్మిక - మానసిక, శారీరక క్లేశాలు

2. ఆధిభౌతిక - ఇతర మనుష్యులవల్ల, జంతువులవల్ల ఏర్పడే కష్టాలు.

3. ఆధి దైవిక దయ్యాలు భూతలవల్ల ఏర్పడే కష్టాలు

ఈ మూటినుండి విముక్తి పొందటం మోక్షం. సరియైన తత్వజ్ఞానం మోక్షానికి మార్గం. ఆత్మ. శరీరం వేరు వేరని గ్రహించటం తత్వజ్ఞానం. మోక్షం వచ్చేవరకుఆత్మ,పునర్జన్మ ఎత్తుతూనే వుంటుంది.

సాంఖ్య వాదానికి కీలకం త్రిగుణ సిద్ధాంతం. సత్వ, రజస్తమో గుణాలు ప్రకృతిలో అంతర్భాగాలు. గుణాలనగా మానసిక స్థితి అనుకుంటాము. సాంఖ్యుల దృష్టిలో మానసిక, భౌతిక పరిణామాలు రెంటిలోనూ గుణాలుంటాయి.

సత్వగుణం మానసికార్ధంలో సుఖ, సంతోషములకు భౌతికార్థంలో లఘుత్వ, ప్రకాశత్వాలకు చిహ్నం. రజోగుణం బాధకు, కదలికకు చిహ్నం. తమోగుణం, జడత్వానికి విశ్ఛలత్వానికి చిహ్నం.

మానసిక, భౌతిక శక్తులను కలగలుపు చేయటం సాంఖ్య సిద్ధాంతంలోని గందర గోళానికి పరాకాష్ఠ.

ప్రకృతి పరిణామక్రమంలో ఒకదశలో చైతన్యం ఏర్పడుతుందనే భౌతికవాద దృష్టిని ఏనాడు భారతీయ తత్వశాస్త్రం విసర్జించిందో

అనాదే ఈ పతనం మొదలైంది. లోకాయతులు మాత్రమే ఆ విషయం సూటిగా చెప్పగలిగారు.

సాంఖ్యులు ప్రకృతి వాస్తవికతను గుర్తించారు దీనిని వారు ప్రకృతి, లేక ప్రధానమని అన్నారు

త్రిగుణాలు నిరంతరం పరిణామం చెందుతూంటాయని, ఐక్యత ఘర్షణ ఈ పరిణామానికీ కారణమనటంలో సాంఖ్యుల గతి తార్కిక దృష్టి శకలాన్ని ప్రదర్శించారు.

ఈ ఐక్యత ఘర్షణ అంతరంగిక చోదక శక్తి వలన గాక, బాహ్యశక్తి ప్రేరణవలన సాగుతోందనడంలో జడాత్మక – దృష్టికి మళ్ళారు. పరిణామంలో కొత్తదేమీ జన్మించదు. నిగూఢమైన అంతస్సారం, ఆవిష్కరణమాత్రమే పొందుతుంది అనటంలో గతి తర్కాన్ని ప్రాణమైన నూతనత్వాన్ని తిరస్కరించారు. ప్రకృతి ఎందుకు పరిణామం చెందవలెను. ఇదంతా పురుషుని ఆనందం తృప్తికొరకే అని చెప్పటలో, ఉద్దేశ పూర్వక పరిణామ (TeleoLogy) వాదాన్ని చెప్పారు.

సాంఖ్యవాద చిహ్నాలు ఉపనిషత్తులలోనే ఉన్నాయి. కఠోపనిషత్తులో నాచికేతుని కథ ఉన్నది. ఆత్మ అనశ్వరం; పురుషుడు ఆత్మ, ఒకటే అనుభావం, ఈ ఉపనిషత్తులో పదేపదే పునశ్చరణఔతుంది. చాలాకాలం తర్వాత రూపొందిన భగవద్గీతలో ఆత్మ శాశ్వతత్వాన్ని నిరూపించే శ్లోకాలు, కఠోపనిషత్తు నుండి మక్కికి మక్కీ తీసుకోబడినవా అనిపిస్తుంది. బుద్ధుని మొదటి గురువు అలరకాముడు సాంఖ్యవాది.

బౌద్ధ ప్రభంజనంతో సాంఖ్యం తాత్కాలికంగా అడుగున పడ్డది. బౌద్ధుల అనాత్మ వాదం, ప్రతీత్య సముత్పాద వాదం నాలుగు దశాబ్దాలు రాజ్యం చేశాయి.

సాంఖ్యులు యజ్ఞ యాగాదులకు ప్రాధాన్యం ఇవ్వలేదు. కాని త్రోసిపుచ్చలేదు నాచికేతుని కథ అందుకు చిహ్నం. యజ్ఞ పశువుగా, యమలోకానికి వెళ్ళి తిరిగివచ్చినవాడు నాచికేతుడు.

బౌద్ధం పైచేయి సంపాదించింది అంటే, బౌద్ధ తత్వ శాస్త్ర ఆధిక్యత నిరూపణ ఐంది అనికాదు. బౌద్ధంలోని సాంఘిక పార్శ్వం, యజ్ఞయాగాదుల నిరసన, కులభేద ఖండన, అనాత్మవాదం లోని, గతిశీల దృష్టి – ప్రజలను ఆకట్టుకున్నది. ఈమహా ప్రవాహంలో భౌతిక ప్రపంచ వాస్తవికతను బౌద్ధులు గుర్తిస్తున్నారా లేదా అను తాత్విక సమస్య అడుగున పడ్డది. నాలుగు శతాబ్దాలు గడిచి బౌద్ధ ప్రభంజనం వెనుకపట్టు పట్టినమీదట, తిరిగి సాంఖ్యం, ఈశ్వర కృష్ణుని కారికల రూపంలో పునర్దర్శన మిచ్చింది. బాహ్య ప్రపంచ వాస్తవికత నిరాకరించే మహాయాన బౌద్ధానికి పోటీగా, సాంఖ్యం రంగంలో ప్రవేశించింది.

ఈశ్వర కృష్ణుని కాలం క్రీ.పూ.100-200 మధ్య.

# యోగం

సాంఖ్య సూత్రాలకు వలెనే యోగసూత్రాలకు కూడా అతిప్రాచీన మైన బీజాలున్నవి. భావవాద సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన ఉపనిషత్కా రులలో ఎక్కువమంది ఆశ్రమాలలో తపస్సు, నియమ నిష్ఠలతో యోగా భ్యాసం చేసినవారే. యోగాచరణను తాత్వికచర్చలకు పునాదిగా, సహాయకారిగా వారు స్వీకరించారు.

క్రీ. పూ. 2 వ శతాబ్దంలో జీవించిన పతంజలి యోగసూత్రాలను గురించి ప్రత్యేక కృషిచేశాడు. యోగమార్గం ద్వారా మోక్షాన్ని సాధించ వచ్చునని ప్రతిపాదించాడు. పాణిని వ్యాకరణ గ్రంథానికి మహాభాష్య మనే వ్యాఖ్యానం వ్రాసిన పతంజలీ, యోగసూత్రాలను వ్రాసినపతంజలీ ఒకరేనని చరిత్రకారుల భావం.

యోగశాస్త్రాన్ని తాత్విక సిద్ధాంతంగా రూపొందించ వలెనని పతంజలి కృషిచేశాడు. కాని విజయం పొందలేదు. సాంఖ్యులు జ్ఞాన మార్గంద్వారా కైవల్యం సాధించవలెనన్నారు. పతంజలి దానిని త్రోసి వేసి, యోగనిష్ఠలద్వారానే అది సాధ్యమని వివరించాడు. పురుష, ప్రకృతి సంయోగంవలన పరిణామం జరుగుతుందని, ఇలా జరగటం సహజ లక్షణమని సాంఖ్యులవాదన. పతంజలి పురుషుని స్థానంలో ఈశ్వరుణ్ణి ప్రవేశపెట్టాడు. అంతా ఈశ్వరుని సంకల్పంవల్ల, జరుగుతున్నపరిణామ మని యోగశాస్త్రం తెలియజేస్తుంది. ఇంతకుమించి సాంఖ్య, యోగశా

స్త్రాలకు తాత్విక సమస్యలలో ప్రధానమయిన భేదాలులేవు. అందువలననే పతంజలి యోగశాస్త్రాన్ని సేశ్వర సాంఖ్యమనీ, కపిలుని సిద్ధాంతాన్ని నిరీశ్వరసాంఖ్యమనీ వ్యవహరిస్తారు.

భూతశక్తులు ఏవో కలవనీ, నిగూఢమైన ఈ దైహిక, మానసిక శక్తులను నియమనిష్ఠల ద్వారా ప్రకోపింప చేయవచ్చుననే మూఢనమ్మక యోగశాస్త్రంలో ప్రబలంగా ఉన్నది. ఇందులోని ముఖ్య సూత్రాలుఇవి:

శరీరాన్ని, ఆత్మనూ కఠినమైన క్రమశిక్షణకు లోనుచేయాలి. ఆత్మకు అయిదు క్లేశాలు సహజంగా వున్నవి. అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశాలు అనేవి ఈ అయిదు. మనస్సు, ప్రమాణ. విపర్యయ, వికల్ప, నిద్ర, స్మృతి—అని అయిదు అవస్థలను పొందుతూ వుంటుంది. బాహ్యప్రపంచంపట్ల గల రాగ, ద్వేష, అభిమానాదులు పై చిత్తవృత్తులకు మూలం.

చిత్తవృత్తిని నిరోధించడానికి ఎనిమిది ఉపాంగాలుకలిగిన యోగ పద్ధతిని ఆశ్రయించాలి. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన సమాధి అనునవి ఎనిమిది ఉపాంగాలు. కఠినమైన ఈ పద్ధతిద్వారా మానవుడు అలౌకికమైన శక్తులను సంపాదిస్తాడు. జ్ఞాననేత్రం వికసిస్తుంది. గాలిలో ఎగరడం, భూమిలో పాతిపెట్టబడినా జీవించడం మొదలైన శక్తులను మానవుడు సంపాదించగలడు.

సాంఖ్యశాస్త్రం ప్రాతిపదికలను అంగీకరించుటచే యోగశాస్త్రానికి కొంత భౌతికవాద ఛాయలున్నప్పటికీ. మిగతాసూత్రాలన్నీ భావవాదంతో కూడుకున్నవి. ఇది ప్రధానంగా భావవాద ధోరణి అలౌకిక శక్తులను సంపాదించవచ్చుననే నమ్మకంతో నైనప్పటికీ, యోగ శాస్త్రజ్ఞులు శరీర రసాయన శాఖలపై ప్రత్యేక కృషి చేశారు. హఠయోగం, రసవాదం, తాంత్రిక వాదం మొదలైన ధోరణులకు ఇది తోవ తీసింది. నీచ లోహాలను పుటంపెట్టి బంగారం చేయవచ్చుననే నమ్మకం రసవాదానికి మూలం. యూరపులో సైతం మధ్యయుగాలలో రస వాదం వృద్ధిఅయింది. రసవాదులలో ఒకరైన అఘోరశాఖవారు, శ్మశానాలలోని శవాలను తవ్వి. శరీర నిర్మాణాన్ని అధ్యయనం చేసేవారు.

సాంఖ్య, యోగములు రెండూ పురుషకార ప్రధానములు. ప్రకృతి యావత్తూ పురుషుని, వ్యక్తి లేక మానవుని యొక్క ప్రయోజనం. తృప్తి. ఆనందం కొరకు పరిణామం చెందుతుంది. ఈ ధోరణి, ప్రకృతి శాస్త్రాల వృద్ధికి ప్రోత్సాహమిచ్చింది.

సాంఖ్యం భౌతిక, వైద్య శాస్త్రాలకు యోగం, శరీర నిర్మాణ శాస్త్రాలకు ఊపునిచ్చింది.

శాస్త్రీయ దృష్టితో పాటు మార్మికత ముడివేసకోవటం ప్రాచీన భారతీయ తాంత్రిక ధోరణుల ప్రత్యేకత. యోగశాస్త్ర పరిణామంలో మార్మికత శాతంపోనుపోను హెచ్చింది. వాటివిజ్ఞాన శాస్త్రాల ప్రాథమికత కిది తార్కాణం.

,

# తొమ్మిదో అధ్యాయం

# వైశేషిక సూత్రాలు, న్యాయం

వైశేషిక సూత్రాలను రచించినది కణాదుడు. ఇతడు బుద్ధుడికి పూర్వమే జీవించాడనీ, ఈయన రచించిన వైశేషికసూత్రాలలో బౌద్ధమత ప్రస్తావన లేకపోవుట యిందుకు కారణమనీ పలువురి అభిప్రాయం. ఏమైనప్పటికీ, ఈ సూత్రాలను గుదిగుచ్చి ఒక తత్వశాస్త్రంగా రూపొందించినది క్రీ॥పూ॥ 200లో జీవించిన ప్రశస్తపాదుడు.

భారతీయ తత్వశాస్త్రంలో అణువాదాన్ని ప్రతిపాదించి, దానిని కూలంకషంగా పరిశీలించిన సిద్ధాంతం వైశేషికం. గ్రీసులో క్రీ. పూ. 300 ప్రాంతంలో జీవించిన డెమోక్రిటస్ అణుసిద్ధాంతానికీ, కణాదుని సిద్ధాంతానికీ పోలికలు, వ్యత్యాసాలు కూడా వున్నవి. క్రీ. పూ. 300 నాటికి గ్రీసు, భారతదేశాల మధ్య సంబంధ బాంధవ్యాలు ఏర్పడ్డవని చరిత్ర తెలియజేస్తున్నది. కనుక సిద్ధాంతాలు, శాస్త్రాలు భావాలు, ఒకరివి మరొకరుతెలుసు కోవటం జరిగి ఉండవచ్చు. అంతమాత్రాన వైశేషిక సిద్ధాంతానికి డెమోక్రిటస్ సిద్ధాంతంమూలమనిగాని, వైశేషికసిద్ధాంతమే డెమోక్రిటస్ స్వీకరించాడనిగాని వాదించటం పొరపాటు. ఆయాదేశాల తాత్వికపురోగమనంలో సహజంగానే ఆ సిద్ధాంతా లుత్పన్నమైనవి.

ప్రపంచంలోని వస్తువులు రెండు రకాలు. శాశ్వతమైనవి. అశాశ్వతమైనవి. భూమి, నీరు, తేజస్సు, గాలి — యీ నాలుగు మూలభూతాలు. ఇవి అణురూపంలో నిత్యములు, శాశ్వతములు.

బల్లలు, కుర్చీలు, కూజాలు, మొదలైనవన్నీ అనేక విభాగాలతో కూడుకుని ఉన్న వస్తువులు. ఇవి మూలపదార్థాలు కావు. అవి బాహ్యమైన రూపాలు మాత్రమే మూలపదార్థాలు. అణువులు అలాంటి అవిభాజ్య వస్తువులు. అణువుల్లో విభాగాలు లేవు. సృష్టి అంటే విభాగాలను కలపటం. అణువులు ఎవరిచేతా సృష్టించబడలేదు. వినాశనం అంటే విభాగాలను విడదీయటం. అణువులు విభాగాలు కావు గనుక, విడదీయటం అనే సమస్యలేదు. అణువులకు పుట్టుక లేదు, మరణం లేదు, అవి నిత్యములు.

అణువాదంపట్ల వైశేషికుల పట్టుదలను తెలియజేసే ఒక కథను చూద్దాం. ఒక వైశేషిక తత్వవేత్త మరణావస్థలో ఉండగా ఒక అద్వైత వేదాంతి వెళ్ళి యిలా అన్నాడట: "ఓయీ, నీ ఆఖరు ఘడియలు సమీపించాయి. కనీసం యిప్పుడైనా ప్రపంచానికి మూలకారణమైన ఆ పరబ్రహ్మను స్మరించుకొనుము."

అందుకు వైశేషికుడు యిలా అన్నాడట :

"ప్రపంచానికంతా మూలకారణం అణువులు కనుక, వాటినే స్మరిస్తాను." ఆ వైశేషికుడు "పీలుః పీలుః" (పరమాణువు పరమాణువు) అని స్మరిస్తూ మరణించాడట.

నాలుగు మూలభూతాల అణువులు విశేష లక్షణాలు కలిగిన ప్రత్యేక అణువులు. ఇవి గుణాత్మకంగా విభజించబడి ఉన్నవి కనుకనే యీ సిద్ధాంతాన్ని వైశేషిక సిద్ధాంతం అన్నారు. డెమోక్రిటస్ సిద్ధాంతంలో అణువులన్నీ పరిమాణ వ్యత్యాసాలు మాత్రం కలిగిన ఏక గుణాత్మకమైనవి. డెమోక్రిటస్ సిద్ధాంతానికీ, వైశేషిక సిద్ధాంతానికీ ప్రధానమైన వ్యత్యాసం ఇదే.

ఈశ్వరుడు చట్టబద్ధ పరిపాలకుడు. ఒకసారి సృష్టి ప్రారంభమైన తర్వాత జోక్యం కలిగించుకోడు. మూలపదార్థాల వలెనే, మరొక ఐదు

వస్తువులున్నవి. ఆకాశం, దిక్కు, కాలం, మనస్సు, ఆత్మ—ఈ ఐదు కూడా అణురూపంలో శాశ్వతములు, నిత్యములు. నాలుగు మూల పదార్థములు, ఐదు వస్తువులు—మొత్తం తొమ్మిదింటిని వైశేషికులు ద్రవ్యములు అన్నారు. ఇవి దేవునిచే సృష్టించబడలేదు.

పై తొమ్మిది వస్తువులు అణురూపంలో నిత్యములు, స్వతస్సిద్ధములు. వాటి పరిణామంలో వివిధ రూపాలు ధరిస్తూ వుంటాయి. పరిణామావస్థలో వున్నప్పుడు అవి అనిత్యములు. అశాశ్వతములు. నిత్యమైన అణువులలోనుండి, అనిత్యమైన వస్తువులు ఏర్పడటానికి కారణం, పరిణామం. రెండు అణువులు కలిసి, ద్వ్యణుక్కు, మూడు ద్వ్యణుక్కు కలిసి త్రణుక్కు ఏర్పడతాయి. అణువును మనం చూడలేము. కాని త్రణుక్కును చూడగలం.

అణువుల సంయోగ వియోగాలవల్ల మార్పు, సృష్టి జరుగుతూ ఉంటుంది ; ఈ మార్పు అదృష్టశక్తుల ప్రభావంవల్ల జరుగుతుంది. మార్పు వాస్తవం. సృష్టి వాస్తవం. అదృష్టశక్తుల ప్రకారం సృష్టి జరిగేటట్లు దేవుడూ చూస్తూ ఉంటాడు. ప్రజాక్షేమం కోరిన పరిపాలకుడు, నిత్య వ్యవహారాలలో అనవసర జోక్యం కలిగించుకోకుండా సాక్షిభూతుడుగా ఉన్నట్లే దేవుడు కూడా వుంటాడు.

కొంతకాలానికి ఈశ్వరుని, వినాశేచ్ఛ కలుగుతుంది. దాంతో ప్రళయం వస్తుంది. ప్రళయం వచ్చినా భూమి, నీరు, గాలి, తేజస్సు, ఆకాశము, దిక్కు, కాలము, మనస్సు ఆత్మ—యీ తొమ్మిదీ అణురూపంలో నిత్యంగా ఉంటాయి.

సృష్టి, ప్రళయం, పునస్సృష్టి—ఇలా చక్రాకారంలో పరిణామం ఎల్లప్పుడూ సాగుతూ ఉంటుంది.

అణురూపంలో భౌతిక ప్రపంచ స్వతస్సిద్ధ వాస్తవికతను అంగీకరించుటవల్ల, వైశేషిక సిద్ధాంతాన్ని భౌతికవాదం అనవచ్చు. సాంఖ్యవాదంవలె, సృష్టి—ప్రళయం, చక్రాకారంలో సాగుతుందని అనటంలోను, పరిణామానికి ప్రథమకారణం ఈశ్వరుడనుటలోను వైశేషిక సిద్ధాంతాలలో యాంత్రికదృష్టి ఉంది.

అంతర్గత కారణాలైన అదృష్ట శక్తులను వైశేషికులు సప్త పదార్థాలుగా విభజించారు. ఇవి :

1. ద్రవ్యము, 2. గుణము, 3. కర్మము (కార్యాచరణ), 4. సామాన్యము, 5. విశేషము, 6. సమవాయ, 7. అభావ.

అభావం రెండు రకాలు. సంసర్గాభావం, అన్యోన్యాభావం. ఒకటి మరొక దాంట్లో లేదు అని చెప్పటం సంసర్గాభావం. ఒకటి మరొకటికాదు అని చెప్పడం అన్యోన్యాభావం.

సంసర్గాభావం తిరిగి మూడు రకాలు. ప్రాగభావం, ప్రధ్వంసాభావం, అత్యంతాభావం "ఇటుకలతో ఇల్లు నిర్మించబడుతుంది" అనే వాక్యార్థం చూద్దాం. ఇల్లు ప్రస్తుతానికి లేదు. భవిష్యత్తులో నిర్మించబడుతుంది. కనుక యింటియొక్క అభావానికి మొదలు లేదు. కాని యిల్లు నిర్మించబడ్డ తర్వాత, అభావం అంతమౌతుంది. ఇది ప్రాగభావం.

ఒక కూజా ముక్కలైపోతుంది. కూజా ముక్కలుకాగానే అభావం ప్రారంభమౌతుంది. ఈ అభావానికి మొదలు ఉంది కాని తుది లేదు. కాన యిది ప్రధ్వంసాభావం.

గాలిలో రంగులేదు. భూత, భవిష్యత్ వర్తమాన కాలాలలో ఎన్నడూ ఇది లేదు. ఈ అభావం శాశ్వతం. ఇది అత్యంతా భావం.

అభావం ఒక ప్రత్యేక దృగ్విషయంగా పరిశీలన జరపడం వైశేషికుల ప్రత్యేకత.

గుణము వస్తువును ఆశ్రయించుకుని ఉంటుంది. స్వతస్సిద్ధంగా ఉండలేదు. గుణం స్థిరమైనది. ద్రవ్యంలో మరొక లక్షణముంది. అదే కర్మ లేక చలనము. ఈచలనము ఉత్క్షేపణ (పైకి విసరుట), అవక్షేపణ (క్రిందపడుట). అకుంచన (ముడుచుకొనుట), ప్రసరణ(విస్తరించుట), గమన (కదలుట) అనే అయిదు రకాలుగా ఉంటుంది.

వివిధ వస్తువుల మధ్య సామాన్యత్వము, విశేషత్వము రెండూ ఉంటాయి. నాలుగుకాళ్ళ జంతువులన్నిటికి కొన్ని సామాన్య ధర్మాలున్నవి. ఇందులో తిరిగి ఆవు వేరు, గేదె వేరు. విశేష ధర్మాలు కూడా ఉన్నవి.

సామాన్య, విశేష ధర్మాలకుగల సంబంధమే సమవాయ సంబంధము. సామాన్య విశేష ధర్మాలు ఒకదానివి వదలి మరొకటి ఉండలేవు. సామాన్య ధర్మము నాశ్రయించుకొనే విశేష ధర్మముంటుంది. విశేష ధర్మములు కొన్నిఉన్నప్పుడే, ఒక సామాన్యధర్మం అందులో నుండి ఉత్పన్నమౌతుంది. ఈ రెంటినీ వైశేషికులు అయుతసిద్ధ శక్తులు అన్నారు. రెండూ ఎల్లప్పుడూ కలిసే ఉంటాయి.

సమవాయ సంబంధం మాత్రమే కాక. కేవలం బాహ్య సంబంధము కూడా ఒకటుంది. దానినే సంయోగం అంటారు. ఒక కుర్చీ, ఒక బంతి కలిపి ఉన్నప్పుడు సంయోగం ఏర్పడుతుంది. ఈ రెండూ విడిగా అయినప్పటికీ వుండగలవు. ఈ కలయిక బాహ్య సంబంధము మాత్రమే.

అయుతసిద్ధశక్తులు ఉన్నవని అంగీకరించిన మేరకు, వైశేషిక సిద్ధాంతంలో ఒకమెరుపువలె గతితార్కిక దృష్టి ప్రదర్శితమైంది. యీ అయుత సిద్ధి శక్తులు ప్రకృతిలోని అన్ని భౌతిక శక్తులలోను ఉన్నవని, వానిమధ్యగల ఘర్షణే పరిణామానికి మూలకారణమనిగ్రహించినట్లయితే, ఆ మెరుపు వెలుతురుగా మారేది, సమగ్ర గతి తార్కికదృష్టి ఆవిర్భవించేది. ఈ అవగాహన లేనందువల్ల, ఆ మెరుపు క్షణమాత్రం మెరిసి, తిరిగి యాంత్రిక దృష్టిలో మరుగుపడ్డది.

## ఆరంభవాదం

కార్య కారణ సంబంధాన్ని గురించిన నైయ్యాయికుల సిద్ధాంతం ఆరంభవాదం.

కారణం, కార్యం వేరువేరు. పరిణామంలో క్రొత్తగుణాలు గల వస్తువులు ఏర్పడుతూ వుంటాయి. ఇలా ఏర్పడటానికి వస్తువుల మధ్య గల సమవాయ, సంయోగ సంబంధాలే మూలకారణాలు. జడ పదార్థంలో నుండి చైతన్యం యిలాగే ఏర్పడుతుంది. ఆరంభవాదం, గుణాత్మక మార్పును అనగా పురోగమనాన్ని అంగీకరిస్తుంది. సత్కార్య వాదంవలె క్రొత్తదనాన్ని నిరాకరించదు. కాని యాంత్రికదృష్టి ఆరంభ

వాదంలో ఉంది. అణువులు కొంతకాలం చలనంలేని స్థితిలో ఉంటాయి. ఈశ్వరుడు ఆరంభిస్తేనే సృష్టి ప్రారంభమౌతుంది. దీనిని ఆరంభ వాదం అన్నారు. పదార్థం, చలనం అవిభాజ్యమని ఆధునిక విజ్ఞాన శాస్త్రం ఘోషిస్తున్నది. నాటి విజ్ఞాన శాస్త్రిలు యీ స్థాయికి రాలేదు. చలనం వస్తువుయొక్క ఒక లక్షణంగానే నైయ్యాయికులు భావించారు. రెండూ అవిభాజ్యమని గుర్తించలేదు. ఈ పరిమితు లలో సైతం వైశేషికులు పదార్థ విజ్ఞాన శాస్త్రికి గొప్ప సాయంచేశారు. గురుత్వాకర్షణ సూత్రాన్ని అస్పష్టరూపంలోనైనప్పటికీ వివరించారు. చేతిలోని వస్తువువదిలితే కిందపడడానికికారణం గురుత్వంఅనిచెప్పారు. ప్రకృతి అనాది సిద్ధమని, చైతన్యం, మానవుడు పరిణామక్రమంలో ఏర్పడ్డారని వివరించారు. నూతన గుణోత్పత్తిని అంగీకరించారు. నీటిని వేడిచేయుటద్వారా ఆవిరి అవుతుంది. ఇది ఒక గుణాత్మక మార్పు అని ఉదాహరణ యిచ్చారు. పాక జోత్పత్తి అన్నారు. రసాయన శాస్త్ర మంతా గుణాత్మక మార్పులతో కూడుకుని ఉంది. వైశేషిక సిద్ధాంతం మధ్యయుగాలలో రసాయనశాస్త్ర అభివృద్ధికి దోహదమిచ్చింది. కిరణాల ద్వారా అసంఖ్యాకమైన అణువులు ప్రసారం చేయబడతాయనీ, కాంతి ప్రసరణ కివి కారణమనీ అన్నారు.

ఆత్మను, పునర్జన్మను వైశేషికులు అంగీకరించారు. ఆత్మ అణు రూపంలో శాశ్వతంగా ఉంటుంది; యీ ఆత్మ శరీరంతో కలిసి ఉన్న పుడే, చైతన్యం ఏర్పడుతుంది. లేకపోతే ఆత్మ గుడ్డిది. అదృష్టశక్తుల కనుగుణంగా పూర్వజన్మలో చేసుకున్న కర్మఫలితంగా పునర్జన్మ ఏర్పడు తుంది. కొంతకాలానికి జన్మరాహిత్యం, మోక్షం వస్తుంది. వైశేషికులు, మోక్షాన్ని గురించి ఎక్కువగా చర్చచేయలేదు. ఆత్మను, పునర్జన్మను గురించి కూడా వారు నామమాత్రపు అంగీకారం వెలిబుచ్చా రేగాని, ప్రత్యేక శ్రద్ధచూపలేదు. అణువుల సంయోగ, వియోగాలను గురించి మాత్రమే వీరు ప్రత్యేక కృషిచేశారు.

అణువు అవిభాజ్యమన్న వీరి సిద్ధాంతం, ఆధునిక విజ్ఞాన శాస్త్రి వ్ననుసరించి సమగ్రమైనది కాకపోవచ్చు. కాని ప్రపంచమే అవాస్తవ

మన్న ధోరణులు ప్రబలంగా ఉన్న రోజులలో, ప్రపంచం వాస్తవ మనీ, ప్రపంచానికి మూలం అణువులనీ వివరించటం ద్వారా వీరు భౌతికవాద ధోరణులను ప్రదర్శించారు.

## న్యాయ శాస్త్రం

వైశేషిక తత్వశాస్త్రానికి అనుబంధంగా న్యాయశాస్త్రం అను మరొక శాఖ ఏర్పడ్డది. ఈ న్యాయశాస్త్రానికి ప్రారంభకుడు గౌతముడు లేక అక్షపాదుడు, ఇతనికాలం క్రీ. పూ. 400 ఇతను వ్రాసిన న్యాయ సూత్రాలలో మొదటిభాగాలు బౌద్ధమతం వ్యాప్తిచెందిన వెన్వెంటనే ప్రచారంలోకి వచ్చాయి. చివరి భాగాలు క్రీ. శ. 200 ప్రాంతంలో రచించ బడినవని పరిశోధకులు భావిస్తున్నారు. బౌద్ధతత్వశాస్త్రాన్ని తార్కిక పద్ధతుల ద్వారా ఖండించుటకై ఉద్దేశింపబడిన ఈ న్యాయసూత్రాలు, క్రమంగా పెరిగి పెద్దవై క్రీ. శ. 200 నాటికి సర్వసమగ్ర ఆకారం ధరించినవి. క్రీ. శ. 300 లో జీవించిన కాత్యాయనుడు, న్యాయభాష్య మనే వ్యాఖ్యాన గ్రంథం వ్రాశాడు. సాంఖ్య, యోగ, వైశేషిక సూత్రాలవలెనే, న్యాయశాస్త్రాన్ని పలువురు విద్వాంసులు మధ్య యుగాల వరకు పెంచి, పెద్దదిచేసి భారతీయ తర్కశాస్త్రాన్ని అభివృద్ధి చేశారు.

సృష్టి, ప్రళయం, పరిణామక్రమం మొదలైన విషయాలలో వైశేషిక, న్యాయ సిద్ధాంతాలు రెండూ ఒకే అభిప్రాయంలో ఉన్నవి.

మోక్ష సంపాదనకు జ్ఞానం మార్గమని సాంఖ్యం చెప్పగా, సరియైన తార్కిక జ్ఞానం మార్గమని న్యాయసూత్రాలు వివరిస్తున్నాయి. తర్కపాండిత్యానికి విశేష ప్రాధాన్యత యివ్వటంలోనే న్యాయ సూత్రాల ప్రత్యేకత ఉన్నది.

# జ్ఞాన సిద్ధాంతం

న్యాయశాస్త్రం ప్రకారం తార్కికపద్ధతులు పదహారు: (1) ప్రమాణం: వాస్తవిక విషయాన్ని తెలుసుకొనుట, (2) ప్రమేయం: తెలుసుకోవలసిన వస్తువులు. ఈ తెలుసుకోవలసిన వస్తువులు 12. ఆత్మ, శరీరం, ఇంద్రియములు, అర్థములు, బుద్ధి, మనస్సు, ప్రవృత్తి, దోష, ప్రేత్యాభావ (పునర్జన్మ). ఫల, అపవర్గ, అనగా జీవిత సమస్యలన్నీ ప్రమేయములే- తెలుసుకోవలసినవే. (3) సంశయం, (4) ప్రయోజనం (5) దృష్టాంతరం లేక ఉదాహరణ, (6) సిద్ధాంతం (7) అవయవం (అనుమాన ప్రమాణములోని అయిదు అంశాలలో ఒకటి) (8) తర్కం (9) నిర్ణయము, (10) వాదము, (11) జల్పము, (12) వితండము. (13) హేత్వాభాసము, (14) ఛలము. (15) జాతి, (16) నిగ్రహస్థానం.

వాస్తవ సత్యాన్ని గ్రహించవలెననే సదుద్దేశంతో తార్కిక సూత్రాలకు అనుగుణంగా జరిగే చర్చవాదం.

జల్పము-అవతల, వ్యక్తిని ఏదోవిధంగా ఓడించవలెనని చేసే వాదన.

వితండము-తన వాదాన్ని చెప్పక, ఎదిరి వాదాన్ని ఏదోవిధంగా ఖండించి, అంతట తన వాదం సరియైనదని ప్రకటించటం.

హేత్వాభాసము-పైకి సకారణంగా కనబడినా వాస్తవానికి అకారణమైనది.

ఛలము_ఒకమాటను ఎదిరి ఒక అర్థంలో వాడగా, నీవు మరొక అర్థంలో వాడి అతనిని ఖండించటం.

జాతి_ప్రశ్నను దాటవేసి సమాధానం యివ్వటం.

విగ్రహస్థానము_ఓటమికి కారణభూతమైనపొరపాటుఅవగాహన.

ప్రపంచం స్వతస్సిద్ధం, వాస్తవం. భౌతికప్రపంచం, అందులోని వస్తువులు వాస్తవ విషయాలు. మానవ చైతన్యం వాటిని గుర్తించవచ్చు లేక గుర్తించకపోవచ్చు.

పంచేంద్రియాల ద్వారా మనం సంపాదించే జ్ఞానం సరియైనదో, కాదో తెలుసుకోవటం ఎలాగా ? ఆచరణే సిద్ధాంతాల నిజాయితికి గీటు రాయి. పంచదారను నీవు చూస్తావు. పంచదార తియ్యగా ఉంటుందని నీకు తెలుసు. నీవు చూసేది పంచదారో, ఉప్పో అని అనుమానం కలిగితే, నాలిక మీద వేసుకొని పరీక్షించు. ఆచరణ ద్వారా నీ అభిప్రాయం నిజమో, అబద్ధమో స్పష్టమౌతుంది. ఇది నైయ్యాయికుల జ్ఞాన సిద్ధాంతం. సాంఖ్యులవలెనే వీరు కూడా: ప్రత్యక్ష జ్ఞానంలో నిర్వికల్పక సవికల్పన విభజనను అంగీకరించారు.

న్యాయ, వైశేషిక సూత్రాలకు భారతీయ తత్వ శాస్త్రంలో ప్రత్యేక స్థానమున్నది.

సాంఖ్య, యోగములవలె, ఈ ధోరణులకు బీజములు ఉపనిషత్తులలో కనపడవు. ఉపనిషత్తులలో ఎక్కడో ఒక చోట అణువు అను మాట వుండవచ్చు. కాని అణువాదం, లోకాయతజైన ధోరణుల సాంప్రదాయములలో పెరిగినది. ఉపనిషత్ సాంప్రదాయములో కాదు. లోకాయతుల పంచభూతములు, జైనుల పుద్గలవాదం, వైశేషికుల అణు విభజనకు నాంది.

ఉపనిషత్తులలో తర్కశాస్త్రం లేదు. పరబ్రహ్మ చర్చలో కొంత యుక్తివాదం ఉన్నది. కాని ప్రమాణ, ప్రమేయ, ప్రత్యక్ష, అనుమానాది నానా విధములైన తర్కవాద కౌశలము, బౌద్ధ జైనముల తర్వాత వృద్ధి చెందినది. కౌటిల్యుడు అర్థశాస్త్రంలో ప్రస్తావించిన అన్వీక్షకి తర్కం. తర్కం కూడా లోకాయతుల వాదనా సాంప్రదాయము నుండి ఉద్భవించినదే.

అవైదికమైన న్యాయ, వైశేషికములు, వేద ప్రామాణ్యం అంగీక రించవలసి వచ్చింది. బౌద్ధ, జైన, చార్వాక మతములపై, వైదిక మత కర్తల దాడి, దూషణ తర్వాత, అశోక సామ్రాజ్య పతనం తర్వాత, రాజాదరణ నశించినమీదట, ఏ తత్వ శాస్త్రమైనా, వేదాలకు, చాతుర్వర్ణ్య వ్యవస్థకు నమస్కారబాణంవేసి తప్ప ముందుకు సాగలేని దుస్థితిఏర్ప డ్డది. సాంఖ్య యోగములకు ఈ దుస్థితి తప్పలేదు. ఆత్మ పరమాత్మ మోక్షము ఇత్యాదులు, సాంఖ్య.యోగములలో తేలికగా అంతర్భాగమైనవి. ఆ రెంటికి ఉపనిషత్తులలో బలమైన పునాదులు కూడాఉన్నవి.

న్యాయ, వైశేషిక దర్శనములను ఎంత తరచి చూసినా. వీనిలోని ఆత్మ, పరమాత్మ మోక్షాదిభావాలు ఎరువు సొమ్ములుగానే కనిపిస్తాయి.



న్యాయ వైశేషికులు దేవుని అంగీకరించారు. దేవుడనగా వారి దృష్టిలో ఉదార చక్రవర్తి. చక్రవర్తి లేనిదేరాజ్యం నడవదు. దేవుడు లేనిదే ప్రపంచం నడవదు. ఈ ఉదహారణలోనే ఒక ధ్వని ఉంది. చక్రవర్తి పదవి ఒకానొక సామాజిక దశలో ఏర్పడిన వ్యవస్థ. అనాది సిద్ధంకాదు. వైశేషకుల దేవుడు అట్టివాడే.

ప్రళయం ఏర్పడుతుంది. దేవుని ఇచ్ఛ మేరకు అది జరుగుతుంది. ప్రకృతి అణువు రూపంలో అప్పుడు సైతం నశించదు. ఆత్మ సైతం అణురూపంలో నిత్యంగానే ఉంటుంది. అనగావ్యక్తి, జీవాత్మ, శాశ్వతం.

అణువుల కలయిక ఫలితంగా ఏర్పడిన పదార్థం నశిస్తుంది. ఆత్మల అభివ్యక్తీకరణ ఐన సమాజం నశిస్తుంది. అణువులకు మాత్రం చావులేదు. అవి ఈశ్వరునికి సైతం అతీతములు.

సాంఖ్యుల ప్రకృతివలెనే, వైశేషికుల అణువులూ ఆది మధ్యాంత రహితములు.

సర్వమూ, శూన్యం అను మహాయానం. బ్రహ్మసత్యం, జగ న్మిథ్య అను బాదరాయణ అద్వైతవాదం తల ఎత్తు కాలంలో ఆ రెంటినీ కాదని అణురూపంలో బాహ్య జగత్తు వాస్తవికతను నిర్ద్వం ద్వంగా ప్రకటించటం, న్యాయ వైశేషికముల విశిష్టత.

బల్లలు, కుర్చీలు, బాహ్యజగత్తులో ఉన్నవి. మానవుడు గుర్తించినా, గుర్తించకపోయినా అవి ఉన్నవి, ఉంటవి. అంతరంగిక కారణాలవలన అవి నాశనమైతేతప్ప ఈ ఒక్కమాటను ఖచ్చితంగా చెప్పినందుకె వైశేషికులకు మనం రుణపడిఉండవచ్చు. లోకాయతుల తర్వాత ఇంత స్పష్టంగా ఈమాట అన్నది వీరే.

న్యాయశాస్త్రం, జ్ఞానసిద్ధాంతంలో వాస్తవిక దృష్టినిప్రదర్శించింది. సత్యానికి గీటురాయి ఆచరణ; ప్రవృత్తి సామర్థ్యం.

జ్ఞానేంద్రియములు సరియైన జ్ఞానాన్ని ఇస్తాయన్న నమ్మకమేమిటి అనే సందేహాన్ని అద్వైతులు లేవదీస్తారు. కలలోకొన్ని వస్తువులు కనపడతాయి. జాగ్రదావస్థలో, అవన్నీ అసత్యాలని తేలుతున్నాయి. అలాగే జాగ్రదావస్థలోవి మనజ్ఞానం అసత్యమని సమాధి అవస్థలో తేలుతుంది. ఇది అద్వైతుల కీలకవాదన.

దీనిని నైయ్యాయికులు, ముఖ్యంగా క్రీ॥ శ॥ 600 తర్వాత, మొదట మిథిలలోనూ, పిమ్మట నవద్వీపంలోను వృద్ధి చెందిన నవన్యాయవాదులు, నిశితంగా ఖండించారు.

## జాగ్రదావస్థ సర్వ సామాన్యం

సమాధి ఏ కొద్దిమందికో చెందినది. అది నిజమో, భ్రమజనితమో చెప్పలేము. అట్టి సమాధిని ప్రాతిపదిక చేసుకుని జాగ్రదావస్థను నిరాకరించటం తర్కవిరుద్ధం.

అంతేకాదు, కలలో కనిపించేవి పూర్తిగా అసత్యములు కావు. ఏనుగును అంతకు పూర్వం చూసి ఉంటాము. ఆ స్మృతి మనలను వెంటాడుతుంది. కలలో ఏనుగు కనిపిస్తుంది. ఏనుగు అనేది అసత్యం కాదు. కలలో చూచిన ఆ ప్రతిబింబాన్ని ఆ సమయంలో నిజమని నమ్మిన ఆ చిత్తవిభ్రమం అసత్యం. జాగ్రదావస్థ రాగానే ఆ చిత్తవిభ్రమం తొలగిపోతున్నది.

మాయావాదాన్ని తర్కప్రాదికపై తీవ్రఖండనకు గురిచేసినవారు నైయ్యాయికులు.

న్యాయ వైశేషికములను రెంటినీ, భౌతికవాద శ్రేణికి చేర్చ వలసి ఉంటుంది. ఆత్మ, మోక్షం, ఈశ్వరుడు- మొదలైన భావము లుంటవచ్చుగాక. అవి తెలిసో తెలియకో తెచ్చిపెట్టుకున్న అరువు సొమ్ములు. బాహ్యప్రపంచ వాస్తవికతను నిర్ద్వంద్వంగా, ప్రళయ కాలంలో సైతం కొనసాగే వాస్తవికతగా గుర్తించిన న్యాయ, వైశేషి కాలు, భారతీయ విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి ఎంతో దోహదం చేశాయి. కాగా ఇవి యాంత్రికవాద శాఖకు చెందిన భౌతిక ధోరణులు.

వీరి ఆత్మభావనకు సాంఖ్యుల ఆత్మభావనకు తేడా ఉంది. వీరి ఆత్మ శుద్ధచైతన్యం కాదు. చైతన్యం దానికొక లక్షణం. మనస్సు, శరీరములతో కలిసి ఉన్నప్పుడే ఈ లక్షణం ఆత్మకు ఏర్పడుతుంది.

సుఖ, దుఃఖములు, అభిమాన, ద్వేషములు- శరీరమునకే గాని ఆత్మకు కావు అని సాంఖ్యుల వాదన. ఇవి ఆత్మలక్షణాలని నైయ్యాయికుల వాదన.

మరి మోక్ష మననేమి? శ్రవణ, మనన, నిధి, ధ్యానాదులచే- అనగా భక్తి మార్గముచే, ఆత్మ శరీరము కంటె వేరైనదని గ్రహించుట. నైయ్యాయికులు తర్కముతో ప్రారంభించి భక్తికి ప్రాధాన్య మిచ్చారు. విశిష్టాద్వైతులతో వీరికి పోలిక ఉంది.

సాంఖ్యులు జ్ఞానానికి ప్రాధాన్యమిచ్చారు. భగవద్గీతలోని ఆత్మ చర్చ అంతా సాంఖ్యవాదవివరణ. జ్ఞానమార్గంద్వారా ఆత్మను తెలుసు కొనుట, వారి దృష్టిలో మోక్షం.

ఆత్మ, మోక్షముల విషయంలో సాంఖ్యం, అద్వైతానికి దగ్గ రౌతుంది. వైశేషిక న్యాయములు - విశిష్టాద్వైతాన్ని సమీపిస్తాయి.

# పదవ అధ్యాయం

# పూర్వ మీమాంస

పూర్వమీమాంసా సూత్రాలను ప్రతిపాదించిన జైమిని క్రీ. పూ. 200 ప్రాంతంలో జీవించాడు. బౌద్ధ, జైన మతాల ప్రభావం వల్ల వేదాలపట్ల వైదిక కర్మకాండపట్ల దేశంలో పూర్తి విరసన భావం వ్యాపించింది సాంఖ్య వైశేషిక, తర్క-సిద్ధాంతాలు వేదప్రామాణ్యాన్ని అంగీకరించినప్పటికీ, అది నామమాత్రం. అవి ప్రత్యేక తాత్విక సిద్ధాంతాలుగానే రూపొందినవి. వేదాలపట్ల భక్తి భావాన్ని పునరుద్ధరించటానికి అవి ఉపయోగపడలేదు.

ఈ పరిస్థితులలో జైమిని తన పూర్వమీమాంసా సూత్రాలను వివరించాడు. అద్వైతమతానికి పునాదియైన ఉత్తర మీమాంస, పీని తర్వాత వెలువడినందున, ఈ సూత్రాలను పూర్వమీమాంస అని వ్యవహరిస్తున్నారు.

(పూర్వ = మొదటిది, ఉత్తర=తర్వాతది)

ఈ సూత్రాలకు శబరస్వామి, కుమారిలభట్టు, ప్రభాకర పండితుడు వ్యాఖ్యానాలు వ్రాశారు. వీరిలో శబరస్వామి కాలం క్రీ. పూ. 100–200 ప్రాంతం కావచ్చు. కుమారిలభట్టు, ప్రభాకర పండితులు క్రీ. శ. 700 నాటివారు. వీ రిద్దరు ఆంధ్రులు, గురుశిష్యులు.

వైదిక కర్మకాండపట్ల మూఢభక్తిని కలిగించుట పూర్వమీమాంస ప్రధాన లక్ష్యం. వేదాలు పరమ ప్రమాణాలు. అవి ఎవనిచేత వ్రాయబడలేదు. అవి సర్వకాల సర్వావస్థలకు వర్తించే నియమాలు. వైదిక కర్మలను, అనగా యజ్ఞయాగాలు, నిత్యకర్మలు, మొదలైనవాటిని తు. చ. తప్పకుండా అనుసరించితే, మానవునికి మోక్షం లభిస్తుంది. వైదికజ్ఞానం స్వయంసిద్ధమైనది. దానిని ప్రశ్నించడానికే వీలులేదు.

వైదిక కర్మలపట్ల గల అత్యాసక్తితో మీమాంస సూత్రాలు దేవుని సైతం నిరాకరించినవి. ప్రపంచానికి సృష్టికర్త ఎవరూ లేరు. సృష్టికి ఆది, అంతం లేవు. సకల వస్తు సమన్వితమైన యీ భౌతిక ప్రపంచం వాస్తవమైనది.

ఆత్మ ఒకటి కాదు ఎందరు వ్యక్తులున్నారో అన్ని ఆత్మలున్నాయి. భౌతిక వస్తువులవలెనే ఆత్మలుకూడా శాశ్వతమైనవి. ఆత్మలకు స్వయం వ్యక్తిత్వం లేదు. శరీరంతో కలిసి వున్నపుడే, వీటికి వ్యక్తిత్వం లభిస్తుంది. ఆత్మలకంటె, వీరు శరీరానికే ఎక్కువ ప్రాధాన్యత యిస్తారు.

జీవిత లక్ష్యం ఏమిటి?

కర్మబద్ధమైన ఆత్మ, కర్మ విముక్తి చెంది మోక్షాన్ని సాధించుట జీవిత లక్ష్యం. ఈ మోక్షాన్ని వీరు నిశ్శ్రేయసం అని పిలిచారు. ఈ మోక్ష సాధనకు వైదిక కర్మలను నియమ నిష్ఠలతో ఆచరించు మార్గం.

వేదాలను ప్రమాణాలుగా అంగీకరించే మీమాంసకారులు, దేవుని అస్తిత్వాన్ని నిరాకరించటం ఆశ్చర్యంగా కనబడవచ్చు. వేదాలలో ప్రకృతి శక్తులకు అధినాధుడైన అగ్ని, ఇంద్రుడు, వరుణుడు మొదలైన అనేక దేవతల వర్ణనలున్నాయి. ఈ దేవతలను ఆరాధించడానికి అవలంబించవలసిన కర్మకాండ ఎంతో వుంది. వేదాలకు ఆఖరున తాత్విక చర్చకు సంబంధించిన ఉపనిషత్తులున్నాయి. ఈ మూడింటిలోను మీమాంసకులు, కర్మకాండనే ముఖ్యమైన దానినిగా స్వీకరించారు. తాత్విక చర్చను నిరాకరించారు. వైదిక దేవతలను త్రోసివేశారు. కర్మకాండకు మూలమైన మంత్రాలు సర్వశక్తివంతములని వీరి నమ్మకం.

మంత్రాలను ఏదో దేవుని పేరుతో ఉచ్చరించాలి కనుక ఒక దేవుని మనం ఆవాహన చేస్తున్నామేగాని, నిజానికి ప్రధానమైంది మంత్రశక్తి దేవతలు కారు.

మంత్రశక్తిని సమర్థించుకునేందుకు వీరు ఒక సిద్ధాంతాన్ని తయారు చేశారు. విత్తనంలో మొక్కగా రూపొందేశక్తి అంతర్యాతంగా ఉన్నట్లే, ప్రతి పనిలోను ఒక ఫలితం శక్తిరూపంలో ఉంటుంది. ఈ అంతర్గర్భితమైన శక్తి కొంతకాలానికి వికసించి. క్రియాత్మకమైన శక్తిగా మారుతుంది. అలాగే మంత్రాలలోను ఒకశక్తివుంది. మంత్రాలు ఉచ్చరించిన వ్యక్తికి ఈ శక్తి కొంత పుణ్యాన్ని చేకూరుస్తుంది. ఈ పుణ్యం ఆ వ్యక్తి, మరణానంతరం అనుభవిసాడు. మంత్రోచ్చారణ, కర్మకాండ స్వర్గసంపాదనకు సరియైనమార్గం.

స్వర్గంకూడా ఒక బంధనమే. అన్ని బంధనాలనుండి విడివడి నప్పుడే నిశ్శ్రేయసం లభిస్తుంది. మనం చేసే కర్మలలో కామ్యకర్మలు, నిత్యకర్మలు అని రెండు రకాలున్నాయి. కామ్య కర్మలు చేస్తే స్వర్గం లభిస్తుంది. నిత్యకర్మలను అనాసక్తతో ఆచరిస్తే స్వర్గమూ రాదు. నరకమూ రాదు. పాపపుణ్యాల కతీతమైన మోక్షం లభిస్తుంది. వైదిక కర్మలను ఆచరించవలసిన పద్ధతే యిది.

దేవుని నిరాకరించినప్పటికి, సాంప్రదాయసిద్ధమైన వైదిక కర్మలను గుడ్డిగా ఆచరించుట పరమలక్ష్యంగా కలిగిన పూర్వమీమాంస, సామాజికంగా పూర్తి అభివృద్ధి నిరోధక పాత్ర వహించింది. బౌద్ధమత పతనానంతరం భారతదేశాన్ని పరిపాలించిన పల్లవ, విష్ణుకుండిన, చాళుక్యరాజులు,వైదిక కర్మలను తిరిగి పట్టుదలగా నిర్వహించసాగారు. పూర్వ మీమాంస శాస్త్రాన్ని వీరు ఆదరించారు. విష్ణుకుండిన రాజైన మాధవవర్మ (క్రీ. శ. 450) అశ్వమేధ, రాజసూయ యాగాలను మాత్రమే గాక, నర మేధయాగాన్ని సైతం జేసినట్లు ఆంధ్రుల చరిత్ర తెలియజేస్తుంది.

వేదాధ్యయనంలో ప్రావీణ్యంగల పండితులకు ఈ రాజులు అగ్రహారాలు విరివిగా ఇవ్వసాగారు. నాలుగువేదాలను కంఠస్థంచేయడం, వైదిక మంత్రాలన్ను, ఘన, జటలను స్వరయుక్తంగా పల్లించడం-

ప్రత్యేక విద్యగా అభివృద్ధి చెందింది. వేదాధ్యయనంలో తెలుగుదేశపు బ్రాహ్మణులకు ఆనాడు గొప్ప పేరుండేది. పూర్వమీమాంస ప్రభావం వల్లనే ఈ ఫలితాలన్నీ కలిగాయి. కుమారిలభటు, ప్రభాకర పండితులు తెలుగువారు. పూర్వమీమాంసకు తెలుగుదేశంలో చాళుక్యయుగ ప్రారంభంలో ఎంతో రాజాదరణ లభించింది. శంకరాచార్యులు (క్రీ. శ. 788) లని అద్వైత మతాన్ని స్థాపించే ముందు పూర్వమీమాంస కర్తలతో తీవ్రవాగ్వాదాలు జరిపినట్లు, అందులో మండన మిశ్రుడనే గొప్ప పండితుని ఓడించుటతో, పూర్వమీమాంస పరాజయం పూర్తియైనట్లు శంకరుని జీవిత చరిత్ర తెలియజేస్తుంది. వేదాలలో భాగమైన ఉపనిషత్తులకు అందులోని తాత్విక చర్చకు — శంకరాచార్యులు విశేషప్రాధాన్యమివ్వగా, వేదాలలోని కర్మకాండకు, మంత్రోచ్చారణకు పూర్వమీమాంసకులు అధిక ప్రాధాన్యత యివ్వడమే వాగ్వాదాలకు కారణం.

మీమాంసకుల జ్ఞాన సిద్ధాంతంలో ఒక ప్రత్యేకత వుంది. న్యాయ సిద్ధాంతం అంగీకరించిన ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్ద ప్రమాణాలను వీరు అంగీకరిస్తారు. కాని నైయ్యాయికులు శబ్ద ప్రమాణానికి నాల్గవ స్థానాన్నిస్తే, మీమాంసకులు ప్రథమ స్థానమిచ్చారు. వేదాలలో చెప్పినది పరమ ప్రమాణమని స్థాపించగలందులకేవీరుశబ్దప్రమాణానికి విశేష ప్రాధాన్యత ఇచ్చారు. పై నాలుగు కాక అర్థాపత్తి, అనుపలబ్ధి అను మరి రెండు ప్రమాణాలను కూడా వీరు అంగీకరిస్తారు.

అర్థాపత్తికి ఒక ఉదాహరణ; ఒకవ్యక్తి రోజురోజుకు బలుస్తున్నాడు. కాని పగటిపూట ఉపవాసం చేస్తున్నాడు. కనుక ఈ వ్యక్తి రాత్రిపూట భోంచేస్తున్నాడు అని మనం అభిప్రాయపడతాం. ఈ రకంగా నిర్ణయం చేయడమే అర్థాపత్తి.

అతను రాత్రిళ్లు భోంచేయడం మనం చూడలేదు. కనుక ఇది ప్రత్యక్ష ప్రమాణంకాదు; ఎవరో చెప్పగా మనం విన్నదీ కాదు; కనుక శబ్ద ప్రమాణంకాదు. రోజురోజుకు బరువెక్కేవారందరూ రాత్రిపూట మాత్రమే భోంచేస్తూవుంటారనే సూత్రం ఏమీ లేదు. కనుక అనుమాన ప్రమాణంకాదు. మనం ఇంతకు పూర్వం ఇలాంటి విషయాన్ని వినలేదు. చూడలేదు. కనుక ఇది ఉపమాన ప్రమాణం కాదు. ఈ వాస్తవ

విషయాన్ని మనం వూహించాలి. ఈ అర్థం ఈ ఉదాహరణకుమాత్రమే ప్రత్యేకమైంది; దీనిని అర్థాపత్తి ప్రమాణం అని అన్నారు.

ప్రత్యక్ష ప్రమాణానిక విరుద్ధమైనది అనుపలబ్ధి. కొన్ని వస్తువులను మనం స్వయంగా చూసినందువల్ల, అవి వున్నవి అని గుర్తిస్తున్నాం. అలాగే కొన్ని విషయాలను మనం చూడనందువల్ల అవి అక్కడ లేవు అని గుర్తిస్తున్నాం. లేవు అని గ్రహించుటకూడా వ్యతిరేకార్థంలో జ్ఞాన సంపాదనే. దీనిని కూడా మీమాంసకులు ఒక ప్రమాణంగా అంగీకరించారు.

బాహ్య ప్రపంచ వాస్తవికతను గుర్తించినప్పటికీ, మీమాంసకులను భౌతికవాద శాఖగా చెప్పలేము. తెగల దశలోని ప్రకృతి శక్తుల ఆరాధకుల వారసత్వం వీరు స్వీకరించారు.

యజ్ఞయాగముల ఫలము ఆత్మలు అనుభవించాలిగదా. కనుక ఆత్మలుశరీర నిర్యాణానంతరం స్వర్గానికో,నరకానికో పోవాలి.మధ్యలో దయ్యాలు, భూతాలుగా కొంత కాలం ఉండవచ్చు. ప్రతి వ్యక్తికి ఒక ఆత్మ ఉంటుంది కనుక ఆత్మలు అసంఖ్యాకములు. అనేకులు ఒకసారి కర్మలు చేస్తారు. అందరూ దేవతలను ఆహ్వానిస్తారు. వారందరూ వచ్చి హవిస్సు స్వీకరిస్తారు కనుక దేవతలు అసంఖ్యాకులు.

జైమినిలాంటి మీమాంసకులు మంత్రములే ముఖ్యంకాని,దేవతలు కాదన్నారు. వీరు ఈశ్వరుని నిరాకరించారు. కాలక్రమేణ వీరి కొక చిక్కువచ్చింది. స్వర్గనరకాలను ఊహించినపుడు దేవతలుండక తప్పదు కదా! కనుక ఆ తర్వాత వచ్చిన ప్రాభాకర, కుమారిల భట్టు తదితరులు అసంఖ్యాకులైన దేవతలకు చోటు చేశారు. కానీ వీరందరూ కర్మకు అధీనులు. మంత్రశక్తితో వీరిని లోబరచుకోవచ్చు.

మంత్రాధీనం జగత్సర్వం
మంత్రాధీనంతు దేవతా
తన్మంత్రం బ్రాహ్మణాధీనం
బ్రాహ్మణో మమదైవతం
"యావత్తు జగత్తు మంత్రములకు లోబడి ఉంది
దేవతలు కూడా మంత్రములకు లోబడి ఉన్నారు

ఆ మంత్రములు బ్రాహ్మణులకు లోబడి ఉన్నవి
అట్టి బ్రాహ్మణులు నాకు దైవ సమానులు."
ఈ బ్రాహ్మణ భక్తి ఈకాలంలో పుట్టినదే.

భూత శక్తులను నిరాకరించి, బాహ్య ప్రపంచ అస్తిత్వాన్ని గుర్తించటం భౌతికవాద చిహ్నం. లోకాయతు లట్టి భౌతికవాదులు సాంఖ్యంయోగం, న్యాయ వైశేషికులు-ఎవ్వరూ భూతశక్తులు, దయ్యాలు, మంత్రాలు, స్వర్గనరకాలను గురించి ప్రస్తావించలేదు. బౌద్ధ, జైనాలలో కూడా మొదట్లో ఈ ప్రస్తావన లేదు. మహాయాన దశలో మాత్రమే బౌద్ధం, తుషిత స్వర్గం, జన్మపరంపర లాంటి భావాలకు చోటి చ్చింది.

ప్రాచీన తెగలలోని మూఢనమ్మకాలనీన్ని పూర్వమీమాంసలో చోటు చేసుకున్నవి. ప్రకృతి ఉపాసనా దశలోని తెగలు ఒక్కుమ్మడిగా పూర్వమీమాంసలోని యజ్ఞయాగాదులను స్వీకరించాయి. గ్రామ దేవతలకు చేసే జంతుబలులు, జాతరలకు, యజ్ఞయాగాదులకు తేడా లేదు. వారు పైశాచీ భాషలో ఏవో మంత్రాలు చదివితే, వీరు సంస్కృత మంత్రాలు చదువుతారు.

ఇక్కడ ఒక ప్రశ్న ఎదురౌతుంది.

పశుహింసా ప్రధాన మైన యజ్ఞయాగాదులపై, శతాబ్దాలుగా వ్యతిరేకత, నిరసన, దాడి జరుగుతూనే వచ్చాయి.

ఉపనిషత్తుల కాలంలో ఇది ప్రారంభమైంది. బౌద్ధ, జైన, చార్వాక మతోద్యమాల ప్రభావం, బౌద్ధానికి రాజాదరణతో యజ్ఞ యాగాదులు దాదాపు అదృశ్యమైనాయి. ఆ పిమ్మట ఉద్భవించిన సాంఖ్య, యోగ న్యాయ వైశేషికాలలోనూ కర్మల ప్రస్తావన లేదు. అవి జ్ఞాన, తర్క ప్రధానములైన తాత్విక ధోరణులు.

అట్టిది తిరిగి పూర్వమీమాంసలో యజ్ఞయాగాదుల విజృంభణ ఎలా జరిగింది.

దీనికి సమాధానం తత్వశాస్త్రంలో దొరకదు. చరిత్రలోకి వెళ్ళాలి.

మౌర్య సామ్రాజ్యకాలంలో బౌద్ధం రాజాదరణ పొందింది. ఆ పిమ్మట శృంగ, కణ్వరాజులు, పిమ్మట, గుప్తరాజులు వైదికమత పునరుద్ధరణకు పాటుపడ్డారు. అప్పటికే భారతదేశంలోని మేధావి వర్గంలో హెచ్చుమంది, బౌద్ధ, జైనాలవైపు మొగ్గారు. ఇక యజ్ఞ యాగాలు చేసేదెవరు?

ఆటవిక తెగలకు చెందిన ప్రజలను ఆర్యనాగరికతలో ఇముడ్చుకుని వారిలో వర్ణవిభజన ఏర్పరచి, బ్రాహ్మణ, క్షత్రియాది విభాగాలను సృష్టించి వైదికమతాన్ని వ్యాప్తి చేయటం అనాదిగా జరుగుతున్న పరిణామం.

వేదాలలోని యజ్ఞయాగాదులు అలా వ్యాపించినవే. అనార్య తెగలలోని ప్రకృతి ఉపాసన,ఆర్యులలోని యాగకర్మలు కరిగిపోయినవి. సింధునది తీరంనుండి గంగా తీరానికి ఆర్యవిస్తరణ జరిగిన కాలంలో ఈ విధంగా బ్రాహ్మణ పురోహితవర్గం, ఆర్య, అనార్య తెగల సమ్మేళనం వలన ఏర్పడ్డది. వారే అశ్వమేధ, గోత్రేదివరమేధాది యజ్ఞాలను, పశుహింసా ప్రధానమైన క్రతువులను పెద్ద ఎత్తున ప్రారంభించారు.

ఇది మితిమీరి, ఉత్పత్తి శక్తులైన పశుసంపదకే నష్టం వాటిల్లే సమయంలో క్షత్రియులనుండి ఇందుకు నిరసన మొదలైంది. ఉపనిషత్తులలోని బ్రహ్మవాదం, కర్మకాండ నిరసన అందుకు చిహ్నం — క్రీ.పూ. (1000–1500).

మహాభారత యుద్ధానంతరం అనేక తెగలు ఆర్యత్వం స్వీకరించి, క్షత్రియులైనారు. తిరిగి యజ్ఞయాగాదులు విజృంభించాయి. నాగులు భారత యుద్ధానంతరం రాజ్యాధికారానికి వచ్చినట్లు చరిత్ర తెలుపుతున్నది.

బౌద్ధంతో ఇది మరొకసారి దెబ్బ తిన్నది. తిరిగి, శృంగ, కణ్వ రాజుల కాలంలో, అనేక తెగలు ఆర్యులై, తెగల పురోహితులు బ్రాహ్మణులైనారు. వీరే పూర్వమీమాంసా ప్రవర్తకులు. వీరికి రాజాదరణ లభించింది. దేశమంతటా వైదిక పురోహితులకు అగ్రహారాలిచ్చే సాంప్రదాయం, శృంగ, కణ్వ, గుప్తరాజుల కాలంలో మొదలైంది.

బ్రాహ్మణ పురోహితులుగా మారిన తెగల పురోహితులు, తెగల సంస్కృతి ఐన ప్రకృతి శక్తుల ఉపాసనను, వేదమంత్రాలకు జోడించారు.

బౌద్ధ, సాంఖ్య, న్యాయ, వైశేషికాది ధోరణులు భారతీయ తాత్త్వికచింతనను ఉన్నతస్థాయికి పెంచినవి. పూర్వమీమాంస తిరిగి తత్వశాస్త్రాన్ని అధోగతికి దించింది.

బాహ్యప్రపంచం ఉనికిని గుర్తించుట, జ్ఞాన సంపాదనకు ఇంద్రియజ్ఞానం మూలమని గుర్తించుట మాత్రమే పూర్వమీమాంసలోని విశేషం. ప్రకృతి శక్తుల ఆరాధనలో అంతర్గతంగా ఉన్న భౌతికవాసన ఫలితం ఇది అటు భౌతికవాసన, ఇటు భూతశక్తులపై గుడ్డివమ్మకం - ఈ విచిత్ర కలగా పులగమే పూర్వమీమాంస.

కర్మకాండ పెరుగుదల పురోహిత వర్గ ప్రయోజనాలతో ముడి పడి ఉంది.

పుట్టినది మొదలు చనిపోయేవరకు అంతులేని కర్మకాండ పెరిగింది. పురోహిత వర్గానికిది జీవనాధారమైంది. అష్టాదశపురాణాలు ఈ కాలంలోనే రూపొందాయి. పురాణాల ప్రచారంతో.కర్మకాండ ఆచరణతో తాత్విక చింతన అడుగునపడ్డది.

గుప్త రాజుల తర్వాత భారతదేశాన్ని పరిపాలించిన రాజులందరూ, తెగల అధిపతుల నుండి రూపొందినవారేనన్న వాస్తవాన్ని గుర్తించాలి. వీరే కర్మకాండకు, పూర్వమీమాంసకు రాజపోషకులు.

మీమాంసకుల దృష్టిలో మోక్షం లేకపోలేదు- దానిని వారు నిశ్శ్రేయసమన్నారు అది ఎలా లభిస్తుంది నిరపేక్షారహితంగా కర్మలు చేయాలి. అపేక్ష సహితమైతే స్వర్గవరకాలు వస్తాయి.అంతకంటె ఉన్నతమైనది నిరపేక్ష కర్మ.

వివిధ తాత్విక ధోరణులలో అనేకమైన సామాన్య భావాలు వ్యక్తమౌతూ ఉంటాయి. గీతలోని, నిష్కామ కర్మ. పూర్వమీమాంసకుల నిరపేక్ష కర్మ, నాగార్జునాచార్యుని ఫలాపేక్ష రహిత త్యాగం - ఇవన్నీ అలా ప్రవేశించిన భావాలే. కాగా ఒక్కొక్క మాటకు ఆయా దశలలో ఒక్కొక్క అర్థం ఏర్పడ్డది.

# పదకొండవ అధ్యాయం

# అద్వైత సిద్ధాంతం

షడ్దర్శనాలలో ఆరవది ఉత్తర మీమాంస. అద్వైత సిద్ధాంతానికి ప్రాతిపదిక. ఉత్తర మీమాంస సూత్రాలను రచించిన బాదరాయణుడు క్రీ. శ. 200 లో జీవించాడు. ఈ సూత్రాలలో బౌద్ధ, జైన, న్యాయ, సాంఖ్య సిద్ధాంతాలపై విమర్శ, భారత, భాగవత గ్రంథాల ప్రస్తావన ఉన్నది. వాటన్నిటికన్నా ఆఖరున ఈసూత్రాలు రూపొందాయి. భారత, భాగవత తదితర పురాణాలను రచించిన వేదవ్యాసుడు, బాదరాయణుడు ఒకే వ్యక్తి అని ఒక వాడుక కలదు. ఈ వివిధ గ్రంథాల రచనాకాలంలోగల వ్యత్యాసాన్ని గమనించినట్లయితే. ఈ వాడుక వాస్తవం కాదనీ, అన్ని మతగ్రంథాలనూ ఒకే వ్యక్తికి ఆపాదించి, తద్వారా ఆ గ్రంథాల ఔన్నత్యాన్ని పెంచుటకై సృష్టించబడిన కల్పితగాథ మాత్రమేనని తెలియగలదు.

బాదరాయణ సూత్రాలలో, బ్రహ్మ పదార్థాన్ని గురించిన చర్చ ప్రధానాంశం. ఈ సూత్రాలు బ్రహ్మసూత్రాలను, నిరాకారుడైన పరమాత్మ, శరీర ధారణ చేసినపుడు యేర్పడే సమస్యలను చర్చిస్తాయి. గనుక, 'శారీరక సూత్రాలని' కూడా వ్యవహరించబడుతున్నాయి. ఈ సూత్రాల సంఖ్య 555. ఒక్కొక్క సూత్రంలో రెండు మూడు మాటలు

మాత్రం వుంటాయి. వ్యాఖ్యాత సహాయం లేకుండా, ఈ సూత్రాల అర్థాన్ని గ్రహించడం కష్టం. వివిధ వ్యాఖ్యాతలు, వివిధ వ్యాఖ్యానాలు చేయటానికి చాలా అవకాశం వుంది.

బాదరాయణ సూత్రాలకు, శంకరాచార్యులు చేసిన వ్యాఖ్యానం అద్వైత సిద్ధాంతానికి ప్రాతిపదికగా సర్వత్రా అంగీకరించబడుతున్నది. కనుక అద్వైత వేదాంతాన్ని శంకర వేదాంతమని గూడా వ్యవహరించవచ్చు.

శంకరాచార్యులు, క్రీ. శ. 788 ప్రాంతంలో మలబారు జిల్లాలోని కాలడి గ్రామంలోని, కఒ నంబూద్రి బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. తండ్రి చిన్నతనంలోనే చనిపోయినందువల్ల, తల్లి సంరక్షకత్వంలో విద్యాభ్యాసంచేసి, చిన్నతనంలోనే సన్యసించాడు. ఉపనిషత్తుల తత్వాన్ని తెలుసుకునే ఉద్దేశంతో దేశయాత్రకు బయలుదేరి, నర్మదా నదీ తీరంలో ఒక ఆశ్రమంలో నివసిస్తున్న గోవిందుడను ఆచార్యుని వద్దకు వెళ్ళాడు. తనకు ఉపనిషత్ సారాన్ని బోధించవలసిందిగా ఆచార్యుని శంకరుడు అభ్యర్థించాడు. శంకరాచార్యులు, పుట్టుకతోనే అద్వైత సిద్ధాంతాన్ని జీర్ణించుకున్నాడని చెప్పేందుకై, శంకర దిగ్విజయాన్ని వ్రాసిన మాధవ విద్యారణ్యులు, ఈ సందర్భంలో ఒక కథ కల్పించారు.

గోవిందుని వద్దకు విద్యాభ్యాసానికై వెళ్ళిన శంకరుడు, ఉపాధ్యాయునికి సాష్టాంగ ప్రణామం ఆచరించాడు. అంతట గోవిందుడు 'నీ వెవరవు' అని ప్రశ్నించగా శంకరుడు యిలా అన్నాడు.

"గురూ ! నేను అగ్నిని కాను, వాయువును కాను, భూమిని కాను నీరును కాను—వీటిలో ఏ ఒక్కటీ కాను. అన్ని దృగ్విషయాలలోనూ అంతర్భూతమై ప్రకాశిస్తున్న బ్రహ్మపదార్థాన్ని స్వామీ" ప్రపంచం వాస్తవమైనదనీ, నీరు, నిప్పు, గాలి, ఆకాశం, భూమి — ఈ పంచభూతాల సంయోగ వియోగాలవల్ల సృష్టి జరుగుతున్నదనీ తెలియజేసే వైశేషిక, సాంఖ్య, బౌద్ధ, చార్వాక సిద్ధాంతాలు నాటికి ప్రబలంగా వున్నాయి. ఈ సిద్ధాంతా లన్నిటినీ ఖండించి, సృష్టికి మూలం పదార్థం కాదని, అసలు పదార్థమే 'మాయ' అని, పరబ్రహ్మ ఒక్కటే వాస్తవ

మైనదని అద్వైతం వాదిస్తుంది. (అద్వైతం=రెండు కాదు ఒక్కటే సత్యం) అద్వైత సిద్ధాంతంయొక్క మూల సూత్రాన్ని స్ఫురింప చేసేందుకే పై కథ కల్పించబడి వుంటుంది

గోవిందుని వద్ద విద్యాభ్యాసం ముగించుకుని, శంకరాచార్యులు కాశీవెళ్ళి పండిత చర్చలను సాగించాడు. పూర్వమీమాంసా సూత్రాలకు వ్యాఖ్యానం చేసిన కుమారిలభట్టును, వాదంలో ఓడించవలెననే ఉద్దేశంతో, ఆయనను కలుసుకోవలెనని బయలుదేరాడు. కాని, అప్పటికే ఆయన మరణించినందున, కుమారిలభట్టు ముఖ్య శిష్యుడు, మధ్యప్రదేశ్‌లోని మాహిష్మతి నగరంలో నివసిస్తున్న మండనమిశ్రుని వద్దకు వెళ్ళాడు. మండనమిశ్రుని సుదీర్ఘ చర్చలలో శంకరాచార్యులు ఓడించగలిగాడని, తద్వారా పూర్వ మీమాంసా సిద్ధాంతం పూర్తిగా అపజయం పొందిందని, శంకర దిగ్విజయంగా కీర్తింపబడ్డది. మండన మిశ్రుడు, శంకరాచార్యుని శిష్యుడై సురేశ్వరాచార్యుడను పేరుతో కొన్ని గ్రంథాలను రచించాడు.

మండనమిశ్రునికి, శంకరాచార్యులకు జరిగిన వాదోపవాదాలలో, మండనమిశ్రుని భార్య, విదుషి అయిన ఉభయభారతి, మధ్యవర్తిగా వ్యవహరించి, శంకరాచార్యుని పక్షాన తీర్పు యిచ్చి, తన భర్తతోపాటు తాను కూడా సన్యసించిందని కూడా పై గాథలో వుంది.

హిమాలయ పర్వతాలనుండి కన్యాకుమారి వరకు సంచారంచేసి, శృంగేరీ, పూరీ, ద్వారక, బదరీనాథ్....అను నాలుగుచోట్ల నాలుగు మఠాలను స్థాపించి, వేలాది శిష్యులను మతప్రచారానికి వినియోగించి, శంకరాచార్యులు తన 32-వ యేట బదరీనాథ్‌లో మరణించెను.

శంకరాచార్యుని జీవితానికి కొన్ని విచిత్ర గాథలు ముడి పెట్టబడి వున్నాయి. ప్రతి మతాచార్యునికి, తత్వవేత్తకు అభిమానశిష్యులచే అంట కట్టబడే ఈ కట్టుకథలకు, మనం ఎట్టి విలువ నివ్వనక్కర లేదు.

## సామాజిక పరిస్థితులు

శంకరాచార్యుని అద్వైత సిద్ధాంతం ప్రాధాన్యత తెలుసుకోవాలంటే, నాటి సామాజిక తాత్విక పరిస్థితులను గమనించాలి. ఉత్తర

హిందూస్థానంలో బలమైన కేంద్ర ప్రభుత్వం లోపించింది. వివిధ ప్రాంతాలను వేర్వేరు చిన్న రాజులు పరిపాలించసాగారు. దక్కన్ పీఠభూమిలో రాష్ట్రకూట రాజులు, ఆంధ్రదేశంలో తూర్పు చాళుక్యులు, తమిళ దేశంలో చోళరాజులు పరిపాలించేవారు.రాజకీయ అల్లకల్లోలాలు, అంతర్యుద్ధాలు సర్వసామాన్యం అయిపోయినవి.బౌద్ధమతం అపభ్రంశమై క్షీణదశలో ఉంది. జైనమతం ఇంకా వ్యాప్తిలోనే వుంది. అనాదిగా వస్తున్న శైవమతం ప్రజలలో బాగా పాతుకుపోయి, కొన్నిచోట్ల కాపాలిక, శాక్తేయ మతాల రూపంలో కొనసాగుతూ ఉంది. వింధ్య పర్వత ప్రాంతాలలో వింధ్యవాసిని పేరుతో దుర్గకు నరబలులు, జంతు బలులు విరివిగా జరిగేవి.

క్షుద్ర ఆచారాలతో దుర్గను పూజించే శాక్తేయమతం, వినాయకుని పూజించే గాణాపత్యం, శివుని కుక్క ఆకారంలో పూజించే మల్లారి మతం దేశం నలుమూలలా వ్యాప్తిలో వుండేవి.

తాత్విక రంగంలో, సాంఖ్యవాద ధోరణి దేశంలో విశేష వ్యాప్తి చెందింది. ప్రకృతి, పురుషుడు—ఇద్దరూ అనాది సిద్ధులు. వీరి కలయిక వల్ల సృష్టి జరుగుతుంది. ప్రపంచం యదార్థమైనది; పరిణామం యధార్థమైనది. మోక్షసాధన మానవుని లక్ష్యం. సమ్యక్ జ్ఞానాన్ని సంపాదించుట ద్వారా మోక్షం లభించగలదు. ఇవి సాంఖ్య తత్వశాస్త్రంలోని ప్రధాన సూత్రాలు.

శైవమతంలోని పాశుపత, లకులీశ, కాపాలిక, శాక్తేయ, కాశ్మీర శైవాది ధోరణుల కన్నిటికీ సాంఖ్యవాదంలోని ద్వైత ధోరణి పునాది. పురుషుని స్థానంలో శైవులు శివుని భావించేవారు. పశుపతి ఆదికారణం మానవులు, ప్రపంచం అంతా పశువులు. మానవులను ప్రపంచానికి బంధించే కామక్రోధ లోభ మద మోహ మాత్సర్యాలు — పాశములు. ఈ పాశముల నుండి విముక్తి, పశుపతి ఆరాధన ద్వారా సాధ్యం— శైవమత ధోరణులలో అంతర్భూతమైన వాదన ఇది.

ఇట్టి పరిస్థితులలో శంకరాచార్యులు, తన నూతన సిద్ధాంతాన్ని ప్రచారం చేయ నారంభించాడు. శంకరుని సిద్ధాంతాన్ని రెండు విభాగా

లుగా పరిశీలించాలి: (1) మతసంస్కరణ (2) తాత్వికరంగంలో సంపూర్ణ భావవాద సిద్ధాంత ప్రచారం.

## మతసంస్కరణ

నరబలుల, జంతుబలుల ద్వారా ఆరాధన చేయడం నీచమని, ఉపనిషత్తులలో ఎక్కడా అట్టి పద్ధతులు అంగీకరించబడలేదని శంకరుడు ప్రచారం చేశాడు. కేవలం ప్రచారం మాత్రమే గాక, అనేకచోట్ల కాపాలిక, శాక్తేయ మతస్థులతో ప్రత్యక్ష చర్చలద్వారాను, మరికొన్ని చోట్ల రాజుల సహాయంతో, బలప్రయోగం ద్వారాను ఆ మతాలను అణచివేయుట ద్వారా కూడా శంకరుడు తన లక్ష్యాన్ని సాధించాడు.

శంకర దిగ్విజయంలో ఒక కథ ఉంది ఉజ్జయిని ప్రాంతంలో శంకరునికి, ఒక కాపాలిక మతాచార్యుడు తారసిల్లాడు. అతడు శరీరం నిండా బూడిద పూసుకని త్రిశూలం ధరించి, పుర్రెను చేత్తో పట్టుకొని వచ్చాడు. ' నరబలులను యిచ్చి, ఎర్రటి మద్యం సేవిస్తే తప్ప భైరవుడు సంతృప్తి పడడు ? నీ వెందుకు ఈ మతాన్ని ఖండిస్తున్నావు' అని ఆ కాపాలికుడు శంకరునితో వాదించసాగాడు. మాటలు ముదిరి, శంకరుని వెంటనే వస్తున్న సుధన్వుడనే రాజు, ఆ కాపాలికునితో యుద్ధానికి తలపడి, అతనిని చంపివేశాడు. క్రకచుడను మరొక కాపాలికుడు వచ్చి యుద్ధానికి తలపడ్డాడు. సుధన్వుడు అతనిని కూడా సంహరించాడు. ఈ విధంగా అనేక కాపాలిక, శాక్తేయ మతస్థులను, రాజుల సహాయంతో శంకరుడు సంహరించి, ఆ మతాల్ని అణచివేసి నట్లు గాథ లున్నాయి.

శైవ, వైష్ణవ విభేదాలను శంకరుడు ఖండించాడు. హిందూ మతంలో ఆరాధించబడే దేవతలందరూ సమానులేనని, ఎక్కువ తక్కువల ప్రసక్తి తెచ్చి ద్వేషాలు పెంచుకోరాదని బోధించాడు. శివుని, విష్ణుని ఇద్దరినీ కీర్తిస్తూ స్తోత్రాలు రచించాడు.

హిందూమతంలోని వివిధ శాఖలమధ్య సమన్వయం కుదర్చడానికి ఒకవైపున ప్రయత్నంచేస్తూ మరొక వైపున బౌద్ధ, జైనమతాలను శంకరుడు తీవ్రంగా ఖండించాడు. వేదాలను, ఉపనిషత్తులను ప్రమా

ణంగా అంగీకరించడం హిందూమత శాఖల కన్నిటికీ సాధారణ ప్రాతిపదిక. బౌద్ధ, జైన మతాలు, వేదాలను ప్రమాణంగా అంగీకరించవు. బౌద్ధ, జైన మతస్థులతో వాగ్వాదాలు చేసి, మధ్యవర్తులుగావున్న రాజులు, శంకరుని పక్షాన తీర్పు యిచ్చిన తర్వాత. విజయ సూచకంగా బౌద్ధ, జైన మతస్థుల ఆస్తులను, మఠాలను శంకరుడు స్వాధీనం చేసుకున్నట్లు పెక్కు ఉదాహరణ లున్నాయి.

కులవిభేదాలపట్ల శంకరుని వైఖరిని తెలియజేసే ఒక గాధను పరిశీలిద్దాం. ఒకరోజున శంకరాచార్యులు. శిష్యులతో కలిసి కాశీలో ఉదయాన గంగానదికి స్నానానికి వెళ్తున్నాడు. ఎదురుగా ఒక హరిజనుడు కుక్కను పట్టుకుని వస్తున్నాడు. వెంటనే శంకరుని శిష్యులు, అతనిని చూసి 'బ్రాహ్మణులు వస్తున్నారు. పక్కకు తప్పుకోవలసింది, అని హెచ్చరించారు. అంతట ఆ హరిజనుడు ఇలా ప్రశ్నించాడు: "అందరిలో ఉన్న ఆత్మ ఒకటే కదా. ఎందుకీ భేదభావం?" ఈ వాదనకు శంకరుడు ఆశ్చర్యపడ్డాడట. ఆ హరిజనుడు చెప్పిన మాట వాస్తవమేనని, అద్వైత సిద్ధాంతాన్ననుసరించి కులభేదాలు పాటించగూడదని, అయితే అంతటి అద్వైతసిద్ధి మన కింకా లభించలేదు కనుక, లోకవ్యవహారానికి మనం కట్టుబడి కులవిభేదాలను పాటించవలసి ఉంటుందని శంకరుడు తన శిష్యులకు సమాధానం చెప్పాడు. లోకవ్యవహారానికి కట్టుబడి ఉండాలనే రాజీధోరణి ఒక వైపున, సాంఘిక నియమాలకు అతీతంగా ఊహించగల విశాలదృష్టి అలవర్చుకోవలసి ఉంటుందని మరొక వైపున, ఈ రెండూ పై సమాధానంలో ద్యోతకమవుతున్నాయి. కాగా శంకరాచార్యుని శిష్యులందరూ, కులాచారాలను సమర్థిస్తూనే వచ్చారు. అద్వైత తాత్విక ధోరణిని, కులభేదాలకు అతీతంగా వర్తింపచేయగల విశాలదృష్టి ఎక్కడా కనబడలేదు.

## శూన్యవాదం - అద్వైతవాదం

శంకరుని మత సంస్కరణకంటె ప్రధానమైనది. ఆయన తాత్విక సిద్ధాంతం, హిందూ తత్వశాస్త్రంలోని వివిధ శాఖలకంటె ఉన్నతమైనదిగా శంకరుని అద్వైత సిద్ధాంతం, నేటి భావవాద తాత్విక ప్రపంచంలో

గుర్తించబడుతున్నది. భారతీయ తత్వశాస్త్రం అంటే అద్వైతమేనన్నట్లు ప్రపంచంలో భావించబడుతున్నది. కనుక అద్వైత తాత్విక సిద్ధాంతాన్ని గురించి లోతుగా పరిశీలించడం అవసరం.

శంకరాచార్యునికి పూర్వమే, అద్వైత ధోరణులు తలయెత్త సాగినవి. క్రీ. శ. 650 లో జీవించి, వాక్యపదీయమను తాత్విక గ్రంథాన్ని రచించిన భర్తృహరి. ప్రారంభంలో మాధ్యమిక వాదానికి చెందిన బౌద్ధమతస్థుడుగా ఉండి; తర్వాత, అద్వైత వేదాంతిగా మారాడు. భర్తృహరి అనేకసార్లు బౌద్ధమతాన్ని స్వీకరించడం, వదలడం జరిగిం దనీ, చివరకు అద్వైతిగా మరణించాడనీ-ఈ-సింగ్ అను చైనా యాత్రి కుడు తెలియజేస్తున్నాడు.

భర్తృహరివలెనే క్రీ. శ. 730 ప్రాంతంలో జీవించిన గౌడ పాదుడు. కూడా, బౌద్ధమతం పట్ల విశేషాభిమానం కలవాడు. గౌడపాదుడు శంకరుని గురువైన గోవిందుని గురువు: అనగా శంకరునికి పరమ గురువు. విస్మృతిపథాన పడిపోయిన అద్వైత ధోరణిని ఉద్ధరించినవాడు గౌడపాదుడేనని, శంకరాచార్యుడు అనేక సందర్భాలలో శ్లాఘించాడు. గౌడపాదుడు. నాగార్జునుడు వాడిన అనేక తాత్విక పదజాలాన్ని అదే రకంగా వాడే వాడు. తన మాండూక్యకారికలో అనేకచోట్ల బుద్ధుని, గౌరవపురస్సరంగా ప్రస్తావించాడు. గౌడపాదుడు ప్రారంభంలో బౌద్ధ మతస్థుడని కొందరు భావిస్తున్నారు.

అద్వైతానికి. శూన్యవాదానికి పోలికలు వ్యత్యాసాలూ, రెండూ ఉన్నాయి.

సత్యాన్ని, వ్యావహారిక సత్యం, పారమార్థికసత్యం అని శంకరుని విభజన విపృత్తిసత్యం, పారమార్థికసత్యం అని నాగార్జున విభజన. ఇది పోలిక. పారమార్థిక సత్యం అంతిమ పరిశీలనలో శూన్యం అని నాగార్జు నుని వాదన. శాశ్వత బ్రహ్మ పదార్థం, ఒక్కటే పారమార్థిక సత్య మని శంకరుల వాదన. ఇది వ్యత్యాసం.

సత్యాన్ని రెండుగా విభజించుట ఉభయులూ చేసే పొరపాటు. అంతకు ముందు ఏ తాత్విక ధోరణిని బట్టి విభజన చేయలేదు. ఈ విభ జన పూర్తి అశాస్త్రీయం. మానవుని చిత్తవృత్తులు సత్యానికి గీటు

రాయి కాదు. మానవునితో ప్రమేయంలేని భౌతిక వాస్తవిక సత్యానికి పునాది.

ఈ పునాదిని వదులుకున్న శూన్యవాద, అద్వైత వాదాలురెండూ పోయి పోయి, తత్వశాస్త్రంలో అనేకమైన సుడిగుండాలు సృష్టించాయి. అవి వినూత్న పరిశోధనలనే భ్రమలను సృష్టించాయి. మనో వికాసానికి తోడ్పడ వలసిన తత్వ శాస్త్రాన్ని మాయాజాల సృష్టికి సాధన చేశాయి.

## విజ్ఞానవాదం

మేధావులలో అనాడు ప్రబలంగా వున్న మరొక దోరణి బౌద్ధ విజ్ఞాన వాదం. విజ్ఞానవాద బౌద్ధానికీ, ఆది బౌద్ధానికి హస్తి మశకాంతరం వుంది. ఆది బౌద్ధం ప్రపంచం వాస్తవమని అంగీకరించింది. విజ్ఞానవాదబౌద్ధం ప్రపంచ వాస్తవికతను నిరాకరించింది. ప్రతి వస్తువు ఉనికి క్షణికమని మరుక్షణంలో అది రూపాంతరం చెందుతుందని ఆది బౌద్ధ తెలియ చేస్తుంది విజ్ఞానవాదం పై వాదనలో మొదటి భాగాన్ని మాత్రం స్వీకరించింది. క్షణికమైన బాహ్య వస్తువులకు ఉనికి అసాధ్యమని త్రోసి వేసింది. బాహ్యవస్తువులు మానసిక ప్రవృత్తులకు ప్రతిబింబాలుమాత్రమే నని, మానసిక ప్రవృత్తుల కలయికకు, ఆలయ విజ్ఞానం అని విజ్ఞాన వాదులు పేరు పెట్టారు.

వీరు బాహ్య ప్రపంచపు ఉనికిని పూర్తిగా నిరాకరించే ఆత్మాశ్రయ భావవాదులు.

శంకరులు, వీరి వాదనలను, తర్కాన్ని ఆధారంగా చేసుకుని విమర్శించారు. బాహ్య వస్తువులు కేవలం స్వాప్నిక సత్యములని త్రోసి పుచ్చుట సరికాదన్నారు. అన్నం తిన్నప్పుడు కడుపు నిండుతున్నది. గోడ తలకు తగిలినపుడు దెబ్బ తగులుతున్నది. కనుక అన్నం తినటం, గోడకు ఢీకొనడం స్వాప్నికసత్యాలెలా కాగలవు. వీనికి శంకరులు, వ్యావహారిక సత్యం అను ఒక కొత్త మాటను వాడారు. అటు స్వాప్నిక సత్యానికి, ఇటు పారమార్థిక సత్యానికి ఇది మధ్యే మార్గం.

బౌద్ధ విజ్ఞానవాదులను విమర్శించే సందర్భంలో, శంకరుడు బాహ్య ప్రపంచ వాస్తవికతను అంగీకరిస్తున్నాడా అనిపిస్తుంది. కాని వ్యావహారిక సత్యానికి, 'మిధ్య' అని శంకరుడు పెట్టిన పేరు. దాని కిచ్చిన నిర్వచనం చూసినపుడు యీ భ్రమ తొలగిపోతుంది. వేద ప్రామాణ్యాన్ని నిరాకరించిన బౌద్ధులను విమర్శించుటకు మాత్రమే స్వాప్నికి సత్యంకంటె భిన్నమైన వ్యావహారిక సత్యాన్ని శంకరుడు ప్రతిపాదించాడు. ఆ పని ముగిసిన వెంటనే, దానిని 'మిధ్య' అని త్రోసి పుచ్చాడు. మూలంలో బౌద్ధ విజ్ఞానవాదుల వలెనే, శంకరుడు కూడా ఆత్మాశ్రియ భావ వాదాన్నే ప్రతిపాదించాడు.

## పదార్థం వాస్తవమా? కాదా?

పదార్థం, భావం ఈ రెంటిలో ఏది ప్రాథమికం అన్న సమస్య, తత్వశాస్త్రాల కన్నిటికి ప్రాథమిక సమస్య. బౌద్ధ, జైనమతాలు, సాంఖ్య, వైశేషిక దర్శనాలు, పదార్థం వాస్తవమనీ, అనాది సిద్ధమనీ, ఇది ఎవరిచేతా సృష్టించబడలేదనీ అంగీకరించాయి. కాని అద్వైతమతం, పదార్థం వాస్తవమన్న ప్రాథమిక సత్యాన్ని నిరాకరించింది. అలా నిరాకరించటానికి శంకరాచార్యులు ఈ క్రింది వాదనలను ప్రతిపాదించాడు:

ప్రపంచం అంతా చైతన్య సహితమైంది. ఒక పథకం ప్రకారం ఉద్దేశం ప్రకారం యిది నడుస్తున్నది.

ఇట్టి ప్రపంచానికి మూలకారణం చైతన్య రహితమైన జడ పదార్థం కాజాలదు. కనుక పదార్థం పరిణామంచెంది చైతన్యం ఏర్పడుతుందన్న చార్వాక వాదం. అణుసంయోగంవల్ల పరిణామం జరుగుతుందన్న వైశేషికవాదం రెండూ తప్పు. సాంఖ్యులు పురుషుని అంగీకరించినా, సృష్టికర్త అయిన ఈశ్వరుని అంగీకరించరు. చైతన్యాన్ని అంగీకరించి, సృష్టికర్తను అంగీకరించకపోవడం స్వయం బాధితం. ఘటనలన్నీ క్షణికములనీ, కార్య కారణ సంబంధంద్వారా సృష్టి జరుగుతుందని బౌద్ధుల వాదన. క్షణికమైనదేదీ సత్యము కాజాలదు. ప్రపంచ

మంతా బ్రహ్మమయం. బ్రహ్మ ప్రపంచంకంటె అతీతుడు. బ్రహ్మ ఒక్కటే సత్యం. పదార్థం, ప్రపంచం అంతా అసత్యం — ఇదీ అద్వైతుల వాదం.

ఈ విషయాన్ని హేతువాదం ద్వారా నిరూపించటం సాధ్యమా? సాధ్యం కాదు? కనుకనే, శబ్ద ప్రమాణమే పరమ ప్రమాణమనీ, ఉపనిషత్తులపట్ల దృఢవిశ్వాసం అద్వైత సిద్ధాంతానికంతా మూలమనీ శంకరాచార్యుడు ప్రసాదించాడు. తర్కపాండిత్యం ఉపనిషత్ సారాన్ని గ్రహించటానికేగాని, తిరస్కరించటానికి కాదు. తర్కం ద్వారా బ్రహ్మపదార్థ నిరూపణ సాధ్యంకాదు. అలా సాధ్యమని నిరూపించ యత్నించిన న్యాయశాస్త్రాన్ని శంకరుడు ఖండించాడు.

బ్రహ్మ అంటే ఎవరు? సృష్టికర్తయేనా? అయితే ఈ సృష్టి ఎందుకు చేసినట్లు? బ్రహ్మకు కూడా రాగద్వేషాలు, మానాభిమానాలు వున్నవా? బ్రహ్మ సాకారుడా, నిరాకరుడా? సగుణుడా, నిర్గుణుడా?

ఈ ప్రశ్నలకు అద్వైతం యిలా సమాధాన మిస్తుంది: వ్యావహారిక దృష్టిలో సృష్టికర్త ఈశ్వరుడు. కనుక ఈశ్వరుడు, ఆ దశలో సాకారుడు, సగుణుడు. సామాన్య ప్రజలు దేవుని పూజించటం, విగ్రహారాధన చేయటం వ్యావహారిక దృష్టిలో సమంజసమే.

ఇది అఖండ సత్యం కాదు. సృష్టి ఈశ్వరుని తటస్థ లక్షణం మాత్రమే, స్వరూప లక్షణం కాదు. అనగా యాదృచ్ఛికంగా వచ్చిన లక్షణం మాత్రమే. ఒక గొర్రెల కాపరి నాటకంలో రాజు వేషం ధరించినంత మాత్రాన నిజంగా రాజు కానట్టే, నిరాకారుడైన బ్రహ్మ, యాదృచ్ఛికంగా సృష్టికర్త బాధ్యతను నిర్వర్తించినా, అతని అసలు స్వభావానికి ఏమీ భంగంరాదు. అయితే అసలు స్వరూపం ఏది? సత్యం. జ్ఞానం, అనంతం—బ్రహ్మ అసలు స్వరూపం. అసలు స్వరూపాన్ని గ్రహించాలంటే, మనం పారమార్థిక దృష్టి అలవర్చుకోవాలి. ఈ అఖండసత్యాన్ని, లౌకికపదజాలంతో వర్ణించడం కూడా సరికాదు. అందుకనే ఈ పరబ్రహ్మను, నిరాకార, నిర్గుణ, నిరంజన అనే వ్యతిరేకార్థాలలో మాత్రమే గ్రహించగలం (ఆకారం, గుణం, మార్పులేని

సఠాస్థం) వ్యావహారిక దృష్టిని అధిగమించనిదే, పారమార్థిక దృష్టి అలవడదు. సామాన్యప్రజలు, గ్రామదేవతల దగ్గరనుండి శివుని, విష్ణుని వరకు వివిధరూపాలలో పూజించటంలో తప్పులేదు. అదే పరమ సత్యమని మాత్రం భ్రమించకూడదు. పారమార్థిక దృష్టిని అలవరుచుకునేందుకు. నిరంతరం కృషిచేయాలి. పారమార్థిక దృష్టికి వ్యావహారిక దృష్టి ఒకమెట్టు, దశ.

## పన్నెండవ అధ్యాయం

# ఆత్మాశ్రయ భావవాదం

నిరాకార నిర్గుణ పరబ్రహ్మ, ఈ సృష్టిని ఎందుకు చేసినట్లు? సృష్టి మాయఅని అద్వైతులవాదన. మాంత్రికుడు, కనుకట్టు విద్య ద్వారా రూపాయిలనుచేసి, మామిడిమొక్కలను మొలిపించి ప్రజలను మోస పుచ్చినట్లు, మాయావియైన పరబ్రహ్మ, తన మాయద్వారా సృష్టిని సాగి స్తున్నాడు. ఈ సృషి నిజమని మనం భ్రమిస్తున్నాం. పరబ్రహ్మకు అట్టి భ్రమలేదు. చీకట్లో తాడునుచూసి, పాము అని భ్రమించినట్లే (రజ్జు సర్పభ్రాంతి,) యీ భ్రమ ఏర్పడుతున్నది. ఈ భ్రాంతిని అద్వైతులు అవిద్య అని పిలిచారు.

మాయ బ్రహ్మకు సహజమైన యాదృచ్ఛిక లక్షణం. అగ్నినిని. దహనశక్తిని వేరుచేయటం సాధ్యంకానట్లు, బ్రహ్మను, మాయను వేరు చేయటం సాధ్యంకాదు ఈ మాయనే అద్వైతులు ఒక్కొక్కసారి ప్రకృతి అని కూడా వాడారు.

నిరాకార నిర్గుణ పరబ్రహ్మ, మాయద్వారా సాకార సగుణ ప్రపంచాన్ని యెలా సృష్టించగలడు? సాధ్యమా? తర్కసూత్రాల ద్వారా నిరూపించగలమా? అద్వైతులు కొన్ని ఉపమానాలద్వారా ఇదినిరూపించ యత్నిస్తున్నారు. చంద్రబింబం ఒక్కటే; వేర్వేరు అద్దాలలో వేర్వేరు

ఏకాలగా స్పష్టంగా. అస్పష్టంగా కదలుతున్నట్లూ స్థిరంగా వున్నట్లు కనబడ్డట్లే. అవిద్య అను అద్దంపై పరబ్రహ్మ ప్రతిబింబాలు పడుతుంటాయి. ఈ ప్రతిబింబాలే వివిధ జీవులు. జీవులలోగల ప్రత్యగాత్మలు. ఇది బింబ ప్రతిబింబవాదం.

అనంతమైన పరబ్రహ్మ, మాయచే కొన్ని పరిమితులలోకి, ఆకారాలలోకి కుదించబడుతున్నాడు. అతని బింబ ప్రతిబింబాలే ఈ విశాల సృష్టి. అనంతమైన ఆకాశం, ఒక గదిలో, కుండలో. పాత్రలో కుదించబడినట్లే అనంత పరబ్రహ్మ వివిధ జీవులలోను కుదించబడుతున్నాడు. ఈ పరిమితులను, అడ్డుగోడలను గుర్తించి, వాటికి అతీతుడైన పరబ్రహ్మను గ్రహించుటే జీవితలక్ష్యం. ఇది అవచ్ఛేదక వాదం.

మాయవలన సృష్టి యేర్పడుతుందనిచెప్పే అద్వైతులు, మాయతో కూడిన పరబ్రహ్మను నాలుగు దశలుగా విభజిస్తారు. సృష్టికి పూర్వం, మాయ యింకా ఏర్పడక పూర్వం పరబ్రహ్మ. ఈశ్వరుడు- ఇతడు సర్వవ్యాపకుడు. సర్వతంత్రుడు. సృష్టించగల శక్తిఉన్నది. కాని వినియోగంలోకి రాలేదు. నిగూఢశక్తిగా మాత్రమే అదిఉంది. మాయతో కూడిన పరబ్రహ్మ హిరణ్యగర్భుడు ఇది రెండవదశ. సృష్టి పూర్తి అయిన తర్వాత, చరాచర జీవప్రపంచంతో కూడిన పరబ్రహ్మ, వైశ్వానరుడు లేక విరాట్పురుషుడు: ఈ మూడుదశలు గడిచిన తరువాత, తిరిగి తన స్వస్థితికి వచ్చినప్పుడు పరబ్రహ్మ. ఈ పరబ్రహ్మ పరిణామాన్ని గాఢనిద్ర, కలలతో కూడిన నిద్ర, మెలకువ_అను మూడు దశల క్రింద కూడా విభజించి వివరిస్తుంటారు.

## సృష్టి వాస్తవమా ?

సృష్టి వాస్తవమా, కాదా? ప్రకృతి పురుషుల సంయోగంవల్ల పరిణామం జరుగుతున్నదని చెప్పిన సాంఖ్యులు, పరిణామం వాస్తవమని అంగీకరించారు. అయితే కార్యం, కారణంలోనే బీజరూపంలోనే ఉంటుందని, కనుక ఇంతకు పూర్వంలేని నూతనత్వం ఆవిర్భవించటం అసంభవమని అన్నారు.

పరిణామంలో నూతనత్వం ఏమీ లేదు అనే సత్కార్యవాదాన్ని శంకరాచార్యులు అంగీకరించి, నూతనత్వం ఆవిర్భవించటంలేదు కనుక, అసలు పరిణామమే వాస్తవం కాదనీ, పరిణామం అంతా మిథ్య అనీ తేల్చివేశాడు. ఈ వాదాన్ని వివర్తవాదం అంటారు. శంకరుని వాదం యిది:

కుండ, మన్ను ప్రస్తుతం ఒకటే. ఉంగరం, బంగారం వస్తుతః ఒకటే. రూపంలో మాత్రమే తేడావుంది. రూపంలో వచ్చిన తేడా వాస్తవమని అనగలమా? కొత్తదనం ఏమీ ఆవిర్భవించదని ఒక వైపున అంగీకరిస్తూ, రూపంలో మాత్రం కొత్తదనం ఆవిర్భవించింది అనటం సరియైనదా? కాదు. ఈ రూపంకూడా ఇంతకు పూర్వం ఉన్నదై వుండాలి? లేక భ్రమ అయివుండాలి.

కంటికి కనబడే ఆకారాన్ని, భ్రమ అని తోసివేయటం సాధ్యమా? బాహ్యదృష్టికి ఇది సాధ్యంకాదు. తార్కిక దృష్టికి సాధ్యమే. ఆకారం వస్తువు యొక్క అవస్థాభేదం తప్ప మరొకటి కాదు. అట్టి ఆకారంలో వచ్చే మార్పు తార్కికదృష్ట్యా వాస్తవమా? కాదు.

బాహ్యదృష్టికి కొన్ని రూపవిభేదాలు కనబడ్డా, ఈ భేదాలను వాస్తవ సత్యాలుగా భావించరాదు. మార్పు అంతా అవాస్తవం. కొన్ని మార్పులు, అసత్యాలని మనం తేలికగా తెలుసుకుంటాం. సూర్యుడు కదులుతున్నట్లు కనబడతాడు. కాని కదలటంలేదని మనకు తెలుసు. కుండ, కుర్చీ, వేరువేరు వస్తువులుగా బాహ్యదృష్టికి కనబడేమాట మాట నిజం. తార్కికదృష్ట్యా ఆ రెంటికి గల భేదం వాస్తవమైనది కాదు.

వస్తువు, రూపం, రెండూ మారుతుంటాయి అని బౌద్ధం. వస్తువు మారదు, రూపం మాత్రం మారుతుందని సాంఖ్యం. వస్తువు రూపం ఏదీ మారదు. మార్పు కేవలం మిథ్య అని అద్వైతం.

# వాస్తవికత అంటే ఏమిటి?

ఇంతటి అయోమయ ధోరణులకు కారణం వాస్తవికతను గురించిన అద్వైతుల పొరపాటు అవగాహన ఏది వాస్తవం, సత్యం అనే ప్రశ్నకు, శంకరాచార్యులు ఇలా అంటారు :

కుండ లేక ఉంగరం ఒక వస్తువు. నిజానికి కుండ మట్టి యొక్క ఆకారవిశేషం మాత్రమే. అసలు వస్తువు మట్టి. అలానే బంగారం. కాని నిజానికి మన్ను, బంగారంకూడ అసలు వస్తువు కాదు. అవికూడా అనేక మూలపదార్థాలు కలయికవల్ల ఏర్పడే వస్తువులు మాత్రమే. ఆ మూలపదార్థాలు సైతం, అనేక వికారాల (మార్పు)కు లోనవుతూ వుంటాయి. కనుక అవి అసలు వస్తువులు కావు. మార్పులేకుండా అన్ని వస్తువులకు మూలమైన దేదో అదే వాస్తవికత సత్యం. ఉనికి. 'సత్తు' ఒక్కటే, అన్ని పదార్థాలకు మూలమని పై విచారణద్వారా తేలగలదు. పదార్థం అవాస్తవం, ఆ పదార్థం యొక్క ఉనికిమాత్రం వాస్తవం

జగత్తులోని చరాచర వస్తువులకు భౌతిక మానసిక ప్రపంచానికంతా ఉనికి సామాన్య లక్షణం. భౌతిక వస్తువులకు మాత్రమే కాదు, భ్రాంతికి సైతం ఉనికి వున్నది.

ఉనికికి (సత్తు) ఆకారం లేదు. వేర్వేరు ఆకారాలలో కనబడుతుంది. విభాగాలు లేవు. అనేక విభాగాలుగా కనబడుతుంది. ఇది అనంతం. కాని కొన్ని పరిమితులలో వ్యక్తమౌతుంది. దానికి మార్పులేదు కాని మారుతున్నట్లు కనబడుతుంది. ఇది నిరాకార, నిర్వికార నిర్విశేష పరబ్రహ్మ. ఇది ఒక్కటే పరమసత్తు, పారమార్థికసత్తు.

ఈ పరమసత్తు చైతన్య సహితమా? రహితమా? ఇది స్వయం ప్రకాశమానం. ఇది అన్నిటిలోను ఉండేది. దీనిలో వైరుధ్యాలు లేవు. ఇది నిరంతరాయం (అనువృత్తిగా) జీవించి ఉంటుంది.

ప్రపంచమంతా మాయ, మిధ్య. అందుకు సందేహం లేదు. కాని అలా అనుకుంటే లోక వ్యవహారంలో మనుష్యులు ఒక్క అడుగు కూడా వేయలేరు కనుక శంకరుడు, సత్తును మూడురకాలుగా విభజించాడు.

మన అనుభవాలన్నిటినీ మూడు రకాలుగా విభజించవచ్చు: (1) కలలో మనం ఏవో అనేక విషయాలు చూస్తాం. నిద్రమేల్కొన్న వెంటనే, అవి అసత్యాలని గ్రహిస్తాం. ఇవి క్షణికమైన భ్రాంతిని కలిగిస్తాయి. ఇది ప్రాతిభాసిక సత్తు. (2) మనం మేల్కొని ఉన్నప్పుడు, నిత్యజీవితంలో అనేక అనుభవాలను పొందుతాం. ఈ అనుభవాలే మన లౌకిక జీవితానికంతా పునాది. వీటిని నిరాకరించటం అసంభవం. కనుక ఇవి అంతా వ్యావహారిక సత్తు. (3) ఈ అనుభవాల కన్నిటికీ అంత ర్వ్యాప్తమైన, చలనరహితమైన సత్తును, జ్ఞానదృష్టి ద్వారానే తెలుసు కోగలం. ఇది పారమార్థిక సత్తు.

ఈ వాదనలోని బలహీనతను నైయ్యాయికులు నిశితంగా విమర్శించారు.

వ్యావహారిక సత్యం ప్రాతిపదికగా, స్వాప్నిక సత్యాన్ని నిరాక రిస్తున్నావు. మరొక ప్రాతిపదికపై వ్యావహారిక సత్యాన్ని నిరాక రిస్తున్నావు. ఇది తర్కబద్ధంగాదు. సత్యం మానసిక స్థాయీ భేదముచే నిర్ణ యించబడునది కాదు. అది భౌతికం.

మానవుడు రూపొందక ముందే భౌతిక ప్రపంచం ఉంది. భౌతిక ప్రపంచం ముందు, మానవుడు తర్వాత, ఈ మౌలిక సత్యాన్ని త్రోసి పుచ్చటం, అద్వైతంలోని ప్రధాన లోపం.

## వస్తువు - గుణములు

వస్తువుకు, దాని గుణములకు గల సంబంధాన్ని తెలిసికొనుట తత్వ శాస్త్రంలోని ప్రధాన సమస్యలలో ఒకటి.

శంకరుడు యిలా వాదిస్తాడు: నేను చూస్తున్నాను, నేను వింటు న్నాను. నేను నడుస్తున్నాను—అని అంటాం. నేను బాగా నిద్రపోయి నాను. నేను మంచి కలగన్నాను అని అంటాం. అనగా జాగ్రదావస్థ, నిద్రావస్థ, స్వప్నావస్థ లన్నిటికీ అతీతమైన "నేను" ఒకటి ఉన్న దన్న మాటేగదా. మరొక వాదన: నీరు, ఆవిరి మంచు మూడు రూపాంతర ములున్నవి. ఈ మూటికి మూలం ఏది? కొందరు నీరనవచ్చు, కొందరు

మంచు అనవచ్చు, మరికొందరు ఆవిరనవచ్చు.అది వారి దృష్టి భేదము ననుసరించి ఉంటుంది. కనుక అది అనిర్వచనీయం. అనిర్వచనీయ జ్ఞానాన్ని బోధాతీత జ్ఞానం ద్వారా మాత్రమే తెలుసుకొనగలం.

ఇందులో మొదటి వాదనను పరిశీలిద్దాం—జాగ్రదావస్థ, స్వప్నావస్థ. నిద్రావస్థలలో జీవించివున్న వ్యక్తి ఒకడున్నాడు. ఆ జీవించి వున్న వ్యక్తియె 'నేను' 'నేను' కూ. నా కార్యములకూ' గల సంబంధం అవయవి-అవయవములకూ గల సంబంధం.

ఇది ఒక గతితార్కిక సంబంధం. క్రీ. శ. 200 నాటి బౌద్ధభిక్షువు నాగసేనుడు, ఈ సంబంధాన్ని ఇలా వివరించాడు :

"అనేకమైన భాగాలు, చక్రాలు, ఆసనము, గుర్రాలు, సారధి మొదలైనవన్నీ కలిసి వున్నప్పుడే రథం ఏర్పడుతున్నది. అలాగే 32 రకాలైన భౌతిక వస్తువులు, పంచభూతాలు కలిసి మానవాకారం ఏర్పడినపుడే, నేను నాగసేనుణ్ణి ఔతున్నాను. కనుక కారణ సముదాయం వలన ఫలితం కలుగుతున్నది." అవయవములన్నీ నశిస్తే, అవయవి కూడా లేదు.

వస్తువును దాని గుణములనుండి వేరుచేసి, గుణములు నశించిన పిమ్మట కూడా దానికి ఉనికి ఆపాదించడం శాస్త్రీయ దృష్టికి విరుద్ధం. యాంత్రికమైన జడాత్మక దృష్టికి చిహ్నం.

## ప్రత్యేక ధర్మం - సామాన్య ధర్మం

ప్రత్యేక వస్తువులలో ఇమిడివున్న సామాన్య ధర్మాన్ని తెలుసుకోటానికి యత్నించడం సరియైనదే. అయితే సామాన్య ధర్మాన్ని మాత్రమే గుర్తించి ప్రత్యేక ధర్మాలను నిరాకరించడం అశాస్త్రీయదృష్టి ఒక వస్తువు యొక్క ప్రత్యేక సామాన్య ధర్మాలకు గల సంబంధం గతితార్కికసంబంధం ఒక దాని నుండి మరొక దానిని విడదీయుట సాధ్యంకాదు;

శంకరునికి పూర్వీకులైన వైశేషికులు, ఈ క్రింది ఉదాహరణ ద్వారా ప్రత్యేక, సామాన్య ధర్మాల సంబంధాన్ని నిరూపించారు.

ఆవు, మేక. గొర్రె, గుర్రం మొదలైనవన్నీ నాలుగు కాళ్ళ జంతువులు. ఈ జంతువు లన్నింటికీ సామాన్య ధర్మం, అవి నాలుగు కాళ్ళను కలిగి ఉండటం. మిగతా లక్షణాలన్నీ, ఆవు పాలనిస్తుంది. గుర్రం స్వారీ కుపయోగ పడుతుంది. మొదలైనవన్నీ ప్రత్యేక ధర్మాలు. కొన్ని ప్రత్యేక ధర్మాలు కలిగిన వస్తువుల నొక చోటచేర్చి. పోల్చి పరిశీలించినపుడే వానిలోని సామాన్య ధర్మం ద్యోతకమౌతుంది. ప్రత్యేక ధర్మాలతోబాటు, ఏదో ఒకటి, లేక కొన్ని సామాన్య ధర్మాలు ఉండటం వలననే అసలు పోలిక సాధ్యమౌతుంది. అన్నీ ప్రత్యేక ధర్మాలే అయి, సామాన్య ధర్మాలు లేకపోయినా. అన్నీ సామాన్య ధర్మాలే ఉండి, వైవిధ్యం, ప్రత్యేకత లేకపోయినా పోలిక సాధ్యమే కాదు.కనుక ప్రత్యేక ధర్మాలు, సామాన్య ధర్మాలలో ఒకటి వాస్తవం, రెండవది అవాస్తం అని భావించటంసరికాదు.ఈ రెంటికీగల సంబంధం సమవాయ సంబంధం. ఈ రెండూ ఆయుత సిద్ధ శక్తులు.

వైశేషికులు, ఈ క్రింది ఉదాహరణ లిచ్చారు. దారాలన్నీ కలిపితే, వాటికి వస్త్రత్వం ఏర్పడుతున్నది, గులాబీకి ఎరుపురంగు, వస్తువుకు చలనం — ఈ మొదలైనవన్నీ ఇట్టి విడదీయ వీలులేని సంబంధాలే.

ఆధునిక గతితర్కంకూడా ప్రత్యేక, సామాన్య ధర్మాలను గురించి ఇదే వైఖరిని అవలంబిస్తుంది.

ప్రత్యేక, సామాన్య ధర్మాలను విడదీసి, ఒకటి వాస్తవం, మరొకటి అవాస్తవం అని నిర్ణయించబూనడం అశాస్త్రీయమయిన జడాత్మక దృష్టికి చిహ్నం. శంకరుని పొరపాటు ఇది.

## వైరుధ్యం వాస్తవికతకు మూలం

శంకరునిలోని జడాత్మక దృష్టికి మరికొన్ని ఉదాహరణలు గమనిద్దాం.

"నాసతో విద్యతే భావః, నా భావో విద్యతే సతః"

"మొదటి నుండీ ఏదైతే ఉన్నదో దానికి అభావం లేదు. మొదటి నుండి ఏదైతే లేదో దానికి ఉనికిలేదు."

ఈ భావం కూడా తప్పు. సృష్టిలో ఇంతకు పూర్వమున్న వస్తువులు నశించి, కొత్తవి పుడుతున్నట్లు మనం నిత్యం చూస్తున్నాం. ఇదే భావాన్ని ఆదిబౌద్ధులు ఇలా తెలియజేశారు.

"ఘటనల సముదాయం గొలుసువలె బంధించబడి ఉంది. ఏదో ఒక కొత్తఘటన నిరంతరం ఆవిర్భవిస్తూ ఏదో ఒక ఘటన నశిస్తూ కాలగర్భంలో కలసిపోతూ వుంటుంది. ఆద్యంతాలు లేకుండా ఈ పరిణామం యిలా సాగుతూనే ఉంటుంది" (నాగసేనుడు: మిలిందపన్హా)

"జీవించేది ప్రతిదీ మరణిస్తుంది. పైకి స్థిరంగా కనబడే పదార్థాలన్నీ నిజానికి అస్థిరములైనవే. ఐక్యత ఉన్నచోట, ఎడబాటుకూడా వుంటుంది. ప్రాణం వున్నచోట, మృత్యువుకూడా ఉంటుంది."

(బుద్ధుడు : ధర్మచక్ర ప్రవర్తన).

ఆధునిక గతితర్కం యీ విషయమై ఇలా తెలియజేస్తుంది

"చిన్న నలుసునుండి పెద్ద వస్తువు వరకు, యిసుక రేణువు మొదలుకొని సూర్యబింబం వరకు, ప్రొటిస్టా మొదలుకొని మానవుని వరకు ఉనికి లోనికి వచ్చుట. ఉనికినుండి బయటకు పోవుట అనే నిరంతర ప్రవాహమే, యెడతెగని, చలనమే, పరిణామస్థితియే ప్రకృతి అంతా."

వైరుధ్యం. కదలిక వాస్తవ ప్రపంచానికి లక్షణమని బౌద్ధుల ప్రాథమిక గతితర్కం, ఆధునిక శాస్త్రీయ విజ్ఞానం కంఠోక్తిగా తెలియజేస్తున్నాయి. మార్పు, కదలిక, నాశనం లేనిదే వాస్తవికత అని శంకరుడు చేసిన ప్రతిపాదన అశాస్త్రీయం.

## సాపేక్షక సత్యం – అఖండ సత్యం

దృష్టిభేదమును బట్టి సత్యం ఆధారపడి ఉంటుందనీ, అసలు సత్యం అనిర్వచనీయమనీ శంకరుని వాదం. మనదృష్టి పరిచ్ఛిన్నమనీ,

జ్ఞానం అపరిచ్ఛిన్నమనీ, పరిచ్ఛిన్నబుద్ధితో, అపరిచ్ఛిన్న జ్ఞానాన్ని సంపాదించడం సాధ్యం కాదని కూడా శంకరుడు వాదిస్తాడు. ఇది కూడా పొరపాటే.

ఈ సమస్యకు ఆధునిక గణితతర్కం యిలా సమాధాన మిస్తుంది: దృష్టి భేదాన్నిబట్టి, అధికారి సామర్థ్యాన్నిబట్టి వ్యక్తి గ్రహించే జ్ఞానానికి పరిమితులున్నమాట. విశ్వజ్ఞానం అఖండ మనేమాట కూడా వాస్తవమే. అయితే మనకుగల పరిచ్ఛిన్న, పరిమిత బుద్ధితోనే అఖండ జ్ఞానాన్ని తెలుసుకోగలం. అఖండ జ్ఞానానికి, సాపేక్షక జ్ఞానమే కొలబద్ద, మరొక మార్గం లేదు. సాపేక్షక జ్ఞానాన్ని నిరసించి, అఖండజ్ఞానం అనిర్వచనీయం అని చెప్పటం శాస్త్రీయదృష్టికి చిహ్నంకాదు.

సాపేక్షక జ్ఞానం అంటే, సంశయజ్ఞానం కాదు. భ్రమ కాదు. శంకరుని వ్యావహారిక సత్తను, ఆధునికమైన సాపేక్షక జ్ఞానంతో పోల్చడం సరికాదు.

## జ్ఞానసిద్ధాంతం

శంకరుని ఇతర సిద్ధాంతాలవలెనే జ్ఞానసిద్ధాంతం కూడా. వాస్తవిక ధోరణులను పూర్తిగా తిరస్కరిస్తుంది. పంచేంద్రియాలద్వారా, మనం ప్రపంచజ్ఞానం సంపాదించగలమని భౌతికవాద జ్ఞానసిద్ధాంతం తెలియజేస్తుంది.

భారతీయ తాత్విక ధోరణులలోని వైశేషిక, సాంఖ్య, బౌద్ధ సిద్ధాంతాలు పంచేంద్రియాలను, జ్ఞానసాధనకు మూలంగా అంగీకరించాయి. ప్రత్యక్ష ప్రమాణానికి అవి ప్రాధాన్యత యిచ్చాయి.

శంకరాచార్యుడు, ప్రత్యక్ష ప్రమాణాన్ని జ్ఞానసంపాదన కొక మార్గంగా అంగీకరించినా, ప్రధానమార్గంగా మాత్రం అంగీకరించలేదు.

ఇంద్రియాలు మోసంచేస్తాయి అన్న ప్రాతిపదిక శంకరుని సంశయవాదికంతా మూలం. తాడును చీకట్లో మనం పామని భావిస్తున్నాం: మన కళ్ళను మనం ఎలా నమ్మడం? ఈ సంశయానికి వైశేషికులు, పూర్వమీమాంసకులు తేలికగానే సమాధానం చెప్పారు. బాహ్యకారణ

మైన చీకటివల్ల ఈ భ్రాంతి ఏర్పడుతున్నదనీ, అయినా ఎల్లప్పుడూ జరగదు. అది ఒక అసాధారణ విషయం మాత్రమేననీ వైశేషికులు అన్నారు. పూర్వ మీమాంసకులు మరొకడుగు ముందుకువెళ్ళి, విచక్షణను ఉపయోగించకపోవటం మన బుద్ధిలోపం కాని, కళ్ళలో ఏమీ లోపం లేదన్నారు.

శంకరాచార్యుడు యివేవీ అంగీకరించడు. తాడును పాముగా భావిస్తున్నాం. ఇది నిజంకాదు. ఎదువల్లనంటే, వెలుతురు రాగానే, అది తాడు అని తెలుసుకుంటున్నాం. కాని యిది పూర్తిగా అసత్యంకాదు. క్షణమాత్రమైనా అది పాము అన్న భావం కలిగింది కనుక ఇది ఒక అనిర్వచనీయసృష్టి.

మనం ఒక కుండను చూస్తాం. అది కుండ అని తెలుసుకుంటాం, భౌతికవస్తువైన కుండ ఉనికిని కంటితో చూసి, మనస్సుతో భావిస్తున్నాం. ఇది ప్రత్యక్షజ్ఞానం ఏర్పడే పద్ధతి భౌతిక వస్తువుల వాస్తవికతనే నిరాకరించిన శంకరుడు పై పద్ధతిని ఎలా అంగీకరించగలడు? కనుక శంకరాచార్యులు యిలా అంటారు:

మనం ఒక కుండను చూస్తాం. మన మనస్సులో కుండబుద్ధి (ఘటభావం) ఒకటి అనాదిగా, అస్పష్టంగా ఉంది. ఆ ఘటభావం పైకి ప్రసరించి తన కిరణాలను వస్తువుపైకి పంపుతుంది. అంతట మనం యిది కుండ అని గ్రహిస్తాం. ఈ పద్ధతిని శంకరుడు 'వృత్తి' అని పిలిచాడు. కుండ ప్రధానంకాదు. మన మనస్సులో అనాదిగా వస్తున్న ఘటభావం ప్రధానం.

ప్రత్యక్ష. అనుమాన, శబ్దప్రమాణాలలో-శబ్ద ప్రమాణమే ప్రధానం. అనగా ఉపనిషత్తులలో చెప్పినదే పరమ ప్రమాణం. ఈపద్ధతైనా లౌకికవిద్యలను సంపాదించడానికి ఉపయోగ పడుతుంది. పరవిద్య, ఆధ్యాత్మిక విద్యసంపాదించడానికి ఈ పద్ధతులేవీ పనికిరావు. దానికి తపోపద్ధతి, జ్ఞాననేత్ర వికసన ఒకటే మార్గం.

ప్రత్యగాత్మ, పరమాత్మ ఒకటే. 'తత్ త్వం అసి' (అదే నీవై ఉన్నావు) అన్న వాక్యం అద్వైతసిద్ధాంతానికి మూలం. ఈ జ్ఞానాన్ని సంపాదించినపుడు మోక్షం లభిస్తుంది. ఆత్మ పరమాత్మలో లీనమౌ

తుంది. పునర్జన్మ ఉండదు. కొందరు జ్ఞానులు జీవించి ఉండగానే ముక్తి పొందగలరు. వారు జీవన్ముక్తులు.

భారతీయ తాత్వికధోరణులలో అంతవరకూ వుంటూ వచ్చిన వాస్తవిక వాద, భౌతికవాద అంశాలన్నిటినీ అద్వైతమతం నిరాకరించింది. సంపూర్ణ భావవాద సిద్ధాంతా న్నొకదానిని ఏర్పరచింది. వాస్తవ ప్రపంచాన్ని నిరాకరించి తమ ధోరణిని వితండ వాదంతో సమర్థించుకుంటూ, ఒక ప్రమాదకరమైన ఆలోచనా పద్ధతిని తాత్వికరంగంలో ప్రవేశపెట్టినది

## ఆధునిక పరిశోధనలు - అద్వైతం

ఆధునిక పరిశోధనలు, పదార్థం, శక్తి రూపాంతరాలేనని తెలియ జేస్తున్నాయి. కనుక భావవాదానికి, భౌతికవాదానికి పెద్ద అఖాతం ఉన్న దనుకోవటం తప్పుకాదా అనే ప్రశ్న కలగవచ్చు.

శక్తి, పదార్థాలమధ్య అడ్డుగోడలేవీ లేవనీ, ఒకటి మరొకటిగా మారుతుందనీ ఆధునిక పరిశోధనలు నిరూపించి, గతితార్కికమార్గప్రాశస్త్యాన్ని నిరూపిస్తున్నాయి.

శంకరుని 'సత్తు'కు చలనం, కదలిక, ఆకారంలేవు. అదొక జడాత్మకభావన.

కనుక ఆధునిక పరిశోధనలు, శంకరాద్వైతాన్ని సమర్థిస్తున్నాయని ఎంచటం పొరపాటు.

శాస్త్రీయ విజ్ఞానం ఫలితంగా ఏర్పడిన తార్కిక దృష్టిని మేళవించుకుని అత్యున్నతమైన ప్రాపంచిక దృక్పథాన్నిచ్చేది గతితార్కిక భౌతికవాదం. గతితర్క-ధోరణి ప్రాశస్త్యాన్నివివరిస్తూ ఏంగెల్సు యిలా అన్నారు: "ప్రకృతిని గురించిన ఈ కొత్త దృక్పథంలో ఘనీభవించిన పాత భావాలన్నీ ద్రవీకరించాయి. శాశ్వతమని భావించబడిన ప్రత్యేకతలన్నీ అశాశ్వతములని రుజువైనవి ప్రకృతిఅంతా నిరంతర చలనంలో వర్తుల యానంలో (Spiral) అనంతంగా ముందుకు సాగిపోతుంది.

(ప్రకృతి గతితర్కం - పీఠిక - 43 వ పేజీ)

ఇంతటిఅశాస్త్రీయమైన అద్వైతం అప్యుస్నత తత్వశాస్త్ర ఖ్యాతిని ఎలా పొందింది.

దానికి కారణం అద్వైతంలోని తాత్విక ప్రాశస్త్యం కాదు. అద్వైతానికి పూర్వం మతశాఖలలోని అలౌకిక, జుగుప్సాకర, అమానుష, హింసాకాండ. అద్వైతంలో లేదు. ఇందులోని రాజీ ధోరణి ఎవరికి తోచిన అర్థంవారు కల్పించుకోటానికి అవకాశమిచ్చింది.

వర్ణ వ్యవస్థను, పూర్తిగా బలపరచిన అద్వైతం, పరాధీన రాచరిక సామాజిక వ్యవస్థలో పాలకవర్గ, వర్ణ ప్రయోజనాలకు పూర్తిగా ఉపయోగపడ్డది. ప్రపంచం అశాశ్వతం అనేభావం, సామాన్య ప్రజలను జీవిత కష్టాలతో రాజీపడేట్లు చేయడానికి, పాలకవర్గాల చేతులలో ఒక సాధనగా ఉపయోగపడ్డది.

## పదమూడవ అధ్యాయం

# అద్వైత ధోరణిపై తిరుగుబాటు

అద్వైత ధోరణిపై తిరుగుబాటుగా అనేక తాత్విక ధోరణులు ప్రారంభమైనాయి. రామానుజుని విశిష్టాద్వైతం, మధ్వాచార్యుని ద్వైతం, భాస్కరుని భేదాభేదవాదం, నింబార్కుని ద్వైతాద్వైతవాదం మొదలైనవన్నీ ఈ కోవకు చెందినవే. శంకరుని మాయావాదాన్ని ఖండించి, ఏదో ఒక రూపంలో ప్రపంచ వాస్తవికతను అంగీకరించడం, ఈ ధోరణులన్నింటికీ సామాన్య లక్షణం. అంతులేని తాత్విక చర్చలను నిరుత్సాహపరచి, భక్తిమార్గాన్ని వేర్వేరు మోతాదులలో, పై ధోరణులన్నీ ప్రచారం చేయ బూనుకున్నాయి.

వీరిలో ముఖ్యుడైన రామానుజాచార్యులు, క్రీ. శ. 1017 లో ఉత్తర ఆర్కాట్ జిల్లాలోని శ్రీ పెరంబుదూరులో జన్మించాడు. యుక్త వయస్సు వచ్చిన వెంటనే కంజీవరం (కంచి) లో యాదవప్రకాశుడను అద్వైత వేదాంతి వద్ద విద్యాభ్యాసం ఆరంభించాడు. అప్పటికే రామానుజునికి స్వతంత్ర ఆలోచనా ధోరణి,వైష్ణవ మతాభిమానం ఏర్పడివున్న ఫలితంగా, యాదవ ప్రకాశుని అద్వైతవ్యాఖ్యానాలు, రామానుజునికి నచ్చలేదు. అనేక సందర్భాలలో గురుశిష్యుల మధ్య తీవ్రవాగ్వివాదాలు జరిగి, రామానుజుడు తన గురువును వదలిపెట్టాడు. ఈ వాగ్వివాదాలు

అంతటితో ఆగక, అద్వైతనిందకు పూనుకున్న రామానుజుని, యాదవ ప్రకాశుడు హత్య చేయించ బూనుకున్నాడనీ, అతి ప్రయత్నం మీద రామానుజుడు, తన ప్రాణాన్ని రక్షించుకోగలిగాడనీ కూడా అంటారు.

వైష్ణవ ధోరణి ఆనాటికే దక్షిణ హిందూదేశంలో కొన్ని శతాబ్దాలుగా వ్యాప్తిలో ఉంది. ఆళ్వారు అను పేరుతో పన్నెండుగురు వైష్ణవ భక్తులు క్రీ. శ. 500 నుండి 900 వరకు జీవించి, విష్ణుభక్తిని ప్రచారం చేసే అనేక ప్రబంధాలు రచించారు. వీరిలో అన్ని కులాలవారు, స్త్రీలు వున్నారు. తమ గ్రంథాలను వీరు తమిళ భాషలో వ్రాశారు. వీటిని తమిళ వేదాలని వ్యవహరిస్తారు. వీరు కులభేదాలను ఖండించారు. వైష్ణవ దేవాలయాలలో పన్నిద్దరాళ్వారులను పేరుతో, వీరి విగ్రహాలకు పూజలు జరుగుతున్నాయి. వీరిలో ప్రముఖులైన నమ్మాళ్వార్, పెరియాళ్వార్, ఆండాళ్ అనువారి పేర్లు సంస్కృతీకరించబడి, అనేక కావ్యాలలోకి ప్రవేశించాయి. నమ్మాళ్వార్ శఠకోపయతిగాను, పెరియాళ్వార్ విష్ణుచిత్తుడుగాను, ఆండాళ్ గోదాదేవి గాను తర్వాతకాలంలో మార్చి వేయబడ్డారు.

ప్రజాసామాన్యంలో వేరూనిన ఈ భక్తి ధోరణి మాత్రమేగాక, మేధావులలో సైతం వ్యాపించిన భక్తిధోరణికి చెందిన ఆచార్యులు కొందరున్నారు. వీరిలో నాదముని (క్రీ. శ. 1000). ఆళవందార్ (యమునాచార్యులు) రామానుజునికి పూర్వులు.

రామానుజుడు, యాదవప్రకాశుని అద్వైతధోరణిని వ్యతిరేకిస్తున్నాడని తెలుసుకున్న ఆళవందార్, శ్రీరంగ వైష్ణవపీఠానికి గురువుగా ఉండేవాడు. తన తదనంతరం, తన పీఠానికి రామానుజాచార్యుని గురువుగాచేయదలచుకున్నాడు. ఇంతలో ఆళవందార్ మరణించాడు.

రామానుజుడు, పెరియనంబి అను పండితునివద్ద వైష్ణవ సిద్ధాంతాల నభ్యసించి, కాలక్రమేణ శ్రీరంగ పీఠానికి అధిపతి అయినాడు. కొంతకాలానికి రామానుజుడు సంసారాన్ని వదలి పూర్తిగా సన్యసించి, 'యతిరాజ' బిరుదుతో, దక్షిణ దేశమంతటా మత ప్రచారం చేయసాగాడు. శైవ, వైష్ణవ మతాల మధ్య ద్వేషాలు తీవ్రంగావున్న ఆ

నాడు రామానుజుని జీవితం శాంతంగా సాగలేదు. భిక్షాటనకై ఇంటింటికీ వెళ్ళుతుండగా, ఒక ఇంట్లో ఒక శైవుడు రామానుజునికి అన్నంలో విషం పెట్టాడు. అది తెలుసుకొని రామానుజుడు బైటపడ్డాడు. కంచిని పాలిస్తున్న కుళోత్తుంగ చోళుడు (రాజ రాజ నరేంద్రుని కొడుకు) పరమ శైవుడు, వైష్ణవ ద్వేషి, తన రాజ్యానికి వచ్చి శివుని ఆరాధించవలసిందిగా కుళోత్తుంగచోళుడు రామానుజుని ఆజ్ఞాపించాడు. తనకు ప్రాణాపాయం కలుగుతుందని శంకించి, రామానుజుడు చోళ రాజ్యాన్ని వదిలి రహస్యంగా మైసూరు (హోయిసల) రాజ్యానికి వెళ్ళి 12 ఏండ్లు అక్కడ తలదాచుకోవలసి వచ్చింది. రామానుజుని తరపున చోళరాజు ఆస్థానానికి వెళ్ళిన పెరియనంబి. కురితాళ్వారుల కండ్లను, వైష్ణవద్వేషి అయిన కుళోత్తుంగుడు పెరికించి వేశాడు.

కుళోత్తుంగచోళుడు చనిపోయిన మీదట, రామానుజుడు బహిరంగంగా దేశ సంచారం ప్రారంభించాడు. ఉత్తర హిందూ స్థానం వెళ్ళి, కాశ్మీర్ పండితులతో చర్చలు జరిపి, తాను వ్రాసిన బ్రహ్మ సూత్ర భాష్యానికి (శ్రీభాష్యం) వారి ఆమోదం పొంది వచ్చాడు. మైసూరు రాష్ట్రంలోని మేల్కోటేలో వైష్ణవ దేవాలయాన్ని స్థాపించి, సంవత్సరానికొకసారి హరిజనులకు ప్రవేశం ఇప్పించారు. దీర్ఘ కాలం మత ప్రచారంచేసి, క్రీ.శ. 1137లో రామనుజాచార్యులు మరణించారు.

రామానుజాచార్యుని తత్వ శాస్త్రం విశిష్టాద్వైతం. తన మతాన్ని స్థాపించుకునేందుకు, రామానుజుడు బ్రహ్మ సూత్రాలకు, భగవద్గీతకు, కొన్ని ఉపనిషత్తులకు, వ్యాఖ్యానాలు వ్రాశాడు అవిగాక వేదాంతసారం, వేదాంత సంగ్రహం, వేదాంత దీపం అను గ్రంథాలను కూడా వ్రాశాడు.

## పదార్థం - పరిణామం

అనేకవిషయాలలోరామానుజుడు అద్వైత సిద్ధాంతాన్నిఖండించాడు. పదార్థం అనాదిసిద్ధం. వాస్తవమైనది. ఇది ఎవరిచేతాసృష్టించబడలేదు. ఈ పదార్థం పరబ్రహ్మలో ఒక భాగం. పరబ్రహ్మలో చైతన్యరహితమైన

పదార్థం (అచిత్). చైతన్య సహితమైన ఆత్మలు(చిత్) అంతర్భాగాలు, శరీరాన్ని, శరీరాంతర్భాగమైన ఆత్మ నడిపించినట్లే, పరబ్రహ్మ ప్రపంచాన్నంతా నడిపిస్తాడు. ప్రళయకాలంలో పదార్థం, సూక్ష్మరూపంలో అవిభక్తంగా పరబ్రహ్మలో భాగంగా వుంటుంది. అది ప్రకృతి. ఈఅవిభక్త ప్రకృతి, పరిణామక్రమంలో నిప్పు, నీరు, భూమి అను మూలపదార్థాలుగా రూపొందుతుంది.

ప్రకృతి, ఆత్మలతో అవిభక్తరూపంలో ఉన్న పరబ్రహ్మ కారణం; పరిణామ ఫలితంగా ఏర్పడ్డ ప్రపంచం కార్యం. కారణంలోనుండి కార్యం యేర్పడుతుంది. ఈ మార్పు వాస్తవం. కారణ, కార్యాలురెండూ పరబ్రహ్మలో అంతర్భాగాలే.పరబ్రహ్మ, పదార్థం,ఆత్మలు ఈ మూడూ అనాదిసిద్ధంగా ఉన్నవి. వీటికి మొదలు, తుదలేదు. ఈ మూటిలోను చివరి రెండూ పరబ్రహ్మలో అంతర్భాగాలు.

ఈ మూలపదార్థాల కలయికవల్ల, యితర వస్తువులన్నీ ఏర్పడతాయి. ఈ మూడు పదార్థాలుగాక, మూడు మూల స్వభావాలున్నాయి, సత్వం,రజస్సు, తమస్సు అనునవి ఈ మూలస్వభావాలు ప్రపంచంలోని ప్రతి వస్తువులోను ఈ మూలపదార్థాలూ, మూలస్వభావాలూ ఏదో ఒక నిష్పత్తిలో కలిసి ఉంటాయి. ఈ పరిణామాన్ని త్రివృత్కరణం అంటారు.

సాంఖ్యులు, ప్రకృతి, పురుషుడు అనాదిసిద్ధమైన వేర్వేరు శక్తులని. వీటి కలయికవల్ల పరిణామం జరుగుతుందని వివరించిన సంగతి మనకు తెలుసు. రామానుజుడు, ప్రకృతిని అనాదిసిద్ధమైన వాస్తవ విషయంగా అంగీకరించాడు. ఐతే, రామానుజుని ప్రకృతి, స్వతంత్రశక్తి కాదు, పరబ్రహ్మలో అంతర్భాగం. పురుషుడుకూడా సాంఖ్యవాదంలోవలె చైతన్యం మాత్రం కలిగి, కదలికలేని శక్తి కాదు. ప్రపంచాన్నంతా నడిపించే పరబ్రహ్మ. అద్వైతుల మాయావాదాన్ని ఖండించిన రామానుజుడు, ప్రకృతి అస్తిత్వాన్ని అంగీకరించినా, సాంఖ్యవాదం వెళ్ళినంత మేరకు తనదృష్టిని పొడిగించ లేకపోయాడు.

సాంఖ్యుల సత్కార్యవాదానికి, రామానుజుని పరిణామవాదానికి దగ్గర సంబంధ మున్నది. మార్పు వాస్తవమని. ఐతే మార్పు ఫలితంగా నూతన వస్తువులేవీ కలగవని సాంఖ్యుల వాదన. భిన్నత్వం మార్పుకు చిహ్నమనీ, ఈ మార్పు వాస్తవమనీ రామానుజుడు అంగీకరించాడు. వస్తుసారంలో మార్పును అంగీకరించకపోయినా రూపంలో, ఆకారంలో వచ్చే మార్పులను సాంఖ్యులు, రామానుజులు అంగీకరించారు.

మార్పును రామానుజుడు మరొక విధంగాకూడ వివరించాడు. పరబ్రహ్మ వస్తువు, లేక ద్రవ్యం. పదార్థం, ఆత్మలు, ఆ ద్రవ్యానికి గల విశేషణాలు. పరబ్రహ్మకు, పదార్థానికి, ఆత్మకు గల సంబంధం అవయవి, అవయవములకుగల సంబంధంవంటిది:అవయవి ఎల్లప్పుడూ కొన్ని అవయవములతో కూడుకుని ఉంటుంది. అవయవి, అవయవముల మధ్య ఐక్యత, విభేదంకూడా ఉన్నాయి.విభేదం ఉన్నంత మాత్రాన వాస్తవికతకు భంగం రాదు విభేదాలు మూడు రకాలు. స్వజాతీయ, విజాతీయ, స్వగతభేదాలు. ఒకేజాతికి చెందిన రెండు వస్తువులకు గల భేదం, స్వజాతీయభేదం (ఒక ఆవుకు, మరొక ఆవుకు). విరుద్ధజాతులకు చెందిన రెంటి మధ్యగల భేదం విజాతియ భేదం (ఆవుకు, గుర్రానికి). పరబ్రహ్మకు సాటివచ్చే వస్తువు మరొకటిలేదు కనుక, పై రెండు భేదాలు పరబ్రహ్మలో లేవు. కాని పరబ్రహ్మలో స్వగతభేదం ఉన్నది. నిరాకార నిర్గుణ నిరంజనమైన పరబ్రహ్మకు- సాకార సగుణమైన ఆత్మకు, నిర్జీవమైన ప్రకృతికి గల భేదమే స్వగతభేదం. కాని వీనిమధ్య భేదంకంటె, ఏకత్వమే బలవత్తరమైనది. కనుకనే రామానుజుని సిద్ధాంతాన్ని విశిష్టాద్వైతం అని వ్యవహరిస్తున్నారు. విభేదానికి, ఏకత్వానికి సమానహోదా నిచ్చిన నింబార్కుని (క్రీ.శ 1100) సిద్ధాంతాన్ని ద్వైతాద్వైతం అన్నారు (Monistic Dualism). వైరుధ్యాలు లేనిది వాస్తవికత అన్న శంకరుని సిద్ధాంతానికి వ్యతిరేకంగా, వాస్తవికత, వైరుధ్యాలతో విభేదాలతో కూడుకుని ఉంటుందని రామానుజుడు ప్రతిపాదించాడు. ఇద్దరూ భావవాద తాత్వికులైనప్పటికీ, పరబ్రహ్మ ఒక్కటే వాస్తవ సత్యం అని ఇద్దరూ అంగీకరించినప్పటికీ, సత్యస్వరూప నిర్ణయంలో రామానుజుడు కొంత హేతువాద దృష్టిని ప్రదర్శించాడు.

# జ్ఞానసిద్ధాంతం

జ్ఞాన సిద్ధాంతంలో కూడ, శంకరుని సిద్ధాంతానికి, రామానుజుని సిద్ధాంతం విరుద్ధం. ఇంద్రియాలు మనలను మోసంచేస్తాయి. ఇంద్రియ జ్ఞానం పరమ ప్రమాణంగా అంగీకరించలేమన్నది శంకరుని జ్ఞాన సిద్ధాంతానికి ప్రాతిపదిక. ఇందుకు విరుద్ధంగా రామానుజుడు ఇలా అన్నాడు: "యదార్థం సర్వ విజ్ఞానం" విజ్ఞానమంతా నిజమైనదే ఒక్కొక్క సందర్భంలో మన ఇంద్రియాలు, మనలను మోసం చేస్తున్నాయి గదా! అందుకు రామానుజుడు ఇలా సమాధానం చెప్తున్నాడు :

తాడును పాముగా భ్రమించే మాట నిజమే. నిజానికి ఇది పూర్తి భ్రమకాదు. పాము తాడు రెండూ కూడ నిప్పు, నీరు, భూమి - అను మూడూ మూలపదార్థాలతో కూడుకున్నవే. వాటి నిష్పత్తిలోగల తేడా వల్ల రెండు రూపాలేర్పడ్డాయి. తాడును పాముగా భ్రమిస్తున్నామంటే, రెంటిలోనూ సామాన్యంగా ఉన్న పదార్థాలను మనం గుర్తిస్తున్నాం. కొన్ని బాహ్య అవరోధాలవల్ల (చీకటి మొదలైనవి) ఆ కొద్దిపాటి భ్రమ ఏర్పడుతున్నది. తాడును, పాముగా భావించడంలో భ్రమ కొన్ని వంతులు మాత్రమే. వాస్తవిక మూలపదార్థాల ఉనికిని గుర్తించుట ప్రధానం.

ఇక రెండవ ఉదాహరణ: ఎండమావులను చూచి సెలయేళ్ళగా భ్రమిస్తున్నాం. సూర్యకిరణాల ప్రసరణలోని నీటిమంచును చూస్తున్నాం. అంతవరకూ వాస్తవమే. ఆ నీటిమంచును, సెలయేళ్ళగా భావించటం భ్రమ. సెలయేటిలో నీరు, దప్పిక తీర్చుకోడానికి ఉపయోగపడుతుంది. ఎండమావిలో కనబడే నీరు. అందుకు ఉపయోగపడదు. విజ్ఞానం వాస్తవం కాదా అన్నదానికి పరీక్ష ఆచరణే. ఎండమావులలో కనబడే నీరు, దప్పిక తీర్చలేదు గనుక, దానిని భ్రమ అంటున్నాం.

ఆచరణే విజ్ఞానానికి గీటురాయి అను సత్యాన్ని రామానుజుడు అంగీకరించాడు.

ప్రత్యేక లక్షణాలన్నీ నశించేవి గనుక, వాటికి ప్రాధాన్యత లేదనీ, సాధారణ లక్షణాలను గ్రహించుటే జ్ఞానానికి మూలమనీ శంకరుని సిద్ధాంతం. దీనికి విరుద్ధంగా, రామానుజుడు ఇలా అంటాడు: విశేష లక్షణాలను గ్రహించుటే జ్ఞానానికి చిహ్నం. ఒక వస్తువుకూ, మరొక వస్తువుకూ గల తేడాను, ప్రత్యేక లక్షణాలను బట్టే గ్రహించ గలం. సామాన్య లక్షణాలను బట్టి కాదు.

ఉపనిషత్తులు అనేకత్వాన్ని నిరాకరించినమాట నిజమే; దాని అర్థం ఇతర వస్తువులు అసలు లేవని కాదు. పరబ్రహ్మకంటె భిన్నమైన స్వతంత్ర పదార్థాలు లేవు. పరాధీనమైన వస్తువు లనేకం వున్నాయి. పదార్థం, ఆత్మలు అలాంటివి.

ప్రపంచంలో ప్రతి వస్తువు పరిణామశీలం పరిణామశీలమైన దేదీ వాస్తవం కాదని శంకరుని సిద్ధాంతం, పరిణామం, మార్పు సహజమనీ, అది వాస్తవికత లక్షణమనీ రామానుజుని సిద్ధాంతం.

ప్రత్యక్ష, అనుమాన, శబ్ద ప్రమాణాలను మూటినీ రామానుజుడు అంగీకరించాడు. అద్వైతులవలెనే శబ్ద ప్రమాణానికి ఉపనిషత్ వాక్యాలకు విశేష ప్రాధాన్యత ఇచ్చాడు. జ్ఞాన సిద్ధాంతానికి సంబంధించి నంతవరకు, అద్వైతుల అవాస్తవిక వాదనలను తిరస్కరించి, హేతువాద ధోరణిని ప్రదర్శించాడు.

## ఆత్మ, కర్మ, మోక్షం

శంకరునికంటే, రామానుజుని భక్తిభావం హెచ్చు. శంకరుడు కేవలం తాత్వికుడు. రామానుజుడు మత ప్రవక్త కూడా.

మానవు లందరిలోను వేర్వేరు ఆత్మలున్నాయి. ఇవి పరబ్రహ్మ అంశవల్ల ఏర్పడ్డది. అనాది సిద్ధమైనవి. కాని పరబ్రహ్మమాత్రం కాదు. పరబ్రహ్మ అనంతుడు. ఆత్మలు పరిమితిగలవి. 'తత్ త్వం అసి' అన్న వాక్యానికి, అద్వైతం యిచ్చిన వ్యాఖ్యానం తప్పు.

పరబ్రహ్మ—ఆత్మ ఒకే వస్తువుయొక్క వేర్వేరు రూపాలు. రెండూ ఒకటి కాదు. వస్తువు ఒకటైనా ఆకారం వేరు. ఈ రెంటికీ ఐక్యతను ప్రతిపాదించుటే (తత్ త్వం అసి) యొక్క లక్ష్యం. ఐక్యత

అంటె సర్వాంగీన ఐక్యతకాదు. వస్తుసారం ఒకటేనని మాత్రమే. ప్రత్యగాత్మ ఏనాడూ పరమాత్మలో పూర్తిగా ఒకటి కాలేదు. రెండూ, విశిష్ట లక్షణాలను శాశ్వతంగా కలిగివుంటాయి. ఐనప్పటికీ ఐక్యంగా వుంటాయి

ఆత్మ సూక్ష్మరూపంలో ఉంటుంది. అది స్వయం ప్రకాశం. పూర్వజన్మలో చేసిన కర్మఫలితంగా, ఆత్మ ఈ జన్మలో, తనకు అర్హమైన శరీరంలో ప్రవేశిస్తుంది.

మోక్షసాధనకు వర్ణాశ్రమ ధర్మాలు (కర్మకాండ) ఆచరించాలి. కాని అదే పరమార్థంకాదు. వేదాంత జ్ఞానాన్ని సంపాదించాలి జ్ఞాన సంపాదనంటే కేవలం గ్రంథ పఠనం మాత్రం కాదు. భక్తిభావం ఏర్పరచుకోవాలి. ధ్రువస్మృతి, ధ్యానం, ఉపాసనాభక్తికి సోపానాలు. మనుష్య ప్రయత్నం వల్ల మాత్రమే మోక్షం రాదు. దేవునికి దయ కలగాలి. అది కలగాలంటే, భక్తుడు ప్రపత్తిభావాన్ని అలవర్చుకోవాలి.

జీవులు మూడురకాలు: నిత్యులు, ముక్తులు, బద్ధులు. నిత్యులు కర్మకు అతీతులు. వీరు శాశ్వతంగా వైకుంఠంలో వుంటారు. ముక్తులు స్వయంకృషి ద్వారా, జ్ఞానంద్వారా మోక్షం సాధిస్తారు. బద్ధులు అజ్ఞాన మోహితులై ఎల్లప్పుడూ సంసార చక్రంలో పరిభ్రమిస్తూ వుంటారు. బద్ధులైన జీవులు తిరిగి నాలుగు రకాలు. దైవికాంశ కల ఆత్మలు, మానవాంశ, జంతు అంశ, జడపదార్థాలలో వుండే ఆత్మలు.

ఆళ్వారుల వైష్ణవమతం, కులభేదాలను నిరసించింది. భక్తికి ప్రాధాన్యత ఇచ్చింది. ఉత్తర హిందూస్థానంలోని పురాణాంతర్గతమైన వైష్ణవ ధోరణి, కులభేదాలను ఖండించలేదు. భక్తితోపాటు, తాత్విక చర్చకు ప్రాధాన్యత ఇచ్చింది. ఈ రెండు ధోరణులూ, రామానుజుని కాలంనాటికి ప్రబలంగా వున్నాయి. ఈ రెంటినీ, రామానుజుడు సమన్వయ పరచాడు. కనుక, రామానుజుడు ఉభయ వేదాంత ప్రవక్తుడని కూడా పిలువబడుతున్నారు.

ఈ సమన్వయం రామానుజుని అనంతరం ఎక్కువకాలం నిల్వ లేదు. 13 వ శతాబ్దానికల్లా, వైష్ణవులలో వడగలై (ఉత్తరాది), తెంగలై

(దక్షిణాది) తెగలు రెండు ఏర్పడ్డాయి. వడగలై శాఖ సంస్కృతానికి, తాత్విక చర్చలకు ప్రాధాన్యత యిచ్చింది. దేవాలయాలలో, అర్చనలన్నీ సంస్కృత భాషలోనే వీరు సాగిస్తారు. కులభేదాలను సమర్థించారు. ఈ శాఖకు ముఖ్యుడు వెంకటనాథుడు లేక వేదాంత దేశికుడు (13 వ శతాబ్దం), తెంగలై తెగప్రారంభకుడు పిళ్ళై లోకాచార్యులు. మరొక ముఖ్యుడు 13వ శతాబ్దానికి చెందిన మనవాళ మహాముని. వీరు కులభేదాలను ఖండించారు. దేవాలయాలలో అర్చనలను. తమిళభాషలోనే వీరు చేస్తారు. పురాణాల కంటె, ఆళ్వారులు రచించిన తమిళ ప్రబంధాలు వీరికి ఎక్కువ ప్రమాణం. వీరిని వీరవైష్ణవులని కూడా అంటారు.

ఈ రెండు శాఖలకు, సిద్ధాంత సంబంధమైన స్వల్ప భేదాలు కూడా వున్నాయి. విచక్షణతో కూడిన భక్తి ద్వారా మోక్షం లభిస్తుందని వడగలై శాఖ సిద్ధాంతం. మానవుడు, స్వయంకృషి ద్వారా జ్ఞాన, భక్తి మార్గాల ద్వారా మోక్షం సాధించాలి. కోతిపిల్ల ప్రయత్న పూర్వకంగా, తన తల్లిని అంటిపెట్టుకొని వున్నట్లు, మానవుడు స్వయంకృషి ద్వారా భగవంతుని అంటిపెట్టుకోవాలి. దీనినే మర్కట కిశోర న్యాయం అని అంటారు.

తెంగలై తెగవారు, భక్తికంటే, ప్రపత్తికి ఎక్కువ విలువ యిస్తారు. భగవంతుని దయలేనిదే మోక్షం రాదు. ఆ దయ స్వయం కృషిద్వారా సాధ్యం కాదు.'నీవే తప్ప నితఃపరంబెరుగ' నన్న సంపూర్ణ దాస భావంతో. అహంకారాన్నంతా వదలి, భగవంతుని ధ్యానించాలి. జ్ఞానం అప్రధానం. ప్రపత్తి ఒక్కటే మార్గం. అట్టి ప్రపత్తిగల వారిని, తల్లి, తన పిల్లలను తానే మోసుకొని వెళ్ళినట్లు, దేవుడు ఈ లోకంలో నుంచి వైకుంఠానికి మోసుకు వెళ్ళతాడు. ఇది మార్జాల కిశోర న్యాయం.

## మధ్వాచార్యుని ద్వైతం

మధ్వాచార్యులు, క్రీ. శ. 1199 వ సంవత్సరంలో, దక్షిణ కెనరా జిల్లాలోని ఉడిపికి ఆరు మైళ్ళలో వున్న పాకజ గ్రామంలో జన్మించారు. ఇతని పేరు వాసుదేవుడు; అచ్యుత ప్రేక్షదను అద్వైత

వేదాంతి వద్ద, తత్వశాస్త్రం అభ్యసించి. 25 వ ఏట సన్యసించి మత ప్రచారానికి పూనుకున్నాడు. సన్యసించిన తర్వాత పూర్ణ ప్రజ్ఞుడని, మరికొంత కాలానికి ఆనందతీర్థుడని బిరుదునామాలు ధరించాడు.

అచ్యుత ప్రేక్షుని అద్వైత వ్యాఖ్యానాలు, మధ్వాచార్యునికి నచ్చ లేదు. అద్వైత ధోరణికి పూర్తి వ్యతిరేకమైన ద్వైత సిద్ధాంతాన్ని రూపొందించి, ప్రచారం చేయసాగాడు.

శృంగేరి అద్వైత మఠాధిపతి, మధ్వాచార్యునిపై ఆంక్షలు విధించాడు. పరస్పర దూషణలు, నిందలు తీవ్రంగా సాగాయి. రెండు మూడు సందర్భాలలో అద్వైతులతో జరిగిన చర్చలలో, మధ్వాచార్యులు ఓడిపోయారు. దాంతో కక్ష పెరిగి, శంకరమతానికి పూర్తిగా విరుద్ధ మైన ఒక సర్వసమగ్ర సిద్ధాంతాన్ని రూపొందించటానికి పూనుకొని, మధ్వాచార్యులు ఉత్తర దేశయాత్ర సాగించాడు.

త్రోవలో మహమ్మదీయ సైనికుల చేతికిచిక్కి; వారితో అరబ్బీ భాషలో చర్చలుచేసి మధ్వాచార్యులు బయటపడ్డాడు. హరిద్వారం వెళ్ళి, ద్వైత సిద్ధాంత ప్రతిపాదితమైన సూత్ర భాష్యం రచిం చాడు. తిరిగి వచ్చిన మీదట, మధ్వాచార్యుని హత్య చేయటానికి అద్వైతులు అనేక యత్నాలు చేశారు. ఆచార్యునికి చెందిన తాటి యాకుల పుస్తకాలన్నిటినీ రహస్యంగా దొంగిలించారు. ఎంతో కష్టం మీద మధ్వాచార్యులు వాటిని సంపాదించగలిగాడు. 79 సంవత్సరాలు జీవించి, 1278 వ సంవత్సరంలో మధ్వాచార్యులు మరణించాడు.

అద్వైతులు పెట్టిన హింసల ఫలితంగా, మధ్వాచార్యులలో అద్వైతులపట్ల సిద్ధాంత వ్యతిరేకత మాత్రమే గాక, ద్వేషం కూడా ఏర్పడ్డది. అద్వైతులంతా దైత్యులనీ, తాను దైత్యసంహారానికి పుట్టిన వాయుపుత్రుడనైన భీముడననీ, ఆయన అనేకసందర్భాలలో వివరించారు. మణిమన్ అను రాక్షసుని, భీముడు వధించినట్లు, తాను అద్వైతులను సంహరిస్తున్నానని ప్రతిజ్ఞ పట్టాడు.

మధ్వాచార్యునికి కొన్ని అద్భుతాలు ఆరోపించ బడ్డాయి. నీటిమీద నడిచాడని, ఒక్క రొట్టె ముక్కను, వేల రొట్టెముక్కలుగా మార్చి, శిష్యుల ఆకలిని సంతృప్తి పరచాడని, బకాసురునికై ఉద్దేశింప

బడిన ఒక బండి భోజనాన్ని భీముడు భోజనం చేసినట్లు, ఒక అతిథుల ఇంట్లో 12 సార్లు భోజనం చేసి తన భీమ పరాక్రమాన్ని ప్రదర్శించా డనీ, గాథలు శిష్యులచే సృష్టించబడ్డాయి. వీనిలో మొదటి రెండు గాథలు ఏసుక్రీస్తుకు ఆరోపించబడ్డగాథలు. మధ్వాచార్యుని కాలం నాటికే, సిరియన్ క్రైస్తవమత ప్రచారకులు, పశ్చిమ తీరంలో ప్రవే శించి మతప్రచారంచేయసాగారు. పై గాథలలోను ఆయన సిద్ధాంతంలోను చూచినా క్రైస్తవ ప్రభావం కనిపిస్తుంది.

## ప్రధాన సిద్ధాంతాలు

పరబ్రహ్మ, ఆత్మ, ప్రపంచం-ఈ మూడు అనాది సిద్ధములు. ఒక దానికి ఒకటి సంబంధం లేనివి. వీనిలో చివరి రెండూ పరబ్రహ్మ పై ఆధార పడి ఉంటాయి. పరబ్రహ్మ అనేక వ్యూహాలలో, అవతారా లలో బహిర్గతమౌతూ ఉంటాడు. పరబ్రహ్మ విష్ణువు అవతారంలో ఉంటాడు. పరబ్రహ్మ సృజనాత్మక శక్తికి చిహ్నాం లక్ష్మి. ఆత్మ లన్నిటినీ పరబ్రహ్మ పరిపాలిస్తూ ఉంటాడు. ఆత్మలూ, ప్రపంచం కూడా పరబ్రహ్మవలె శాశ్వత పదార్థాలు. పరబ్రహ్మ సృష్టికి కారణం ప్రకృతి సహాయం లేనిదే సృష్టిసాగదు. ప్రకృతి, పరబ్రహ్మలు రెండూ కలిసి సృష్టిని సాగిస్తారు. సాంఖ్యుల ప్రకృతి-పురుష సిద్ధాంతానికి ద్వైతుల సిద్ధాంతానికి దగ్గర సంబంధముంది.

ప్రపంచం, ఆత్మలు మాయ కావు. ప్రకృతి వివిధ వస్తువుల సముదాయం. అవిభక్త ప్రకృతినుండి 24 దశలుగా సృష్టి పరిణామం చెందుతుంది. సాంఖ్యుల 24 దశలను, ద్వైతులు కొద్ది తేడాలతో స్వీకరిం చారు.

ప్రపంచంలో జీవులు, లేక ఆత్మలు అసంఖ్యాకంగా ఉన్నాయి. బ్రహ్మకూ, జీవునికి భేదం వాస్తవమైనది, శాశ్వతమైనది. కనుకనే ఈ సిద్ధాంతాన్ని, ద్వైతసిద్ధాంతం అంటున్నాం. రెండు విరుద్ధవస్తువులుఎప్ప టికీ ఒకటి కాలేవు. జీవుడు అణురూపంలో ఉంటాడు. స్వతః ఆనంద మయుడు. శరీరధారణ ఫలితంగా, బాధ, కష్టం, పాపం జీవుడికి కలుగు

తుంది. ఏ రెండు జీవులూ ఒకటి కావు, ప్రతి దానికీ మోక్షానంతరం దానికి అర్హమైన స్థానం ఉంటుంది.

ఆత్మలు మూడు రకాలు. నిత్య, ముక్త, బద్ధులు, బద్ధులైన ఆత్మలలో కొన్ని మోక్షం సాధించే అర్హత గలవి. మరికొన్ని శాశ్వతంగా నరకంలో ఉండవలసిందే. లేక శాశ్వతంగా సంసారచక్రంలో తిరుగుతుండవలసిందే. సత్వ, తమో, రాజస లక్షణాలుగల ఆత్మలు, వరుసగా, నిత్యముక్త బద్ధులుగా ఉంటాయి. స్వర్గరాజ్యంలో బ్రహ్మ, వాయువు, ప్రథమ, ద్వితీయస్థానాలు ఆక్రమించుకొని ఉంటారు.

కొందరు శాశ్వతంగా నరకబాధ అనుభవిస్తారనే సిద్ధాంతం, మానవుని జీవితం అంతా పుట్టుక ముందుగానే నిర్ణయించబడుతున్నదన్న క్రైస్తవమతంలోని సిద్ధాంతాన్ని పోలివుంది. స్వర్గరాజ్యాన్ని గురించిన మధ్వాచార్యుని వర్ణనలోగూడా, క్రైస్తవ మతచ్ఛాయలు కనిపిస్తాయి.

## జ్ఞాన సిద్ధాంతం

మధ్వాచార్యుని జ్ఞానసిద్ధాంతాని కంతా మూలం భేద సిద్ధాంతం. ప్రపంచంలో ఐదు శాశ్వత విభేదా లున్నాయి :

1. పరబ్రహ్మకు జీవునికీ గల భేదం.
2. పరబ్రహ్మకు, పదార్థానికి గల భేదం.
3. జీవునికి, పదార్థానికి గల భేదం.
4. ఒక జీవికి, మరొక జీవికి గల భేదం.
5. పదార్థంలో ఒక భాగానికి మరొక భాగానికి గల భేదం.

ఈ విభేదాలు శాశ్వతాలు— మార్పు లేనివి. ఏ పరిస్థితిలోనూ ఈ భేదాలు నశించవు. భౌతిక ప్రపంచంలోనూ, భావప్రపంచంలోనూ, ఇహలోకంలోనూ, పరలోకంలోనూ సైతం ఈ విభేదాలు శాశ్వత సత్యాలు.

మధ్వాచార్యులు, శంకరుని అద్వైతాన్నీ, రామానుజుని విశిష్టాద్వైతాన్నీ ఖండించాడు. విశేష లక్షణాలను గ్రహించుటే, జ్ఞానానికి మూలమని రామానుజునివలె, మధ్వాచార్యులు కూడా అంగీకరించాడు. ప్రత్యక్ష, అనుమాన, శబ్దప్రమాణాలను జ్ఞానమార్గాలుగా స్వీకరించాడు.

వైరుధ్యాలున్న దేదీ వాస్తవం కాదని శంకరుని వాదన. అందుకు పూర్తి వ్యతిరేకంగా వైరుధ్యాలమధ్య విభేదం శాశ్వతమనీ, ఒక శక్తి, తత్వ్యతిరేకమైన శక్తిగా ఏ పరిస్థితిలోనూ రూపొందదనీ మధ్వాచార్యులు వాదించారు.

వైరుధ్యాల మధ్య ఐక్యత, ఘర్షణ, పరస్పర ప్రతి పర్యవిత్యం జరుగుతుంటాయనే అంశాన్ని, ఉభయులూ గుర్తించరు,

విభేదాల కింత ప్రాధాన్యత నిచ్చిన మధ్వాచార్యులు సహజంగానే కులవిభేదాలకు, కర్మకాండకు విశేష ప్రాధాన్యత నిచ్చాడు. మాధ్వుల ద్వైతవాదం కన్నడ, మహారాష్ట్ర ప్రాంతంలోని బ్రాహ్మణ కులంలో తప్ప మిగతా ప్రాంతాలలో కాని, మిగతా కులాలలో కాని వ్యాపించ లేదు. కన్నడదేశంలోని బ్రాహ్మణులు ఎక్కువ ద్వైత శాఖకు చెంది వుండగా, ఆ ప్రాంతంలోని బ్రాహ్మణేతరులు అధిక సంఖ్యాకులు. ద్వైతధోరణికి చెందిన మరొక మతాన్ని 'వీరశైవ మతాన్ని' అభిమానించారు.

మధ్వాచార్యులు కొన్ని స్వల్ప సంస్కరణలు చేయకపోలేదు. యజ్ఞ, యాగాదులలో జీవహింసను నిషేధించడం, శైవ-వైష్ణవ విభేదాలకు ప్రాధాన్యత యివ్వకపోవడం యిందులో ముఖ్యము లైనవి. కాని అర్థరహితమైన కర్మకాండకు ద్వైతమతం విశేష ప్రాధాన్యత నిచ్చింది.

## ఇతర ధోరణులు

అద్వైత, ద్వైత ధోరణులు వేర్వేరు రూపాలలో అంగీకరిస్తూ, సమన్వయపరుస్తూ అనేక తాత్విక ధోరణులు తల యెత్తినవి వీనిలో ఏ ఒక్కటీ కూడ, ప్రజలలో కాని, చివరకు మేధావులలో సైతం వ్యాప్తి పొందలేదు. స్వతంత్ర తాత్విక ధోరణిగా వీనిలో ఏఒక్కదానినీ చెప్పలేము. వీనిలో కొన్ని ప్రధానంగా భక్తిధోరణులుగా రూపొందినాయి. అయినప్పటికీ, తాత్వికచింతన ఏ సూత్రాల ననుసరించి భారత దేశంలో, ఎన్ని రూపాలలో కొనసాగిందో గ్రహించేందుకు వీటిని గురించి స్థూలంగా తెలుసుకోవటం అవసరం.

# భాస్కరుడు - భేదాభేద వాదం
## (Unity and Difference)

భాస్కరుడు కన్యాకుబ్జ నగరం (కనోజ్) లో క్రీ. శ. 900 ప్రాంతంలో జీవించాడు. ఇతనిని భట్టభాస్కరుడని కూడా పిలుస్తారు. శంకర, రామానుజుల మధ్య కాలంలో ఇతను జీవించాడు,

శంకరుని మాయావాదాన్ని భాస్కరుడు ఖండించాడు. ప్రపంచం వాస్తవం. పరిణామం వాస్తవం. బ్రహ్మనుండి ప్రపంచం ఆవిర్భవిస్తుంది. బ్రహ్మ పరిణామానికి ముందు అవిభక్తంగా ఉంటాడు. అది ఏకత్వానికి చిహ్నం. పరిణామం పూర్తి అయిన మీదట అనేక రూపాలతో, విభేదాలతో ప్రపంచం ఏర్పడుతుంది. ఏకత్వంలోనుండి విభేదం యేర్పడుతుంది. ఒకటి అనేకం ఔతాయి. ఐక్యత, వైవిధ్యం; భేదం, అభేదం— రెండూ వాస్తవమే. ఈ సిద్ధాంతాన్ని భేదాభేద వాదం అని వ్యవహరిస్తున్నారు.

# నింబార్కుడు - ద్వైతాద్వైతం
## (Monistic Dualism)

ఇతడు 11వ శతాబ్దంలో, రామానుజుని అనంతరం జీవించిన ఆంధ్రదేశ బ్రాహ్మణుడు. భాస్కరుని భేదాభేద వాదం వంటిదే నింబార్కుని ద్వైతా ద్వైత వాదం. ఇతడు బళ్లారిజిల్లాలోని నింబాపురంలో జీవించాడని భావిస్తున్నారు.

తాత్వికరీత్యా, భాస్కరుని భేదాభేదా వాదానికీ. రామానుజుని విశిష్టా ద్వైతానికీ విశేష వ్యత్యాసం లేదు.రామానుజుడు విశిష్టతకుతక్కువ ప్రాధాన్యత నిచ్చి, ఏకత్వానికి విశేష ప్రాధాన్యత యిచ్చాడు. భాస్కర, నింబార్కులు రెంటికీ సమానస్థాయి నిచ్చారు.

విష్ణుపూజ మోక్షానికి సాధనం. భక్తికంటె ప్రపత్తి ఎక్కువ ప్రయోజనకరం. విష్ణువును, రాధాకృష్ణుల రూపంలో పూజించే పద్ధతిని నింబార్కుడు ప్రవేశపెట్టాడు. నింబార్కుడు దక్షిణాదికి చెందినవాడైనా

అతని జీవితమంతా ఉత్తర ప్రదేశ్‌లోని మధుర వద్ద బృందావనంలో గడిచింది. రాధాకృష్ణుల ప్రేమ, కృష్ణుని రాసక్రీడలు అత్యున్నత భక్తిభావానికిచిహ్నమని ఈ ధోరణి ప్రచారం చేసింది. బృందావనంలో నింబార్కుని మతానికి చెందిన ఒక మఠం ఉన్నది. ఇతని మతస్థులు ఎక్కువగా ఉత్తర పదేశ్, బెంగాల్, ఒరిస్సాలలో ఉన్నారు.

## వల్లభాచార్యులు - శుద్ధాద్వైతం
## (Pure Monism)

నింబార్కుడు ప్రారంభించిన రాధాకృష్ణ ఉపాసనను మరొక మెట్టు ముందుకు తీసుకుపోయినవాడు వల్లభాచార్యులు. వల్లభాచార్యుడు క్రీ. శ. 1401 ప్రాంతంలో జీవించిన తెలుగుదేశ బ్రాహ్మణుడు. నింబార్కునివలె ఇతడు కూడా ఉత్తర హిందూస్థానం వెళ్ళి మధురలోను, బృందావనంలోను చాలా కాలం జీవించాడు. వల్లభాచార్యుని మతం గుజరాతులో ఎక్కువ వ్యాప్తిలో ఉంది.

రాధాకృష్ణులను పూజించినంత మాత్రాన లాభంలేదు. అన్నిరకాల ప్రేమలకంటే స్త్రీపురుషుల ప్రేమ అత్యున్నతమైనది. భక్తులు తాము గోపికలైనట్లు భావించి గోపికలు కృష్ణుని ప్రేమించినట్లు పూజించాలి. స్త్రీమనస్తత్వాన్ని అలవర్చుకోవాలి.

రాధాకృష్ణుల పూజను వల్లభాచార్యులు వికృత రూపంలోకి మార్చాడు. భక్తిపేరులో. విశృంఖలత విచ్చలవిడి అవినీతి ప్రవర్తనకు కారకుడైనాడు.

తాత్వికరీత్యా. ఈయన సిద్ధాంతం శుద్ధాద్వైతవాదం. శంకరుని మాయావాదాన్ని ఖండించాడు పరబ్రహ్మ ఒక్కటే సత్యం. మాయ సహాయం లేకుండానే పరబ్రహ్మ సృష్టి చేయగలడు, "మాయ"ను అంగీకరించటం అంటే పరబ్రహ్మ సర్వశక్తివంతుడని మనం గుర్తించటం లేదన్నమాట. శంకరుడు నిజమైన అద్వైతి కాదు.

పరబ్రహ్మ అవయవి. వ్యక్తిగత జీవులు అవయవములు. ఈ రెంటి వస్తుసారము ఒకటే అవయవికి. అవయములకు భేదమేమీ లేదు. రామానుజుడు కూడా అవయవి అవయవములకు ఉదాహరణ

నిచ్చాడు. ఈ రెంటికీ గల విభేదం వాస్తవమని రామానుజుడు అంగీక రించగా, రెంటికి భేదమే లేదని వల్లభాచార్యుడు వాదించాడు.

శంకరాద్వైతులను, వారి మతాన్ని వల్లభాచార్యుడు చాలా విశ దంగా విమర్శించాడు.

## చైతన్యస్వామి - అచింత్య భేదాభేదవాదం

వల్లభాచార్యుని రాధాకృష్ణ సిద్ధాంతం వంటిదే చైతన్య మతం. చైతన్య స్వామి 15వ శతాబ్దంలో బెంగాలులో జన్మించాడు.

నింబార్క, వల్లభులకు-చైతన్య స్వామికి ఒక ప్రధాన విభేదం ఉంది. ఎంత భక్తి ప్రపత్తులను నింబార్క, వల్లభులు ప్రతిపాదించినా, కుల భేదాలను వారు సమర్థించారు. బ్రాహ్మణేతరులను తక్కువభావంతో చూశారు.

చైతన్యస్వామి ఈవిభేదాన్ని నిరసించాడు. అన్ని కులాలనుండి, అన్ని మతాలనుండి శిష్యులను చేర్చుకున్నాడు. మొట్టమొదటిసారిగా మహమ్మదీయ శిష్యులను స్వీకరించింది చైతన్యుడే. ఒక ముస్లింఫకీరు హరిదాసు అను పేరుతో చైతన్యుని శిష్యుడైనాడు. ఇతని శిష్యులైన రూపగోస్వామి సనాతనులు. మొదట హిందువులుగా ఉండి మహమ్మ దీయులై తిరిగి హిందూమతంలో చేరినవారు. 16 వ శతాబ్దంలో జీవిం చిన జీవగోస్వామి, బలదేవులు చైతన్యుని శిష్యులలో ముఖ్యులు. భక్తి ప్రధానమైన చైతన్య మతానికి వీరు ఒక శాస్త్రీయ పునాది ఏర్పరిచారు.

రామానుజుని తత్వశాస్త్రానికి, చైతన్యమత తత్వశాస్త్రానికి వ్యత్యాసం లేదు. పదజాలంలో మాత్రం తేడా ఉంది. పరబ్రహ్మకు జీవులు, పదార్థం విశేషణాలని రామానుజుడు చెప్పగా, వీరు వాటినే 'శక్తి' అని అన్నారు ప్రపంచమంతా పరబ్రహ్మసృష్టి. కాని పర బ్రహ్మ, పదార్థం వేర్వేరు వస్తువులు; ఒకటి కాదు. చైతన్య సిద్ధాం తాన్ని, అచింత్య భేదభేదవాదం (Indescribable theory of unity and difference.)

నింబార్క, వల్లభుల వలెనే,చైతన్యమతం రాధాకృష్ణుల పూజకు, విస్తార ప్రాధాన్యత ఇస్తుంది. 'కృష్ణుని శక్తు లన్నిటిలోకి అత్యున్నత

మైనది అహ్లాదం కలిగించేశక్తి; రాధ ద్వారానే ఈ అహ్లాదం కలుగ గలదు. రాధాకృష్ణులను వేరుచేయలేము, నిజానికి కృష్ణునికంటె, రాధ ఉన్నతస్థానంలో ఉంటుంది.

రాధాకృష్ణ ఉపాసన బెంగాలు, ఒరిస్సా రాష్ట్రాలలో విశేషంగా ఉంది. జయదేవుని గీత గోవిందకావ్యం రాధాకృష్ణ భక్తికి పరాకాష్ఠ.

శైవ ధోరణిలోని శాక్తేయ, కాపాలిక మతాలు శక్తికి విశేష ప్రాధాన్యత నిచ్చినట్లే వీరు రాధకు విశేష ప్రాధాన్యత ఇస్తారు. కాపాలిక, శాక్తేయ మతాలలో త్రాగుడు, వ్యభిచారం, జంతుబలులు, నరబలులు సామాన్య లక్షణాలు. రాధాకృష్ణమతంలో జంతుబలులు, నరబలులు లేవుగాని మిగతా అవలక్షణాలన్నీ ఉన్నాయి.

రామానుజుని వైష్ణవ భక్తిలోని భక్తిధోరణి 5 శతాబ్దాలు గడిచే ఉప్పటికి నింబార్క, వల్లభ, చైతన్యుల చేతులలో వికృతరూపం ధరిం చింది. భావవాద తాత్వికచింత నుండి మూఢభక్తి, అందులో నుండి ప్రవృత్తి, పిమ్మట రాధాకృష్ణ ఉపాసన ఆపైన నీతి నియమాలను లెక్క చేయని విశృంఖలత — ఇదీ పతనం ?

## సంస్కరణ ధోరణులు

వైష్ణవభక్తి నుండిపైన వివరించిన శిధిల జీర్ణధోరణులు మాత్రమే కాక, ఆరోగ్యకరమైన సంస్కరణ ధోరణులు కూడా తలఎత్తినవి.

ఈ ధోరణికి మూలపురుషుడు రామానందుడు. 1300 సంవత్సర ప్రాంతంలో రామానందుడు కన్యాకుబ్జ నగరంలో ఒక బ్రాహ్మణ కుటుం బంలో జన్మించాడు. తక్కువ కులాలవారి పట్ల, పీడిత ప్రజలపట్ల వైష్ణవమతంలో, ముఖ్యంగా దక్షిణాది ఆళ్వారులలో కరుణ దయాభావాలు విస్తారంగా వున్నాయి. ఈ భావాలను రామానందుడు స్వీకరించి, కుల భేదాలపై ఖండన ప్రారంభించాడు; సమానత్వ సిద్ధాంతాన్ని ప్రచారం చేశాడు. అంతర్వర్ణ భోజనాలను ప్రోత్సహించాడు. అన్ని కులాలనుండి, మహమ్మదీయుల నుండి శిష్యులను స్వీకరించాడు.

అవినీతికి, విశృంఖలతకు ప్రోవతీసే రాధాకృష్ణ ఉపాసనను విర సించి సీతారాముల భక్తిపై ప్రచారం చేశాడు. 'రాముడు ఆదర్శ పురు

షుడు. సీత ఆదర్శపత్ని. వారి ప్రేమ ప్రజలకు స్మరణీయం. అందు లోనూ రాముడే ప్రధానం. రామభక్తి ఒక్కటే మోక్షానికి మార్గం.' ఇవీ రామానందుని ప్రధాన బోధనలు.

అప్పటికి మహమ్మదీయ పరిపాలన భారతదేశంలో ప్రారంభ మైంది. హిందువులు, మహమ్మదీయులు కలిసి మెలిసి జీవించక తప్ప దని ప్రజలు గ్రహించారు. మతసహనం. అన్య మతగౌరవం సహజీవ నానికి అత్యవసరం. రామానందుడు మతసహనాన్ని బోధించాడు.

రామానందుడు తన ప్రచారానికి సంస్కృతభాషను వదలి దేశ భాషను స్వీకరించాడు. ఇతని ముఖ్య శిష్యులు 13 గ్గురు, బ్రాహ్మణులు మాత్రమే గాక, అన్ని కులాలవారు వున్నారు. పీపా అను క్షత్రియ యువకుడు, మహమ్మదీయుడైన కబీరు, మంగలి వృత్తిలో జీవించే పేన. వ్యవసాయ వృత్తి చేసే ధన్నా, హరిజనుడైన రామదాసు, పద్మా వతి అను స్త్రీ-వీరంతా రామానందుని శిష్యులు. వీరు రామభక్తిని, కుల భేదాల ఖండనను, మతసామరస్యాన్ని, మానవుల యెడల దయ, జాలి మొదలైన భావాలను ఉత్తర హిందూస్థాన మంతటా ప్రచారం చేశారు. రామానందుడు 111 సంవత్సరాలు జీవించి, క్రీ. శ. 1411 లో మర ణించాడు.

## కబీరు

రామానంద శిష్యులలో ఒకడైన కబీరు సుప్రసిద్ధుడు. నేత వృత్తిలో జీవించే మహమ్మదీయ కుటుంబంలో కబీరు పుట్టాడు. కబీరు క్రీ.శ. 1398-1500 ల మధ్య జీవించాడు. రామానందుని వృద్ధాప్యంలో ఆయనవద్ద శిష్యుడుగా చేరాడు.

హిందూ-మహమ్మదీయ సామరస్యం, రామ్-రహీమ్‌ల ఏకత్వం, కబీరు బోధనలో ముఖ్యవిషయాలు. కాయకష్టంతో జీవితం గడుపుతూ. మతసహన భక్తిధోరణులను ప్రచారం చేస్తూ, ఉత్తర ప్రదేశ్‌లో పలు ప్రాంతాలు కబీరు పర్యటించాడు. నాటి ఢిల్లీ నవాబు సికిందర్‌లోడీ, హిందువుగా మారిపోయిన కబీరును మొదట్లో హింసించాడనీ, తరువాత కబీరు మహావ్యక్తి అని గుర్తించి గౌరవించాడనీ చరిత్ర తెలియజేస్తు

న్నది. ఒక మహమ్మదీయ షేకు కబీరుపై కక్ష సాధించటానికి ఆయ నను అనేక కష్టాలు పెట్టాడు. కాని కబీరు అన్ని కష్టాలను శాంతంతో సహించాడు, చివరకు ఆ షేకు తన కక్షను వదులుకున్నాడట. మాగర్ అనుచోట కబీరు మరణించాడు. అతని మరణానంతరం, హిందు వులు, మహమ్మదీయులు కబీరు మా వాడంటే,మా వాడని తగాదాపడి, ఆయన శరీరభస్మాన్ని రెండుగా విభజించుకున్నారు. హిందువులు తమకు చెందిన వాటాను కాశీలోని గంగలో కలుపగా, మహమ్మదీయులు తమ వాటాపై ఒక సమాధిని నిర్మించాడు.

కబీరు కులభేధాలను, మతాచారాలను ఖండించాడు. అనేక కీర్తన లను వ్రాశాడు. కొన్ని కీర్తనల సారాంశం గమనిద్దాం;

"వేదాలను చదివిన పండితులందరూ అసలు సారాన్ని గ్రహించ టంలేదు. సంధ్య. తర్పణ, గాయత్రీపూజ–మొదలైనవి అంతు లేకుండా చేస్తున్నారు. వీటివల్ల ఒక్కరికీ మోక్షం రాలేదు,రాదు. మరొక మనిషి తాకితే మైలపడ్డానని నీవు స్నానం చేస్తున్నావు. తాకితేనే మైలపడేనీవు, ఆ వ్యక్తికంటే తక్కువ స్థాయికి చెంది వున్నావు గదా?

'తుమ్మెద ఆ పూవుకూ, ఈ పూవుకూ ఎగురుతుంది. అలాగే ఈ జీవి సంసారబంధంలో చిక్కుకుని బాధపడతాడు. రామభక్తి ఒక్కటే మోక్షసాధనం.'

కబీరు విగ్రహారాధనను ఖండించాడు. కాశీ, మాగర్,ఛత్తిస్‌ఘర్ (మధ్యప్రదేశ్)-మొదలైనచోట్ల మఠాలు స్థాపించాడు. వీటిలో కొన్నిం టికి ముస్లిములు అధిపతులు. కొన్నింటికి హిందువులు అధిపతులు.

రామానందుని ఇతర శిష్యులుకూడా కబీరువలెనే మత ప్రచారం సాగించారు.

హరిజనుడైన రామదాసు,రోహిదాసు అనుపేరుతోమహారాష్ట్రలో ప్రచారం చేశాడు. మహారాష్ట్ర బ్రాహ్మణేతర ప్రజానీకంలో రోహిదాసు అనుచరులు చాలమంది వున్నారు. మంగలి వృత్తిచేసే సేనకూడా మహా రాష్ట్రంలో ప్రఖ్యాతిచెందాడు.

16వ శతాబ్దం ఆఖరులో అక్బరు పరిపాలనా కాలంలో మలుక్ దాస్ అను ఒక ప్రచారకుడు, ఇదే సంస్కరణ ధోరణిని ప్రచారం చేశాడు. అక్బరు ఈ సిద్ధాంతాలపై పు ఆకర్షింపబడ్డాడు. హిందూ మహమ్మదీయ మతాలను సమన్వయం చేస్తూ ఒక నూతన మతాన్ని ఏర్పరచ డానికి అక్బరు ప్రయత్నించాడు.

1600 ప్రాంతంలో, అహమ్మదాబాదు ప్రాంతంలో దాదు అను నేత కార్మికుడు ఇదే మతాన్ని ప్రచారం చేశాడు.

# తులసీదాసు

రామభక్తిని, మత సహనాన్ని, కులవిభేద ఖండనను - మత ప్రచార రూపంలో కాక, ఒక మహాకావ్యం ద్వారా ప్రచారం చేసినవాడు తులసీదాసు. తులసీదాసు క్రీ. శ. 1532 వ సంవత్సరంలో జన్మించాడు. 1574 లో అయోధ్యలో 'రామచరిత మానస' అను పేరుతో రామాయణ మహాకావ్యాన్ని పూర్తిచేశాడు. తులసీదాసు క్రీ. శ. 1633 లో మరణించాడు.

ఉత్తర హిందుస్తానంలో తులసీదాసు రామాయణం గొప్ప ప్రభావాన్ని కలిగించింది. మత సామరస్యం, సాత్వికభక్తి, జీవకారుణ్యదృష్టి, నీతి నియమాలపట్ల - సాంఘిక విధులపట్ల పట్టుదల, ఆదర్శాలంటే అభిమానం - మొదలైన లక్షణాలు ప్రజలలో ప్రచారం కావడానికి, తులసీదాసు రామాయణం ఎంతగానో ఉపకరించింది.

# నామదేవ్

రాధాకృష్ణ భక్తికి బెంగాలు, ఒరిస్సాలు కేంద్రమైనట్లే, రామభక్తికి మహారాష్ట్ర దేశం ప్రధానంగానూ, ఆంధ్రదేశం కొంతవరకూ కేంద్రమైనవి.

నామదేవ్ మహారాష్ట్ర దేశంలో శూద్రకులంలో పుట్టాడు. దర్జీ వృత్తితో జీవించేవాడు. మహారాష్ట్ర వైష్ణవ భక్తులు ఎక్కువమంది బ్రాహ్మణేతరులు కావటం గమనార్హం. నామదేవ్ క్రీ॥ శ॥ 1370-1400

మధ్య జీవించి ఉంటాడని చరిత్రకారులు భావిస్తున్నారు. సీతారాములతో పాటు పంఢర్‌పూర్‌లోని రుక్మిణీకృష్ణులను నామదేవ్ కీర్తించాడు. విగ్రహారాధన, ఉపవాసాలు, వ్రతాలు నిరర్థకమని – సమదృష్టి, భూతదయ, నిజమైనభక్తి ఏర్పరచుకొనవలెనని కీర్తనలద్వారాప్రచారంచేశాడు.

## తుకారాం

తుకారాం మరొక మహారాష్ట్ర భక్తుడు. తుకారాం క్రీ. శ. 1607 లో ఒక శూద్రకుటుంబంలో జన్మించాడు. శివాజీకి సమకాలికుడు, వ్యాపారంచేసి అందులో నష్టపడి, భక్తి మార్గాన్ని చేపట్టి కీర్తనలద్వారా దేశంలో విస్తార ప్రచారం చేశాడు. తుకారాం ఖ్యాతి విని శివాజీ, ఒకటి రెండుసార్లు తన ఆస్థానానికి పిలిపించి సన్మానింప యత్నించాడు. తనకు సన్మానాలు, వెండిబంగారం అక్కరలేదని తుకారం నిరాకరించాడు. 'అభంగ్' అను ఛందస్సుతో తుకారాం తన కీర్తనలను రచించాడు నామదేవ్‌వలెనే తుకారాం కూడా విగ్రహారాధన నిరుపయోగమని, ఆచారాలకు, కట్టుబాట్లకు ఎక్కువ విలువ ఇవ్వక జీవకారుణ్యదృష్టి, భక్తిభావం అలవర్చుకోవలెనని బోధించాడు. తుకారాం జీవితం మానవసేవకు అంకితమైంది. తానునివసించేసిన గ్రామంలో ఎవరికి ఏ ఆపద, ఏ కష్టం వచ్చినా భజనలను మాని, వారికి సహాయం చేయడం తన ప్రథమ కర్తవ్యంగా తుకారాం భావించేవాడు.

ఈ ధోరణులు మొత్తంమీద ప్రజలలోని మూఢాచారాలను ఖండించి విశాలదృష్టిని, మానవసేవా పరాయణత్వాన్ని కలిగించడానికి తోడ్పడ్డవి.

మత భావాలను ప్రచారం చేస్తూనే, సంస్కరణ భావాలను, విశాలదృష్టిని ప్రవేశపెట్టిన సంస్కర్తలు ఆంధ్రదేశంలోకూడా పలువురున్నారు. 12 వ శతాబ్దంలో పల్నాటిలో అన్ని కులాలను ఏకం చేయడానికి యత్నించిన బ్రహ్మనాయుడు వైష్ణవ మతస్థుడు. 1700 ప్రాంతంలో జన్మించి, ఆటవెలది పద్యాలతో మూఢాచారాలను తీవ్రంగా ఖండించిన యోగి వేమన తాత్విక రీత్యా అద్వైతి. 1630 ప్రాంతంలో భద్రాచలంలో నివసించిన కంచర్ల గోపన్న, కబీరు శిష్యుడు, హిందూ—ముస్లిం సామరస్యాన్ని బోధించాడు. రామభక్తిని ఆంధ్ర దేశంలో విశేషంగా ప్రచారం చేశాడు.

# పదునాల్గవ అధ్యాయం

# గీతకుగల ప్రత్యేకత

భారతీయ తత్వశాస్త్రంలో ఏ యితర గ్రంథానికి లేని ప్రాముఖ్యం భగవద్గీతకున్నది.

ఇందుకు కొన్ని బలీయమైన కారణా లున్నాయి.

గీతకు ముందు తల ఎత్తిన పూర్వమీమాంస, ఉత్తర మీమాంస ధోరణులలోనూ ఆ పిమ్మట వెలువడిన శంకర, రామానుజాది మతస్థుల గ్రంథాలలోను పాక్షికత హెచ్చు. తమ ధోరణి వేదసమ్మతమని నిరూపించుకునేందుకు, ఎంతటి విపరీత వాదనలు చేయటానికి సైతం ఈ ధోరణులవారు జంకలేదు

ఈ పాక్షికతకు భిన్నంగా గీత, ఆనాడు ప్రచారంలో వున్న ముఖ్యధోరణులను సమన్వయించింది. జ్ఞానమార్గమా, కర్మమార్గమా, ఏది శ్రేష్ఠమనే చర్చ గీతలో మొదటినుండి చివరిదాకా అంతర్వాహినిగా కనిపిస్తూనే ఉంటుంది. ఈ రెంటికీ వైరుధ్యం లేదనీ, ఎంతటి జ్ఞాని ఐనా కర్మచేయక తప్పదనీ ఫలాపేక్ష రహితంగా చేసే కర్మకు దోషం లేదనీ— సమన్వయ మార్గాన్ని గీత ప్రతిపాదించింది.

ఇంకో విశేషంగా కూడా వుంది. తాత్విక చర్చలలో, విభేదాలలో అహమహమికలు, రోష, కావేషాలను పెంచుకోవటం అనాదిగా ఉండనే వుంది. ఇందుకు విరుగుడుగా గీత, త్రయీ గుణ సిద్ధాంతాన్ని ప్రతిపా

దించింది. సత్వ రజ స్తమోగుణాలు మానవునికి పుట్టుకతో వచ్చేవి. జ్ఞానిగాని, యోగిగాని, కర్మిష్ఠిగాని, తమో రజోగుణాలను కలిగి వుంటే అతని కృషి వ్యర్థం. అది అసురలక్షణం, సత్వగుణం దైవ లక్షణం. సత్వ గుణాన్ని పెంపుచేసుకోవాలి అనేది గీతాబోధలో ముఖ్యాంశం.

మూడో కారణం సాంఖ్యం, యోగం, కర్మ, ధర్మం మొదలైన తాత్విక పదాలు, వేర్వేరు కాలాలలో వేర్వేరు అర్థాలలో వాడబడుతూ వచ్చాయి, ఆ అన్ని అర్థాలలోను అవి గీతలో ప్రయోగించబడ్డాయి. కాలానుగుణంగా ఈ పదాలకు నూతనమైన అర్థాలు ఆపాదించటానికి వీలైన పద్ధతిలోకూడా ఇది జరిగింది.

ఇది యాదృచ్ఛికం కాదు. గీతా రచయిత, తన గ్రంథానికి వ్యాప్తి కల్పించేందుకు, ఉద్దేశపూర్వకంగానే యిలా చేశాడు.

ఈ కారణం వల్లనే, ఆధునికులైన తిలక్, గాంధి, అరవింద మొదలైనవారు, గీతకు వేర్వేరు భాష్యాలు చెప్పగలిగారు. ఎట్టి మత విశ్వాసాలు లేనివారిని సైతం, గీతలో వ్యక్తమయ్యే క్రియాశీలత, విధి నిర్వహణ దీక్ష, స్థిత ప్రజ్ఞత్వం, నిష్కామకర్మ — మొదలైన భావాలు ఆకర్షిస్తున్నాయి.

ఇరవయ్యో శతాబ్ది మొదట్లో వ్యక్తిగత దౌర్జన్యవాదం ద్వారా బ్రిటిషు ప్రభుత్వాన్ని అంతంచేయాలని యత్నించిన విప్లవకారులు పెక్కుమంది గీతాపారాయణం ద్వారా ఉత్తేజితులై, ధైర్యంగా ఉరికంబా లెక్కగలిగారు. రాజకీయ బానిసత్వం, తాత్విక మాయావాదాల ఫలితంగా, జడత్వం ఆవహించిన భారతజాతిను త్తేజితం చేసి, కర్తవ్య నిష్టితం చేసే యత్నంలో, తిలక్‌కు ఈ గ్రంథం ఎంతగానో ఉపయోగించింది.

## కాలనిర్ణయం

గీతాగ్రంథం కీ. పూ. 3—4 శతాబ్దాలమధ్య రచింపబడి ఉండవచ్చునని కొందరు పాశ్చాత్య పండితుల వాదన. ఏ ఒక్క రచయితో గాక, ఇద్దరు ముగ్గురు రచయితలు గీతను పూర్తిచేశారని కూడావీరిభావం.

భారతంతోబాటు గీత కూడా బుద్ధునికంటె పూర్వమే రచింపబడ్డదని, సాంఖ్యయోగం విషయమై గీతలోగల ప్రస్తావన కపిల సాంఖ్యం కంటె ముందే ప్రచారంలో ఉన్న సాంఖ్యధోరణిని తెలియజేస్తున్నదని తిలక్ భావం. తిలక్ దృష్టిలో, గీత మహాభారతంతోపాటే క్రీ.పూ. 900 లో రచించ బడ్డది.

ప్రస్తుతం మనకు లభిస్తున్న మహాభారతం—గీతా గ్రంథాలు మూలగ్రంథాలు కావని, ఇవి క్రీ. పూ. 400 లో రచింపబడ్డవని కూడా తిలక్ వాదన.

గీతా గ్రంథంలోని అంతస్సాక్ష్యాన్నిబట్టి చూస్తే, పై వాదనలు సరికావని తోస్తుంది. బాహ్య సాక్ష్యాలు పరిమితంగా లభించే ప్రాచీన గ్రంథాల కాల నిర్ణయంలో. అంతస్సాక్ష్యమే ఎక్కువ నమ్మదగినది.

జ్ఞానకర్మ మార్గాలలో ఏది శ్రేష్ఠమనే చర్చ అతి తీవ్రంగా, మేధావి వర్గంలో సాగుతున్న దశలో గీత ఆవిర్భవించింది.

ఈ చర్చ బుద్ధునికి పూర్వమే ప్రారంభమైన మాట నిజం. యజ్ఞ యాగాది వైదిక కర్మలను అంధప్రాయంగా అనుసరించే ధోరణి ఒక వైపునా. సర్వస్వం పరిత్యజించి అడవులలో తపస్సు, యోగనిష్ఠ ఆచరించే ధోరణి మరొక వైపునా ఆనాడు తలయెత్తాయి.

బుద్ధుడు ఈ రెంటినీ నిరసించి, సమాజసేవ ద్వారా వ్యక్తి ఆత్మోన్నత్యాన్ని సాధించాలనే మధ్యేమార్గం ప్రతిపాదించాడు. సంసారాన్ని త్యజించి భిక్షుక వృత్తి స్వీకారాన్ని ప్రోత్సహించాడు.

ఈ చర్చ అంతటితో ముగియలేదు, అలా ముగిసేదీకాదు. ముఖ్యంగా వేదాలపై విశ్వాసమున్న హిందూమతవర్గంలో బుద్ధునిబోధలు ప్రభావం కలిగించలేదు. సాంఖ్య, న్యాయ, వైశేషిక, పూర్వమీమాంసాది దర్శనాలు, ఈ వర్గాలలో తలయెత్తి వ్యాప్తిచెందాయి.

ఈ విభిన్న ధోరణులు హిందూమతాన్ని, తత్వశాస్త్రాన్ని కలవర పెడుతున్న రోజులలో గీతారచన జరిగింది. గీతలో, సాంఖ్యం అనేమాట జ్ఞానమార్గానికి పర్యాయపదంగా వాడబడ్డది. సాంఖ్య తత్వశాస్త్రంలోని అనేకాంశాలు, ప్రకృతి, పురుషుడు, త్రయీగుణాలు, ఆత్మ సాక్షీభూతత్వం-గీత అంగీకరించింది. మరొకవైపున ప్రతిఫలాపేక్షతో

చేసే కర్మను, గీత తీవ్రంగా నిరసించింది. ఇది పూర్వ మీమాంసా ధోరణి ఖండనే తప్ప. మరొకటి కాదు కనుక, ఈశ్వరకృష్ణుని సాంఖ్య కారికలు, జైమిని పూర్వమీమాంసా సూత్రాలూ బాగా వ్యాప్తిలోకి వచ్చిన మీదటనే, గీతా రచన సాగిందని ఎంచవలసి ఉంటుంది. ఈ కాలం క్రీ. పూ. 100-క్రీ. శ.-100.

వైష్ణవభక్తి, వాసుదేవపూజ, భాగవతధోరణి – వీటి ప్రస్తావన గీతలో హెచ్చుగావుంది. మౌర్యవంశం తర్వాత ఉత్తరాదిన తల ఎత్తిన శుంగ, కణ్వ రాజుల కాలంలో, ఈ భక్తి ధోరణులు రాజాదరణతో వృద్ధి కాసాగాయి. హిందూమత పునరుద్ధరణ, పురాణాల సంగ్రథనం కూడ ఈ కాలంలోనే ప్రారంభమైంది.

ఈ దృష్ట్యా చూసినా గీతారచన క్రీ. పూ. 100 క్రీ. శ. 100 మధ్యనే అయి ఉండాలి.

గీతలో వ్యక్తమయిన నిష్కామకర్మ భావానికీ, నాగార్జునా చార్యుని వజ్రచ్ఛేదికలోని 'ఫలాపేక్షారహిత త్యాగ, కర్మల' భావానికీ పోలిక ఉంది.

త్యాగం అంటే ఐహికప్రపంచాన్ని వీడి, సన్యాసం స్వీకరించడమని ఉపనిషత్తుల కాలంనాటికున్న అర్థం.

త్యాగంచేసినా, కర్మచేసినా అపేక్షారహితంగా చేయాలని నాగార్జునాచార్యులు ప్రతిపాదించారు. అదే భావం, రూపాంతరం చెంది "నిష్కామకర్మ" భావనగా గీతలో కనిపిస్తుంది.

ఈ భావసారూప్యత చూచినా, గీతారచన నాగార్జునాచార్యుని తర్వాతనే జరిగినట్లు తోస్తున్నది. నాగార్జునుని కాలం క్రీ. శ. 78 కనక, ఆ పిమ్మటనే గీతారచన జరిగి ఉండాలి.

రచనాకాలాన్ని పైకెంత వెనక్కు నెట్టినంతున. గ్రంథ ప్రాశస్త్యం పెరుగుతుందనుకోవడం సరికాదు. క్రీ.శ. 100లో రచించబడిందన్నంత మాత్రాన, గీతాగ్రంథ ప్రాశస్త్యానికే లోటూ లేదు. బౌద్ధంనుండి కొన్ని భావాలను స్వీకరించిందన్నందున వచ్చే లోపమూ లేదు.

బౌద్ధతాత్వికచింతన, వైదిక తాత్వికచింతన గౌడపాదుని (క్రీ. శ. 800) వరకు, పక్కపక్కనే సాగి, ఒకదానితో ఒకటి కలుస్తూ విడిపోతూ వచ్చింది.

ఈ సత్యాన్ని కాదని బౌద్ధానికి, హిందూ తత్వశాస్త్రానికి ఏ పోలికా లేదని నిరూపించటానికి ప్రయత్నించినవారిలో శంకరుడు మొదటివాడు. తెలిసో తెలియకో, ఆధునిక పరిశీలకులు పెక్కుమంది అదే భ్రమలో ఉంటున్నారు. ప్రాచీన గ్రంథాల కాలనిర్ణయంలో ఏర్పడుతున్న విపరీత వ్యత్యాసాలకు, ఈ పొరపాటు అవగాహనే ఒక కారణం.

ఒక రచయిత గాక, వేర్వేరు రచయితలు గీతను రచించి ఉంటారనే ఊహకూడా సరికాదు.

గీత నిర్జీవమైన తాత్విక గ్రంథం కాదు. అదొక కావ్యం. మొదటినుంచి చివరివరకూ ఏకవాక్యత, ధారాశుద్ధి, కవితావేశం కనిపిస్తూ ఉంటాయి.

కొన్ని అధ్యాయాలలో, పునశ్చరణ వున్నమాట నిజమే. ఈ పునశ్చరణ ధోరణి, ప్రాచీన తాత్విక గ్రంథా లన్నింటిలోనూ కనబడే సామాన్య లక్షణం. గీత కొకదానికే ప్రత్యేకత కాదు. ఒకే అంశాన్ని, వేర్వేరు రూపాలలో, వేర్వేరు పద్ధతులలో తిరిగి తిరిగి చెప్పటం మత బోధకుల పద్ధతి. తత్వశాస్త్రం మతంతో పెనవేసుకుని వస్తున్నది. గీతలోనూ ఈపద్ధతి కనిపిస్తుంది. కనుక గీతను వేర్వేరు రచయితలు రచించారనటం కూడా సరికాదు.

ప్రతిభావంతుడైన ఒకే కవి, తత్వవేత్త ఈ గ్రంథం రచించి ఉండాలి.

అద్వైత ప్రతిపాదితమైన ఉత్తరమీమాంసాసూత్ర ప్రస్తావనే గీతలో కనుపించదు. ఆనాటికి బాదరాయణుని ఉత్తర మీమాంసాసూత్రాలు, వ్యాప్తిలోకి వచ్చి ఉండకపోవచ్చు. వ్యాప్తిలోకి వచ్చినా, గీతాకారుడు ఉద్దేశపూర్వకంగానే వానిని వదిలేసి, ద్వైత ప్రతిపాదకమైన సాంఖ్యా మార్గాన్నే, జ్ఞానమార్గంగా పరిగణించి ఉండవచ్చు. రెండో ఊహే సమంజసమని తోస్తున్నది.

# విషయ విభజన

గీతలో 18 అధ్యాయా లున్నవి. మొదటి ఆరు అధ్యాయాలూ కర్మమార్గాన్నీ, రెండో ఆరు అధ్యాయాలూ భక్తిమార్గాన్నీ, ఆఖరు ఆరు అధ్యాయాలూ జ్ఞానమార్గాన్నీ బోధిస్తున్నాయని కొందరు పండితులు విభజిస్తున్నారు.

ఈ విభజన సరియైనది కాదు. కర్మమార్గ ప్రతిపాదములని చెప్పబడే మొదటి అధ్యాయాలలోనే, సాంఖ్య జ్ఞాన యోగాలు, ధ్యాన యోగమూ వున్నాయి. భక్తిమార్గ ప్రతిపాదకములని చెప్పబడిన రెండో భాగంలో విజ్ఞాన యోగమూ, జ్ఞానమార్గ ప్రతిపాదకమని చెప్పబడే మూడో భాగంలో సత్వ, రజ, స్తమోగుణ విచారణ చేసే అధ్యాయాలు వున్నాయి.

గీతా హృదయాన్ని గ్రహించేందుకు ఇంతకంటె మరొక విభజన అవసరం.

జ్ఞానమార్గమంటే ఏదో, కర్మమార్గమంటే ఏదో వివరించి, ఈ రెండు ప్రధాన తాత్వికధోరణులనూ సమన్వయపరచి, నిష్కామ కర్మ భావాన్ని ప్రతిపాదించే విభాగం మొదటిది.

(1) సాంఖ్య (2) కర్మ (3) జ్ఞాన (4) సన్యాస (5) విజ్ఞాన (7) క్షేత్రక్షేత్రజ్ఞ (13) మోక్షసన్యాసయోగాలు (18) ఇవి మొత్తం 7.

గీత ప్రధానబోధ ఇదేగనక, రచయిత, ఈ అంశాన్ని మొదట్లో వివరించి, మధ్యలో జ్ఞాపకంచేసి ఆఖరుకు పునరుద్ఘాటించాడని చెప్ప వచ్చు. ఇది గీతలోని తాత్విక విభాగం.

ఆనాటి మతభావాలను, విశ్వాసాలను ప్రస్తావించి, భక్తి భావాన్ని బోధించే విభాగంరెండోది. ఇందులో ధ్యానయోగం (6) అభ్యాసయోగం (8) రాజవిద్యా రాజగుహ్యయోగం (9) విభూతి యోగం (10) విశ్వ రూప సందర్శనయోగం (15) మొత్తం 7 ఉన్నవి. ఇదీ గీతలోని మత సంబంధమైన విభాగం.

ఇక మూడోది త్రయీగుణ చర్చచేసే విభాగం.

గుణత్రయ విభాగయోగం (14), దైవాసుర సంపద్విభాగయోగం (16) శ్రద్ధాత్రయ విభాగయోగం (17). ఇవి పాక్షిక ధోరణుల కతీత

మైన మానవతను, సాత్విక భావాన్నీ సహనాన్నీ ప్రతిపాదించే అధ్యాయాలు.

మొదటి అధ్యాయం అర్జున విషాదయోగం, మొత్తం గ్రంథానికి భూమికగా ఉపయోగపడి, ఈ గ్రంథాని కొక కావ్యత్వాన్ని కల్పించిన అధ్యాయం.

ఈ విభజన సైతం స్థూలమైనదే. ప్రతి విభాగంలోనూ ప్రధానాంశంతోపాటు ఇతర అంశాలు వస్తూనే ఉంటాయి. ఇది అనివార్యం.

తత్వశాస్త్రం, మతం మానవత్వం- ఈ మూడూ ముప్పేటలుగా పెనవేసుకుని గీతలోని 18 అధ్యాయాలలోనూ వ్యక్తమౌతూనే ఉంటాయి.

కేవలం తాత్విక గ్రంథంలో తర్కప్రకర్ష అతిపేలమై పాఠకునికి విసుగు కలిగించే ప్రమాదముంది.

కేవలం మత గ్రంథం విశ్వాస ప్రధానమై సంకుచితమైపోతుంది.

ఈ రెంటి ప్రమేయం లేకుండా కేవలం నీతి బోధకమైన గ్రంథాలు, ప్రాచీన కాలంలో అపురూపం. ఒకవేళ ఉన్నా, మత ప్రధానమైన ఆ కాలంలో అట్టి గ్రంథాలకు వ్యాప్తి తక్కువ.

ఈ మూటినీ కలిపి, ఒక సమగ్రమైన గ్రంథంగా రూపొందించుట లోనే గీతాకారుని ప్రత్యేకత కనపడుతుంది.

## పదిహేనవ అధ్యాయం

# జ్ఞానం - కర్మ

## (సిద్ధాంతం - ఆచరణ)

రాజ్యలోభంతో, బంధుమిత్రాదులతో యుద్ధం చేయటం పాపకర్మ అనే జిజ్ఞాసలో మునిగిన అర్జున విషాదంతో, గీత ప్రారంభమౌతుంది. మహాభారతంలోని ఈ ఘట్టాన్ని, గీతాకారుడు తన గ్రంథానికి కావ్యత్వాన్ని, జీవాన్ని కలిగించేందుకై కల్పించుకున్నాడు.

చచ్చేదీ, చంపేదీ - శరీరమే కాని, ఆత్మకాదని - ఈ రెండూ ఒకటి కాదనే చర్చ గీతకు నాంది.

శరీరం వేరు, ఆత్మ వేరు అనే భావం ఉపనిషత్తుల కాలంనుండి వున్నదే. అయితే, గీతలో ఈ చర్చ జరిగిన తీరుకు ఉపనిషత్తుల భావాలకు కొంత తేడా వుంది.

కేనోపనిషత్తులో ఇలా వుంది :

"ఆత్మ శక్తివల్లనే చెవులు వింటున్నాయి, కండ్లు చూస్తున్నాయి, నాలుక మాట్లాడుతున్నది, బుద్ధి ఆలోచిస్తున్నది, జీవితం నడుస్తున్నది, ఈగుణాలువేరు, ఆత్మవేరు అనితెలిసినవాడు గ్రహిస్తున్నాడు. ఇంద్రియవాసననుండి విముక్తిచెంది అమరత్వం పొందుతున్నాడు."

ఈ శావాస్యోపనిషత్తులలో యిలా వుంది.

"ఆత్మ ఒక్కటే. దానికి చలనంలేదు. కాని బుద్ధికంటే వేగం ఎక్కువ. బుద్ధికంటే ఆత్మ మొదటిది. ఇంద్రియ వాసనలకు ఆత్మ అతీతం. అదెప్పుడూ స్థిరంగా వుంటుంది. అయినా, అన్నిటికంటె ముందు పరుగెత్తుతుంది. దాని ఉనికివలనే జీవకోటికి ప్రాణం ఏర్పడు తుంది. (ఈ.4)

"అది కదులుతుంది. కదలదు. అది దూరంగా ఉంటుంది. దగ్గరగా ఉంటుంది. అన్నిటిలోనూ ఉంది. అన్నిటి వెలుపలా ఉంది."

(ఈ.5)

గీతలోని ఆత్మవర్ణన ఇలాంటిది కాదు :

ఆత్మకు చావూ లేదు; పుట్టుకా లేదు. అది శాశ్వతం. దానిని నిప్పుకాల్చలేదు. బాణం బాధించలేదు. నీరు తడపలేదు.

ఇంద్రియ వ్యాపారాలకు ఆత్మ కారణం కాదు. ఇందుకు కారణం ప్రకృతి.

ప్రకృతి, పురుషుడు ఇద్దరూ అది లేనివాళ్ళు. గుణాలు, వికారాలు ప్రకృతిలోనుంచే పుట్టుతున్నాయి. శరీరం, ఇంద్రియాల సృష్టికి ప్రకృతే కారణం.

"ప్రకృతేః క్రియమాణాని
గుణైః కర్మాణి సర్వశః
అహంకార విమూఢాత్మా,
కర్తాహ మితి మన్యతే" (కర్మయోగం-27)

అన్నిరకాల కర్మలూ ప్రకతి గుణాలవల్లనే కలుగుతుంటాయి. ఆత్మజ్ఞానం లేనివాడు, ఈ కర్మలన్నీ తానే చేశాననుకుంటాడు. గుణాలూ, కర్మలూ వేరే ఉన్నాయనే నిజం తెలుసుకున్నవాడు వానిలో ఆసక్తుడు కాడు.

సత్వమూ, రజస్సూ, తమస్సూ ఈ మూడుగుణాలూ ప్రకృతిలో పుడుతున్నాయి. నాశనంలేని ఆత్మను ఇవి దేహంతో బంధిస్తున్నవి.

చనిపోయేది ఆత్మకాదు; శరీరం. ఆత్మ ఎల్లప్పుడూ ఉండేదే, నీవూ, నేనూ ఎల్లప్పుడూ ఉన్నాము. ఇకముందూ ఉంటాము. బాల్య యౌవన కౌమార వృద్ధాప్యాలవలెనే మరణం ఒక దశ. ఆత్మ ఈ

శరీరం వదలి. మరో శరీరంలో ప్రవేశిస్తుంది, చినిగిన బట్టను వదలి, మంచి బట్టను మానవుడు ధరించినట్లే.

దీనికి విచారం ఎందుకు. నేనే చంపుతున్నాను అనే అహంకారం వదులు.

చంపేది నీవు కాదు – నీ ప్రకృతి. నీ ప్రకృతి కనుగుణమైన ధర్మంలో విధి నీవు చేయాలి.

అలా చేస్తే పాపం అంటావా? ఫలాపేక్ష లేకుండా నీ విధి చేయి. అపుడు ఏ పాపం ఉండదు – ఇది గీతలోని ఆత్మ చర్చ.

ఈ తాత్విక చర్చ, సాంఖ్యవాదానికి అనుగుణమైనది.

ప్రకృతి, పురుషుడు వేరు, పురుషుడు సాక్షిభూతుడు. ప్రకృతే అన్నిటికీ కారణం అనేది సాంఖ్యవాదం.

ఆత్మచర్చలో, గీతాకారుడు, ఉపనిషత్ వాదనకు భిన్నమైన సాంఖ్యవాదాన్ని ఎందుకు స్వీకరించినట్లు?

ఉపనిషత్తుల ఆత్మవాదం నిష్క్రియాపరమైనది అంతా ఆత్మే. శరీరం నిమిత్త మాత్రం. ఆత్మజ్ఞానం మోక్షసాధన. సంపాదించుటకు తపస్సూ, యోగమూ, సన్యాసమూ మార్గాలు.

క్రీ. పూ. 600–100 మధ్యకాలంలో, భారతదేశంలో, యోగులూ, మునులూ, సాధువులూ, సన్యాసులూ లక్షల సంఖ్యలో ఉండేవారు. ఆనాటి సాంఘిక పరిస్థితులు కూడా ఇందుకు కారణం. చిన్న చిన్న రాజుల మధ్య అంతఃకలహాలతో దేశం క్షోభించిపోయింది. రాజ కుటుంబాల మధ్య వ్యక్తిగత కక్షలూ, ద్వేషాలూ తరచు యుద్ధాలకు కారణమయేవి. యజ్ఞ యాగాలు, జంతుబలులు, మూఢాచారాలు విస్తారంగా వ్యాప్తిలో ఉన్నవి.

కర్మ అంటే, ఈలాంటి సమాజంలో తానూ భాగస్వామి కావటం. జ్ఞానమార్గం అంటే, ఇందులోనుండి బైటపడి, అడవుల్లో ముక్కు మూసుకుని, కందమూల ఫలాదులతోనూ, భిక్షాటనతోనూ జీవించటం.

ఆనాటికి, కర్మ, జ్ఞానం అనే మాటలకు అదే అర్థం.

ఈ దశలోనే సాంఖ్యం బౌద్ధం, తలయెత్తినవి.

ప్రకృతి వాస్తవం, అనాదిసిద్ధం: ఎవ్వనిచేతా సృజించబడింది కాదు. పురుషుడు కేవలం నిమిత్తమాత్రుడు. ప్రకృతి లేనిదే పురుషుడు చేయకలిగిందేమీ లేదు అనే సాంఖ్యధోరణి– ప్రజలను ప్రపంచం వైపు, సమాజంవైపు, తిరిగి మళ్ళించడానికి ఉపయోగపడ్డది.

గీతాకారుడు ఆ ప్రయోజనం ఆశించే, ఉపనిషత్తులలోని ఆత్మ భావంకంటే, భిన్నమైన సాంఖ్యుల ఆత్మభావాన్ని స్వీకరించాడని చెప్ప వచ్చు.

## 'పరమాత్మ' భావన

ఆత్మభావం వరకు సాంఖ్యం స్వీకరించి గీత అంతటితో ఊరుకోలేదు. సాంఖ్యంలో లేనట్టి పరమాత్మభావాన్ని చేర్చుకున్నది. ఈ విషయంలో, తిరిగి ఉపనిషత్తులను అంగీకరించింది.

సాంఖ్యంలో ఈశ్వరప్రసక్తి లేదు. గీతలో అలా కాదు. ఈశ్వరుడు, పరమాత్మ, పురుషోత్తముడు అనే భావం ప్రగాఢంగా ఉంది.

"అన్నాద్భవంతి భూతాని
పర్జన్యాదన్న సంభవః
యజ్ఞా ద్భవతి పర్జన్యో
యజ్ఞః కర్మ సముద్భవః
"కర్మ బ్రహ్మోద్భవం విద్ధి
బ్రహ్మా క్షీర సముద్భవం
తస్మాత్సర్వ గతం బ్రహ్మ
నిత్యం యజ్ఞేప్రతిష్ఠితం" (క. 14, 15)

ప్రాణులు అన్నంనుండి. అన్నం మేఘంనుండి, మేఘం యజ్ఞం నుండి, యజ్ఞం కర్మనుండి, కర్మ బ్రహ్మనుండి, బ్రహ్మ (ప్రకృతి) అక్షరమైన పరమాత్మనుండి ఉద్భవిస్తున్నవి. ప్రకృతి యావత్తూ యజ్ఞాల్లో ప్రతిష్ఠితమై ఉంది.

విజ్ఞానయోగంలో యిలా వుంది:

"భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశం, మనస్సు, బుద్ధి, అహంకారమూ అని ప్రకృతి ఎనిమిది విధాలు. భూత స్వరూపమైన ఇది నికృష్ట ప్రకృతి. ఇదిగాక, ఈ ప్రపంచాన్నంతా ధరించేది నా రెండో ప్రకృతి. అది పరాప్రకృతి: శ్రేష్ఠప్రకృతి. సమస్తమైన భూతాలూ ఈ రెండు ప్రకృతులలోనుంచి పుడుతున్నాయి. జగత్తు పుట్టడానికి, నాశనం కావడానికి నేనే కారకుణ్ణి. నాకంటె శ్రేష్ఠమయిందిలేదు. దారంలో పూసల్లాగ సర్వమూ నాలోనే కూర్చబడి ఉన్నాయి."

(వి. యో. 4, 5, 6, 7)

ప్రకృతిని రెండుగా విభజించే పద్ధతి సాంఖ్యంలో లేదు. గీతాకారుడు సృష్టించిన విభజన.

విభూతి, విశ్వరూప సందర్శన యోగాలలోనూ, పురుషోత్తమ యోగంలోనూ ఈ పరమాత్మ భావం మరింత స్పష్టంగా కనిపిస్తుంది.

కనుక తాత్త్విక ఆలోచనకు సంబంధించి నంతవరకు, గీత,సాంఖ్యవాదాన్ని, ఉపనిషత్ వాదాన్ని సమన్వయ పరచి, ఒక కొత్త ధోరణిని ప్రవేశపెట్టింది.

## సంపూర్ణ భావవాదం

గీతలోని తత్వశాస్త్రం సంపూర్ణమైన భావవాదం. శరీరం కంటె భిన్నమైన, శాశ్వతమైన ఆత్మ ఒకటి ఉన్నదనీ, ఇది బుద్ధి, మనస్సుల కంటె భిన్నమైనదనీ ఊహించుటే అసలు అశాస్త్రీయం. ప్రకృతి అనాది సిద్ధమనీ, ఆత్మ ఉన్నా, అది ప్రకృతి సంపర్కం లేనిదే. శక్తిహీనమైనదనీ చెప్పిన సాంఖ్యం, వాస్తవిక దృష్టిని ప్రదర్శించింది. ప్రకృతి నైతం, పరమాత్మనుండి ఆవిర్భవించిందన్న గీతా వాదనలో ఆ కాస్త వాస్తవికతా పోయింది.

"నాసతో విద్యతే భావో,
నాభావో విద్యతే సతః
ఉభయో రపి దృష్టాంతః
అనయో స్తత్వదర్శిభిః" (సాం. 116)

లేనిదానికి ఉనికి లేదు, ఉన్నదానికి లేకుండుట లేదు. పశువులు ఉండనివి, ఆత్మ ఉండేది. అసత్తూ సత్తూ అయిన ఈ రెంటి యథార్థాన్ని తత్వజ్ఞాను లెరుగుదురు.

ఉనికికీ, లేమికీ, చావుకూ, పుట్టుకకూ: శాశ్వతత్వానికీ, క్షణికత్వానికీ, శాశ్వత అభావాన్ని భావించటం భావవాద, ఐనాత్మక ధోరణుల సామాన్య ధర్మం.

ఈ శాశ్వత అభావాన్ని ఊహించినంత వరకు భావవాద మాయాజాలం నుండి బైటపడడం అసంభవం.

ఈ భావవాదాన్ని బోధించటం గీతకుగల విశిష్టత కాదు. ఇంగతా ధోరణులకూ. గీతకూ అది సామాన్య ధర్మమే.

జ్ఞాన కర్మల పరస్పర సంబంధాన్ని వివరించటమే గీత ప్రత్యేకత, ఈ చర్చే, గీతకు విశేషవ్యాప్తిని చేకూర్చింది.

శరీరంకంటె ఆత్మ భిన్నమైంది. చావు లేనిది. ఇంద్రియవ్యాపారాలకూ, ఆత్మకూ సంబంధం లేదు. ఈ గుర్తింపే జ్ఞానం అయితే ఆ జ్ఞానం కోసం ప్రయత్నించక, కర్మ ఎందుకు చేయమంటావు అని అర్జునుడు ఒక ప్రశ్న వేస్తాడు.

నిజానికీ ప్రశ్న అర్జునుడు వేసింది కాదు. పాఠకుడికి కలిగే ప్రశ్నే.

కర్మలలో పాపపుణ్యాలు అంటుతూనే ఉంటే, ఇవి ఆచరించిన కొద్దీ బంధనాలు మరింత బిగుస్తూంటే, బంధన మోక్షానికి యిది ఎలా మార్గమౌతుంది ?

మేము జ్ఞానులం. అంతా మాకు తెలుసు. మేము ఏమీ చేయనక్కరలేదు. ఒకవేళ ఏది చేసినా, మాకు పాపం అంటదు — అనే కుహనా సన్యాసులున్నారు. వారు "పైకి మాత్రం నేత్రాలూ మొదలైన కర్మేంద్రియాలు బిగబట్టినా, లోపల వారికి విషయవాంఛ ఉండనే ఉంది." వారు "కపటాచారులు" (క.యో, 6).

వీరు నిజమైన జ్ఞానులు కారు.

ఏ మనిషీ కర్మచేయకుండా ఉండలేడు. దేహయాత్ర కవసరమైన నియత కర్మలు (గాలి పీల్చుట, ఆహారం స్వీకరించుట మొద

లైనవి) చేయక తప్పదు కర్మలలోనుంచి తప్పించుకోవటం అసాధ్యం. ఫలాపేక్షతో కర్మచేయటమా, ఫలాపేక్ష లేకుండా కర్మచేయటమా అనేది సమస్య.

"యజ్ఞం కర్మవల్ల పుడుతుంది. కర్మ ప్రకృతినుంచి, ప్రకృతి పరమాత్మనుంచి పుడుతుంది. ఈ చక్రపరిభ్రమణానికి కర్మ అత్యవసరం, అయితే– ఆ కర్మలను ఆసక్తి లేకుండా లోక కల్యాణార్థం చేయాలి." (క. యో: 25)

ఇక్కడ కర్మఅంటే కేవలం వైదిక కర్మలేకాదు. లౌకిక కర్మలు కూడా.

మానవుడు ప్రకృతిలో భాగం. ప్రకృతి కొన్ని అంతర్గత కారణాల ద్వారా పరిభ్రమిస్తున్నది. పరిణామం చెందుతుంది. అది దాని కర్మ. లేక ఆచరణ, ఇదొక భౌతిక సూత్రం మానవుడు ప్రకృతిలో భాగం. కనుక ఈ సూత్రాలను, కర్మను మానవుడు తప్పించుకోలేడు. అలా తప్పించుకోగల ననుకోవటం భ్రమ.... ఈ అర్థంలో కూడా గీతాకారుడు కర్మ పదాన్ని వాడాడు.

ప్రపంచమంతా కొన్ని నిర్ణీతమైన సూత్రాల ప్రకారం నడుస్తున్న దనేదృష్టి గీతాకాలంనాటికి భారతదేశంలో ధృవపడ్డది. ఈ దృష్టి వేదకాలంలోనూ ఉంది. ప్రపంచాని కంతా ఒక రుతం, ఒక క్రమం ఉన్నదని వైదికార్యులు గుర్తించారు.

భౌతిక, రసాయన శాస్త్రాలలోను, వైద్యంలోనూ, గణితశాస్త్రంలోనూ భారతీయులు గణనీయమైన స్థాయి నందు కున్నారు. ఈ విజ్ఞానశాస్త్రాలు, తాత్విక చింతనపై కలిగించిన ప్రభావం వల్లనే, కర్మలు - భౌతిక సూత్రాలు అనే అర్థంకూడా ఏర్పడ్డది.

కర్మ అనే మాటను ఒక్కొక్కరు ఒక్కొక్క అర్థంలో వాడారు. బౌద్ధుల దృష్టిలో కర్మ అంటే వ్యక్తి ఆచరణ. సమాజం పట్ల వ్యక్తికి గల బాధ్యత, సాంఖ్య, వైశేషికుల దృష్టిలో ప్రకృతి అంతర్గతమైన భౌతికసూత్ర సముదాయం. పూర్వ మీమాంసకుల దృష్టిలో వైదిక కర్మ.

గీతాకారుడు, ఈ అన్ని అర్థాలలోనూ కర్మపదాన్ని వాడాడు.

యజ్ఞం కర్మలోంచి పుడుతుంది అని ఒకచోట అన్నాడు.

యజ్ఞం అంటే ఏమిటి? కొందరు ద్రవ్యయజ్ఞం, కొందరు తపోయజ్ఞం, కొందరు యోగయజ్ఞం, కొందరు స్వాధ్యాయయజ్ఞం, మరి కొందరు జ్ఞానయజ్ఞం చేస్తున్నారు. వీటన్నిటిలోకీ జ్ఞానయజ్ఞం శ్రేష్ఠం.

కొందరు వేదాల్లోని కర్మకాండకు చెందిన మాటలమీద వ్యామోహం పెట్టుకొని, భోగాలు, ఐశ్వర్యాలు, స్వర్గసుఖమూ కోరి యజ్ఞాలు చేస్తున్నారు. వారికి స్థిరబుద్ధి లేదు. వారి కర్మ లాభాపేక్షతో కూడిన కర్మ. అది కూడదు.

బ్రహ్మజ్ఞానం కలవాడికి వేదాలవల్ల ప్రయోజనంలేదు.

తనకోసం కాక, లోకంకోసం కర్మచేయాలి. సమత్వబుద్ధి అలవర్చుకోవాలి. అదే నిష్కామకర్మ. ఇది ప్రతి ఒక్కడూ చేయాలి.

సమష్టి క్షేమంకొరకు చేసే ప్రతిపనీ యజ్ఞమే. యజ్ఞం అనే మాటకు ధాత్వర్థమూ ఇదే.

వైదికకర్మలను పూర్తిగా గీతాకారుడు నిరసించాడా అంటే లేదు.

అజ్ఞానులు ఆసక్తితో కర్మలు చేస్తున్నారు. జ్ఞానులు లోకకల్యాణార్థం చేయాలి. కర్మలమీద ఆసక్తిగల అజ్ఞానుల బుద్ధిచెడగొట్టకూడదు. (క. యో.)

ప్రకృతి గుణాలతో భ్రాంతిచెందినవాళ్ళు, కర్మలమీద ఆసక్తి పెట్టుకుంటారు. అల్పజ్ఞులైన ఆ మందమతుల్ని, జ్ఞానంతో పెడదారిలో పెట్టరాదు. తాను, సర్వకర్మలూ చక్కగా చేస్తూ, వాళ్ళు కూడా చేసేటట్లు జ్ఞానవంతుడుచేయాలి. (క. యో)

'తమ ప్రకృతుల ననుసరించి, వ్యక్తులు, వేర్వేరు దేవతలను ఉపాసిస్తున్నారు. ఏ దేవతను ఉపాసిస్తాడో, ఆ దేవతపై అతడికి శ్రద్ధను కుదురుస్తున్నాను, తాను కోరుకున్న కోరికను ఆ దేవతనుంచి అతడు పొందుతున్నాడు. తక్కువ బుద్ధుల వాళ్ళకి కలిగే ఫలాలు అశాశ్వతమైనవి.'.... (వి. యోగం.)

## నిష్కామకర్మ

నిష్కామకర్మ ఎందుకు చేయాలి? అసలు ఫలితాన్నాశించకుండా, తన పని ఏ ఫలితాన్ని కలిగిస్తుందో తెలుసుకోకుండా, కర్మ చేయటం

తెలివి తక్కువ కాదా? ఆ ఫలితం, తన కుపయోగపడుతుందో, ఇతరుల కుపయోగపడుతుందో గ్రహించక కర్మలు చేయటం అంటే ఇతరుల శ్రేయస్సుకొరకు తాను శ్రమచేయాలని చెప్పటమే కాదా? సమాజంలోని వ్యత్యాసాలను, దోపిడీని, అన్యాయాలను కప్పిపుచ్చటానికి, ఈ వాదన వుపయోగపడదా ?

సమాజంలోని రాచరికవర్గాలు, అగ్రవర్ణాలు గీతా ఘోషలను ఆ విధంగా ఉపయోగించుకున్నమాట నిజం.

కాని, నిష్కామ కర్మపదానికి మరో అర్థం కూడా ఉంది.

మన విధిని మనం చేయాలి. ఫలితం కొరకు అర్రులు చాచ కూడదు. ఫలితం మనకు లభించక పోవచ్చుకూడా.

తండ్రి సంపాదించిన ఆస్తి కుమారుడు అనుభవిస్తున్నాడు. తోవ పక్కన ఎవరో వేసిన విత్తనం చెట్టై, ఆ పండ్లు అందరికీ ఉపయోగ పడుతున్నవి.

సమాజ శ్రేయస్సుకు కృషిచేసే వ్యక్తుల త్యాగఫలితం, సమాజం అంతా అనుభవిస్తున్నారు. బహుశా ఆ కృషిలో ఆ వ్యక్తి నశించవచ్చు.

మన కృషికి ఆశించిన ఫలితం ఆశించిన కాలంలోరాకపోవచ్చు. లక్ష్య సిద్ధిలోగా ఆశాభంగాలు ఎదుర్కొవలసి రావచ్చు. ఆశాభంగానికి కుంగిపోయి, కర్తవ్య నిర్వహణ విస్మరించటమా ? లేక అంతిమ విజయంలో విశ్వాసం ఉంచి, కృషి కొనసాగించడమా ?

ఫలితాన్ని గూర్చి అదేపనిగా కలలుకనే వ్యక్తి, ఆ ఫలితం లభించకపోతే, పూర్తిగా కుంగిపోయె ప్రమాదం ఉంది. కర్మచేయుటం సమబుద్ధితో జరగాలి. నిష్కామకర్మ అంటే ఇదే అర్థం. "కామ" అంటే అవాంఛనీయమైన ఆసక్తి.

గీతకు ప్రాణప్రదమైన ఈ భావం అనేక శ్లోకాలలో గ్రంథ మంతటా వ్యక్తమౌతూనే ఉంది.

'కర్మణ్యేవాధికారస్తే
మాఫలేషు కదాచన
మా కర్మ ఫలహేతుర్భూః
మాతే సంగోస్త్వకర్మణి' (సాం. యో. 47)

కర్మలు చేయుట నీవిధి. ఫలితాలమీద అధికారం వదలుకో. ఫలితాలకు నీవు కారణం కాదు. అందుకని నిష్క్రియాపరుడవు కారాదు.

'శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మాత్ స్వనుష్ఠితః
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః' (క. యో. 35)

బాగాచేసిన పరధర్మం కంటె లోపంతోఉన్న స్వధర్మమే మేలు.

స్వధర్మంలో మరణించినా మంచిదే. కాని పరధర్మం మాత్రం భయంకరమైనది.

ఈ వాక్యానికి స్వధర్మమంటే కుల ధర్మమని, కొందరు వ్యాఖ్య చేశారు.

ప్రకృతి ననుసరించి గుణాలు ఏర్పడతాయని గీతలో ఆది నుంచి అంతం వరకు ఉన్న భావన. కనక స్వధర్మం అంటే తన ప్రకృతి ననుసరించి ఏర్పడే ధర్మాలు అనటమే సరియైనది. ఆధునికులు ఈ అర్థాన్నే చెప్పారు.

గుణ, కర్మలనుబట్టి నాలుగు వర్ణాలు ఏర్పడ్డాయనీ, నాలుగు వర్ణాలకు నాలుగు విధులున్నాయనీ గీతాకారు డొకచోట చెప్పాడు.

జ్ఞాని జనవానికి 'బ్రాహ్మణునిమీద, ఆవుమీద, ఏనుగుమీద, కుక్కమీద, చండాలునిమీద'సమదృష్టిఉండాలని మరొకచోట చెప్పాడు.

కుల వ్యవస్థ విషయంలో గీత రాజీ పద్ధతిని అవలంబించింది. కుల భేదాలనా గుర్తించింది. అయితే కులద్వేషాలు కూడదని అన్నది. క్రింది స్థాయి వ్యక్తి, పైస్థాయికి రాగలడనే అంశం గీతలో కీలకం. కులాలు శాశ్వతమైనవి, మార్పురానివి అనే భావానికి గీత వ్యతిరేకం.

జ్ఞాన కర్మల చర్చను ముగిస్తూ, గీత సన్యాస యోగంలో యిలా తెలియజేస్తున్నది:

సాంఖ్యయోగౌ పృథక్ బాలాః
ప్రవదంతి న పండితాః

ఏకమప్యాస్థిత స్సమ్య
గుభయో ర్విందతే ఫలం॥ (స. యో. 51)

సాంఖ్యం వేరు, యోగం వేరు (జ్ఞానం వేరు, కర్మ వేరు) అవి అవివేకులు అనుకుంటారు. ఈ రెంటిలో ఏది బాగా చేసినా, రెంటి ప్రయోజనం కలుగుతుంది.

జ్ఞేయస్స నిత్యస్స, న్యాసో
యో నద్వేష్టి నకాంక్షతి
నిర్ద్వందో హి మహాబాహో
సుఖం బంధాత్ ప్రముచ్యతే" (స. యో. పి)

కర్మలు చేస్తూ కూడా రాగ ద్వేషాలు లేనివాడు సన్యాసి. కర్మలు చేయకపోయినా, మనస్సులో రాగ ద్వేషాలు కలవాడు సన్యాసి కాజాలడు.

జ్ఞాన కర్మల వివాదం పూర్వకాలంలోనే కాదు. ఈ కాలంలోనూ యికముందూ మానవుణ్ణి ఎదుర్కొంటూనే ఉన్నది.

మత విశ్వాసం కలవారు, లేనివారు, వ్యక్తి జీవితంలో, కుటుంబ జీవితంలో, సంఘజీవితంలో అన్ని వలయాలలోనూ, ఈ సమస్యను ఏదో రూపంలో పరిష్కరించుకోవలసినవారే.

వర్గదోపిడీ, వర్గసంఘర్షణతోపాటు, ప్రతివర్గంలోనూ, వ్యక్తికీ సముదాయానికీ ఘర్షణవుంది.

సమాజంలో భాగస్వామి ఐన వ్యక్తి ఆచరణ, అతనికి తెలిసినా తెలియకపోయినా, సమాజంపై ఏదో ప్రభావం కలిగిస్తూనే ఉంటుంది. తన ఆచరణకు, సమాజ ప్రగతికి గల సంబంధాన్ని గుర్తించి, వ్యక్తి సాగించే నడక, సిద్ధాంత ఆచరణల సమన్వయానికి చిహ్నం. ఇది గుర్తించని వ్యక్తి చేసే పనులు, వ్యక్తికి, సమాజానికి హానికరం కూడాను.

సామాజికంగా చూస్తే నిష్కామకర్మ దోపిడీ వ్యవస్థను సమర్థిస్తుంది.

వ్యక్తి పరంగా ఇది, నిస్వార్థ కృషిని, త్యాగాన్ని ప్రోత్సహించే భావం.

తపస్సుద్వారా ఆత్మజ్ఞానం పొందు - ఇది ఉపనిషత్తుల బోధ.

అష్టాంగమార్గంద్వారా నిర్వాణం సాధించు — ఇది బౌద్ధుల సలహా.

వైదిక కర్మలద్వారా నిశ్రేయసం పొందాలని పూర్వామీమాంసా వాదుల మతం. నిష్కామ కర్మద్వారా స్థితప్రజ్ఞత్వాన్ని సాధించు–ఇది గీత సందేశం.

కర్మ సన్యాసంద్వారా జ్ఞానం, తద్వారా మోక్షం పొందు - ఇది శంకరాచార్యుని ఉపదేశం.

భక్తిద్వారా మోక్షం సాధించమని రామానుజుల ఆదేశం.

ఇలా ప్రతి మతమూ, తత్వశాస్త్రమూ, వ్యక్తి ఔన్నత్యానికి ఏదో ఒక మార్గం సూచిస్తూనే వున్నాయి.

ఈ మార్గాలన్నింటిలోకీ గీతామార్గం వ్యక్తిశ్రేయస్సుకూ, సమాజ శ్రేయస్సుకూ ఉపయోగపడే పద్ధతి. ఆధునిక భావాలకు ఇమడగల ప్రాతిపదిక కలది.

# పదహారవ అధ్యాయం

# గీతా భాష్యం

ఏ ఇతర తాత్విక గ్రంథానికి లేనన్ని భాష్యాలు, వ్యాఖ్యలు గీతా గ్రంథానికి వెలువడ్డాయి.

గీతా భాష్యాలన్నిటినీ నాలుగు తరగతులుగా విభజించవచ్చు.

తామిదివరకే ఒక తాత్విక ధోరణిని రూపొందించుకుని, గీత, తమ ధోరణికి అనుకూలం అని చెప్పుకునేందుకు వెలువడిన భాష్యాలు. శంకర, రామానుజాది మతకర్తలు, రచించిన భాష్యాలు ఇలాంటివి.

గీత ఏ చారిత్రక పరిస్థితులలో వెలువడ్డదీ చర్చించి, గీతాకారుని ప్రధానసిద్ధాంతం ఇదై వుంటుంది అని నిర్ణయించే భాష్యాలు రెండో రకానివి. తిలక్, అరవిందులవాఖ్యలు ఇలాంటివి.

గీతాకారుని అసలు ఉద్దేశం ఏది అనే ప్రస్తావనకు, ప్రాధాన్యం ఇవ్వక, ఆ గ్రంథం నాకీ విధంగా బోధపడ్డది. ఈవిధంగా ఉ త్తేజం కలిగించింది అని వివరించే భాష్యాలు మూడో తరహా. గాంధీ, వినోబాజీల వ్యాఖ్యలు ఇలాంటివి.

నిరంతర గమనశీలమైన భారతీయ తాత్వికపరిణామానికి, గీత ఏ రకంగా దోహదంచేసిందీ చర్చించి, ఆధునిక కాలానికి, ఆధునిక సమస్యల

పరిష్కారానికి పనికివచ్చే లక్షణాలు గీతలో ఉన్నవా అని పరిశీలించే వ్యాఖ్యానం మరొకటి.

ఈ నాలుగో తరహాకు చెందిన వ్యాఖ్యలు, అంతగా వెలువడని మాట నిజం. కాని కాలం గడచినకొద్దీ, గీతలోని ప్రతి అక్షరమూ ప్రమాణమని స్వీకరించే అంధ విశ్వాసమూ, ఈ మాటకు ఇదే అర్థమూ అని వాదించే కుతర్కమూ అంతరించక తప్పవు. గీతకు సంబంధించిన సరియైన సంపూర్ణమైన వ్యాఖ్య అప్పుడుగాని వెలువడదు.

## మత భాష్యం

మొదటి తరహాకు చెందిన శంకర, రామానుజాది భాష్యాలు మత భాష్యాలు.

వీరికి చారిత్రక దృష్టిలేదు. అష్టాదశ పురాణాలతోపాటు, భారతాన్ని, గీతను - వ్యాసు డొక్కడే రచించాడు అనే విశ్వాసాన్ని వీరు ప్రశ్నించనైనా ప్రశ్నించరు.

వీరికి పరిణామదృష్టి లేదు. వేదాలలోనే శాశ్వత సత్యాలు ప్రవచించబడ్డాయని, అవి కాలక్రమేణా అడుగున పడిపోగా, ఉపనిషత్తులు, గీత మొదలైనవి, ఆ శాశ్వత సత్యాలను ఉద్ధరించాయని వీరి నమ్మిక. కృష్ణుడు అవతార పురుషుడని వీరి విశ్వాసం.

అద్వైత, విశిష్టాద్వైత పరంగా వీరు కొన్ని పీఠాలను ఏర్పరచారు. తమ మత బోధని కనుగుణంగా ప్రాచీన గ్రంథాలకు వ్యాఖ్య చేయడమే వీరి పని. మాటలకు లేనిపోని, అసందర్భమైన అర్థాలు కల్పించటంలో వీరికి జంకులేదు. గీతా హృదయాన్ని గ్రహించే యత్నం కంటే, గీతను తమకు అనుకూలమని నిరూపించుకునే యత్నమే వీరిలో కనిపిస్తుంది.

భారతీయ తాత్విక పరిణామానికి ఈ పీఠస్థాపకులు చేసినంత చెడుగూ, హానీ మరెవ్వరూ చేయలేదు.

వేదాలు, ఉపనిషత్తులు, గీత - తాత్విక పాఠ్యగ్రంథాలు కావు. మతం, తత్వశాస్త్రం, కవితావేశం, నీతిబోధ మొదలైనవన్నీ కలసిన

గ్రంథాలు. ఆ యా యుగాలలోని విభిన్న మత, తాత్విక ధోరణులను సమన్వయపరచి, వేర్వేరు ధోరణులలోని సామాన్య లక్షణాలను నొక్కి చెప్పి, మానవతా సమస్యలను తాత్విక పరిభాషలో వివరించిన గ్రంథాలు.

నదీ ప్రవాహంలోని నీటిని పక్కకు మరల్చి, చెరువులో దిగ్బంధనం చేస్తే, ఆ నీరు మురిగిపోయినట్లే, వివిధ పీఠాధిపతులు, ఉపనిషత్తులకూ, గీతకూ తాము చేసిన మతభాష్యాల ఫలితంగా, భారతీయ తాత్విక చింతనలో మురుగు గుంటలు యేర్పాటుకానికి కారణమైనారు.

## శంకరాచార్యులు

వీరిలో ప్రథములు శంకరాచార్యులు. ఈయన కాలం క్రీ. శ. 800 గీతారచన పిమ్మట 6. 7 శతాబ్దాలకు శంకరాచార్యులు తన భాష్యం వ్రాశారు.

ఈ మతస్థుల వ్యాఖ్యాన పద్ధతికి కొన్ని ఉదాహరణలు చూద్దాం:

గీత నాలుగో అధ్యాయంలో ఈ శ్లోకం ఉంది:

'చాతుర్వర్ణ్యం మయా సృష్టం
గుణ కర్మ విభాగశః' (గీ. 4-13)

వారివారి స్వభావాలను బట్టి, చేసే పనులనుబట్టి నాలుగు వర్ణాలు ఏర్పడ్డాయి అని ఈశ్లోకాని కర్థం.

కిందినుండి పైకీ, పైనుండి కిందికి కులాల మార్పిడికి ఈ శ్లోకం అవకాశం ఇస్తుంది.

ఇలాంటి అవకాశాన్ని కలిగించటం శంకర మతస్థుల కిష్టంలేదు.

గుణం అనగా స్వభావం. జీవుడు శరీరంలో ప్రవేశించినపుడే అనగా పుట్టుకతోనే గుణం ఏర్పడుతుందని వ్యాఖ్య చేశారు.

కనుక వర్ణాలు జన్మసిద్ధాలు; మార్పు వీలులేనివి.

(గీత 28 అధ్యాయం. 71 శ్లోకం)

విహాయ కామాన్సర్వాన్
పుమాం శ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకారః
సశాంతి మధిగచ్ఛతు॥

కోరిక లన్నిటినీ త్యజించి, అహంకార మమకార రహితుడైన వ్యక్తి శాంతిని పొందుతాడు.

ఇక్కడ 'కామం' అంటే కోరిక కాదని, కర్మలు అని శంకరా చార్యుల వ్యాఖ్య అన్ని కర్మలను వదలి, సన్యాసం స్వీకరించిన వానికి శాంతి లభిస్తుందని చెప్పటానికి, వారు కల్పించిన వికృతార్థ మిది.

గీతలో కర్మ అని మాట వచ్చినపుడల్లా, స్మృతిపరమైన కర్మ అని వీరి వ్యాఖ్య.

జ్ఞానియైనవాడు పైతం, కర్మలు చేయక తప్పదని గీత బోధి స్తుంది. కాని, శంకర మతస్థు లలాకాక, జ్ఞానప్రాప్తికి అర్హతలేనివారు మాత్రమే కర్మలు చేయాలని వ్యాఖ్యానిస్తున్నారు.

చిరిగిన వస్త్రాలను విడిచి, పురుషుడు మంచి వస్త్రాలను స్వీక రించినట్లే దేహానంతరం, ఆత్మ మరొక దేహంలో ప్రవేశిస్తుందని గీతలో ఉంది.

ఆత్మలు అనేక మున్నవని చెప్పేందు కీ భావం ఆధారం కలిగి స్తుంది. ఈ భావం అద్వైతానికి నచ్చదు.

పరమాత్మ, ఆత్మ ఒక్కటేనని వారి విశ్వాసం.

అందుకని పై గీతాభావాన్ని నిరాకరించటానికి గీతలోని మరొక శ్లోకానికి వా రిలా వ్యాఖ్య చేస్తున్నారు.

అంతవంత ఇమే దేహాః
నిత్య స్యోక్తా శ్శరీరిణః
అనాశినో ప్రమే యస్య (గీ 2-131)

దేహాలు నశిస్తాయి. దేహిమాత్రం శాశ్వతుడు.

ఇచ్చట దేహాః అను బహువచనం వాడి శరీరిణః అని ఏక వచనం వాడినందున, శరీరాలు వేరైనా, ఆత్మలొకటేనని గీతాకారుని భావమని వారి వ్యాఖ్య.

గీత రెండో అధ్యాయంలో ఈ శ్లోకం ఉంది:

అవ్యక్తాదీని భూతాని
వ్యక్తమధ్యాని భారత
అవ్యక్త నిధనాన్యేవ
తత్రకా పరివేదనా॥

ఈ జీవకోటి పుట్టుక ఏదో తెలియదు. అంత మేదో తెలియదు. ఈ రెంటికీ మధ్య వర్తమానం మాత్రం మనకు తెలుసు. ఇలాంటి దాని విషయమై విచారమెందుకు అని శ్లోకం అర్థం.

దుఃఖంలో ఉన్నవారిని ఎవరైనా సామాన్యంగా పరామర్శచేసే పద్ధతి ఇది.

ఈ శ్లోకాన్నాధారం చేసుకొని గీత సంశయ వాదాన్ని బోధిస్తున్న దనడం పొరపాటే. కాని, ఇలాంటి సమస్యలూ, సందేహాల ప్రస్తావనా గీతకు ఆదరణ కలిగించే అంశాలలో ఒకటి.

ఇలాంటి భావాన్నే ఒక పర్శ్యన్ తత్వవేత్త వెలువరించాడు:

'ప్రకృతి ఒక చినిగిపోయిన తాళ పత్రగ్రంథం. ఇందులో మొదటి పుటలూ లేవు. చివరి పుటలూ లేవు మధ్య పుటలు ఉన్నవి. వీటి ఆధారంతో, మొదటి చివరలను అన్వేషించటమే తత్వశాస్త్రం.'

శంకర మతస్థులు ఇక్కడచేసే వ్యాఖ్య చూడండి :

తెలియవు అనగా లేవు అని అర్థం. అనగా అవాస్తవములు. ఒక వస్తువు మొదట అవాస్తవమై, చివర అవాస్తవమై, మధ్యమాత్రం వాస్తవం. ఎలా కాగలదు? కనుక వర్తమానం వాస్తవం అనటంలో అర్థం యిదొక భ్రమ, మాయ అని మాత్రమే. కనుక పై శ్లోకం మాయావాదాన్ని బోధిస్తున్నది.

అద్వైత, విశిష్టాద్వైత శాఖాభేదాలు గీతా కాలానికిలేవు. సాంఖ్యం లోని అనేకాత్మ వాదాన్నీ, ఉపనిషత్తులలోని పరమాత్మ భావాన్నీ, రెంటి సమన్వయమే గీత లక్ష్యం.

శంకర, రామానుజుల దృష్టి అది కాదు. వీరిలో తత్వవివేచన కంటె, పీఠాధిపత్య ధోరణి హెచ్చు. తమకు నచ్చిన విధంగా వ్యాఖ్య చేయటానికి, ఎన్ని వితండవాదాలు చేయటానికీ వెనుకాడిలేదు.

## రామానుజులు

జీవేశ్వరులు రెండూ ఒకటే అని, శంకరుని మతం. ఈ రెండూ స్వభావంలో ఒకటే ఐనా, వేని విశిష్టతలు వానికున్నాయని రామానుజుని మతం.

జ్ఞానమార్గమే ఏకైక మార్గమని శంకరులు ప్రతిపాదించగా, జ్ఞాన, కర్మ, భక్తిమార్గాలు మూడూ అవసరమనీ, అందులోనూ భక్తిమార్గం ముఖ్యమనీ రామానుజుల వ్యాఖ్య.

అర్జునునికి బోధచేసి చేసి, చివరకు కృష్ణుడు యిలా అంటాడు:

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ
అహం త్వాం సర్వ పాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచ" (18—66)

అన్ని ధర్మాలూ వదలివేసి నన్ను శరణు జొచ్చుము. నీ పాపా లన్నిటినుండి నేను మోక్షం కలిగిస్తాను. విచారించవద్దు.

జ్ఞాన, కర్మల కంటె భక్తి ఆచరణీయం, సులభం. భక్తి రహితమైన జ్ఞాన, కర్మలు నిష్ప్రయోజనములు. భక్తిమార్గం శ్రేష్ఠం.

గీత అనేకాత్మలను గురించి, పరమాత్మను గురించి చెబుతుంది. కనుక ఆత్మలన్నీ ఒక్కటే అని అద్వైతులు చేసే వ్యాఖ్య సరికాదు. ఆత్మ లనేకా లున్నవి. ఇవన్నీ భక్తి జ్ఞాన, కర్మ మార్గాలద్వారా పర మాత్మ సాయుజ్యం పొందుతాయి. అప్పుడు కూడా, ఆత్మ, పరమాత్మలు పూర్తిగా ఒకటికావు. దేని విశిష్టత దానిదే.

పీఠాధిపతులు, గీతకు చేసిన వ్యాఖ్యలన్నీ కూడా పై విధం గానే, తమ తమ ధోరణుల కనుగుణంగా సాగిన మతపరమైన భాష్యాలు.

# తిలక్ గీతా రహస్యం

గీతను మొత్తంగా అధ్యయనంచేసి, ఆ బోధలను వివరించిన మొట్టమొదటి వ్యాఖ్యాత బాలగంగాధర తిలక్.

తిలక్ జాతీయోద్యమ నాయకులలో ఒకరు. "స్వరాజ్యం నా జన్మ హక్కు"ని చాటిన మొదటివ్యక్తి. జీవితమంతా దేశస్వాతంత్ర్య పోరాటాని కర్పించిన వీరుడు. నిద్రాణమై వున్న జాతిని మేల్కొల్పి, నవసత్వాలు కల్పించటానికి, ఒక సాధనగా గీతారహస్యాన్ని రచించిన కర్మిష్టి.

ఆధునిక పాశ్చాత్య తాత్విక ధోరణులతో ఎక్కడికక్కడ సరి పోల్చుతూ, గీతను వివరించటం గీతా రహస్యంలోని మొదటి విశిష్టత.

జ్ఞానం, కర్మ, యజ్ఞం, యోగం—మొదలైన మాటలకు శంకర, రామానుజులవలె సంకుచితార్థాన్ని కాక, విస్తృతమైన తాత్వికార్థా న్నివ్వటం రెండో విశిష్టత.

సామాజిక సూత్రాలు—వ్యక్తి స్వేచ్ఛ—పరస్పర సంబం ధాల దృష్ట్యా "కర్మ" భావాన్ని తిలక్ సుదీర్ఘంగా చర్చించాడు.

## తాత్వికవిభజన

భారతీయ తాత్విక పరిణామాన్ని తిలక్ యీ విధంగా విభ జించాడు :

మొదటిది వైదిక యుగం. ఇది కర్మ ప్రధానం.

రెండోది గీతాయుగం. ఇది కూడా కర్మ ప్రధానమే. ఈ యుగం భారతంతో అంతమయింది.

అంతటితో భారతదేశంలో కర్మదృష్టి లోపించింది.

పిమ్మట, బౌద్ధయుగం, శంకరయుగం, జ్ఞానేశ్వర్, తుకారాంల యుగం వచ్చింది. ఇవి సన్యాస భావాన్ని బోధించిన యుగాలు, ఇవి శివాజీ కాలం (క్రీ. శ. 1000) వరకు కొనసాగాయి.

శివాజీ గురువైన సమర్థ రామదాసుతో, కర్మయుగం పునరుజ్జీవించింది. తిలక్, గాంధీలు ఈ యుగాన్ని కొనసాగిస్తున్నారు. భారత దేశంలో పుట్టిన ఆఖరు కర్మయోగి గాంధీజీ.

ఈ విభజన శాస్త్రీయమైనదీ కాదు, చారిత్రకమైనదీ కాదు. కర్మయోగం పట్ల తిలక్‌కు గల ప్రత్యేక శ్రద్ధయే మాత్రమే విభజన కారణం.

శాస్త్రీయమైన తాత్విక విభజన క్రింది విధంగా ఉంటాలి:

వైదిక కర్మలు, ఉత్పత్తిశక్తుల విధ్వంసాన్నీ అంధ విశ్వాసాలనూ కలిగిస్తున్న దశలో, అందుకు ప్రతిచర్యగా నిరాకార, నిర్గుణ భావాన్నీ, అందరిలో ఉన్న ఆత్మ సమానమనే భావాన్నీ బోధించినవి ఉపనిషత్తులు.

వైరాగ్యం హెచ్చి సమాజంకంటె, ఆత్మ అనగా తన వ్యక్తి శ్రేయస్సే ముఖ్యమని భావించే వైపరీత్యం తల యెత్తగా, 'ఆత్మ' భావాన్నే నిరాకరించి, వ్యక్తికీ, సమాజానికీ నూతన అనుబంధాన్ని కర్మపరంగా ఏర్పరచింది బౌద్ధం.

గీతకూడా, కొంత తేడాతో ఇదే కృషి చేసింది. బౌద్ధం అవైదికం కాగా, గీత వైదిక ప్రాముఖ్యాన్నంగీకరించింది.

ఈ బోధనలన్నీ తమ మత ధోరణుల కనుగుణంగా వ్యాఖ్యచేసి, తాత్విక శీలనను అరికట్టిన యుగం శంకర, రామానుజాదుల యుగం.

జ్ఞాన, కర్మాది పదాలకు ఆధునికమైన వ్యాఖ్యచేసి, తిరిగి భారతీయ తాత్విక చింతనను ముందుకు తీసుకుపోతున్న యుగం నేటిది: ఇందులో తిలక్, అరవింద వంటివారి పాత్ర గమనీయం.

## సన్యాస మార్గ నిరసన

జ్ఞాన మార్గం పేరుతో, కర్మసన్యాసాన్ని బోధించిన శంకర భాష్యంపై ఖండన, గీతారహస్యంలో మొదటినుండి చివరి వరకు కనిపిస్తూనే ఉంటుంది. అలాగే భక్తి మార్గాన్ని బోధించిన రామానుజ భాష్యం కూడా విమర్శించబడ్డది. తిలక్ గీతారహస్యం వ్రాసిందే ఈ సన్యాస ధోరణిని, నిష్క్రియాపరతను పారద్రోలేందుకు.

గీతారహస్యం పీఠికలో తిలక్ ఇలా అంటున్నాడు :

"మత కర్తలైన వ్యాఖ్యాతలు, గీతను గురించి ముందుగానే కొన్ని అభిప్రాయాలు ఏర్పరుచుకొన్నారు. ఆ దృష్టికి విరుద్ధమైన అర్థం గీతలో కనిపిస్తే, ఆ అర్థాన్ని త్రోసిపేస్తారు.. వ్యక్తి దృష్టి ఒక మత శాఖకు కట్టుబడితే, ఇంతే జరుగుతుంది" (39 వ పేజీ, ఇంగ్లీషు కాపీ)

సుఖదుఃఖాలను గురించిన అద్వైతవ్యాఖ్య సరికాదంటూ తిలక్ ఇలా అంటున్నాడు;

'కోరిక అన్ని దుఃఖాలకు కారణమని సన్యాసమార్గం చెప్పే విషయం అంగీకరించ తగదు. మన ఇంద్రియాలు, బాహ్యవస్తువులతో సంబంధం పెట్టుకుంటాయి. ఇంద్రియాలకిది సహజలక్షణం. బాహ్య వస్తువులలో సుఖదుఃఖ కారణాలు రెండూ ఉండవచ్చు. మనం కోరుకున్నా, కోరుకోకపోయినా యిలా జరుగుతుంది. కనుక ఫలితం ఏమవుతుందా అని ఆరాటపడకుండా, నిరాసక్తితో విధిచేయటం ఒక్కటే కర్తవ్యం.'

(153 పేజీ)

పూర్వమీమాంసకుల కర్మయోగం ఫలితంగా, జన్మ పరంపర తప్పదు. ఏమంటే వారిది ఫలాపేక్ష కర్మ. గీత బోధించే కర్మ నిష్కామ కర్మ. కనుక ఇది మోక్షదాయకం. (482 పేజీ).

శంకరాచార్యుని సన్యాస మార్గాన్ని తిలక్ తీవ్రంగా నిరసించి, భారతదేశం బానిసత్వంలో దీర్ఘకాలం ఉండటానికి, ఇలాంటి సన్యాస ధోరణులే కారణమని ఖండించాడు.

తాత్వికంగా తిలక్ కూడా అద్వైతమార్గాన్నే ఆమోదించాడు. ఈ విషయమై ఇలా అంటున్నాడు:

'శంకరాచార్యుని సన్యాసమార్గంపైన మాత్రమే నా ఆరోపణ. ఆయన బోధించిన జీవేశ్వర ఐక్యతా ప్రతిపాదితమైన అద్వైతంపై కాదు.

(702 పేజీ)

బౌద్ధ, జైన, చార్వాకాది మతాలపట్ల, భౌతికవాద ధోరణుల పట్ల తిలక్ వ్యతిరేకత, గీతా రహస్యంలో అడుగడుగునా కనిపిస్తూనే ఉంటుంది. కులవ్యవస్థపై కూడా, ఆయన భావాలు సాంప్రదాయ ధోర

జీకి చెందినది. ఆ వ్యవస్థ ప్రస్తుతః మంచిదేననీ, ప్రస్తుతం అది చెడిపోయింది కనుక, ఆ భేదాల నీనాడు పాటించరాదనే తిలక్ భావం.

తాను, గీతా రహస్యం ఎందుకు వ్రాయవలసి వచ్చిందో, తిలక్ స్వయంగా ఇలా చెపుతున్నాడు :

"నా చిన్నతనంలో పెద్దలు తరచు చెబుతూండేవారు. సంసార తాపత్రయంలోనుంచి ఎంత బైటపడితే అంతగా మోక్షసాధన తేలిక అని. ఒకే వ్యక్తి, ఇదరు యజమానులకు దేవుడూ, ప్రపంచం - సేవ చేయలేడు....ఇది నా ఆలోచనను రేకేత్తించింది. గీతాధ్యయనం ప్రారంభించాను....గీతకు ఎన్నో వ్యాఖ్య లున్నవి. సంపూర్ణజ్ఞానం పొందిన తర్వాతకూడా, భక్తి స్థిరపడ్డ తర్వాతకూడా, వ్యక్తి, కర్మ చేస్తూనే ఉండాలి అని నా భావం. ఈ విషయంలో తదితర వ్యాఖ్యాతలందరితోనూ నేను భేదిస్తున్నాను .. ఈ కర్మయోగం నేను కొత్తగా చెప్పటం లేదు. ఇదిచాలాప్రాచీనం...సోమరిపోతుకు దేవుడుకూడా సాయంచేయడు. నీ స్వశక్తిని యావత్తూ ఉపయోగించి, నీ అభ్యున్నతికి పాటుపడాలి. అపుడే, దేవుడూ సాయం చేస్తాడు. ఫలితంపై నీవు ఆశ పెట్టుకోరాదు. అది రాబోయే తరాలకు వదులుదాం. మన విధి కర్మ చేయటమే. ఇదే నిజమైన వేదాంతం. (తిలక్ ప్రసంగం నుండి).

ఇంతటి ఉన్నత ఆశయాన్ని బోధించిన తిలక్, ఆరేండ్లు కారాగారవాసం అనుభవించాడు. తన జీవితంలో, స్వరాజ్యం వచ్చే అవకాశం లేదని తెలిసికూడా, ఆఖరు క్షణంవరకూ తన కృషి మానలేదు. తిలక్ తరువాతి తరం వారమైన మనం, ఆయన కలలుగన్న స్వాతంత్ర్యం అనుభవిస్తున్నాం.

తిలక్ రాజకీయ నాయకుడైన తత్వవేత్త. ఆయన దృక్పథంలో క్రియాశీలత హెచ్చు.

తిలక్‌కు పూర్వమే ఈ క్రియాశీలత పునరుజ్జీవనోద్యమంలో ప్రారంభమైంది.

భారతీయ పునరుజ్జీవనోద్యమ జనకుడు రాజారాంమోహనరాయి.

18 వ శతాబ్ది ఆఖరున బెంగాల్‌లో జన్మించి 1833 లో మరణించిన రాంమోహనరాయి ప్రధానంగా సంఘసంస్కర్త. క్రైస్తవమతంతో

ప్రభావితుడైనవాడు. విగ్రహారాధన, కులవ్యవస్థ, సహగమనం తదితర మూఢ విశ్వాసాలన్నిటినీ వ్యతిరేకించి, ఉపనిషత్తులలోని ఆస్తికమతాన్ని పునఃస్థాపించటానికి బ్రహ్మ సమాజాన్ని స్థాపించాడు. ఉపనిషత్తులలోని భావవాద తత్వశాస్త్రానికి క్రియాశీల వ్యాఖ్య చేసినవాడు. నిష్క్రియా పరతకు పర్యాయపదమైన కర్మసన్యాసం ఉపనిషత్తులకు విరుద్ధమని, మధ్యయుగాల మత కర్తలు కల్పించిన వైపరీత్యమని వాదించిన వాడు.

వివేకానంద ధోరణికూడా ఇదే. రామమోహనరాయి, హిందూ మతాన్నికాదని బ్రహ్మ సమాజమనే కొత్తమతాన్ని స్థాపించగా, వివేకానందుడు హిందూ మతాన్నే సంస్కరించ వచ్చునని భావించినవాడు. క్రైస్తవ మిషనరీల నమూనాలో రామకృష్ణ మిషన్ (1897) స్థాపించి, మతప్రచారం, తత్వబోధనలను, సాంఘిక సేవతో జత పరచినవాడు వివేకానందుడు.

శంకరా ద్వైతాన్ని ఆమోదిస్తూనే, వివేకానంద వర్ణవ్యవస్థను ఖండించాడు. అందరి ఆత్మలు ఒకటే ఐనప్పుడు, లౌకిక జీవితంలో వర్ణవ్యవస్థ ఎందుకుండాలి ? ఆత్మ, పరమాత్మతో ఐక్యం కావడం అంటే, ప్రతి వ్యక్తి, పరమాత్మ స్థాయికి ఎదగగల శక్తికలిగి ఉన్నాడు అని అర్థం. స్వయం కృషిద్వారా ఆ శక్తిని వినియోగంలోకి తెచ్చు కోవాలి. ఇది కేవలం జ్ఞానం ద్వారా సాధ్యంకాదు, కర్మ అవసరం.

ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క వర్ణం అధికారంలోకివస్తున్న దని, కలియుగంలో శూద్రులు అనగా పాటకజనం అధికారంలోకి వస్తా రని, అదే సోషలిజమని సృజనశీల వ్యాఖ్య చేసినవాడు. సోవియట్ రష్యాలో సోషలిస్టు విప్లవాన్ని హర్షించి ఆహ్వానించిన వాడు స్వామి వివేకానంద.

ఆధునిక భావవాద తత్వవేత్తలలోముఖ్యులు డాక్టరు రాధాకృష్ణన్. వివేకానంద, ఠాగూరులచే ప్రభావితుడైన రాధాకృష్ణన్ శంకరా ద్వైతా నికి కొత్త వ్యాఖ్యానం ఇచ్చాడు.

ప్రపంచం వాస్తవం. మాయ అని శంకరుడు వాడిన మాటకు అర్థం అవ్యక్తం అని మాత్రమే. ప్రతి వ్యక్తిలోనూ అనంతమైన

విశ్వజనీన లక్షణాలున్నవని చెప్పటమే, ఆత్మ పరమాత్మలు ఒక్కటి అని వాడుటలో అర్థం. రామానుజుని వాదనకు శంకర అద్వైతానికి వైరుధ్యం లేదు. ఒకటి పై మెట్టు, మరొకటి కిందిమెట్టు దేవుడు అవతారాలు ఎత్తుతాడు అనగా, ప్రతివ్యక్తిలోనూ అవతార అంశలు ఉన్నట్లే, మానవుడు తన భవిష్యత్తును తానే నిర్ణయించుకోగలడు.

రాధాకృష్ణన్ వివరణ, వివేకానంద వివరణకు సన్నిహితమైనది. అద్వైతవేదాంతాన్ని, ఆధునిక విజ్ఞానశాస్త్ర విజయాలను, సాంఘిక ఆర్థిక న్యాయం కొరకు పీడిత ప్రజలు పడే ఆందోళన, ఆవేదనలను సానుభూతితో అర్థం చేసుకునే విశాల దృష్టిని ప్రదర్శించిన తత్వవేత్త డాక్టర్ రాధాకృష్ణన్.

భారతీయ తత్వశాస్త్రానికి, ముఖ్యంగా గీతకు గాంధీజీ ఇచ్చిన వ్యాఖ్యానుకూడా పరిశీలించాలి.

గాంధీజీ వ్రాసిన అనాసక్తి యోగానికీ, తిలక్ వ్యాఖ్యకూ తేడా ఒకే ఒక అంశంలో ఉంది.

## గాంధీజీ వ్యాఖ్య

విద్యుక్తధర్మ నిర్వహణలో, హింస చేసినా తప్పులేదని తిలక్ వ్యాఖ్య.

ఆ సందర్భంలో కూడా హింస కూడదనీ, అహింసా మార్గమే ఆచరణీయమనీ గాంధీజీ వ్యాఖ్య.

గీత. అహింసను బోధిస్తున్నదా? ఆ విషయంలో గాంధీజీ ఇలా అంటున్నారు:

'భగవద్గీత, అహింసా సిద్ధాంతమును స్థాపించు నుద్దేశముతో వ్రాయబడలేదని మాత్రం మనం ఒప్పుకొనవచ్చును. గీతారచనకు పూర్వమే, అహింసా ధర్మం సుస్థిరంగా, ముఖ్య ధర్మంగా అంగీకరింపబడి ఉంది. అయితే యుద్ధాలు నిషేధింపబడలేదు. .. '

గీతను ఆయన అర్థం చేసుకున్న పద్ధతిని. గాంధీగారే ఇలా చెబుతున్నారు ;

'గీత ఒక ఇతిహాస గ్రంథం కాదు. అంతరంగ యుద్ధమును మరింత ఆకర్షవంతంగా చేయుటకే, భౌతిక యుద్ధం వర్ణింపబడ్డది. భౌతిక యుద్ధ నిష్ప్రయోజకత్వాన్నే, మహాభారత రచయిత నిరూపించాడు... మానవుని నలెచే గొప్ప గ్రంథాల అర్థాలు కూడా, కాలాను సారంగా పెరుగుతుంటాయి. గీత విషయంలోనూ ఇదే జరిగింది. కొన్ని మాటలకు గీతకారుడే విశాలమైన అర్థాలు కల్పించాడు. యజ్ఞమూ, సన్యాసం మొదలైన మాటలిట్టివి. తనవలె, మనలను కూడా మాటలకు విశేషార్థాలు కల్పించమని గీతాకారుడు చెప్పుచున్నాడు'

ఇలా ఎవరికి తోచిన వ్యాఖ్యలు, వారు వ్రాయటం సరైనదేనా? అసలు గీతార్థం ఏమిటి? అనే ప్రశ్న రావచ్చు.

గీతాకారుడు, ఉద్దేశ పూర్వకంగానే, విశాలార్థ ప్రతిపాదకాలైన మాటలు వాడాడని గుర్తించినప్పుడు, ఈ సృజనశీలమైన వ్యాఖ్యలలో సిద్ధాంత రీత్యా తప్పేమీ లేదు.

కాని, ప్రతి కొత్త విషయాన్నీ పాత గ్రంథాల సాయంతోనే నిరూపించవలసిన అవసరం లేదు. పాత తాత్విక గ్రంథాలలో లేని సరి కొత్త భావాలను, స్వీకరించ వలసిన అవసరం ఎంతో ఉంది. ఈ కొత్త భావాలు, మన తాత్విక పరిణామానికి అనుగుణమైనవని నిరూపించటం సరియైనదే; అవసరమూను. కాని ఈ కొత్త భావాలన్నీ, పాత గ్రంథాలలోనే ఏదో రూపంలో నిగూఢంగా ఉన్నాయని చెప్పటం నిజమూ కాదు. అలా చెప్పవలసిన అవసరమూ లేదు.

గీతకు వెలువడిన వ్యాఖ్య లన్నిటిలోకీ. అరవిందుని వ్యాఖ్య విలక్షణమైనది.

జ్ఞాన, భక్తి, కర్మయోగాల సమన్వయం ద్వారా, మానవుడు అతీత మానవుడు కాగలడనీ, అందుకు కృషి చేయటమే మానవ జీవిత లక్ష్యమనీ అరవిందుని సిద్ధాంతం. ఇందు కనుగుణంగానే, ఆయన గీతకు చేసిన భాష్యం కూడా నడిచింది.

పదిహేడవ అధ్యాయం

# అరవిందుని తత్వశాస్త్రం

తిలక్ వలెనే, అరవిందుడుకూడా తీవ్ర రాజకీయవాది. కొంతకాలంపాటు కారాగారవాసం అనుభవించాడు. తిలక్ జీవితాంతం స్వాతంత్ర్యోద్యమానికి తన కాలం అర్పించగా, అరవిందుడు, మధ్యలో రాజకీయాలను వదలి, తాత్విక పరిశోధనలకు తన జీవితం అంకితం చేశాడు.

అరవిందుడు యోగమార్గావలంబి. మానవుడు, అతీత మానవుడు కావటానికి జ్ఞాన కర్మయోగమార్గాలు ఆయనకు సాధనాలు. సమాజంతోనూ, సంఘంతోనూ గల ప్రమేయాన్ని క్రమేపీ తగ్గించుకుంటూ, విరక్తతతో వ్యక్తి ఆత్మోన్నత్యానికి ప్రయత్నించటం, అరవిందుని బోధలలోని ముఖ్యాంశం. అరవిందుని తత్వశాస్త్రం, వ్యక్తి ప్రధానమూ తర్క ప్రధానమూను.

1872 ఆగస్టు 15 వ, అరవిందఘోష్ బెంగాల్‌లో జన్మించాడు. ఇంగ్లాండులో ఐ. సి. యస్. పరీక్ష చదివి, స్వదేశానికి తిరిగివచ్చి, బరోడాలో 1893 నుండి 1906 వరకు కళాశాల ఉపాధ్యాయవృత్తి నిర్వహించాడు. 1906 నుండి 1910 వరకు బెంగాల్ జాతీయోద్యమంలో, అతివాద వర్గానికి నాయకుడుగా కృషిచేశాడు. 1907 సూరత్ కాంగ్రెస్‌లో, మితవాదుల ఓటమికి దోహదం చేసిన వారిలో, అరవిందు

దొకడు. కాంగ్రెస్‌కు బైట, తిలక్ నాయకత్వాన ఒక అఖిలభారత రాజకీయపార్టీని స్థాపించాలని కూడా యత్నించాడు. ఈ కాలంలోనే, 1908–1909 సంవత్సరాలలో అలీపూర్ జైల్లో ఒక ఏడాది శిక్ష అనుభవించాడు.

జాతీయోద్యమంలో స్తబ్దత ప్రవేశించింది. అరవిందుడు నిరుత్సాహపడ్డాడు. తాను వ్యక్తిగతంగా, రాజకీయ జీవితానికి తగనని నిర్ణయించుకున్నాడు. 1910 లో, ఫ్రెంచి స్థావరమైన పుదుచ్చేరి చేరి, కొంతమంది అనుయాయులతో తాత్విక పరిశోధనలు ప్రారంభించాడు.

1914 నుండి ఆయన, తన రచనలను ప్రచురించ సాగాడు. ఇవి ఇరవైకి పైగా ఉన్నవి. అరవిందుడు, ఇంగ్లీషు భాషలో గొప్పరచయిత. ఆంగ్లభాషా మాధుర్యం అరవిందునికి తెలిసినంతగా ఇతరులకు తెలియదని ప్రశస్తి. ఆయన రచనలలోని ప్రవాహసదృశమైన శైలి అందుకు చిహ్నం. 1950 డిసెంబరు 5 న అరవిందుడు మరణించాడు. పుదుచ్చేరిలో ఒక ఆశ్రమం ఏర్పడ్డది. దేశదేశాలలోను అరవిందునికి శిష్యులేర్పడ్డారు. పుదుచ్చేరిలో, ఒక అంతర్జాతీయ తాత్వికకేంద్రం ఏర్పడ్డది.

## ఆత్మారోహణం

అరవింద తత్వశాస్త్రంలోని ముఖ్యాంశా లివి:

పదార్థంలో చైతన్యం, అనాదిగా అంతర్గర్భితంగా ఉంది. ఈశక్తి బహిర్గతం కావటమే పరిణామం. జడపదార్థంలోనుండి జీవి ఆవిర్భవించింది. ఇది ఆరోహణలో మొదటిమెట్టు. జీవకోటినుండి చైతన్యంగల మానవుడు ఏర్పడ్డాడు. ఇది రెండోమెట్టు. ఇంతటితో పరిణామం ఆగదు. ఈ చైతన్యం ఆత్మలోకి మారాలి. మారుతుంది.

ఇంతవరకూ జరిగిన పరిణామం అంతా, ఉద్దేశరహితంగా జరిగింది. ప్రకృతికి ఉద్దేశం, చైతన్యం లేవు గనుక, ఇక ముందు జరిగేది చైతన్య సహితంగా జరుగుతుంది. ఇందుకు వ్యక్తి అనుసరించవలసిన మార్గం యోగం.

యోగం అంటే. సంసారచక్రం నుంచి దూరంగా సన్యాసం స్వీకరించటమని పూర్వీకుల ఆలోచన. ఇది అనవసరం. యోగం అంటే, మానవుడు పైస్థాయికి పయనించటం మాత్రమే కాదు. పైస్థాయిలోని ఆత్మను, కిందికితెచ్చి, ప్రపంచాన్ని పునీతం చేయటంకూడా యోగమే. ఈశ్వరత్వాన్ని పొందాలని మానవుడు ఎంతగా కాంక్షిస్తున్నాడో, మానవుణ్ణి ఉద్ధరించాలని, ఈశ్వరుడు, విశ్వాత్మ, అంతగా ఆరాటపడుతూనే ఉంటాడు.

ఈ ఆరోహణ దశలవారీగా జరుగుతుంది కొందరు వ్యక్తులు, ముందుగా ఈ పరిణామం పూర్తిచేస్తారు. ప్రపంచమంతా ఈస్థితికి రావటానికి ఎంతోకాలం పడుతుంది. అందువలన, ఏ వ్యక్తి కా వ్యక్తి ఇందుకు కృషి చేయాలి.

మానవునిలో ఆత్మ నిగూఢంగా ఉంది. దానిని గ్రహించి, అనంతమైన ఆత్మవికాసానికి మార్గం సుగమం చేయాలి. బాహ్యప్రవృత్తి కంటె భిన్నమైన అంతఃప్రవృత్తిద్వారా, సత్యాన్వేషణ సాగించాలి. అంతః ప్రవృత్తి ఊర్ధ్వాభిముఖమై పయనిస్తుంది. మానవాతీతమైన సత్యచైతన్యం కిందికి దిగి ఆత్మను ఆవహిస్తుంది. ఆత్మారోహణా, విశ్వాత్మ అవరోహణా రెండూ జరుగుతాయి. ఇది అనేక దశల్లో జరుగుతుంది. ఇందుకు సాధన, నిగ్రహం అవసరం.

నిత్యానిత్య వివేచనద్వారా జ్ఞానం సంపాదించటం జ్ఞానమార్గం.

భక్తి, ప్రేమలద్వారా ఆత్మ, విశ్వాత్మలో లీనం కావటం భక్తిమార్గం.

స్వార్థదృష్టితో కాక, లోకక్షేమం దృష్ట్యా కర్మలు చేయటం కర్మమార్గం.

ఈ మార్గాలద్వారా, ఆత్మ పరిపక్వత చెందుతుంది. విశ్వాత్మ స్పందనానికి, ఆత్మ ప్రతిస్పందిస్తుంది.

గురుశుశ్రూష అవసరం మానవాతీతస్థాయి నందుకున్న వ్యక్తి గురువు. బోధలద్వారానే గాక, తనలోని అతీత మానవశక్తిని, గురువు, శిష్యులపై ప్రసరింపజేస్తాడు. సూర్యకాంతివలన, గ్రహాలు కాంతివంతమైనట్లు గురుశుశ్రూషచే, శిష్యులు ప్రభావితులౌతారు.

అతీత మానవస్థాయిని పొందిన వ్యక్తి, ప్రపంచంనుంచి దూరం కాడు. ఆత్మ, ప్రపంచంనుంచి దూరంగా పోదు. ఆత్మశక్తి, ప్రపంచం లోనే వెల్లివిరుస్తుంది. ప్రతివ్యక్తి, ప్రపంచంలో జీవిస్తూనే, తనలోని అతీత మానవశక్తులను గ్రహిస్తాడు. ఆ శక్తులను వికసింపచేసుకుని, అతీత మానవుడౌతాడు. మానవకోటి యావత్తూ, ఈ విధంగా అతీత మానవస్థాయి పొందుతుంటుంది.

ఇది జరుగనున్న పరిణామం – పరిణామం అనే మాట తరచు అరవిందుడు ప్రయోగిస్తాడు. అయితే ఈ మాటకూ, ఆధునిక జీవశాస్త్ర జ్ఞులు వాడే మాటకు పొలికలేదు. ఆ విషయాన్ని అరవిందుడే ఇలా వివరిస్తున్నాడు:

'ప్రకృతిలో ప్రతిదీ సమన్వయాన్ని కోరుకుంటున్నది.... . జడ ప్రకృతిలో జీవం ఆవిర్భవించడంతో, విరుద్ధశక్తులు ఏర్పడ్డాయి. ఈ వైరుధ్యాల సమన్వయమే పరిణామం. మానవునిలో చైతన్యం, బుద్ధి ఉన్నాయి. మానవశరీరం ప్రకృతి సిద్ధమైన సూత్రాలకు కట్టుబడి నడవక తప్పదు. ఇదొక వైరుధ్యం. ఈ వైవిధ్య సమన్వయమే, అతీత మానవ ఆవిర్భావం...

'పదార్థంలో జీవం, జీవంలో చైతన్యం పరిణామం చెందాయం టున్నాం. ఇదిలా జరిగింది అని పరిణామవాదం చెబుతుందే కాని, అలా ఎందుకు జరిగిందో చెప్పలేదు...వేదాంతులు చెప్పినట్లు, జీవశక్తి, పదా ర్థంలో అంతర్నిహితంగా ఉన్నదనీ, చైతన్యశక్తి జీవరాశిలో నిగూ ఢంగా ఉన్నదనీ అంగీకరిస్తేనేగాని, ఈ ప్రశ్నకు సమాధానం దొర కదు....నిగూఢ శక్తులు బహిర్గతం కావటమే పరిణామం... జంతు ప్రయోగశాలనుండి మానవుడు పుట్టాడు. మానవ ప్రయోగశాలనుండి అతీత మానవుడు ఏర్పడతాడు ... విశ్వాత్మ క్రమానుగత వికాసం పరి ణామం ..' ('లైఫ్ ది వైన్' లోని ప్రథమాధ్యాయం నుండి)

సమన్వయాన్ని ప్రకృతి ఆకాంక్షించటమే, పరిణామానికి మూల మనటం అవాస్తవం. ప్రకృతికి, ఏ ఆకాంక్ష లేదు. లేదని అరవిందుడే మరొక సందర్భంలో అన్నాడు. చైతన్యం లేనిదే, ఆకాంక్ష ఎక్కడి నుంచి వస్తుంది?

విరుద్ధ శక్తుల ఘర్షణా, సమన్వయం- ప్రకృతిలో అనాదిగా ఉన్నాయి. ఇందులో ఉద్దేశం లేదు. ఇదొక సహజసూత్రం.

వీనిలో, ఘర్షణ పెరుగుదలకు చిహ్నం, శాశ్వతం. ఘర్షణనే చలనం, కదలిక, గతి అని కూడా చెప్పవచ్చు—సమన్వయం స్థితి.

## గతి ప్రాథమికం

పదార్థం, చలనం అవిభాజ్యం. చలనంలేని పదార్థం లేదు. పైకి కదలకుండా, స్థితిలో, సమన్వయంలో ఉన్నట్లున్న పదార్థంలోనూ సూక్ష్మ రూపంలో చలనం, మార్పు, జరుగుతూనే ఉన్నదని, ఆధునిక విజ్ఞాన శాస్త్రం తెలియజేస్తున్నది.

చలనం, కదలిక, గతి, ఘర్షణ, వైరుధ్యాలు, వ్యతిరేక శక్తులు ఏదైనా అనండి— ఇదే పరిణామానికి మూలం. ఈ శక్తి వలననే, ప్రోటిస్టా నుండి నాచు, జలచరాలు, భూమిపై పాకే జంతువులు, పక్షులు, చతుష్పాత్తులు. వానరుడు, నరుడు, యిలా పరిణామం జరిగింది.

డార్విన్ చెప్పిన 'జీవితంకోసం జరిగే పోరాటం' 'సామర్థ్యం కల జీవికే ఉనికి' మొదలైన జీవపరిణామ సూత్రాలన్నీ, ఈ చలనంనుండే ఏర్పడ్డాయి.

## నూతన శక్తులు

ఈ పరిణామంలో నిత్యమూ కొత్త లక్షణాలు ఆవిర్భవిస్తూనే ఉన్నాయి. నిగూఢంగా ఉన్నవి, బహిర్గతం కావటం కాదు. జడ ప్రకృతిలో ప్రాణం నిగూఢంగా లేదు. ఉన్నదల్లా ఘర్షణ, కదలిక. ఈ కదలిక, చలనం- బాహ్యశక్తుల తోడ్పాటు ఉన్న సందర్భాలలో, నూతన శక్తిని సృష్టిస్తున్నది. మొట్టమొదటి ప్రాణి నీటి ఒడ్డున నాచులోనే ఎందుకు పుట్టాలి? పరిసరాలు, అందుకు తోడ్పడ్డాయి కనక.

నిగూఢ శక్తుల బహిర్గమనమూ, సమన్వయ ఆకాంక్షా, పరిణామానికి కారణమైతే, లక్షలాది జీవులెందుకు నశించాయి? కొన్ని జీవ రూపాల పేర్లుమాత్రం మనం వింటున్నాం. పేరుకూడా లేకుండా ఎన్ని నశించిపోయాయో!

ప్రాణికోటినుండి మానవ ఆవిర్భావం యిలాగే జరిగింది.

నిగూఢ శక్తుల ఆవిర్భావమని అరవిందుడు ప్రతిపాదించిన వాదం సాంఖ్యుల సత్కార్యవాదానికి మారుపేరు. గింజలో నుండి నూనె వస్తున్నది, నూనె గింజలోనేఉంది. అసత్తునుండి సత్తు ఎలా పుట్టగలదు ? కనుక సత్తు అనాది సిద్ధం.

రెండువేల ఏండ్లక్రితం, ప్రకృతి శాస్త్రాలు అభివృద్ధి కానిదశలో, సాంఖ్యులు సత్కార్యవాద ప్రతిపాదన చేయటం ఒక రకం అధునిక శాస్త్రాలెంతగానో అభివృద్ధి అయిన ఈ నాడు, అరవిందుడు, అవే పాత భావాలను, కొత్త మాటలలో పొదగటం ఆశ్చర్యం.

నూతన శక్తుల ఆవిర్భావమే పరిణామ లక్ష్యమని బౌద్ధం ప్రతీత్య సముత్పాదవాదం ఏనాడో వివరించింది. భారతీయ తాత్విక ధోరణిలో, ఈ సూత్రం ఏనాడు అడుగున పడ్డదో, నాటినుండి, సత్కార్య వాదం, వివర్తవాదం .. మొదలైన మాయావాదాలతో, మన ఆలోచన శాఖాసంక్రమణం చేస్తూనే ఉన్నది. ముందుకు సాగటం లేదు. అరవిందుని పరిణామవాదమూ అదేకోవకు చెందినది.

## భవిష్యత్తు ?

పరిణామం ఇంతటితో ఆగుతుందా ? ఆగదు. ఇకముందు జరిగే పరిణామంపై, మానవ చైతన్య ప్రభావం ఉంటుందా ? ఉంటుంది. ఈ రెండు అంశాలలోనూ, అరవిందుని భావాలు సరైనవే.

అయితే ఈ పరిణామం వ్యక్తి ప్రధానంగా, అతీత మానవదశకు వెళ్ళుతుందనుకోవటం పొరపాటు.

వ్యక్తి-సంఘంలో భాగం; సంఘం అంతా వెనకబడివున్నా, కొందరు మహనీయులైన వ్యక్తులు, శతాబ్దాలు ముందు నిలబడి కొన్ని బోధలు చేసినమాట నిజం. వారి బోధలైనా, సమాజ పరిణామసూత్రాల కనుగుణంగా ఉన్నంత మేరకే ఉపకరించాయి. లేని సందర్భాలలో విఫల మైనాయి.

బుద్ధుడు- ఏసుక్రీస్తుల కాలంనుండి నేటివరకు ఎందరు ప్రవక్తలు మహనీయులు పుట్టలేదు, గిట్టలేదు ? వారి బోధలు నిరుపయోగమైనవని

కాదు. ఉపయోగం కలిగించాయి. కాని బలవత్తరమైన సాంఘిక శక్తుల ప్రభావంతో, వారి బోధలు రూపాంతరం చెందాయి.

ఈ బలవత్తరమైన సాంఘిక శక్తు లేవి ?

ఇక్కడే తత్వశాస్త్రం, తన పరిధిని విస్తరింపచేసుకొని, చరిత్ర విజ్ఞాన శాస్త్రాల సారాంశాన్ని జీర్ణించుకో వలసిన అవసరం ఏర్పడు తుంది. ఇలా చేసుకోవడంలో, తత్వశాస్త్రం రూపురేఖలే మారి పోతాయి, అది సహజం, అవసరం కూడా.

ఒకప్పుడు మతమే తత్వశాస్త్రం అనుకున్నారు.

ఉపనిషత్తుల కాలంలో ఈ పొర కొంచెం తొలగింది.

బౌద్ధుల కాలంలో తత్వశాస్త్రం, అంతవరకూ ఉన్న వ్యక్తి ప్రధాన, ఆత్మాశ్రయధోరణిని వదలి, సంఘ ప్రధానమైంది. వ్యక్తి శ్రేయస్సు సంఘశ్రేయస్సు అవినాభావమన్న వాస్తవం లీలామాత్రంగా బౌద్ధులకు గోచరించింది.

రసాయన, పదార్థ విజ్ఞాన శాస్త్రసారాన్ని, సాంఖ్య వైశేషికులు తమ తత్వశాస్త్రంలో జీర్ణం చేసుకున్నారు. ఆ మేర కవి భౌతిక వాద, వాస్తవిక వాద ఛాయలను పొందాయి.

జరిగేదేదో అనివార్యంగా జరుగుతుంది. వ్యక్తి నిస్సహాయుడు. పాపభూయిష్టమైన కర్మలను వదలి, జ్ఞానం పొందితే చాలు అనే నిష్క్రియా వాదం, ఆ పిమ్మట దేశంలో తల యెత్తింది. ఆ ధోరణిని, గీత ఖండించి, స్థితప్రజ్ఞత్వంతో, ఫలాపేక్ష రహితంగా కర్మ చేయాలని ఉద్బోధించింది.

శంకరుని వంటి పీఠాధిపతులు, ఈ తాత్విక పరిణామానికంతా, మతాచ్ఛాదన వేసి, మాయాజాలాన్ని సృష్టించారు. తాత్వికంగా మన దేశానికి కిది అంధకార యుగం.

కబీరు, తుకారాంలాంటి భక్తియోగధోరణులతో, ఇది కొంత తొల గింది. తిలక్ కర్మయోగ పునరుద్ఘాటనతో, ఈజడత్వం మరింతవదలింది.

ఇక భవిష్యత్తేమిటి? తత్వశాస్త్రం నూతనజీవం పొందాలి. అణు విజ్ఞాన యుగంలో మనం ప్రవేశించాం. శాస్త్రవిజ్ఞానం, మున్నెన్నడూ

లేనంతగా పురోగమిస్తున్నది. అంతరిక్షయానం, ప్రత్యక్షానుభవమౌతున్నది.

ఈ శాస్త్రవిజ్ఞాన పరిశోధనలను, తత్వశాస్త్రం స్వీకరించాలి.

వ్యక్తికీ, సమాజానికీ వైరుధ్యం శాశ్వతం, అనాదిసిద్ధమనే భావం ఇంతకాలంగా ఉంది. గత చరిత్ర అంతటా సమాజానికి—అందులోనూ అల్ప సంఖ్యాకుల పెత్తనం గల సమాజానికి, అధిక సంఖ్యాకులైన వ్యక్తులు బలికావటమే జరిగింది.

ఇదే వ్యక్తి ప్రధాన ధోరణుల ఆవిర్భావానికి కారణం.

ఇప్పుడు పరిస్థితి వేరు. ప్రపంచం సగభాగంలో సోషలిజం జయప్రదమైంది. కమ్యూనిజంవైపు పురోగమిస్తున్నది. వ్యక్తి సౌకర్యాలను పరిరక్షించే సమాజం ఏర్పడుతున్నది. సమాజ శ్రేయస్సుకు కృషి చేసే నూతన వ్యక్తి ఆవిర్భవిస్తున్నాడు.

ప్రత్యగాత్మ, విశ్వాత్మలు ఏకం కావటం, అనాదిగా భావవాద తాత్వికుల ఆకాంక్ష. వాస్తవ జీవితంలో వ్యక్తికీ, సమాజానికీ గల వైరుధ్యం ఎలాగూ పరిష్కారం కాదనే పునాదిపై ఏర్పడిన భావమిది. ఆ పునాది, నేడు శిథిలమౌతున్నది. ప్రత్యగాత్మ, విశ్వాత్మల వైరుధ్యం, ఈ భౌతిక ప్రపంచంలోనే పరిష్కారమయ్యే సమయం వస్తున్నది.

ఈ జగత్పరిణామాన్ని గుర్తించటం, భారతీయ తాత్విక పురోగతికి అత్యవసరం.

అరవిందుడు ఇది గుర్తించలేదు. వ్యక్తి ప్రధాన ధోరణివైపు పయనించాడు. ఆయన సిద్ధాంతంలోని నూతనత్వం మాటలలో మాత్రమే భావాలలో కాదు.

## యోగ సమన్వయం

అరవిందుని తత్వశాస్త్రానికి యోగం కీలకం. అంతర్గర్భిత శక్తులను తెలుసుకొని, వాటి వికసనకు కృషిచేస్తూ, విశ్వాన్నంతటిని ఆవరించి, ఆ పైనకూడా వ్యాపించి విశ్వాత్మలో, ఆత్మ ఐక్యం కావటానికి అవలంబించవలసిన క్రమపద్ధతి యోగం.

ప్రాచీన యోగపద్ధతు లన్నిటినీ, అరవిందుడు సమన్వయం చేశాడు.

శరీరాన్ని నియమ నిష్ఠలకు లోనుచేయటం ద్వారా, ఆకాశ గమనాది అతీత శక్తులను పొందవచ్చునని హఠయోగం విశ్వాసం. ఇది దేహ సంస్కారానికి ప్రాధాన్యం ఇస్తుంది. అరవిందుడు, దానిని కాదనడు, బహుశా అది సాధ్యం కావచ్చునంటాడు. ఐనా ప్రయోజనం ఏముంది. 'శాశ్వత యవ్వనం, దీర్ఘాయువు మొదలైనవన్నీ, పిసినారి వ్యక్తి, డబ్బును దాచుకున్నట్లు, మనం దాచుకోవలసి ఉంటుంది. వీటి వలన ప్రపంచానికి లాభంలేదు. పైగా ఇవి సాధించడం అతికష్టం. ఫలితం శూన్యం.'

('యోగ సమన్వయం' నుండి)

అంతకంటె ఉన్నతమైంది రాజయోగం. ఇది చిత్త సంస్కారానికి విశేష ప్రాధాన్యమిస్తుంది. హఠయోగం కంటె శ్రేష్ఠమైనది. సమాధి ద్వారా ఇది సాధ్యం. భౌతిక ప్రపంచాన్నుండి, రాజయోగి, దీర్ఘకాలం దూరంగా ఉండవలసి ఉంటుంది. కనుక,ఇదీసమగ్రం కాదు.

భౌతిక జీవితమే అరవిందునికి పునాది. మానసిక, ఆధ్యాత్మిక శక్తులను, ఈ భౌతిక జీవనంలో వికసింపచేయటమే, ఆయన యోగ సమన్వయ లక్ష్యం. రాజయోగం అందుకు చాలదు.

విచారం ద్వారా, వివేకం ద్వారా, ఆత్మను తెలుసుకోవటం, జ్ఞాన మార్గం. గతంలో జ్ఞానమార్గం, సన్యాస పద్ధతిలో నడచి, ప్రపంచ మంతా మాయ అని తిరస్కరించింది.

జ్ఞానమార్గం అలాగే సాగనక్కరలేదు. భౌతిక ప్రపంచం సైతం పరమాత్మ సృష్టేననీ, మాయకాదనీ గ్రహించాలి. అపుడు, ఈ ప్రపంచాన్ని ఆత్మపరివ్యాప్తం చేయటం సాధ్యమౌతుంది.

సృష్టి భగవద్లీలాసమని భక్తిమార్గం చెబుతుంది. భక్తిమార్గం కూడా గతంలో సన్యాస పద్ధతికి లోవతిసింది. ఇదీ తప్పని సరికాదు.

ఆత్మకు, విశ్వాత్మకు మధ్యమాత్రమే కాక, వేర్వేరు ఆత్మల మధ్య, వ్యక్తుల మధ్యకూడా భక్తి ప్రేమలను పెంపొందించుకోవాలి. ఏమంటే, ఆత్మలన్నీ విశ్వాత్మసృష్టే కనుక. ఇలా మార్పుకుంటే భక్తిమార్గమూ ఉపయోగకరమే.

జ్ఞాన, భక్తిమార్గాలు, ప్రాచీన కాలంలో వలెనే సన్యాస పద్ధతికి కాక, ప్రపంచంపట్ల లోకంపట్ల, ప్రకృతిపట్ల అభినివేశం, ప్రేమ కలిగించేందుకు తోడ్పడాలని అరవిందుని ఆశయం. అలా మార్చుకోగలమని ఆయన సిద్ధాంతం.

పై యోగమార్గాలన్నీ వైదికాలు, అనగా, ప్రకృతి పురుషులలో పురుషుడు, ఆత్మ లేక వ్యక్తి అభ్యున్నతి ఈ మార్గాల లక్ష్యం.

ఇందుకు భిన్నంగా, భారతదేశంలో తాంత్రిక మార్గం ఒకటి వుంది.

శరీరం, ఇంద్రియాల అభ్యున్నతి తాంత్రిక పద్ధతి లక్ష్యం. తాంత్రిక మార్గంలోని ప్రకృతి ప్రాధాన్యాన్నీ, వైదిక మార్గంలోని, పురుష ప్రాధాన్యాన్ని-అరవిందుడు స్వీకరించాడు. రెంటిలోనూ, రెండు పాక్షిక సత్యాలున్నాయని ఆయన భావం.

గీత, యోగసమన్వయాన్ని బోధిస్తుంది. అయితే, గీతలోని ప్రతిమాటనూ, పరమ ప్రమాణం గావించరాదు. అలా చేయడం మూఢ విశ్వాసాన్ని ప్రోత్సహించటం.

"భౌతిక జీవితం ముఖ్యమని ఎంచే వ్యక్తికి, గీత-ఈ భౌతిక జీవితం అంతా విశ్వాత్మ సృష్టి అని తెలియ జేస్తుంది. వైజ్ఞానిక జీవితాన్ని, ధర్మాన్ని పాటించే వ్యక్తికి-అదే సర్వస్వం కాదనీ, బుద్ధికంటే అతీతమైన ఆత్మజ్ఞానాన్ని పొందాలనీ బోధిస్తుంది. కేవలం జ్ఞానమార్గం స్వీకరించి, ప్రపంచాన్ని నిరాకరించే వారికి, ఈ ప్రపంచంలో సైతం పరమాత్మ ఉన్నాడని వివరిస్తుంది ............ ప్రతి ఒక్కరూ ఎంతటి అల్పుడైనా యోగమార్గాన్ని స్వీకరించవచ్చునని గీత తెలియచేస్తున్నది.
(గీతా వ్యాసాలమండి)

... మానవునిలో దేవత్వంవుంది. ఆ దేవత్వాన్ని కనుగొనడమే జీవిత లక్ష్యం. మానవ జీవితం, కల్మష భూయిష్టమైనది కాదు. దేవతలకు సైతం వాంఛనీయమైంది. దేవత్వప్రాప్తి కిది సాధన ఈ ఉన్నత లక్ష్యాన్ని ప్రతిపాదించడం, భారతీయ సంస్కృతి విశిష్టత...

....ప్రపంచ రాజ్యం ఒకటి ఏర్పడుతుంది. అయితే అది సోషలిజంకాదు. సోషలిజంలో వ్యక్తిస్వేచ్ఛలేదు. అదొక ఫెడరల్ పద్ధతిలో ఉంటుంది.

ఒక నూతన విశ్వ మానవ మతం ఏర్పడి, అతీత మానవుడు రూపొందుతాడు.

ఎన్నో కోట్లకొలది జన్మల తర్వాత,మానవుడు ఏర్పడ్డాడు.అలాగే ఇంకెన్నో కోట్ల జన్మల తర్వాత, అతీత మానవుడు ఏర్పడవచ్చు. అయినా, ఎప్పటికైనా అది జరుగుతుంది.

ఇది అరవిందుని తత్వ శాస్త్రం.

## పద్దెనిమిదవ అధ్యాయం

# ఇస్లాం, క్రైస్తవ, సిక్కు — భావనలు

**8**వ శతాబ్దిలో ఇస్లాం భారతదేశంలో ప్రవేశించింది. పదో శతాబ్ది నుండి కొన్ని ప్రాంతాలలో అధికార మతం అయింది. ఢిల్లీ సుల్తానుల కాలంలోను, ఆ పిమ్మట మొగలు చక్రవర్తుల కాలంలోను, భారత దేశం అంతటా వ్యాపించింది

ఇస్లాం మతానికి, తత్వశాస్త్రానికి కూడా పునాది కురాన్. కాని ఇస్లామిక్ తత్వశాస్త్రం ఆ యా వ్యాఖ్యాతల భావాల ననుసరించి బహుముఖాలుగా వృద్ధిచెందింది.

ఇస్లాం, క్రైస్తవ మతాలు పుట్టకపూర్వమే గ్రీకుతత్వ శాస్త్రం యూరపులోనూ, మధ్యాసియాలోనూ, వ్యాపించి ఉంది కనుక ప్లేటో, అరిస్టాటిల్ తాత్విక భావాల ప్రభావం, ఇస్లాం, క్రైస్తవ తత్వశాస్త్రాలు రెంటిలోనూ కనిపిస్తుంది.

అరిస్టాటిల్ తత్వశాస్త్రం, సిద్ధాంతరీత్యా భావవాదమే అయినా, భౌతిక ప్రపంచ వాస్తవికతపైన, మానవుని అపారశక్తి సంపదలపైన పూర్తి విశ్వాసమున్న భావన. మరణానంతరం ఆత్మ శాశ్వతంగా ఉంటుందని అరిస్టాటిల్ భావించినా, ఆత్మను అంతటితో వదలి వేశాడేగాని, భారతీయ ఉపనిషత్కారుల వలె, ఆత్మ, పరమాత్మల చర్చను తత్వశాస్త్రానికి కేంద్రంగా చేయలేదు.

ఇస్లాం తత్వశాస్త్రంలోనూ ఇదే ధోరణి కనిపిస్తుంది

ఇస్లాం మతంలో మూడు కీలకభావా లున్నవి. ఏకేశ్వరత్వం, ఈశ్వరునిపై మానవుని పూర్తి పరాధీనత, అవతార పురుషుల ఆవశ్యకత. మహమ్మద్ అట్టి అవతార పురుషుడు.

మానవుడు ఏదితోస్తే అది చేయగల స్వేచ్ఛకలిగి ఉన్నాడా లేదా? పాపపుణ్యాలంటే ఏవి? వాటికి ప్రతిఫలం ఏది? ఈ తాత్విక సమస్యలకు ఇస్లాం రెండురకాల సమాధాన మిస్తుంది.

ప్రతిదీ దైవ నిర్ణయం ప్రకారం జరుగుతుందనే శాఖ ఒకటి. వీరు జబ్రియా ధోరణికి చెందినవారు. మంచి, చెడులను తనకుతానై నిర్ణయించుకునే స్వేచ్ఛ మానవునికి ఉన్నది అనే కదరియా ధోరణి వారు మరొకరు.

క్రీ॥శ॥ 800 ప్రాంతంలో టర్కీలో ముతాగిలాఉద్యమం ప్రారంభమైంది. కూరాన్ బోధనలు, హేతువాదానికి అనుగుణంగా ఉన్నాయని నిరూపించే ఉద్యమం ఇది. ఇందులో మూడుశాఖలు ఏర్పడ్డాయి. ఒక శాఖ కురాన్ బోధలకు మొండిగా అంటిపెట్టుకుని అందులోని ప్రతిభావమూ హేతుయుక్తం అని వాదించసాగింది. వీరు పిడివాదులు. వీరిని ముతకల్లమీన్ అంటారు. మరొకరు, పిడివాదాన్ని విసర్జించి కేవలం తాత్విక సమస్యలపై దృష్టి కేంద్రీకరించారు. వీరిని హుకుమాఅంటారు. మూడవ శాఖ సూఫీలు. సత్ప్రవర్తన, సదాచరణ, భక్తిమార్గాలద్వారా పరమాత్మ సాన్నిధ్యం చేరుకోవాలనే దోరణి. ఇందులో సూఫీ మతస్థుల ప్రభావం భారతదేశంలో ఎక్కువగా వ్యాపించింది.

హుకుమా ధోరణిలో తత్వశాస్త్ర ప్రభావం హెచ్చు.

పరమాత్మ పూర్తిచైతన్య స్వరూపం. అంతకుమించి మరో లక్షణంలేదు. అతనే జ్ఞానం, జ్ఞాత, జ్ఞేయం. ఈ ఏకత్వంలోనుండి, నానాత్వం కలిగిన ప్రపంచం ఏలఉద్భవించింది. అది దేవునిదయ(ఫైజ్). సృష్టిలోని ప్రతివస్తువుకు అస్తిత్వం, సారం అనురెండులక్షణా లున్నాయి. భారతీయ తత్వశాస్త్రంలోని శరీరం, ఆత్మ అను భావాలకు ఇవి అనుగుణమైనవి. ప్రతివ్యక్తి ఈ ద్వంద్వాలతో కూడి ఉంటాడు. పరమాత్మ మాత్రమే ద్వంద్వాతీతుడు.

పరిణామక్రమంలో శుద్ధ చైతన్యం పది రూపాలు ధరిస్తుంది. ఇందులో పదో రూపంనుండి పదార్థం (హయులా) ఏర్పడుతుంది. ఈ దశలోనే ప్రతిశరీరానికి ఒక ఆత్మ యేర్పడుతుంది. ఆత్మ శాశ్వతం, పవిత్రమైనది. కాని శరీరంతో సంబంధం ఉన్నందున, సుఖదుఃఖాలు, అనుభవిస్తు ఉంటుంది.

ఆత్మలో మూడు భాగాలున్నవి. ఒకటి జీవసంబంధమైనది. ఆహార సేకరణ, పెరుగుదల, పునరుత్పత్తి దాని పనులు. రెండవది జంతు సంబంధమైనది. ఇంద్రియాగ్రహణం, భావము, ఊహ, స్మృతి,- మొద లయిన మానసిక కార్యకలాపాలకిది బాధ్యత వహిస్తుంది. మూడవది హేతుయుక్త విభాగం.

ఇదే నిజమైనఆత్మ. ఇది తిరిగి నాలుగు దశలుగా పరిణామం చెందుతుంది. ఈ ఆరోహణ క్రమంలో ఆత్మ పరి పరిపూర్ణత్వము సిద్ధి స్తుంది.

పరమాత్మ అంశ ఐన ఆత్మ శరీరంలో ప్రవేశించటం అవరో హణ. ఆత్మ తిరిగి నాలుగుదశలలో పరమాత్మతో ఏకంకావటం. పాప కర్మలన్నీ విసర్జించి, పుణ్య కర్మలను చేయటం. అజ్ఞానాన్ని వదలి జ్ఞానం పొందటంతో ఈ ఆరోహణ పూర్తి అవుతుంది.

మూడవ ధోరణి సూఫీతత్వం. వీరిలో ధార్మికత హెచ్చు. నరక భీతి వారి ఆలోచనలకు కీలకం. కురాన్‌లోని నీతి సూత్రాలను ఖచ్చితంగా అమలు జరపాలి. విధి, నిషేధాలను పాటించాలి. దారిద్ర్యం త్యాగం, ఇందుకు మార్గం. ఉపవాసాలు, భజనలు ప్రార్థనల ద్వారా ఆత్మ. పరమాత్మతో ఐక్యమౌతుంది.

మానవజీవితం ఒక యాత్ర. ఇందులో అనేక మజిలీలుంటాయి. ప్రతియాత్రలోను కొన్ని నియమాలు పాటించాలి. ఈ యాత్ర ద్వారా అంతిమ జ్ఞానం లభిస్తుంది. ప్రాపంచిక జ్ఞానం (ఇల్మ్) వేరు. అంతిమజ్ఞానం వేరు (ఇల్మ్ ఉర్‌కులుబ్) మొదటిది అపరావిద్య. రెండు వది పరావిద్య రెండవవిద్య, భగవంతుని దయలేనిదే రాదు. అందుకు నిష్ఠ, ధ్యానం' ఉపవాసాలు అవసరం.

12 వ శతాబ్ది తర్వాత, తాత్విక విధానమైన రెండో ధోరణి, భక్తి ప్రధానమైన సూఫీ ధోరణి కలిసిపోయినవి. ఈ కలయికకు ఇమాంఅజలీ (1058 1111) అను తత్వవేత్త ప్రధానకారణం. భక్తి, తాత్విక చింతన మేళవింపు ఐతేగాని ముక్తి రాదని ఇతని సిద్ధాంతం.

కురాన్ బోధలను పిడివాదంగా భావించే మొదటి ధోరణి మత ప్రచారకులలోనూ, ఈ రెండవ ధోరణి తాత్వికులు, భక్తులలోను వ్యాపించింది. నాటినుండి ఇస్లాంలో ఈ రెండూ పక్కపక్కనే కొనసాగుతున్నవి, మొదటిధోరణి మత ద్వేషానికి. రెండోది మత సహనానికి ప్రతీకలుగా నిలిచాయి.

అనేక మంది ముస్లిం తాత్వికులు ఆ తర్వాత ఉద్భవించారు. వీరిలో ఇబిన్ అల్‌అరాబీ (1164) ముఖ్యుడు. ఇతని వాదన ఇలా సాగుతుంది.

పరమాత్మను తార్కిక జ్ఞానంతో గ్రహించలేము. పరమాత్మ అఖండ సత్యం. అందులో ద్వంద్వాలు లేవు. పరమాత్మతోపాటు, ప్రకృతి కూడా అనాది. ప్రకృతిని పరమాత్మ సృష్టించాడనటం సరికాదు. ప్రకృతి పరమాత్మ వ్యక్తీకరణ మాత్రమే. ప్రకృతి ఆత్మ రహితమైన శరీరంవంటిది. ప్రకృతినుండి మానవు డుద్భవిస్తాడు. ప్రతి మానవునిలోని ఆత్మ పరమాత్మ చిహ్నమే. ప్రత్యగాత్మ. పరమాత్మను గుర్తించి, అందులో ఏకం కావటమే జీవితలక్ష్యం. ఇది ఆరోహణ క్రమం.

ఈ తత్వ శాస్త్రానికి, భారతీయ తత్వశాస్త్రంలోని, ద్వైత విశిష్టాద్వైత ధోరణులకు గల సామీప్యం స్పష్టంగా కనిపిస్తుంది.

సూఫీ ధోరణిలో మతసహనం హెచ్చు. అన్ని మతాల అంతిమ లక్ష్యం ఒకటే, ఏకేశ్వరోపాసన, బహుదేవతోపాసన, విగ్రహారాధన, తాత్విక జ్ఞానం, మార్గం ఏదైనా, లక్ష్యంఒకటే.

ఇస్లాం తత్వశాస్త్రానికి, భారతీయ తాత్విక ధోరణులకు సాన్నిహిత్యం ఉన్నప్పటికీ, ఒకరినొకరు అర్థం చేసుకొనటం జరగలేదు. వేర్వేరు భాషలలో మతగ్రంథాలుండటం ఒకకారణం. సంస్కృతాన్ని అధ్యయనం చేయాలని ఇస్లాం తత్వవేత్తలుగాని, పర్షియన్,అరబిక్

గ్రంథాలు అధ్యయనం చేయాలని భారతీయ పండితులుగాని పెద్దగా ప్రయత్నించలేదు.

రాజకీయ, సైనిక దండయాత్రలతో కలిసి. ఇస్లాంమత వ్యాప్తి జరగటం, ఈ అడ్డుగోడలు ఇలాగే ఉండి పోవటానికి ప్రధాన కారణం.

అక్బరు ఆస్థానంలోని అబుల్‌ఫజిల్, ఇస్లాం మతానికి తత్వశాస్త్రానికి ఉదారమైన వ్యాఖ్య ఇవ్వాలని యత్నించాడు. ఆయన ప్రభావంతోనే, అక్బర్, ఒక కొత్తమతాన్ని స్థాపించాలని యత్నించాడు.

పరమాత్మ తనజ్ఞానాన్ని, ఆదర్శ ప్రాయుడైన చక్రవర్తికి ముందుగా అందచేస్తాడు. ఏమట్మ ఆ స్థానం సామాన్యులకు వ్యాపిస్తుంది. రాచరికం, ప్రేమ, ఉదారత్వం, భక్తిశ్రద్ధలకు ప్రతిబింబం. సమాజంలో యోధులు, వృత్తిదారులు వ్యాపారస్తులు, విద్యావంతులు అని నాలుగు తరగతుల వారుంటారు. వీరందరిమధ్య చక్రవర్తి సామరస్యం నెలకొల్పాలి.

ఇవి అబుల్‌ఫజల్ భావాలు మత పీఠాధిపతుల పెత్తనాన్ని అదుపులో పెట్టి చక్రవర్తికి సర్వాధికారాలు కల్పించాలని, అబుల్ ఫజల్ యత్నం. బ్రిటన్‌లో దాదాపు అదే కాలంలో, కాథలిక్ మతగురువు పోప్ పెత్తనంపై చక్రవర్తి హెన్రీ (8) చేసిన తిరుగుబాటులాంటిదే ఇది. అయితే అక్బర్, అబుల్‌ఫజల్‌ల ప్రయత్నం నెరవేరలేదు.

భారతీయ సూఫీమతంలో రెండు ధోరణులు తలఎత్తాయి. వుజూదియా షుడియాశాఖలు. అంతా పరమాత్మే, మరేదీలేదు (హామాబస్త్) అని వుజూదియా భావన, సర్వం పరమాత్మ నుండి ఆవిర్భవిస్తుంది. (హమాఅజ్‌జిస్తు) అని షుహూదియా భావన. శంకరాద్వైతానికి మొదటి ధోరణి, రామానుజ విశిష్టాద్వైతానికి రెండవధోరణి సమీపంగా ఉన్నదని గ్రహించగలం.

సూఫీ తాత్విక విభాగాలు 12 వ శతాబ్దిలో తలఎత్తాయి, గ్రంథస్థమయ్యాయి. సుల్తానుల రాజ్య విస్తరణ ఒకవైపున. సూఫీ మత వ్యాప్తి మరొకవైపున జరిగాయి. హిందూ సమాజంలోని క్రింది కులాల వారు

పెక్కుమంది ఇస్లాం స్వీకరించటానికి సూఫీ ధోరణి కారణం. సూఫీ విభాగం, కాలక్రమేణ నాలుగు పీఠాలుగా చీలిపోయింది. చిస్తియా, కదిరియా, సుహ్రావర్దియా, నక్షబందియా – అనునవి ఈ పీఠాలు. ఉత్తర హిందూస్థానంలో ఉరుసు పేరుతో జరిగే పెద్ద ఉత్సవాలకు సూఫీ మత గురువుల, సమాధులే కేంద్రాలు.

సూఫీల బోధలలో ఒక విశేషమున్నది. షరియత్ (కురాన్‌లో నిబంధనలు) కంటె, జ్ఞానం (మరిఫత్) ప్రధానం. కనుకనే వీరు మత సామరస్యానికి చిహ్నం కాగలిగారు.

క్రీ.శ. 1624 లో ఇందుకు ప్రతిగా ఒక ఉద్యమం ప్రారంభమైంది. షేక్ అహ్మద్ సిర్‌హిందీ దీని నాయకుడు. షరియత్, లేక మత నిబంధనల ప్రాధాన్యతను పునః స్థాపించే మత దురహంకార ఉద్యమం ఇది.

సున్నీ చట్టాలు అనుల్లంఘనీయాలు. పరమాత్మ, ఎప్పుడూ ఆత్మకంటె అతీతుడు. పరమాత్మను భక్తిద్వారా, విద్య ద్వారా గ్రహించలేము. కురాన్‌పట్ల విశ్వాసం ఒక్కటే అందుకు మార్గం.

ఔరంగజేబ్ ఈ శాఖకు చెందినవాడు. అతని సోదరుడు దారా షికో సూఫీ ధోరణికి చెందినవాడు.

సూఫీ ధోరణి పునరుద్ధరణకు, ఇస్లాం, భారతీయ తత్వశాస్త్రాల తులనాత్మక పరిశీలనకు దారాషికో తీవ్ర కృషి చేశాడు. 52 ఉపనిషత్తులకు సంస్కృతం నుండి పర్షియన్‌లోకి తరుమా చేయించాడు. కొన్ని స్వయంగా తర్జుమా చేశాడు. ఇస్లాం మతాన్ని తత్వశాస్త్రాన్ని వివరిస్తూ పెక్కు గ్రంథాలు వ్రాశాడు.

రెండు తత్వశాస్త్రాలలోని తులనాత్మన పదాలను అతడు పైకి తెచ్చాడు. అద్వైతం (తౌహిద్) సత్యస్యసత్యం (హాకీకత్ ఉల్ హాకల్) జ్యోతిషం, జ్యోతి (నూర్ అలామారిన్) మిధ్య, కల్పన మాయ (మాలుం – ఇ – మాదుం, మౌజిదీ – ఇ మౌహిం) సర్వవ్యాపి (చితిన్).

విశ్వ సృష్టిని గురించి కేనోపనిషత్తు వివరణకు, సూఫీ వివరణకు సాన్నిహిత్యం ఉంది. పరమాత్మలో పురుషుడు, ప్రకృతి, అభేద్య

ఐక్యతలో ఉంటాయి. పిమ్మట రెండూ వేరవుతాయి. పురుషుని నుండి ఆత్మలు, ప్రకృతినుండి బుద్ధి, పదార్థం ఏర్పడుతాయి. దేహము ఆత్మ – రెండూ కలిసి మానవు డేర్పడతాడు. ఇది అవరోహణ. తిరిగి ఆరోహణ జరుగుతుంది.

హిందూ – ముస్లిం ఐక్యతకు దారాషికో చిహ్నమైనాడు. ఇది సహించలేని ఔరంగజేబు, దారాషికోను కాఫిర్ అని నిందించి, ఢిల్లీలో బహిరంగంగా వధించాడు.

హిందూ మత, సంఘ సంస్కరణకు, రాజారామ్ మోహనరాయ్ ఆద్యుడైనట్లే, ముస్లిం సంఘ సంస్కరణకు సర్ సయ్యాద్ అహమ్మద్ ఆద్యుడు. ఆలీఘర్ విశ్వవిద్యాలయస్థాపకుడు, ఇస్లాంను, హేతువాదాన్ని ఆధునికతను సమన్వయం చేసిన తాత్వికుడు.

ప్రముఖ కాంగ్రెసు నాయకుడు, పండితుడు, తాత్వికుడు ఐన అబుల్‌కలాం ఆజాద్ రచనలకు ప్రత్యేక ప్రాధాన్యమున్నది. ఆజాద్ దృష్టిలో ఇస్లాం ఒక మతం కాదు. అది విశ్వజనీన ధర్మం. ఇతర అన్నిమతాలకు అందులో స్థానమున్నది, ఖురాన్‌కు ఆజాద్ ఒక వ్యాఖ్య వ్రాశాడు. కురాన్‌లోని నిబంధనలకు (షరియత్) ప్రాధాన్యం లేదు. ఏకేశ్వరోపాసనకే ప్రాధాన్యం. భారతీయ ముస్లింలను జాతీయోద్యమంలో భాగస్వాములనుచేసి, సమైక్య భారతజాతి ఆవిర్భావానికి కృషిచేసిన వారిలో ఆజాద్ ముఖ్యుడు.

ఆజాద్ కృషి, ముస్లింమత ఛాందసుల ఆగ్రహానికి గురైన విషయం మనకు తెలుసు.

ఖురాన్‌పట్ల విశ్వాసంతో దానికి ఆధునిక వ్యాఖ్య చేసిన ఆజాద్ జాతీయవాది కాగా, ఖురాన్ పట్ల ఎట్టి విశ్వాసంలేని ఆధునికుడు జిన్నా పాకిస్తాన్ సృష్టికర్త కావటం గమనార్హం. మత విశ్వాసాలకు. రాజకీయ కార్యకలాపాలకు గల ఈ వైరభక్తి చరిత్రలోని గతితార్కిక వైచిత్ర్యాలలో ఒకటి.

పాకిస్తాన్ భావాన్ని మొదట ప్రవచించిన ఇక్బాల్‌ను గురించి కూడా ప్రస్తావించవలసివుంది. ఇక్బాల్ పూర్తి ఆధునికుడు. మతవాది కానేకాదు. గొప్ప తత్వవేత్త కవి. హిందూస్థాన్ హమారా గేయకర్త.

పోషలిస్టు ప్రపంచంపట్ల సానుభూతికల వాడు,తాత్త్వికంగా నీషేభావాలకు సన్నిహితుడు.

నీషేతత్వ శాస్త్రంలో "మహానాయక" భావముంది. బహుశా ఆ భావాలే ఇక్బాల్‌ను పాకిస్తాన్ భావచాలకుడుగా, జిన్నా ఆరాధకుడుగా చేసి ఉండవచ్చు.

నీషే ప్రతిబింబం భారతీయ తత్వశాస్త్రంలో అరవిందుడు-అతీత మానవభావం నీషేభిక్ష. అటు ఇక్బాల్, ఇటు అరవిందుడు నీషేభావాలతో ప్రోత్సహించబడినవారే. ఇక్బాల్ జిన్నాను ప్రశంసించగా అరవిందుడు హిట్లర్‌ను అభిమానించారు. లోక రక్షకుడు విశ్వ విజేత హిట్లర్‌లో కనిపించాడు.

కొన్ని తాత్విక భావశకలాలు ఎట్టి విపరీత ధోరణులకు తోవ తీస్తాయో, ఇక్బాల్, అరవిందులు - తార్కాణం.

# క్రైస్తవ భావన

క్రైస్తవ మతం భారత దేశానికి చాలాకాలం క్రితమే వచ్చింది. కేరళలోని సిరియన్ క్రైస్తవులు క్రీస్తు శకారంభ కాలంలోనే భారత దేశానికి వచ్చి స్థిరపడినట్లు తెలుస్తుంది. కాని వారు బహుస్వల్పం.

బ్రిటిష్, ఫ్రెంచి,పోర్చుగీస్ సామ్రాజ్యవాదాలతోపాటు క్రైస్తవ మతం వ్యాపించింది. కాథలిక్, ప్రొటెస్టంటు ధోరణులు రెండూ భారత దేశంలో వ్యాపించినవి. హిందూసమాజంలోని నిమ్న జాతులవారు, ఆదిమ తెగలు, పెద్ద ఎత్తున క్రైస్తవమతం స్వీకరించారు.

యూరప్‌లో క్రైస్తవ మతం ఆవిర్భవించటానికి ముందే గ్రీకు తత్వశాస్త్రం వ్యాప్తిచెందింది మొదట్లో గ్రీకు తత్వశాస్త్రం, క్రైస్తవ మతం సహజీవనం చేశాయి. అరిస్టాటిల్ తాత్విక బోధ బైబిల్ మతబోధ పక్కపక్కనే సాగాయి.

అరిస్టాటిల్ భావవాది. ఈశ్వరుని గుర్తించాడు. కాని భౌతిక ప్రపంచ వాస్తవికతనూ నిర్ద్వంద్వంగా గుర్తించాడు. చలనశీలమైన ప్రపంచాన్ని నడిపించేవాడు చలన రహితుడైన లోకేశ్వరుడు. రెండూ వాస్తవలే. అరిస్టాటిల్ భావ వాదాన్ని ద్వైతం అనవచ్చు.

పిమ్మట యూరపియన్ తత్వశాస్త్రాన్ని గొప్పగా ప్రభావితం చేసినవాడు ప్లోటినస్ (క్రీ. శ. 204–270)"అఖండభావాన్ని వర్ణించటం సాధ్యం కాదు.ఇది అవ్యక్తం. అచింత్యం అన్నిటికీ అతీతం. జీవితం, వాస్తవం, అస్థిరత్వం-లాంటి భావాలన్నిటికీ పై మెట్టు. ఈ అనిర్వచనీయ బ్రహ్మపదార్థం కొరకు మానవుని జిజ్ఞాస అనంతంగా సాగుతున్నది"-ప్లోటినస్ ఈ భావానికీ శంకరుని అద్వైత భావానికి సామ్యం ఉన్నది.

క్రీ. శ. 384 లో జీవించిన సెంటు అగస్టిన్ క్రైస్తవమతాన్ని ప్లోటినస్ తత్వశాస్త్రాన్ని సమన్వయం చేశాడు.

ఆత్మ పరమాత్మల కలయిక చిదానంద స్వరూపం. అలౌకిక అతిలోక అనుభవం, అది క్షణిక భావనకాదు. శాశ్వత అనుభవం. అదే జీవన్ముక్తి.

క్రీ. శ. (1126–74) లో జీవించిన సెంటు థామస్ ఎక్వినాస్ ఈ ధోరణులను మరింత ముందుకు తీసుకు పోయాడు.

బైబిలులోని సిద్ధాంతాలనే ప్రతి ఒక్కరూ ఆమోదించాలని నియమం లేదు అవి ఆమోదించకపోయినా ఈశ్వర సాన్నిధ్యం పొందవచ్చు. అయితే బైబిల్ బోధ అన్ని బోధలకంటె ఉత్తమమైనది.

అక్వినాస్ కాలంనాటికి పారిస్ తదితర విశ్వవిద్యాలయాలలో అరిస్టాటిల్ బోధలను నూతన దృక్కోణంలో వివరించసాగారు. ప్రపంచం అనాది దానికి స్వంత చలన సూత్రాలున్నవి. అచింత్యమూ, అనిర్వచనీయమూ ఐన ఈశ్వరుని అవసరం ఏముంది. అరిస్టాటిల్ ఈశ్వరుని ప్రస్తావించిన మాట నిజమే. అది లాంఛనప్రాయం. నిజానికి అరిస్టాటిల్ తత్వశాస్త్రంలో కీలకాంశం భౌతికవాదం.

17, 18 శతాబ్దాలలో తల ఎత్తిన యూరపియన్ భౌతిక వాదానికి ఇది ప్రాతిపదిక. కాగా మతపీఠాధిపతులు దీనిని సహించలేక పోయినారు. అరిస్టాటిల్ ఖ్యాతి తమకు దక్కకుండా పోతుంటే చర్చి సహించగలదా ? సెంటుథోమస్ ఎక్వినాస్ ఆదర్‌లో ఉద్భవించి అరిస్టాటిల్ తత్వశాస్త్రాన్ని, క్రైస్తవ మతసిద్ధాంతాలను ముడిపెట్టాడు. ఈ సిద్ధాంతాలను కాదన్నవారు అనేక చిత్రహింసలకు గురయ్యారు. శాస్త్ర

విజ్ఞానాభివృద్ధికి క్రైస్తవమతం గుదిబండగా తయారైంది. ఈ కాలం లోనే. భారతదేశంలో వ్యాపించినపూర్వ మీమాంసాధోరణికి, అక్వినాస్ మత బోధలను పోల్చవచ్చును.

అక్వినాస్ తాత్విక బోధన ఇలాసాగుతుంది.

విశ్వాసం, హేతువాదం పరస్పర విరుద్ధాలు కావు. వైరుధ్య రాహిత్యం తత్వశాస్త్రంలో మొదటిసూత్రం. ఈశ్వరుడు సృష్టికి ప్రథమ కారణం. ఒక పరిధిలో హేతువాదం సరైనదే. దానికి పరిమితులున్నాయి. ఆ పరిమితులను అది గుర్తించాలి. ఆ పిమ్మట విశ్వాసం అవసరం. హేతువు సమాధానం చెప్పలేని అంశాలెన్నో ఉన్నాయి. అప్పుడు విశ్వాసం అవసరం. "శాస్త్రజ్ఞానం ముగిసినచోట మతం ప్రారంభమౌతుంది" అదేమాట అప్పటినుండే ఆనిర్భవించింది.

తత్వశాస్త్ర పరిధివేరు, మతపరిధివేరు. రెండూ పరస్పర గౌరవంతో జీవించాలి

ఈశ్వరుడు నామరూప రహితుడు. అనుచ్ఛరణీయమైన తెత్రగ్రామాజన్ (జెహోవా) మాట సరైనది. అది ఉన్నది-అని ఈమాట కర్థం. మానవుని కుండే గుణదోషాలు ఈశ్వరునికి లేవు. అదొక నిర్గుణ స్వరూపం. శంకరుని నిర్గుణ పరబ్రహ్మంతో ఇది సమానమైనది.

ఈ ప్రకృతి, సృష్టి అనాది అని అరిస్టాటిల్ వాదన. ఈశ్వరుడు ప్రపంచాన్ని సృష్టించాడు అని బైబిల్ బోధన. రెండు పరస్పర విరుద్ధాలు, కాని ఎలాగైనా సమన్వయం చేయాలి. అరిస్టాటిల్‌ను కాదంటే తాత్విక పునాదే పోతుంది. బైబిల్‌ను కాదంటే మతం ఏమౌతుంది.

ఈ రెంటినీ సమన్వయం చేసే యత్నంలో అక్వినాస్ కొత్త వాదనలు చేశాడు.

విశ్వం అనంతం. చలన శీలం. క్రమబద్ధం అవ్యక్త స్థితినుండి విశ్వం ఎలా ఉద్భవించింది. అవ్యక్తస్థితి కూడా చలనశీలం గనుక. ఇది అరిస్టాటిల్ మూలసూత్రం. అవ్యక్తస్థితి ఈశ్వరునినుండి ఉద్భవించిందా? ఈ ప్రశ్న అరిస్టాటిల్ వేసుకోలేదు.

అక్వినాస్ ఇలా అంటాడు. అరిస్టాటిల్ ఆ ప్రశ్న వేసుకో లేదు. ఆంటేనాట్‌కి ఆ ప్రశ్న ఉద్భవించలేదు. కనుక. అంతే కాని ఈశ్వరుని సృష్టి కర్తృత్వాన్ని అరిస్టాటిల్ నిరాకరించాడని కాదు. అనాది ఐన అవ్యక్త ప్రకృతి కంటిముందు ఈశ్వరుడు నిలిచాడు.

అరిస్టాటిల్ దానిని కాదనలేదు కదా!

ఈ విధంగా అక్వినాస్. అరిస్టాటిల్‌ను క్రైస్తవ మతానికి జోడించాడు. అరిస్టాటిల్ మావాడంటే మావాడని భౌతికవాదులు, మత వాదులు ఘర్షణ పడిన కాలంలో, అక్వినాస్‌పై విశమైన మధ్యే మార్గంలో క్రైస్తవ మత పునరుద్ధరణకు పూనుకున్నాడు. ఇంత చేసినా అక్వినాస్‌ను ఆ పిమ్మట వచ్చిన క్రైస్తవ పీఠాధిపతులు ఆమోదించలేదు "సత్యం ఎక్కడ, ఏ మతంలో ఏ రూపంలో ఉన్నా స్వీకరించవచ్చు" అనే అక్వినాస్ మాటలు క్రైస్తవ ఛాందస పీఠాధి పతులకు నచ్చలేదు. బ్రిటిష్‌చర్చి, థామస్ అక్వినాస్‌ను క్రైస్తవ తత్వ వేత్తల జాబితానుండి తొలగించింది.

యూదు, ముస్లిం మతాల నుండి కూడా కొన్ని అంశాలు స్వీక రించవచ్చుననటమే అక్వినాస్ అపరాధం.

సృష్టి చలనశీలం. నిజమే కాని ఈ చలనాన్ని మొదలు పెట్టే వాడు ఎవడో ఉండాలి కదా. అతడు ఈశ్వరుడు ఆ పిమ్మట సృష్టి అంత రంగిక సూత్రాల ప్రకారం నడుస్తుంది. అక్వినాస్ ఈ వాదన, వైశేషి కుల ఆరంభ వాదాన్ని పోలిఉంది.

ఈశ్వరుడు పతి; మరొకమూల పదార్థం లేనేలేదు. మరి సృష్టి ఎలా జరిగింది. శూన్యం నుండి సృష్టి జరగదుకదా! భావవాద తత్వ వేత్త లందరినీ వేధించే సమస్య యిది.

ఈశ్వరుడు సర్వ శక్తివంతుడు ఏదైనా చేయగలడు. ఇదొక్కటే భావవాదుల సమాధానం. అక్వినాస్ అదే సమాధానం ఇస్తున్నాడు. సృష్టికి, ఈశ్వరునికీను మధ్య మరెవ్వరూ లేరు. అవ్యక్త స్థితి, క్రమ బద్ధత, విశ్వ అనాదిత్వం - మొదలైన అరిస్టాటిల్ భావనలను అక్వినాస్ పరోక్షంగా త్రోసిపుచ్చారు.

క్రైస్తవ మతభావాన్ననుసరించి ప్రతి వ్యక్తికి ఒక ఆత్మఉంది. ఇవి మరణానంతరం జీవించి ఉంటాయి. ఈశ్వరుని ముందు పరీక్ష దినంనాడు వీటికి తీర్పు ఇవ్వబడుతుంది. దాని ననుసరించి, స్వర్గ, నరకాలు లభిస్తాయి. క్రైస్తవమతంలో పునర్జన్మ భావంలేదు. జీవాత్మ పరమాత్మతో ఏకం కావటం లేదు. క్రీస్తు దయవలన, వ్యక్తులు పాప విముక్తులై, ఈశ్వర సాన్నిధ్యం చేరుకుంటారు.

ఈ భావనకు, అక్వినాస్ తాత్విక భావనలకు, అరిస్టాటిల్ వాదనలకు నిజానికి పొత్తు కుదరదు. క్రైస్తవ మతానికి తత్వశాస్త్రానికి గల ఈ వైరుధ్యం పెరిగి పెరిగి యూరపియన్ భావవాదం ఆ తర్వాత కాలంలో క్రైస్తవ మతంతో పూర్తి తెగతెంపులు చేసుకున్నవి.

భారత దేశంలో క్రైస్తవ మత ప్రచారకులు తాత్విక ధోరణి. నేటికీ, సెంట్ థామస్ అక్వినాస్ స్థాయిని దాటి పోలేదు. ఏమంటే ఆ తర్వాత వచ్చిన యూరోపియన్ తత్వవేతలందరూ, మతాన్ని పక్కకు నెట్టివేసిన తత్వవేత్తలు. వారికి మత పీఠాలైన చర్చిలోస్థానం వుండదు కదా!

# సిక్కు భావన

గురునానక్ (1469-1538) సిక్కుమత స్థాపకుడు. గురు పరంపర గోవిందసింగ్ (1668–1708) తో అంతమైంది. నానక్ మతకీర్తనల గ్రంథం (గుర్బాని), ఇతర గురువుల కీర్తన గ్రంథాలలోనూ, వీర గాథలలోను సిక్కుమత తాత్విక భావనలు వ్యక్తమౌతాయి.

కీర్తనలలో మతభావనలు వ్యక్తం చేయటంలో సిక్కులు, వైదిక సాంప్రదాయాన్ని కొనసాగిస్తున్నారు. వేదసూక్తాల వలెనే, సిక్కు కీర్తనలు కూడా సంగీతానికి అనువుగా వుంటాయి.

నానక్ ఇలా అంటాడు: "అశరీరవాణి నాకు వినిపించింది. అది మీకు చెబుతున్నాను"

"సత్యం అన్నిటికంటె గొప్పది. సత్ప్రవర్తన ఇంకా గొప్పది."

సిక్కుమతంలో అనేక దేవతల ప్రస్తావన ఉన్నా, వారంతా మధ్యలో అదృశ్యులయ్యేవారే. ఏకేశ్వరోపాసన సిక్కు మత సూత్రం.

సిక్కు మతగ్రంథాలు అంకెతో ప్రారంభ మౌతాయి. పిమ్మట ఓంకారం ఉంటుంది. ఏక్ ఓంకార్ అని పిలుస్తారు. "ఓం ద్వారా వ్యక్త మయ్యేవాడు ఒక్కడే. వానినే సత్ అనవచ్చు, అతను కర్తసర్వ వ్యాపకుడు, భయ, ద్వేషరహితుడు. గురుసేవ, గురునిదయద్వారా అతనిని గ్రహించవచ్చు. ఇది సిక్కుల మూలమంత్రం.

ఓంకార ప్రాధాన్యం భారతీయ తాంత్రిక, వైదిక ధోరణుల ప్రభావాన్ని, గురుప్రాధాన్యత. ఇస్లాం ప్రభావాన్ని తెలియచేస్తున్నది. వైదిక మతంలో గురువుకు తాత్కాలిక ప్రాధాన్యం మాత్రమే ఉన్నది. చిట్ట చివరకు ఎవరికి వారే ఆత్మసాక్షాత్కారం పొందాలి. సిక్కులలో అది లేదు.

క్రమశిక్షణాయుతమైన సైనికబృందంవలె, అనుచరులను నడప టానికి యత్నించే ప్రతి మతము గురుపరంపరను సృష్టించుకోవటం చూస్తాము.

యావత్తు విశ్వం దైవసృష్టిం. ప్రకృతి, మాయ, మోహం. దేవతలు, రాక్షసులు అందరూ అతని సృష్టే. పురుషుని, ప్రకృతిని సృష్టించి, దేవుడు హుకుం జారీ చేశాడు. దాంతో సృష్టి సాగు తున్నది. లక్షలాది విష్ణు అవతారాలున్నవి శివావతారాలు, బ్రహ్మ అవ తారాలు లక్షలున్నాయి. ఇవన్నీ పుట్టిగిట్టుతూ ఉంటాయి. పరబ్రహ్మ వీటన్నిటికీ అతీతుడు. తన ఇష్టం వచ్చినట్లు అతడు ప్రవర్తిస్తాడు.

పరబ్రహ్మకు మరోపేరు అకల్‌పురుష.

పరమాత్మ భావం కేవలం ఊహ లేక వాస్తవమా ? అది వాస్తవం. ఎలా తెలుసుకోవటం. తర్కజ్ఞానంవల్ల సాధ్యం కాదు. అదొక అఖండజ్యోతి. గురుబోధద్వారా అతనిని తెలుసుకోగలము. శాస్త్ర, పురాణాలుకూడా అందుకు సాయపడతాయి.

సృష్టి ఎందుకు జరిగినట్లు? "కొన్ని కోట్ల సంవత్సరాలు అంతా చీకటి. ఆకాశమూ లేదు. భూమీ లేదు, సూర్యుడూ లేడు, చంద్రుడూ లేడు. అతనికి ఇచ్ఛ కలిగి సృష్టి సాగించాడు. "సృష్టి వాస్తవమా లేక కల్పనా?" అతను సత్యం. అతనిలోనుండి ఉద్భవించేదికూడా సత్యమే.

కనుక లోకం వాస్తవం. ప్రపంచం అంతా నిత్యం మారుతూ ఉంటుంది. ఐనా ఇది వాస్తవం. మార్పు వాస్తవం.

సృష్టి అంతా ఈశ్వరుని నుండి ఉద్భవిస్తుంది. సృష్టి పరమార్థం ఏమిః ? మానవుడు, ఈశ్వరుని గ్రహించుట అది గురుసేవ ద్వారానే సాధ్యం.

చరాచర జీవ కోటిలో అంతటా జీవం, చైతన్యం ఉంటాయి. మానవుడిలో ఇవి అత్యున్నత రూపంలో ఉంటాయి. మానవుడు విశ్వానికి అధినేత. సృష్టి అంతా మానవుని కొరకే ఏర్పడింది. సృష్టికి కారణం అహంత. "అహంత వ్యక్తికి మూలం" అదే బంధన మూలం. అదొక దీర్ఘ రుగ్మత. దానికి చికిత్స ఉంది. గురుసేవ, దైవకృపద్వారా అహంత నిర్మూలన అవుతుంది.

"అల్లా మొదట వెలుగును సృష్టించాడు. పిమ్మట సృష్టి అంతా ఏర్పడ్డది, పిమ్మట సంయోగ, వియోగాలు జరుగుతాయి. అనగా ఆత్మ శరీరంలో ప్రవేశించటం తిరిగి నిష్క్రమించటం. సృష్టిక్రమం.

ఇస్లాం పరిభాష, వైదిక పరిభాష, రెండూ సిక్కు మతంలో వున్నాయి. సాంఖ్యవాద చిహ్నాలైన ప్రకృతి, పురుషులు, ప్రళయం, పునసృష్టి భావాలూవున్నాయి. నానక్ జన్మతః ముస్లిం. పిమ్మటసిక్కు మతంస్థాపించాడు. ముస్లిం సుల్తానుల నిరంకుశపాలనను వ్యతిరేకించిన హిందూ ముస్లిం ప్రజానీకం పంజాబ్‌లో సిక్కుమతం స్వీకరించారు. ఢిల్లీ సుల్తానులు, మొగల్ పాదుషాల యుద్ధాలకు, అకృత్యాలకు దండయాత్రలకు ప్రధానంగా గురి ఐంది పంజాబ్, కనుక పంజాబ్‌లోనే సిక్కిజం ఆవిర్భవించింది.

ఆధునిక తత్వశాస్త్రం, మానసిక అసంతృప్తి సందేహం, నిరాశ, నిస్పృహ, అనంత జిజ్ఞాసలపై ఆధారపడి ఉంది. ఇందుకు విరుద్ధంగా సిక్కిజం, విశ్వాసం, ఏకాగ్రత, మనశ్శాంతి, విశ్వప్రేమలపై ఆధారపడి ఉంది. సందేహం ద్వారా ఏమీ లభించదు. విశ్వాసమే అన్నిటికీ మూలం.

సిక్కుమతం సన్యాసాన్ని, వైరాగ్యాన్ని బోధించదు. తద్విరుద్ధంగా జీవితం పట్ల ఆసక్తిని, శ్రద్ధను కలిగిస్తుంది. జీవితంనుండి పారి

పోరాదు. జీవితాన్ని పూర్తిగా అనుభవించాలి. ప్రతివ్యక్తి తన సంపాదన తానే చేసుకోవాలి "తన సంపాదన ద్వారా తాను జీవిస్తూ, పక్కవాడికి కొంత సాయం చేసేవాడే ముక్తిమార్గంలో పయనిస్తాడు."

ఆత్మకు అనేక జన్మలున్నాయి. కర్మ విమోచన అయ్యేవరకు జన్మ పరంపర తప్పదు. గురుసేవ ఒక్కటే కర్మ మోక్షానికి మార్గం. గురువు అంటే గురువు దేహం కాదు. అతనిమాట అతని బోధ.

సిక్కిజం క్రియాశీల ధోరణి. తాత్విక చర్చలకు అంత ప్రాధాన్యం లేదు. సేనాపతి ఆజ్ఞను సైనికుడు శిరసా వహించినట్లు, ప్రతివ్యక్తి గురువు ఆజ్ఞను తొదల దాల్చాలి.

సిక్కుల జీవన విధానాలలో ఈ తత్వశాస్త్ర ప్రభావం కనిపిస్తుంది. సిక్కులు విశ్వాసపాత్రులు, క్రియాశీలురు. సాహసవంతులు, జీవితం పట్ల ఆసక్తి, ఉత్సాహం కలవారు.

వీరిలో మతవిశ్వాసం, గురుభక్తి, దాసభావం హెచ్చు.

ఒకానొక చారిత్రక దశలో ఉద్భవించిన ఈ మతం ఇప్పటికీ అదే సైనిక స్కంధావార శిక్షణ కొనసాగిస్తున్నది. ఆధునిక తాత్విక భావజాలానికి దూరంగా ఉంటున్నది.

## పందొమ్మిదో అధ్యాయం

# ఆధునిక ధోరణులు

శాశ్వత సత్యాలను పునరుద్ధరించటం తత్వశాస్త్రం పనికాదు. ఎట్టి మార్పులేని శాశ్వత సత్యాలూ లేవు. విశ్వరహస్యాన్ని వివరించటం తత్వశాస్త్ర కర్తవ్యం. ఇతర విజ్ఞాన శాస్త్రాల సారాన్ని, ఆధునిక ధోరణులనూ జీర్ణించుకుంటూ, ముందుకు సాగినప్పుడే తత్వశాస్త్రం ఈ పని చేయగలదు.

తత్వశాస్త్రానికి జాతీయ ప్రాంతీయ సరిహద్దులు లేవు. అన్ని రంగాలలోనూ, ఈ సరిహద్దులు బద్దలవుతున్న యుగంలో మనం ఉన్నాం. ఇతర రంగాలు, అడ్డుగోడల మధ్య పరిమితమై ఉన్నప్పుడు సైతం, విశ్వజనీన సూత్రాలను నిర్వచించిన తత్వశాస్త్రం, ఈకాలంలో మరింతగా అందుకు యత్నించాలి.

ఇది పాశ్చాత్య ధోరణి లేక వైదేశిక ధోరణి. కనుక భారతీయ తాత్విక ధోరణికి విరుద్ధం అని, ఏ ఒక్క ధోరణినీ నిరాకరించరాదు. ప్రతి ధోరణీ మంచి చెడ్డలనూ పరిశీలించాలి. తాత్విక ప్రగతికి అది సహాయకారి ఔనా కాదా? తెల్సుకొని ఉపయోగమైన వాటిని స్వీకరించి, తదన్యాలను నిరాకరించాలి. ఇదే ప్రగతి పథం.

వేర్వేరు దేశాల తాత్విక ధోరణులకు, ప్రత్యేక లక్షణాలు లేకపోలేదు. కాదు, ఉన్నవి

ఆయాజాతుల చారిత్రక పరిణామంలోని ప్రత్యేకతల ఫలితంగా, వారి తత్వశాస్త్రాలలోనూ అవి ప్రతిబింబిస్తున్నాయి.

భారతీయ తత్వశాస్త్రంలో, అంతఃప్రవృత్తి హెచ్చు. ప్రాశ్చాత్య ధోరణులలో, మధ్యయుగాల తర్వాత వెలువడిన వాటిలో, బాహ్య ప్రవృత్తి హెచ్చు.

ప్రకృతితో, మానవుడు సాగించే పోరాటం ప్రబలమూ, సాహసికమూ అయి విజ్ఞానశాస్త్రాలు అతివేగంగా వృద్ధి చెంది, సమాజ పరిణామం త్వరితగతిని ఉన్నతస్థాయికి చేరుకున్నందున, పాశ్చాత్య తాత్విక ధోరణులలో బాహ్య ప్రవృత్తి హెచ్చుగా వుంది. ఇంగ్లీషు తత్వవేత్త బేకన్ ఇందుకు ఆద్యుడు.

భారతజాతి, అలా గాక, ఒక్కొక్క సామాజిక వ్యవస్థను అతి నెమ్మదిగా అధిగమిస్తున్నది.

వేదకాలంనుండి భారత యుద్ధకాలం వరకు, రెండువేల సంవత్సరాలు పైచిలుకు కాలం, అతికఠోరమైన బానిసవ్యవస్థ పశుపాలక వ్యవస్థ రూపంలో ఉంది

ఈ అవశేషాలు బుద్ధుని కాలంవరకు సాగాయి.

అశోకునితో ప్రారంభమైన స్వయం సంపూర్ణ గ్రామవ్యవస్థ. బ్రిటిషు వారిరాకవరకు కొనసాగింది. ఇది అర్ధబానిస,భూస్వామ్య వ్యవస్థ.

ఈ కారణాలవలన, భారతీయ తాత్విక చింతనలో అంతః ప్రవృత్తి హెచ్చుగా ఏర్పడ్డది.

సంస్కృతి, తాత్వికరంగాలలో ఆదాన ప్రదానాలు ఎప్పుడూ ఉన్నవే. చారిత్రకంగా సంక్రమించిన బలహీనతలను అధిగమించి, ఏకత్వంలో భిన్నత్వం కల విశ్వసంస్కృతి, విశ్వజనీన తత్వశాస్త్రాల ఆవిర్భావానికి ఆదాన ప్రదానాలే మార్గం

మానవాతీత వాదాన్ని ప్రతిపాదించిన అరవిందుడూ, వ్యక్తి స్వేచ్ఛ - పారతంత్ర సమస్యలపై సుదీర్ఘ చర్చ జరిపిన తిలక్, పాశ్చాత్య ధోరణులకు లోనైనవారే.

# 'పాజిటివిస్ట్' ధోరణులు

భావవాద, భౌతికవాద ధోరణులు రెండూ, యూరపులో 18, 19 శతాబ్దాలలో బాగా వృద్ధి చెందాయి.

జర్మన్ తత్వవేత్త హెగెల్, కాంట్‌లు, భావవాద శాఖకు అగ్రగణ్యులు.

ఫ్రెంచి తత్వవేత్తలు దెకార్టే, డిడిరోలు – భౌతికవాద శాఖకు చెందినవారు.

బ్రిటిషు తత్వవేత్తలు బేకన్, లాకీ స్పెన్సర్లు – భౌతికవాదానికి సన్నిహితంగా ఉండే అనుభవవాద శాఖకు చెందినవారు.

ఈ మూడూ కాక. గతితార్కిక భౌతికవాదం మార్క్స్, ఏంగెల్సుల కృషి ఫలితంగా 19 వ శతాబ్దంలో వృద్ధి చెందింది.

"తత్వవేత్త లింతవరకూ ప్రపంచానికి వ్యాఖ్యానం చెప్పారు. అసలు సమస్య ప్రపంచాన్ని మార్చటం – అనే నూతన లక్ష్యంతో, మార్క్సిజం సాంఘిక విప్లవాలకు దోహదకరమైంది.

మార్క్సిస్టు తత్వశాస్త్ర సృజనశీలతను చరిత్ర రుజువు చేసింది.

మరొక వైపున, భావవాద సిద్ధాంతాలకు స్తబ్దత ఆవహించింది.

ఈ స్థితిలో, యూరోపియన్ మేధావులు కొందరిలో పాజిటివిస్టు ధోరణులు తలఎత్తసాగాయి.

పాజిటివిస్టు ఆలోచనకు, మూలపురుషుడు ఫ్రెంచి తత్వవేత్త – కామ్టే (1789–1860).

తత్వశాస్త్ర యుగం అయిపోయిందనీ, ఇక విజ్ఞాన శాస్త్రాల పైననే ఆధార పడాలనీ ఈయన వాదన. విజ్ఞాన శాస్త్రాలన్నిటినీ ఈయన తరగతులుగా విభజించాడు. నిర్దిష్ట విజ్ఞాన సంపాదనకు ప్రాధాన్యం ఇవ్వటమే తమ లక్ష్యమని చెప్పుకునేందుకుగాను తమ ధోరణికి, వారు పాజిటివిజం–(నిర్దిష్టత) అని నామకరణం చేసుకున్నారు.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం, పశ్చిమ యూరోపియన్ మేధావివర్గంలో భవిష్యత్తుపై నిరాశ. నిస్పృహలు ఏర్పడ్డాయి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరం, ఇవి మరింత హెచ్చాయి. ఏవో తత్వశాస్త్రీ

లతో కాలం గడిపేదానికంటే, విజ్ఞాన శాస్త్రాల ద్వారా తెలిసినంతవరకు తెలుసుకొని, అంతటితో ఆగిపోవాలనీ, వేర్వేరు అంశాలను సమన్వయం చేసి, ఒక తత్వశాస్త్రాన్ని రూపొందించే యత్నమే నిరర్థకమని వీరి వాదన.

బ్రిటిష్ తత్వవేత్త రసెల్, ప్రొఫెసర్ అయర్ మొదలైనవారు పాజిటివిష్టు శాఖకు చెందినవారు.

## అనుభూతి జ్ఞానం

ఇంద్రియాల ద్వారా, భౌతిక ప్రపంచంలోని వేర్వేరు అంశాలను తెలుసుకుంటాము. అంతేగాని, భౌతిక ప్రపంచం అసలు స్వభావాన్ని తెలుసుకోలేము. మనం తెలుసుకున్న అంశాలను, దృగ్విషయాలను సమన్వయపరుస్తూ, ఒక ధోరణి నిర్మిస్తే, అది భావవాదం కాని, భౌతిక వాదం కాని, ఏదైనా ఆ ధోరణి అశాస్త్రీయమే అవుతుంది. ఏమంటే అందులో తెలియని ఊహలు అనేకం ప్రవేశిస్తాయి గనక.

అనుభూతులద్వారా, పదార్థ స్వరూపం రోజు రోజుకూ మరింత తెలుసుకొంటున్నామా? అదీలేదు. ఈ అనుభూతులు బాహ్యవస్తువు నిజస్వరూపాన్ని, తెలియ జేస్తున్నాయని కూడా మనం ఖచ్చితంగా చెప్పలేము-అలాఖచ్చితంగా చెప్పటమంటే, తిరిగి ఒకసిద్ధాంతాన్ని రూపొందించటమే అవుతుంది. "నాకిలా అనిపిస్తున్నది: నా కన్ను, చెవి యిలా అనుభూతు లనిపిస్తున్నాయి" అని మాత్రమే చెప్పగలం—ఇదీ పాజిటివిష్టుల ఆలోచన.

ఈ వాదన కొత్తది కాదు. పదార్థ మూలతత్వాన్ని, మనమెన్నడూ తెలుసుకోలేమనీ, అది అజ్ఞేయమనీ భావవాద తత్వవేత్త కాంట్, అది వరకే ప్రతిపాదించాడు.

భావవాదానికీ, భౌతిక వాదానికి పాజిటివిజం, 'మధ్యేమార్గం'గా, సమన్వయంగా తోచవచ్చు. సూక్ష్మంగా పరిశీలిస్తే, అది నిజం కాదని స్పష్టమవుతుంది.

విజ్ఞాన శాస్త్రాలకు, తత్వశాస్త్రానికి వైరుధ్యం లేదు. ఇవి పరస్పర సహాయకాలు. ఆలోచన, ఏ సూత్రాలపై సాగేదీ చర్చించే తర్కం

ానితర్కం— అవసరం ఎప్పుడూ ఉంటూనే ఉంటుంది. వీటి సహాయం తోనే, పదార్థంలోని వివిధ అంశాల మధ్య సమన్వయాన్ని గ్రహిస్తాడు.

పాజిటివిస్టులు ఆలోచనా శాస్త్రాన్ని నిరాకరిస్తున్నారు.

అనుభవం ద్వారా విజ్ఞానం పొందే మాటనిజం. వ్యక్తికీ బాహ్య ప్రకృతికీ జరిగే చర్య ప్రతిచర్యల ద్వారా ఏర్పడేదే అనుభవం. ఇందులో మొదటి అంశమైన చర్యను స్వీకరించి, రెండో అంశమైన ప్రతిచర్యను పాజిటివిస్టులు నిరాకరిస్తున్నారు.

తద్వారా, వారు తర్కశాస్త్రాన్నే కాదు, విజ్ఞానశాస్త్రాన్ని సైతం నిరాకరిస్తున్నారు. అన్ని విజ్ఞానశాస్త్రాలూ సిద్ధాంతాలే. గ్రహించిన సమాచారాన్ని క్రమబద్ధం చేయుటమే సిద్ధాంతం. ఇలా చేయుటంలో బుద్ధి, ఆలోచనల పాత్ర ఉంది. వాటిపాత్రను గుర్తిస్తేనే ప్రమాదం ఏర్పడుతుందని పాజిటివిస్టుల భయం.

కనుకనే పాజిటివిస్టులు విజ్ఞాన శాస్త్రాలను సైతం, శాస్త్రాలుగా కాక, కొన్ని ప్రతిపాదనలు (కార్నప్)లేక కొన్ని అలవాట్లు (రసెల్)గా వర్ణించారు.

## ప్రాగ్మాటిజం

పాజిటివిస్టు ధోరణి అనేక రూపాలను ధరించింది.

ఇందులో ఒకటి ప్రాగ్మాటిజం.

ఈ ధోరణి, అమెరికాలో ఎక్కువ వ్యాప్తిలో ఉంది. విలియం జేమ్సు (1842—1940), జాన్ డివీ (1859-1952)లు ఈ ధోరణికి నాయకులు. వీరి వాదన యిది.

పూర్తి జ్ఞానాన్ని, మానవుడు ఎలాగూ పొందలేడు. మన ఇంద్రియాలు అందించే పాక్షిక జ్ఞానంతోనే. మనం సంతృప్తి పడాలి.

జ్ఞానం సరియైనదో కాదో ఎలా పరీక్షించడం? వాస్తవాని కనుగుణమైనది జ్ఞానం అని మామూలు నిర్వచనం.

దీనిని ప్రాగ్మాటిస్టులు అంగీకరించరు. వాస్తవం అంటే ఏమిటి? వాస్తవాన్నెలాగూ మనం పూర్తిగా తెలుసుకోలేం. ఇంద్రియానుభూతులను దాటి మనం పోలేం

కనుక, వాస్తవం అంటే వ్యక్తికి ఉపయోగకరమైనదీ, ఫలితాన్ని కలిగించేదీ. ఏ చర్య మనకు అనుకున్న ఫలితాన్ని కలిగిస్తుందో, అదే వాస్తవం; అదే జ్ఞానం.

ఫలితాలకు ప్రాధాన్యం ఇచ్చే ధోరణి కనుకనే, దీనిని ప్రాగ్మాటిజం అన్నారు. (ప్రగ్మా-ఫలితం), కార్యసాధకవాదం.

వాస్తవికత వస్తువులలో లేదు. భావాలకు మాత్రం ఉంది. ఆ భావాలకైనా ఎల్లప్పుడూ ఉండదు ఒకప్పుడుంటుంది. మరొకప్పుడు పోతుంది. భావం ఫలితాన్నిస్తే అదే వాస్తవం.

భావాల వాస్తవికత, హెచ్చుగా నమ్మకం మీద ఆధారపడి ఉంది. ప్రభుత్వంపై ప్రజలకు విశ్వాసం ఉన్నంతవరకూ, బ్యాంకునోట్లు చెల్లుతూనే వుంటాయి. విశ్వాసం పోతే చెల్లవు. మన భావాలు ఫలితాలిచ్చే వరకూ వాస్తవం; ఆ పైన కావు

ప్రాగ్మాటిజం వ్యక్తి ప్రధానం. ఒక వ్యక్తికి వాస్తవమైనది మరొక వ్యక్తికి వాస్తవం కాకపోవచ్చు. ఒక సమయంలో వాస్తవమైనది, మరొక సమయంలో కాకపోవచ్చు.

వ్యక్తి తన శ్రేయస్సుకు లాభకరమనుకున్నది ఏదైనా చేయవచ్చు. అది సమాజానికీ, యితరులకూ హానికరమా? అన్న సంశయం అక్కరలేదు.

ప్రాగ్మాటిజం కార్యాచరణకు తోవతీసే ఆదర్శవాదం అంటూ జాన్ డివీ ఇలా వ్రాస్తున్నాడు:

"గతానికి చెందిన ప్రతిపాదనలపైనా, సూత్రాలపైనా ఆధారపడి లాభం లేదు. భవిష్యత్తును నిర్మించటానికి అవసరమైన అజేయమైన ఆదర్శవాదం కావాలి. అదే ప్రాగ్మాటిజం.

ఈ మాటలు సమాజ పురోగతిని సూచిస్తున్నట్లు తోచవచ్చు. కాని కాదు.

గతంనుంచి వర్తమానం. వర్తమానం నుండి భవిష్యత్తు ఉద్భవిస్తాయి. ఇదొక విడదీయరానిబంధం. కొన్ని నిర్దిష్ట సామాజిక సూత్రాల ప్రకారం ఈనడక సాగుతున్నది.

గతాన్ని నిరాకరించటం, సాంఘిక సూత్రాలను నిరాకరించటమే.

ఏది లాభకరమో అది చేయాలి. గతంతో పనిలేదు.

అమెరికన్ పెట్టుబడిదారుల విస్తరణ కాంక్షకూ, వ్యక్తి వాదం వెర్రితలలు వేసేందుకూ పూర్తి ప్రోత్సాహమిచ్చింది, ప్రాగ్మాటిజం. ఇది

## అస్తిత్వ వాదం

పాజిటివిజానికి చెందిన మరొక ధోరణి అస్తిత్వవాదం.

దీని మూల పురుషుడు జీన్‌పాల్ సార్త్రే (1905—) ఇతడు ఫ్రెంచి తత్వవేత్త.

వ్యక్తికి స్వేచ్ఛ ప్రధానం. ప్రతి వ్యక్తికీ స్వేచ్ఛ వుంది. మానవుని ప్రతి చర్యా, అతని స్వేచ్ఛకొరకు ఉద్దేశింపబడినదే. ఉనికి మూల సూత్రమే అది. "స్వేచ్ఛకై పోరాడటం అనివార్యమైన మానవప్రకృతి."

అస్తిత్వం రెండు రకాలు. అంతర అస్తిత్వం. బాహ్య అస్తిత్వం. జడపదార్థాలకు అంతర అస్తిత్వం మాత్రం ఉంది. మానవులకు బాహ్య అస్తిత్వం కూడా ఉంది.

అంతర అస్తిత్వంనుండి విడివడిన బాహ్య అస్తిత్వం కొరకు కృషి చేయటం స్వేచ్ఛ.

ఒక వ్యక్తి, మరొకరిని కలుసుకుంటాడు. మొదటి వ్యక్తి జ్ఞాత, రెండో వ్యక్తి జ్ఞాయం. రెండోవ్యక్తిని మొదటి వ్యక్తి పూర్తిగా తెలుసుకోవాలంటే, మొదటి వ్యక్తి కూడా 'జ్ఞేయం'గా మారి, అవతలి వ్యక్తిని జ్ఞాతగా చేయాలి. అపుడుభయుల జ్ఞాతృత్వానికీ స్పర్థ ఏర్పడుతుంది. జ్ఞాత, ఎపుడూ జ్ఞేయాన్ని, తన వైపు ఆకర్షించుకుంటాడు. జ్ఞాతల మధ్య స్పర్థ అనివార్యం.

ఈ విచిత్రవాదన ఫలితంగా, అస్తిత్వవాదం, వ్యక్తి స్పర్థావాదానికి తోవతీసింది. ప్రతి వ్యక్తీ, తన కోసం. తాను కృషి చేసుకుంటాడు.

ఇది సహజం. ఈ కృషిలో, మరొక వ్యక్తితో స్పర్థ ఏర్పడుతుంది. అది అనివార్యం. ఇందులో బలవంతుడు నెగ్గుతాడు. జీవశాస్త్రంలో డార్విన్ ప్రతిపాదించిన సూత్రాన్ని, ఈ రూపంలో సమాజానికి ప్రీడు వర్తింపచేశారు.

తన వాదన, నాస్తికవాదం, మానవత్వాల సమ్మేళనమని సార్త్రే అంటాడు.

ఎట్టి నియమ నిబంధనలూ లేకుండా, 'స్వేచ్ఛ' కొరకు తన కొరకు ప్రతి వ్యక్తీ, కృషి చేసుకోవాలనే వ్యక్తి ప్రధానవాదం తప్ప యిది మరొకటికాదు.

పాజిటివిజం, ప్రాగ్మటిజం, ఎగ్జిస్టెన్షియలిజం — ఈ మూటికీ దగ్గర సంబంధముంది.

భౌతిక ప్రపంచం కొన్ని అంతర్గత సూత్రాలకు కట్టుబడి ఉన్న దనీ, వాటిని గ్రహించటమే మానవ లక్ష్యమనే ప్రాథమికాంశాన్ని పాజిటివిజం నిరాకరిస్తుంది. ప్రపంచం వాస్తవం కాదు. ఇంద్రియానుభూతులే వాస్తవమంటుంది.

ప్రాగ్మటిజం మరొక అడుగు ముందుకు సాగి, ఇంద్రియానుభూతులుకూడా, ఒక్కొక్కరికి, ఒక్కొక్కప్పుడు మాత్రమే వాస్తవమంటుంది.

అసలు వ్యక్తులు స్వేచ్ఛకై జరిపే కృషిలో, స్పర్థ అనివార్యమంటుంది అస్తిత్వవాదం.

ఈ ధోరణులు భారత దేశంలోనూ వ్యాపిస్తున్నవి.

అతీత మానవత్వానికి కృషిచేయటమే, జీవితలక్ష్యమనే అరవిందుని బోధ, వ్యక్తిప్రధానమైనదని ఇదివరకే తెలుసుకున్నాం.

ఒకప్పుడు, మార్క్సిస్టుగా ఉన్న కీ. శే. యం. యన్. రాయి రూపొందించిన నవ్యమానవ వాదం ఈ కోవకు చెందినదే.

అన్ని సామాజిక వ్యవస్థలూ, వ్యక్తిని అణచిఉంచేవే ఇందుకు వ్యతిరేకంగా, వ్యక్తి పోరాడాలి. వ్యక్తి స్వేచ్ఛకు ప్రథమ స్థానంఇవ్వాలి. నవ్య మానవుణ్ణి రూపొందించాలి. అట్టి నవ్యమానవులు, ఆదర్శ సమాజాన్ని నిర్మిస్తారు.

అరవిందుని అతీత మానవుడూ, యం. యన్. రాయ్ నవ్యమానవుడూ పేరులో వేరైనా, స్వభావంలో ఒక్కటే.

ఒకప్పుడు వ్యక్తి ప్రధాన ధోరణులు సమాజంలో అభ్యుదయ కరపాత్ర వహించాయి.

భూస్వామ్య వ్యవస్థనుండి, పెట్టుబడిదారీ సమాజం రూపొందుతున్న కాలంలో, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం నినాదాలు విప్లవ నినాదాలైనవి. అందరు వ్యక్తులూ సమానం; సోదరులు – హెచ్చు తగ్గు లుండరాదనే లక్ష్యంతో సమాజ పరివర్తనకు – ఈ ధోరణులు తోడ్పడ్డాయి.

ఈ నాటికీ, ప్రపంచం చాలాభాగంలో భూస్వామ్య పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద వ్యవస్థ లున్నవి. దాంతోపాటు, సగభాగంలో సోషలిస్టు వ్యవస్థకూడా నేడేర్పడ్డది.

పెట్టుబడిదారులు 'వ్యక్తి స్వేచ్ఛ' పేరుతో, స్వేచ్ఛా వ్యాపార నినాదం వల్లిస్తున్నారు. తమకున్న పెట్టుబడులతో, ధనంతో ప్రజలపై పెత్తనం చేసి, ప్రజల శ్రమశక్తిని హరించి. కుబేరులయ్యేందుకు తమకు 'స్వేచ్ఛ' ఉన్నదని వారి వాదన.

సోషలిజంలో ఈ 'స్వేచ్ఛ' లేదు.

ప్రజలందరికీ తిండి, బట్ట, ఉద్యోగవసతి, విశ్రాంతి, విద్యావకాశాలు కల్పించి, స్వేచ్ఛను ఆచరణలో సోషలిజం నిజం చేస్తున్నది. మానవుడికి, కొన్ని అవసరాలున్నవని గుర్తించి, వాటిని తీర్చటమే స్వేచ్ఛ: స్వతంత్రం.

వ్యక్తి ప్రధాన ధోరణులు పెట్టుబడిదారులు 'స్వేచ్ఛ' పేరుతో చేసే దోపిడిని ప్రస్తావించక, సోషలిస్టు వ్యవస్థలో వ్యక్తులకు స్వేచ్ఛ లేదనే వాదన, ప్రచారం చేస్తున్నాయి.

ఈ వాదనలలోని ప్రధాన బలహీనతా, ప్రమాదం ఇదే.

మాటలు, కొన్ని భావాలను తెలియజేయటంతోపాటు కొన్ని భావాలను మరుగుపరుస్తాయికూడా. ఆ మాటలను వాడే వ్యక్తులనుబట్టి సందర్భాలనుబట్టీ ఇది జరుగుతుంది.

వ్యక్తి స్వేచ్ఛాపదం, తాత్విక ధోరణుల చేతిలో ఇదే ప్రమాదానికి గురి అవుతున్నది.

ఈ ధోరణు లన్నింటికంటె భిన్నమైన మార్క్సిస్టు సిద్ధాంతం, గతి తార్కిక భౌతికవాదం.

గతితార్కిక భౌతికవాదం, అసలు తత్వశాస్త్రమే కాదని నిరసించిన కాలం గడిచింది అది కేవలం ఊహా ప్రధానమైన తత్వశాస్త్రంకాక, క్రియా శీలమైనదని కూడా నేడు గుర్తిస్తున్నారు.

ఇది సిద్ధాంత సమస్యకాదు. ఆచరణలో రుజువు కావలసినది. రుజువు అవుతున్నది. వ్యక్తి-సమాజాల వైరుధ్యం పరిష్కరించి, వ్యక్తి కొరకు సమాజం, సమాజంకొరకు వ్యక్తి అను గతితార్కిక సంబంధం సోషలిజంలో ఏర్పడుతున్నది.

గతితార్కిక భౌతిక వాదం ఒక శాస్త్రం. ప్రకృతి, సమాజాలలో అంతర్గతంగా ఉన్న సూత్రాలను వివరించే విజ్ఞానం. ఇదొక ఆలోచనా పద్ధతి. విజ్ఞానశాస్త్ర ఫలితాల నెప్పటి కప్పుడు స్వీకరిస్తూ పురోగమించే తాత్విక దృక్పథం. ఇదొక విప్లవకర దృక్పథం. సమాజపురోగతికి మార్గ దర్శకమైన కార్యాచరణకు త్రోవ చూపేకరదీపిక.

## ఇరవయ్యో అధ్యాయం

# తత్వశాస్త్రం-సామాజిక ప్రయోజనం

సమాజ జీవితానికి పునాది ఆర్థిక వ్యవస్థ. ఉపరి నిర్మాణానికి చెందిన విజ్ఞాన విభాగం తత్వశాస్త్రం. పునాదికి ఉపరి నిర్మాణానికి సంబంధం ఉన్నది.

సంబంధమే లేదు అనటం భావవాద ధోరణి. ఈ సంబంధం సూటిగా ఉంటుందనటం యాంత్రిక భౌతికవాద ధోరణి.

వివిధ వర్గాల రాజకీయ, ఆర్థిక, సాంఘిక, మానసిక తాత్విక ప్రయోజనాలు, వాటిలో ఉండే అంతర్ వైరుధ్యాలు, ఘర్షణలు దృష్ట్యా ఆ యా తాత్విక ధోరణుల ప్రయోజనం అంచనా కట్టవలసిఉంది. ఆదిమ సమాజంలో ఈ సంబంధం సూటిగా ఉండవచ్చు. సమాజం అభివృద్ధి చెంది, వివిధ విజ్ఞాన విభాగాలు స్వతంత్ర వ్యక్తిత్వం, గమన సూత్రాలను స్థాపించుకుని, నిర్మాణంలో జటిలత్వం హెచ్చినకొద్దీ, పునాది ఉపరితలాల సంబంధం ప్రచ్ఛన్నమౌతుంది. అనేకమైన వైజ్ఞానిక ఆచ్ఛాదనలు, పొరలు ఏర్పడతాయి.

ధర్మశాస్త్ర రచయితలు సమాజంలోని వర్గ, వర్ణ చట్టాన్ని సూటిగా కాపాడేవారు. ప్రభు వర్గం ధర్మ శాస్త్రాలను అమలు జరుపుతుంది. తత్వవేత్తలు, ధరశాస్త్రాలలో సుటిగా ఘర్షణ పడనంత వరకూ

ఈ రెండు విభాగాలు పక్క పక్కనే సాగుతాయి ఘర్షణ పడిన మరు క్షణం నుండి విభేదాలు తలెత్తుతాయి.

వైదిక ఋషులకాలంలో ధర్మశాస్త్రం తత్వశాస్త్రం కలగాపులగంగా ఉండేవి. ఆదిమ కమ్యూనిస్టు సమాజం నుండి బానిస వ్యవస్థకు మారుతున్న కాలం అది. వర్ణ వ్యవస్థ, భారతదేశంలో బానిస వ్యవస్థ యొక్క ప్రత్యేక రూపం.

అధర్వణ వేదకాలం నాటికి నాలుగు వర్ణాలు ఏర్పడ్డాయి. ద్విజులకు మాత్రమే వేదాధ్యయన అర్హత అన్నారు. శూద్రులకు విద్య అక్కరలేదు కూడదు. అంధప్రాయంగా ద్విజులకు సేవ చేయటమే వారి విధి. ఆలోచన వారిలో రేకెత్తరాదు.

వేదాల చుట్టూ ఈ గిరి గీయటం, భారతీయ తాత్విక రంగంలో, పాలక వర్గాల ప్రప్రథమ జోక్యానికి చిహ్నం. వేదాలు అందరూ చదివితే ఏమి? వాటిలోని అర్థాన్ని అందరూ గ్రహిస్తారు. విమర్శనా ధోరణి కలుగుతుంది. హేతువాదం ఏర్పడుతుంది. హేతువాదం విశ్వాసానికి శత్రువు. వర్ణ దోపిడీని, వర్గ దోపిడీని. సమర్థించే అంశాలపట్ల అసంతృప్తి వ్యతిరేకత తల ఎత్తుతాయి. వర్ణవ్యవస్థ బీటలు వారుతుంది. ధర్మం నాలుగు పాదాలలో ఎలా నడుస్తుంది? నాలుగు పాదాలలో నడవటమంటే ఏ వర్ణంవారు ఆ వర్ణానికి కేటాయించిన పనిని తలవంచుకుని చేయటం ఇందుకు వ్యతిరేకమైనది. ప్రతిదీ వర్ణ సంకరమే.

అధర్వణ కాలంనుండి ఆధునిక కాలంవరకూ. వర్ణ సంకరమూ అంటే సమాజం అల్లకల్లోలమైపోవటమే అనే అభిప్రాయాన్ని ధర్మశాస్త్రాలు కలిగించాయి. నిజానికి జరిగేది ఏమంటే అగ్రవర్ణాల ఆధిపత్యం పోవటం. వారి దృష్టిలో అదే అల్లకల్లోలం.

మార్క్స్ ఒకచోట ఇలా అన్నాడు: "వేదాలను చదివే హక్కు తనకు మాత్రమే పరిమితం చేసుకోవటం ద్వారా భారతదేశంలో బ్రాహ్మణుడు వేదాల పవిత్రతను నిరూపిస్తూ కాపాడుతూ వచ్చాడు."

భారతీయ తత్వశాస్త్రం మతంనుండి, సాంప్రదాయంనుండి, దోపిడీ వర్గాల పట్టునుండి బైటపడటానికి మొదటిచర్య వేద ప్రాముఖ్యాన్ని త్రోసిపుచ్చటం లేక కనీసం వాటి ప్రాధాన్యతను తగ్గించటం.

వేదం అంటే యజ్ఞయాగాది కర్మకాండను, వర్ణ వ్యవస్థను సమర్థించే సాహిత్యంఅనే అరంలో నాటి దోపిడీవర్గాలు అర్థం చెప్పాయి. నిజానికి వేదాలలో ఇంకా చాలా విషయాలున్నవి. వర్ణ విభేదాలు, కర్మ కాండ ప్రాధాన్యం – పురోహితవర్గం వేదాలలో ప్రవేశ పెట్టిన అంశాలు. ఐనా విస్సన; చెప్పినదే వేదం అన్నట్లు పురోహిత వర్గం, పాలక కూటమి వేదానికి అలా అర్థం చెప్పారు.

ఈ వ్యాఖ్యానంపై మొట్టమొదటి నిరసన ఉపనిషత్తులు. నారదుడు అన్నివేదాలు చదివాడు. ఐనా తృప్తికలగక సనత్కుమారుని దర్శించగా, 'బ్రహ్మవిద్యను తెలుసుకున్నావా' అన్నాడు.

నారదుడు బ్రాహ్మణుడు, సనత్కుమారుడు క్షత్రియుడు. కర్మ కాండపై నిరసనగా, భావవాద ప్రధానమైన బ్రహ్మవాదాన్ని మొదట రూపొందించింది క్షత్రియులు. ఉపనిషత్తులలో ఇందుకు ఎన్నో ఆధారా లున్నాయి.

ఇలా ఎందుకు జరిగింది కర్మకాండదాటి యజ్ఞయాగాదులు, అపారమైన శిశుహింస, ఉత్పత్తి శక్తుల విధ్వంసం, జంతు బలులు, జాతరలు, యజ్ఞయాగాదులు అన్నీ ఒకే కోవకు చెందినవి ఆటవిక తెగలు జాతరలుచేస్తే, బ్రాహ్మణులు యజ్ఞయాదులు. చేసేవారు.

ఈ రెంటినీ ఎంతో కొంత అదుపులో పెట్టటం ఉత్పత్తి శక్తుల పెంపుదలకు అవసరం ఇది గుర్తించినవారు పాలకవర్గమైన క్షత్రియులు. అందునా ఉదారవాదులైన క్షత్రియులు. ఉపనిషత్తులలోని జనకుడు, సనత్కుమారుడు, అశ్వపతి కేకయ, ప్రవహణజైవాలి. వీరందరూ క్షత్రియులు. జానశ్రుతి, రాజపదవి నధిష్టించిన శూద్రుడు.

వీరు బ్రహ్మవాదానికి ఆద్యులు. కర్మకాండకు, బ్రహ్మవాదానికి జరిగిన వివాదంలో తాత్విక అంశాలు అలా ఉంచి, సామాజికంగాచూస్తే పౌరోహిత వర్గానికి, క్షత్రియ పాలకులకుగల ఘర్షణ కనిపిస్తుంది. ఆనాటి నుండి, ఆధునిక యుగంవరకు, ఈ ఘర్షణ ఏదోరూపంలో కొన సాగుతూనే వున్నది.

పౌరోహితులు, క్షత్రియులు, ఉభయులూ అగ్రవర్ణాలవారే. వారి ఘర్షణ తాత్కాలికం. ఐక్యత, సర్దుబాటు పదేపదే జరుగుతూ వచ్చింది. క్షత్రియులు ఆరంభించిన బ్రహ్మవాదంలో, బ్రాహ్మణుడైన యాజ్ఞవల్క్యుడు అగ్రపీఠం సాధించాడు. ఉభయుల రాజీ కిది తార్కాణం.

బౌద్ధయుగంలో ఇది తిరిగి తీవ్రరూపంలో ప్రజ్వరిల్లింది. బుద్ధుడు, మహావీరుడు; తెగల పాలకుల నుంచి వచ్చినవారు. వృత్తి రీత్యా క్షత్రియులు. వీరు వేద ప్రామాణ్యాన్ని పూర్తిగా త్రోసిపుచ్చారు. ధర్మశాస్త్రాలను వర్ణవ్యవస్థను విమర్శించారు. సమానత్వాన్ని బోధించారు. భారతీయ తాత్వికవికసనకు, ఇది పెద్ద ముందడుగు.

ఈ బోధలు సామాజికంగా, క్షత్రియ, వైశ్య వర్గాలకు ప్రధానంగాను, శూద్ర, పంచమ తదితర పీడిత కులాలకు కొంతవరకు ఉపయోగపడ్డాయి. పౌరోహితవర్గ పట్టును దెబ్బ తీశాయి. చాకలి, మంగలి, కమ్మరి, కుమ్మరి, మాల, మాదిగలు, స్త్రీలు, బానిసలు, వీరంతా బౌద్ధాన్ని అభిమానించారు. వైశ్యులు. క్షత్రియులు బౌద్ధలపైపు మళ్ళారు.

తక్కువ కులాలు. పై శ్రేణికి చేరుకోటానికి, బౌద్ధం, జైన, చార్వాకాలు తోడ్పడ్డాయి. వర్ణ వ్యవస్థలో క్రిందివారు పైకి, పైవారు క్రిందికి మారటం, ప్రతి సాంఘిక, తాత్విక, రాజకీయ కల్లోల సమయంలోనూ జరుగుతూనే వచ్చింది. ఇది గుర్తించక పోతే భారతీయ సామాజిక చరిత్రను మనం ఏమాత్రం అర్థం చేసుకోలేము.

ధర్మ శాస్త్రాలు, ఎప్పటి కప్పుడు పాలకులకు క్షత్రియముద్ర, పౌరోహితులకు బ్రాహ్మణముద్ర, వ్యాపారస్తులకు వైశ్యముద్రవేసి, వర్ణ చట్రాన్ని స్థిరపరుస్తూవచ్చాయి.

భారతీయ తత్వశాస్త్రంలో ఈ పరిణామానికి తోడ్పడిన వేవి? అడ్డుకొన్నవేవి? స్థూలంగా ఈ ప్రాతిప్రాదికపై వివిధ తాత్విక ధోరణుల సామాజిక ప్రయోజనాన్ని నిర్ణయించవచ్చు.

బౌద్ధ, జైన, చార్వాకాలు ఇందుకు తోడ్పడ్డవి. ఇవి అన్నీ అవైదికాలు. వేదప్రామాణ్యాన్ని అంగీకరించిన, షడ్దర్శనాలు. స్థూలంగా యీ పరిణామాన్నివ్యతిరేకించాయి. లేక తటస్థ వైఖరి నవలంబించాయి.

పూర్వ మీమాంస తాత్వికంగా భౌతిక వాద ఛాయలు కలది. ప్రపంచం వాస్తవం. దేవుడు లేడు. కాని వర్ణ వ్యవస్థను అది అతి కఠినంగా సమర్థించేది. సామాజికంగా అభివృద్ధి విరోధక పాత్ర వహించింది.

శంకరాద్వైతం పూర్తి భావవాదం. మనుస్మృతిలోని, విధి నిషేధాలన్నింటినీ శంకరుడు బలపరచాడు. ద్విజులకు మాత్రమే వేదాధ్యయన హక్కు అన్నాడు. కర్మకాండను నిరసించి, జ్ఞాన ప్రాధాన్యాన్ని స్థాపించినా, శంకరాద్వైతం, వర్ణచట్రాన్ని పూర్తిగా బలపరచింది.

సాంఖ్య, వైశేషికాలు భౌతిక వాద ధోరణికి చెందినవి. ఇవి వర్ణ వ్యవస్థను పట్టుదలగా సమర్థించలేదు. వ్యతిరేకించనూ లేదు. వేదాలకు, ధర్మశాస్త్రాలకు నమస్కార బాణంతో, తమ స్రోవన తాము పోయాయి. పాలకవర్గాలను,ధర్మశాస్త్రాలనుసూటిగా వ్యతిరేకిస్తే, బౌద్ధ, జైనాలవలె పౌరోహిత వర్గ వ్యతిరేకతను ఎదుర్కోవలసి వస్తుంది. అందుకు వారు తయారుగా లేరు, రాజీమార్గం అవలంబించారు.

యోగ, న్యాయశాస్త్రాలు, సాంఖ్య, వైశేషికాలకు అనుబంధాలు. అతీత మానవశక్తులకై ఒకరు ఆరాటపడితే, తర్క శాస్త్రంపై మరొకరు కేంద్రీకరించారు. వర్ణచట్రం విషయంలో వీరు తటస్థులు.

మహాయాన, వైజ్ఞానిక వాదాలవంటి బౌద్ధశాఖల విషయంఏమిటి ?

బ్రాహ్మణాధిపత్యాన్ని ఇది గుర్తించలేదు. కాని, పాలకవర్గ ప్రాపుతో ధనికవర్గాల తోడ్పాటుతో వృద్ధి చెందాయి. మౌర్యులు, శాతవాహన చక్రవర్తులు, ఇక్ష్వాకులలో కొందరు బౌద్ధాన్ని అభిమానించారు. పల్లవ, విష్ణుకుండిన, సాలంకాయనులు, శుంగ, కణ్వ, గుప్తరాజులు వైదికాన్ని అభిమానించారు. పాలకవర్గంలో గొప్ప చీలిక వచ్చింది. ఉదార పరిపాలనకు మహాయాన, విజ్ఞానవాదాలు తోడ్పడగా, నిరంకుశ వర్ణ చట్ర పునరుద్ధరణకు హిందూ రాజులు తోడ్పడ్డారు.

తాత్వికంగా కూడా భావవాదం ప్రజలకు, సమాజంలోని దోపిడీ వ్యవస్థతో రాజీపడి తలవంచుకు జీవించే స్థితిని అలవరచింది.

శాశ్వత పదార్థం వేరే ఉంది. అది శూన్యమని నాగార్జునుడంటే, పరబ్రహ్మ అని శంకరుడు అంటాడు. ఉభయుల దృష్టిలోను లౌకిక ప్రపంచం వ్యవహార సత్యం. ఇది తాత్కాలికం. క్షణికం. మానవుని సుఖదుఃఖాలకు, అతని కోరికలే కారణమని. వాటిని అదుపులో పెట్టి, పరిస్థితులతో రాజీపడాలి. బౌద్ధుల నిర్వాణం, శంకరుని జీవన్ముక్తి – రెండూ ఆ విధంగానే లభిస్తాయి.

కనుక నాగార్జున శూన్యవాదమైనా, శంకరుని అద్వైతమైనా పరిస్థితులతో వ్యక్తి రాజీపడి, ఉన్నదానితో తృప్తిపడవలసింది అని బోధిస్తాయి. ఈరెండు తత్వశాస్త్రాలు పాలకవర్గం దోపిడీకి తోడ్పడేవే. నాగార్జున భావవాదం పరోక్షంగా ఈ పనిచేస్తే శంకరుని భావవాదం సూటిగా వర్ణవ్యవస్థను సమర్థించింది. శంకర మతస్థుల మరో పేరు స్మార్తులు, అనగా స్మృతివిహిత ఆచారాలను పాటించేవారు అని.

ప్రజలను అజ్ఞానాంధకారంలో ఉంచేందుకు గాను మత విశ్వాసాలను, మూఢనమ్మకాలను, పాలకవర్గం ఉద్దేశపూర్వకంగా ప్రోత్సహించేవారు. గ్రీస్, ఈజిప్టులలోనూ ఇదేజరిగింది. పరలోకభీతితో ప్రజలను అణచిపెట్టి ఉంచటం భారతదేశంలో వేదకాలంనుండి సాగుతూనే ఉంది.

పాలకవర్గాలకు ఈ మూఢనమ్మకాలు తరచు ఉండేవికావు. కాని ప్రజలలోమాత్రం వాటిని వ్యాప్తిచేసేవారు.కౌటిల్యుని అర్థశాస్త్రంలో ఈ విషయం కనిపిస్తుంది. రాజుకు దేవుడు, దయ్యం, వంటి మూఢనమ్మకాలు ఉండరాదు.కాని,ప్రజలలో ఆ నమ్మకాలను వ్యాపింప చేయాలి అని కౌటిల్యుడు స్పష్టంగా పేర్కొన్నాడు.

షడ్దర్శనాల ప్రభావంతో బ్రాహ్మణ మేధావి వర్గం, మూఢనమ్మకాలనుపారద్రోలింది. శంకరాద్వైతాన్ని పూర్తిగా అర్థంచేసుకున్నవారు, సాకారపూజను అంగీకరించలేదు. అతని పరబ్రహ్మం నిరాకారుడు. నాగార్జునుడువ్యతిరేకార్థంలో శూన్యం అన్నా,శంకరుడు అనుకూలార్థంలో పరమాత్మ అన్నా రెండూ ఒకటే.

కాగా బౌద్ధ జాతక కథలలోని పిట్టకథలను మహాయానం, రామాయణ, భారతాలను, అష్టాదశపురాణాలను, తదితర అనేకానేకమైన అద్భుత కథలను వైదికమతం ఎందుకు వ్యాప్తిచేసినట్లు ?

వారు ఇందులోని నమ్ముతున్నారా ? పురాణం చెప్పే పౌరాణికుడు తాను చెప్పే కట్టు కథలను నిజమని నమ్ముతున్నాడా !

బహుకొద్ది మంది అలా నమ్మవచ్చు. ఎక్కువమంది నమ్మరు. ఐనా చెబుతారు. వాటి ద్వారా ప్రజలకు నీతులు నేర్పి, పాపభీతి, పరలోక భయం కలిగిస్తున్నామంటారు. వర్ణ వ్యవస్థ క్రౌర్యాన్ని, దోపిడీ వ్యవస్థ అమానుషత్వాన్ని ప్రజలు గ్రహించకుండా ఈ పుక్కిటి పురాణాలతో మత్తుమందులో పడిఉండాలనివారిఉద్దేశం. పూజారికి దేవుడిపైనమ్మకంఉండదనే మాట ఇందుకే పుట్టింది. పూజారికి అది వృత్తి. సంపాదనా మార్గం.

అంటే ప్రతి పౌరోహితుడు, మోసకారి, దుర్మార్గుడు అనా ? రామాయణ, భారతాది గ్రంథాలు వ్రాసిన కవులు దురుద్దేశంతో ప్రజలను మోసపుచ్చటానికి ఈ గ్రంథాలు రాశారనా ?

వ్యక్తిగత అసత్యం, సామాజిక అసత్యం వేరు. ప్రజలలో మత విశ్వాసం కలిగించాలి. వారు నీతి పథంలో ఉండాలంటే జాతరలు, జంతు బలులు, దయ్యాలు, పూనకాలు, ఇతర మూఢ నమ్మకాలు ప్రజలలో వ్యాపించి ఉండాలి.

సామాన్యులు ఆ స్థాయిలోనే ఉండాలి. ఇది లౌకిక సత్యం. పారమార్థిక సత్యంవేరు. అది సామాన్యులకు అర్థంకాదు. పండితులకు మాత్రమే పరిమితం.

సత్యాన్ని రెండుగా విభజించిన అద్వైత, శూన్య వాదాలు– ఈ మానసిక ద్వైధీభావాన్ని, వికలత్వాన్ని (alienation) మేధావులలో కలిగించాయి. ఈ ద్వైదీ భావంలో సామాజిక స్వార్థం ఇమిడి ఉంది. వర్గస్వార్థం వర్ణస్వార్థం ఇమిడి ఉన్నాయి. వాటిని వ్యక్తిగత స్థాయికి దిగజార్చి "నీవు మోసగాడివి" అంటే ఏ వ్యక్తి అంగీకరించడు. నేను ఉద్దేశ పూర్వకంగా ఎవరినీ మోసంచేయటం లేదే అంటారు నిజమే. కాని అతడు ప్రచారం చేసే భావాలు, వ్యక్తం చేసే వాదనలు, నమ్మే విశ్వాసాలు – ఇవన్నీ వర్గ, వర్ణస్వార్థంతో పెనవేసుకొన్నవి. ఇందులో ఆత్మవంచన ఉంది. పరవంచన ఉంది.

జటిలమైన ఈ సామాజిక మనస్తత్వాన్ని వివరించటానికి బదులు, దోపిడీ వర్గాలకు చెందినవారు, వ్యక్తిగతంగా మోసకారులు, అని నిందించటం యాంత్రిక దృక్పథానికి చిహ్నం. పూర్వం చార్వాకులు, ఈనాడు కులమత విద్వేషాలను రెచ్చగొట్టే వేర్పాటు వాదులు ఈ పొరపాటు చేస్తున్నారు

నీ భావం దోపిడీని సమర్థించే భావం, అనటానికి, నీవు దోపిడీదారువు అనటానికి తేడా ఉంది. కొన్ని వేల సంవత్సరాలుగా వటవృక్షంలా పెరిగిన, అశాస్త్రీయ భావజాలం ఇది. ఇది గ్రహించుటమే మార్క్సిస్టు గతి తార్కిక దృష్టి.

వర్గ దోపిడి, వర్ణ దోపిడీ ఉన్నట్లే ప్రతి వర్గంలోను, వర్ణంలోనూ, వ్యక్తికి, సమూహానికి వైరుధ్యాలు ఉన్నాయి. ఈ వైరుధ్యాల ఫలితంగా ప్రతివర్గంలో, వర్ణంలో అనేక విభేదాలు తలెత్తు తుంటాయి.

ప్రతి తాత్విక ధోరణిని ఏదో ఒక వర్గ పునాదికి ముడిపెట్టడం సాధ్యంకాదు. తత్వశాస్త్రం స్వతంత్ర విజ్ఞానశాస్త్రంగా పెంపొందిన తర్వాత దానికి ప్రత్యేక గమన సూత్రా లుంటాయి. ఆ క్రమంలో రూపొందే తత్వశాస్త్రం కొన్ని యుగాల తర్వాత ఏర్పడే నూతనవర్గాల దృక్పథాన్ని ప్రతిబింబించవచ్చు. మరికొన్ని సందర్భాలలో పాత యుగాల, వర్గాల సాంస్కృతిక అవశేషాలను కొనసాగించవచ్చు.

సాంఖ్య, వైశేషికులు వర్ణ వ్యవస్థను, మత విశ్వాసాలను ఖండించలేదు. పూర్వ, ఉత్తర మీమాంసకుల వలె వాటిని బలపరచలేదు. అగ్రవర్ణాలలో ఉదారవాద విభాగం తయారు కావటానికి ఈ వ్యత్యాసం తోడ్పడ్డది.

మధ్య యుగాలలోని వైద్యులు, శాస్త్రజ్ఞులు, ఖగోళ పరిశోధకులు వీరందరూ సూటిగా మత విశ్వాసాలను కాదనలేదు. పక్కపక్కనే తమ శాస్త్రీయ భావనలను వ్యాపింప చేశారు.

భూమి నీడ అడ్డుపడటం వలన చంద్రగ్రహణం, చంద్రుని నీడ అడ్డుపడటంవలన సూర్యగ్రహణం కలుగుతున్నదని వరాహ మిహిరుని వంటి ఖగోళశాస్త్రజ్ఞులకు తెలుసు. పంచాంగ కర్తలకు తెలుసు. ఇది విజ్ఞానం. దాంతోపాటు రాహు కేతువుల అనే రాక్షసులు సూర్య చంద్రు

అను మింగటం కారణమనే మూఢవిశ్వాసాన్ని వీరు ఖండించారా లేదు. పక్కపక్కనే రెంటినీ ఉంచారు.ఆనాటినుంచి నేటివరకు ఈద్వైదీభావం. శాస్త్రజ్ఞానం, మూఢనమ్మకం పక్కపక్కనే నడుస్తున్నాయి.

మతము, సాంప్రదాయం శాస్త్రవిజ్ఞానంపై కలిగించిన, కలిగిస్తున్న దుష్ప్రభావం ఇది.

సాంఖ్య, వైశేషికాల వలెనే గీతకూడా, మేధావివర్గంలో ఉదార ధోరణి కలిగించటానికి తోడ్పడ్డది.సాత్విక ప్రవృత్తి అత్యున్నత ప్రవృత్తిగా పేర్కొనటంద్వారా, వ్యక్తిగత జీవితాలు, త్యాగం, ప్రేమ, దయ, కరుణకలిగిన ఒక విభాగాన్నిసృష్టించింది. భావవాద తాత్విక పరిధిలో ఉంటూనే, వీరు నిస్వార్థజీవితాలు గడిపే ఉదారులు.

ఇంకా వెనక్కువెళ్ళితే భౌతికవాదులైన చార్వాకులు తర్కానికి ప్రాధాన్యమిచ్చారు. దుఃఖమయమైన ప్రజల బాధలను గమనించలేదు. తన్నివారణకు కృషిచేయలేదు. ఆ కృషిచేసినవారు బౌద్ధులు. వారు తాత్వికంగా భౌతికవాదులు కాదు.

భౌతికవాదం, ఎల్లప్పుడూ సామాజికంగా అభ్యుదయకరం, భావవాదం ఎల్లప్పుడూ సామాజికంగా అభివృద్ధి నిరోధకరం అని ఒక సూటి గీత గీయలేము. తాత్విక ఆలోచనలకు, సామాజిక కార్యాచరణకు గల సంబంధం జటిలమైనది. ఒక్కొక్క చారిత్రక, సామాజిక పరిస్థితులలో ఒక్కొక్క రకంగా ఉంటుంది.

ఇస్లాం, క్రైస్తవ, హిందూమతాలు మూటి లోనూ భావవాద ధోరణు లున్నాయి. మతం అనే అడ్డుగోడలు వీటిని గుర్తించ నీయటం లేదు. ఇది గుర్తించినవారు, మత పరిహద్దులను దాటి, తత్వశాస్త్రాన్ని అంచనా వేయగలుగుతారు. శంకరుని అద్వైతం, కేవలం హిందూ మతంలో మాత్రమే ఉన్నదని అనుకోవటం తప్పు. ఇస్లాం, క్రైస్తవ భావనల్లోనూ, అద్వైత ధోరణి ఉన్నట్లు యింతకు ముందే చూశాము.

అన్ని మతాలలోనూ కాస్తో కూస్తో అద్వైత ధోరణి ఉంటే అవన్నీ అడుగునపడి శంకరాద్వైతమే ఇంతగా ప్రాచుర్యం ఎందుకు పొందింది?

ఇందుకు కారణం చరిత్రలోకి వెళ్ళితేగాని కనపడదు. పాశ్చాత్య సమాజం భూస్వామ్య పరిధినుండి నాగరిక దశకు, పెట్టుబడిదారీ దశకు వెళ్ళింది. వ్యక్తి పరిస్థితులతో రాజీపడటమేకాదు, పరిస్థితులను మార్చ గలడు అనే క్రియాశీల దృక్పథం ఏర్పడ్డది. దాంతో సెంట్ థామస్ అక్వినా అద్వైతం వెనకడుగు పట్టింది.

ఇస్లాం భూస్వామ్యవ్యవస్థ నుండి ముందుకుపోగా, తెగలదశలోని ప్రాథమిక స్థాయిలోనే ఉండి పోయింది. అద్వైతం కంటె కూడా ఆదిమ మైన మతావేశ స్థాయిలో ఉండిపోయింది.

హిందూ సమాజం చాతుర్వర్ణ వ్యవస్థ ఫలితంగా, వేల సంవత్సరాలుగా ముఖ్యంగా గుప్తరాజుల కాలం తర్వాత పెద్ద మార్పు లేకుండా ఉండిపోయింది. ఉత్పత్తి శక్తులు పెరగవు. వర్ణవ్యవస్థ వాటిని పెరగనివ్వదు. అవి పెరిగితే వృత్తుల పై ఆధారపడిన వర్ణాలు ధ్వంస మౌతాయి. వర్ణసంకరమౌతుంది. ఉత్పత్తిశక్తులు పెరగకుండా ఉండటంలో పాలకవర్గ ప్రయోజనం ఉంది. అచలాయుతనమైన ఇట్టి సమాజంలో, వ్యక్తి సమాజంతో రాజీపడి, ఆత్మోద్ధారణకు, అంతర్దృష్టి కలిగించు కోవటం తప్ప చేసేదేముంది. ఈ నిస్సహాయతే అద్వైతాన్ని పెంచి పోషించే పునాది.

వివిధ తాత్విక ధోరణులు, ముఖ్యంగా షడ్దర్శనాలు మేధావి వర్గానికి మాత్రమే పరిమితమైనవి. ఆ వర్గంలోనే ఇవి వేద్వేరు విభా గాలకు, ధోరణులకు ఆలోచనకు తోవతీశాయి.

పూర్వమీమాంస అంధప్రాయమైన విశ్వాసాన్ని కలిగించింది. ఉత్తర మీమాంస జ్ఞాన ప్రధానమైన సహనదృష్టిని కలిగించింది. సాంఖ్య, వైశేషికాలు హేతువాదాన్ని పెంచాయి. తర్కం భౌతిక వాస్తవికత దృష్టిని, యోగం మార్మిక ధోరణులను కల్పించింది. ఇవన్నీ భావవాద పరిధిలో, వర్ణవ్యవస్థ చట్రంలో కలిగించిన ప్రభావాలు. విశ్లేషణ చేసిన కొద్దీ ఇంకా అనేక అంతర్విభాగాలు కనిపిస్తాయి.

ఆధునిక యుగానికి, ఈ ప్రాచీనమైన ఏ ఒక్క ధోరణి పనికి రాదు. శాస్త్రీయ విజ్ఞానంతో, తత్వశాస్త్రం ముందుకు సాగాలి. మతంతో ముడిని తెంచివేయాలి సామాజిక పురోగతికి, తాత్వికదృక్పథంతోడ్పడాలి.

అట్టి తాత్విక దృక్పథం గతితార్కిక భౌతికవాదం ఒక్కటే.

ఈ దృక్పథానికి ఆలంబనం, వర్గ రహిత సోషలిస్టు సమాజ నిర్మాణానికి ఉద్యుక్తమైన కార్మికవర్గం. భూస్వామ్య గుత్త పెట్టుబడిదారీ వర్గాలకు వ్యతిరేకంగా ఆర్థిక, సామాజిక విప్లవానికి సన్నద్ధమైన పేద రైతు, మధ్యతరగతి, మేధావి వర్గం.

ఈ వర్గాలన్నీ రాజకీయంగా చైతన్య వంతం కావాలి ఆర్థిక సాంఘిక పోరాటాలకు ముందుకు సాగాలి.

నూతన తత్వశాస్త్రం అన్వేషణ సామాజిక విప్లవ పోరాటంలో ఒక భాగం. భారతీయ తత్వ శాస్త్రం, వేల సంవత్సరాలుగా ఒకే మూసలో లేదు. భౌతిక వాద, వాస్తవిక వాద విప్లవవాద, ధోరణులు ఆయా కాలాలలో పుట్టి చైతన్యయుత పాత్ర నిర్వర్తించాయి. మత దురహంకార శక్తులు, పాలకవర్గ దోపిడీ శక్తుల తాకిడికి ఇవి క్రింద పడి తాత్కాలికంగా ఓడిపోతూ వచ్చాయి. భావవాదమే భారతీయ సాంప్రదాయ తత్వశాస్త్రం అనుకోవటం అపప్రద. సామాన్య ప్రజానీకం లోని తాత్విక దృక్పథంలో ద్వైత ధోరణికి చెందిన సాంఖ్యం హెచ్చు భాగం ఆక్రమిస్తున్నది. ఇది అనేకానేక కారణాలవలన వక్రీకరణ పొంది ఉన్నది.

అద్వైతం, శూన్యవాదం, విజ్ఞానవాదం, మినహా అన్ని భారతీయ తాత్విక ధోరణులు భౌతిక ప్రపంచ వాస్తవికతను అంగీకరించేవే; నిరాకరించేవి కావు. పురోహిత వర్గ ప్రచారం, మత ప్రాబల్యం, పాలక వర్గ ప్రయోజనం - అనే పొరలను తొలగించి చూస్తే అర్థ మయే క్రమం ఇది.

ఈ క్రమాన్ని తెలుసుకోవటం, సామాజిక విప్లవకారునికి ఎంతో అవసరం. భారతీయ సాంస్కృతిక జీవనంలో సగర్వంగా, మనం ప్రకటించుకో తగిన తాత్విక, సాంస్కృతిక సాంప్రదాయా లున్నాయి. త్రోసిపుచ్చవలసిన నిర్జీవసాంప్రదాయాలూ ఉన్నవి. విచక్షణాయుతమైన ఈ దృష్టితో భారతీయ తత్వశాస్త్ర అధ్యయనాన్ని ప్రోత్సహించటమే ఈ రచన లక్ష్యం.

